శ్రీః

అభినవశఙ్కరాచార్యవిరచితమ్

# శ్రీ రుద్రభాష్యమ్

## ఆన్ధ్రానువాదసహితమ్


అనువక్త

సాఙ్గస్వాధ్యాయభాస్కరః

సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి అవధాని





ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)

510, Pride Block, Platinum County, Opp. Hosanna Mandir,

Gorantla, Guntur - 522 034

శ్రీః

అభినవశఙ్కరాచార్యవిరచితమ్

# శ్రీ రుద్రభాష్యమ్

ఆన్ధ్రానువాదసహితమ్

**అనువక్త**

సాఙ్గస్వాధ్యాయభాస్కరః

సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి అవధాని

*ద్వితీయముద్రణ : మహాశివరాత్రి 2022*

*ప్రతులు : 500*

*పేజీలు : 240*

*వెల రూ. : అమూల్యము*



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : **9573711454**

***Printed at -***
Karshak Art Printers,
HYDERABAD

# భూమిక

## 1. శ్రీరుద్రాధ్యాయవైభవము

భారతీయులకు వేదము పరమప్రమాణము. అది అఖిలాభ్యుదయనిశ్శ్రేయస సాధనముగ నవతరించిన అపౌరుషేయవాఙ్మయము. ఋగ్యజుస్సామాథర్వనామకములగు నాల్గు వేదములలో యజుర్వేదము ధర్మ (కర్మ) స్వరూప ప్రతిపాదకమగుటచే ప్రశస్తము కాగా, అందలి కర్మ బ్రహ్మోభయాత్మక మయిన **రుద్రాధ్యాయము** – ప్రశస్తతరమైనది. రుద్రాధ్యాయమునకే **'శతరుద్రీయ'** మనునది శాస్త్రీయమైన సంజ్ఞ. 'నమక'మనునది – నమశ్శబ్దప్రాచుర్యమును బట్టి లోకప్రసిద్ధమైన నామాన్తరము.

దీనికి – **'శతరుద్రీయం జుహోతి' 'చరమాయామిష్టకాయాం జుహోతి' 'అజ క్షీరేణ జుహోతి'** ఇత్యాది వచనముల ననుసరించి మహాగ్నిచయనములో శ్రౌతవినియోగము కనిపించుచున్నది. ఇంతేకాక, ఆపస్తంబ–బోధాయన–శాతాతప–యాజ్ఞవల్క్య–అత్రి ప్రభృతులగు మంత్రద్రష్టలైన మహర్షులు–స్మార్తపాకయజ్ఞములలోను, వివిధ శాన్తిక–పౌష్టిక ప్రాయశ్చిత్తాది కర్మలలోను జప–హోమ–అర్చన–అభిషేకాఙ్గముగ ఈ రుద్రాధ్యాయమునకు వినియోగమును చెప్పియున్నారు. ఆ యా విశేషముల నెఱుగగోరువారు, శాన్తికమలాకర–శాన్తిరత్నాకర–కర్మవిపాక–మహార్ణవాది గ్రంథములలో జూడవచ్చును. ఇంతేకాక శిష్టులు కొందరు నిత్యదేవతార్చనములో దీని నుపయోగించుచుండగా, ప్రత్యేకముగా నిత్యపారాయణ మొనర్చు నైష్ఠికులు నెందరో యున్నారు. ఇట్లే రుద్రాధ్యాయము ఆంధ్రప్రదేశముననే కాక భారతవర్షములోని అన్ని ప్రాంతములలోను అత్యధికమైన వ్యాప్తి గలిగియున్నది.

ఇది యిట్లుండగా, రుద్రాధ్యాయమును ఉపనిషత్తుగా, ఉపనిషత్సారముగా శివపురాణాదులు పేర్కొనుచున్నవి. వేదవ్యాఖ్యాతలగు భట్టభాస్కరాదులు దీనిని ఉపనిషత్తుగా వ్యవహరించినారు. అభియుక్తవ్యవహారమును బట్టి మాత్రమే కాక, ఉపనిషదర్థ ప్రతిపాదకమగుటచే గూడ దీనికి ఉపనిషత్త్వము–అవ్యాహతమను విషయమీ రుద్రభాష్యములో సప్రమాణోపపత్తికముగ ప్రతిపాదింపబడినది. ఉప–ని–ఉపసర్గ పూర్వకమైన, విశరణగతి–అవసానార్థకమగు షద్ ధాతువునుండి నిష్పన్నమైనది– **ఉపనిషచ్ఛబ్దము.** జన్మజరామరణప్రవాహరూపస్సంసారకారణమైన అనాద్యవిద్యా వ్యామోహమును నశింపజేసి, సచ్చిదానన్దబ్రహ్మాత్మైకత్వస్థితిరూపమైన అమృతత్వమును

కలిగించే జ్ఞానమే ఉపనిషచ్ఛబ్ద ముఖ్యార్థము. దీనినే శాస్త్రజ్ఞులు బ్రహ్మవిద్యగా వ్యవహరించు చున్నారు. తత్ప్రతిపాదకమగు – అపౌరుషేయశబ్దరాశియందు సైతము ఉపనిషచ్ఛబ్దము 'లాంగలం జీవనం' అనునట్లు లాక్షణికముగ ప్రయుక్తమగుచున్నది. ఈ విషయము ఉపనిషద్భాష్య – వార్తికాదులలో విస్పష్టము గావింపబడినది. కాగా, పాఠతః, అర్థతః – ఉభయవిధములను పరమపవిత్రము – పరమమఙ్గళము – పరమాదరణీయమైనది – రుద్రాధ్యాయము. **'బ్రహ్మ తన్మఙ్గలం పరమ్'.**

## 2. విద్యారణ్యభాష్యము

రుద్రాధ్యాయముయొక్క అర్థమతిగంభీరము. దానిని సుగ్రహము గావించి, మందప్రజ్ఞుల ననుగ్రహించు తలంపుతో ప్రాచీనులగు మహనీయులనేకులు భాష్య–వ్యాఖ్యానములను రచించినారు. వానిలో శ్రీమాధవవిద్యారణ్య మునివరేణ్య ప్రణీతమైన **'వేదప్రకాశము'** ప్రథమ గణ్యమైనది. విజయనగర ధర్మసామ్రాజ్య ధురంధరుడైన ఆ మహనీయుడు – ఒక రుద్రాధ్యాయమునకే కాదు; చతుర్వేదములకును భాష్యములను రచించిన మహామనీషి. పూర్వోత్తరమీమాంసలలో, పురాణధర్మశాస్త్రార్థశాస్త్రాదులలో అభినందనీయములైన అనేక గ్రంథముల నాయన రచించినాడు. తైత్తిరీయసంహితకు భాష్యమును రచించుచు క్రమప్రాప్తమగు రుద్రప్రశ్నకు గూడ భాష్యమును రచించుట జరిగినది.

కాని, అది అతిసంక్షిప్తముగ నున్నది. అందుకు కారణమును గూడ నాయననే రుద్రభాష్యారంభములో వివరించినాడు–

**కర్మప్రకరణే పాఠాత్కర్మాఙ్గత్వమపీష్యతే।**
**జ్ఞానహేతుత్వమప్యన్యసర్వోపనిషదీరితమ్॥**

**కిం జప్యేనామృతత్వం నో బ్రూహీత్యుక్తో మునిర్జగౌ।**
**శతరుద్రీయకేణేతి, జాబాలా ఆమనన్తి హి॥**

**స్మృత్యాగమపురాణేషు రుద్రాధ్యాయప్రశంసనమ్।**
**బహ్వపి తద్విస్తరేణ 'రుద్రకల్పే'ఽభిధాస్యతే॥**

**ఇహ కర్మాఙ్గతా యాదృగ్వర్ణితా బ్రాహ్మణేన తామ్।**
**బోద్ధుం శబ్దార్థమాత్రస్య వివృతీః క్రియతే స్ఫుటా॥**

రుద్రాధ్యాయము–మహాగ్నిచయనకర్మకలాపమధ్య పఠితమైనది గాన, ప్రకరణమును బట్టి కర్మాఙ్గమగుచున్నది. ఐతే, ఇది కర్మాఙ్గము మాత్రమే కాదు; **జాబాలోపనిషత్తులో** వివరింపబడిన విధముగ ఇది – జ్ఞానసాధనము గూడనైయున్నది. జాబాలోపనిషత్తులో – దేనిని జపించిన అమృతత్వము సిద్ధించును? అని బ్రహ్మచారులు ప్రశ్నించగా, 'శతరుద్రీయము అమృతత్వసాధనము' అని యాజ్ఞవల్క్యుడు సమాధాన మిచ్చినట్లు కలదు. స్మృతులలో పురాణములలో, ఆగమములలో సైతము రుద్రాధ్యాయము యొక్క ప్రాశస్త్యము బహుప్రకారముల వర్ణింపబడినది. అది యంతయు **'రుద్రకల్పము'**లో సవిస్తరముగ ప్రతిపాదింపబడగలదు. ఇపుడిచట కర్మాఙ్గత్వమును బోధించు బ్రాహ్మణము ననుసరించి శబ్దార్థము మాత్రము వివరింపబడుచున్నది – అని భాష్యకారవచన భావసంగ్రహము.

దీనినిబట్టి శ్రీ విద్యారణ్యులు **'రుద్రకల్ప'**మను పేరుతో నొక బృహద్గ్రంథమును రచియించియుందురనియు, అభ్యుదయనిశ్శ్రేయససాధనములగు వివిధ రుద్రాధ్యాయ వినియోగములనందు వివరించియుందురనియు, శ్రీరుద్రమును కర్మపరముననే కాక, జ్ఞానపరముగ గూడ నందు సవిశేషముగ వ్యాఖ్యానించి యుందురనియు తలంచుట కవకాశము కలుగుచున్నది. సిద్ధసంకల్పుడైన ఆ మహనీయుడు అట్టి గ్రంథమును రచియించి యుండుననుటకు సందేహము లేదు. అభినవశంకరులుగూడ తమ రుద్రభాష్యములో కొన్ని మంత్రముల వినియోగమును గూర్చి చెప్పుచు, విశేషములను 'రుద్రకల్పము'లో చెప్పిన చొప్పున గ్రహించవలసినదిగా సూచించియున్నారు. కాగా – ఆయన కాలము వరకును రుద్రకల్పగ్రంథము ప్రచారములో నున్నట్లు అవగతమగుచున్నది. కాని అది యిప్పుడెచటను లభించుటలేదు. అమూల్యమైన ఆ గ్రంథరత్నము ఇతరుల చేజిక్కుట కిష్టములేని యే ప్రాచీన పండితుని ఇంటనైన మూటకట్టి మూల నుంచబడి మూల్గుచున్నదో, క్షుధాపీడితులైన ఉపదేహికాది క్షుద్రప్రాణులచే భక్షింపబడి, స్వరూపమునే కోలుపోయినదో తెలియదు. ఏమైన నేమి, ఆ మహాగ్రంథము లుప్తమగుట – భారతరత్న గర్భమునుండి ఆవిర్భవించిన అమూల్యమైన ఒక మహారత్నమును కోల్పోవుటకంటెను శోచనీయమనక తప్పదు.

**విద్యారణ్యశ్రీచరణులు** రుద్రభాష్యోపోద్ఘాతములో – ప్రకరణానుగుణముగ బ్రాహ్మణము ననుసరించి వ్యాఖ్యానించుచున్నట్లు చెప్పినను, ప్రసక్తానుప్రసక్తముగ వేదాన్తపరమైన అర్థమును గూడ వివరించియుండకపోలేదు. ఆయనది **అద్వైతహృదయము.**

అది దాచినను దాగునది కాదు. అంతమాత్రమే కాదు; నిజమునకు సందర్భమునుబట్టి, అచట, ఆ విధమైన వేదాన్తపరమైన అర్థమును పరిగ్రహించినప్పుడే వాక్యములకేకవాక్యత లభించి నిస్సందిగ్ధమైన శ్రుత్యర్థబోధ సంప్రాప్తమగును. అట్లు కానిచో – 'తీర్థమునకు తీర్థము – ప్రసాదమునకు ప్రసాదము' అన్నట్లు సమన్వయము లోపించును.

## 3. భట్టభాస్కరభాష్యము

ఉపలభ్యమానములగుచున్న రుద్రభాష్యములలో భట్టభాస్కరమిశ్రప్రణీతమైనది రెండవది. ఇది – విద్యారణ్యభాష్యముకన్న విస్తృతమైనది. తైత్తిరీయకృష్ణయజుర్వేదమునకు **'జ్ఞానయజ్ఞ'**మను పేరుతో సమగ్రమైన భాష్యమును సమకూర్చిన మహాపండితుడు – భట్టభాస్కరుడు. అందును వ్యాకరణములో అఖండమైన పాండిత్యమాయనది. విభిన్న ధాతుప్రత్యయాగమాదేశ స్వరసన్నివేశముల ననుసరించి ఆయా పదముల నిష్పత్తి ప్రకారమును ప్రదర్శించుటలోను, అపూర్వములగు అనేకార్థములను ఆవిష్కరించుటలోను, ఆయనది – అందెవేసిన చేయి. రుద్రమంత్రముల కాయన సమష్టి–వ్యష్టి పురశ్చరణ విధానములను వివిధ శాన్తిక–పౌష్టిక–వినియోగ ప్రక్రియలను శ్రుతీస్మృతీతిహాస పురాణములనుండి, తన్త్రగ్రంథములనుండి యుద్ధరించి ప్రదర్శించినాడు.

తాన్త్రికమూర్ధన్యుడుగా ప్రసిద్ధుడైన ఉద్దండపండితుడు – భాస్కరరాయ మహాశయునికన్న, నీ భట్టభాస్కరుడు భిన్నుడనియే అభియుక్తు లభిప్రాయపడుచున్నారు. అతని చిత్పరిణామవాదముగాని, శక్తిపారమ్యసిద్ధాన్తము గాని, వామాచారతత్పరత్వము గాని ఈతని భాష్యములో గోచరించుటలేదు. తాన్త్రిక భాస్కరుడేయైనచో ఏదోయొక సందర్భములో నేదోయొక విధమున తన సిద్ధాన్తమును సమన్వితమొనర్చుటకు ప్రయత్నించి యుండెడివా డనుటకు సందేహము లేదు. తాన్త్రికభాస్కరుడు వేదభాష్యమును వ్రాసినాడను జనశ్రుతియు లేదు.

అట్లని భట్టభాస్కరుడు శుద్ధశాఙ్కరాద్వైతసిద్ధాన్తానుయాయిగా కూడ కనిపించుటలేదు. బ్రహ్మస్వరూపమును వివరించుచు – 'బ్రహ్మణశ్చ త్రీణి రూపాణి సన్తి – ఏకం కార్యరూపం సర్వోపాదానతయా సర్వాత్మకమ్. ఇతరత్పురుషాఖ్యం సృష్టిస్థితి సంహారనిమిత్తమ్. ద్వయమప్యావిద్యకమ్. అన్యత్పరం రూపం నిర్గుణం నిరంజనం సత్యజ్ఞానానన్దలక్షణమ్.' **'సంసారీ చిదచిద్భ్యో౽న్యః.'** ఈ విధముగ నిర్దేశించుటనుబట్టి, ఈయన స్వేశ్వరసాంఖ్యసిద్ధాన్తమునకో, శివవిశిష్టాద్వైతసంప్రదాయమునకో చెందినవాడై యుండవచ్చునని కొందఱు అభిప్రాయపడుచున్నారు. ప్రాసంగికముగ నైనను ఎచటగూడ

జీవబ్రహ్మైక్యమును గుఱించిగాని, జగన్మిథ్యాత్వమును గురించిగాని ప్రస్తావించి యుండక పోవుటగూడ, ఈతడు శాంకరాద్వైతి కాడనుటకు ఉపోద్బలకమగుచున్నది.

**రుద్రప్రశ్నభాష్యభూమికలో** – ఇయ్యది (రుద్రము) బ్రహ్మవిద్యాప్రతిపాదకమైన ఉపనిషన్మన్త్రరాశియనియు, రహస్య (ఉపనిషత్) ప్రకరణములో పఠించదగినదనియు జెప్పుచు – **'బ్రాహ్మణవినియోగానురోధేన త్వత్ర వ్యాచక్ష్మహే'** బ్రాహ్మణవినియోగము ననుసరించి యిచట వ్యాఖ్యానించుచున్నాము అనుటనుబట్టి, యితడుగూడ రుద్రాధ్యాయముకు బ్రహ్మవిద్యాపరముగగూడ మరియొక వ్యాఖ్యను రచించి యుండ వచ్చునని ఊహించుట కవకాశము కలుగుచున్నది. అదే యథార్థమగుచో ఆ వ్యాఖ్యలో అతని సంప్రదాయమునుగూర్చి కొంత విస్పష్టముగ తెలుసుకొనుట కవకాశముండెడిది. కాని అదియు ఉపలభ్యమానమగుటలేదు.

## 4. విష్ణుసూరిభాష్యము

మూడవది – విష్ణుసూరి విరచితమైన రుద్రభాష్యము. ఇది అద్వైతపర మను ప్రవాదము కలదు. ఈ వ్యాఖ్యానమును పరిశీలించిన వారికి, విష్ణుసూరి వేదాన్తశాస్త్రముననే కాక సర్వశాస్త్రములలో సూరి యని స్ఫుటము కాగలదు. ఆ యా సందర్భములలో గావించిన కొన్ని వివరణలు – ఆయన శాక్తతన్త్రనిష్ణాతత్వమును స్పష్టము జేయుచున్నవి.

అన్వయానుపపత్తిగాని తాత్పర్యానుపపత్తిగాని యున్నపుడు ముఖ్యార్థమును పరిత్యజించి లాక్షణికార్థమునుగాని, గౌణార్థమునుగాని పరిగ్రహించుట పరిపాటి. అట్టి యవసర మేదియు కలుగకున్నను, కేవలము స్వాభిమతార్థసంపత్తికై లక్షణాశ్రయణము, వ్యవహితాన్వయము, క్లిష్టకల్పనము ఈ వ్యాఖ్యానములో పలుతావుల ప్రత్యక్షమగు చుండును. ఇవి పాఠకుల చిత్తశుద్ధిని పరీక్షించునవిగా నుండును. మరియు సహజమైన సందర్భశుద్ధి కొఱవడి, కావలెనని ప్రవేశపెట్టబడినవిగా భాసించుచుండును. శైలియు సర్వదా కఠినముకాకపోయినను సరళము మాత్రము కాదు.

విష్ణుసూరి కల్పనలు కొన్ని క్లిష్టములు అప్రస్తుతములుగానున్నను, సహృదయ హృదయంగమములైనవికూడ కొన్ని లేకపోలేదు. స్థాలీపులాకన్యాయమున రెంటికిని రెండుదాహరణలు–

1. **'నమో హిరణ్యబాహవే'** అను మంత్రములోని హిరణ్యశబ్దమునకు – 'శుక్లబిందువు' అని యర్థమును చెప్పి, అయ్యది బాహువుగా గలవాడు, అనగా (ఇతర

కార్యములలో) బాహువువలె. సృష్టికార్యములో సహకారిగాగలవాడు అని అర్థవర్ణనము చేయబడినది. ఇందలి సరసతను సాహిత్యవేత్తలే నిర్ణయించవలెను.

2. **'ఘోరా–శివా'** నామములో శ్రుతిప్రసిద్ధములైన పరమేశ్వరుని రెండు తనువులలో ఘోరతనువును – అఖిలానర్థనిదానమైన – విషయాసక్తమైన బహిర్ముఖాన్తః కరణవృత్తిగాను, శివతనువును – విషయవ్యావృత్తమై ఆత్మప్రవణమైన అన్తర్ముఖాన్తః కరణవృత్తిగాను లక్షించుట ఇది ఔచిత్యసమన్వితమై సహృదయులను సంతోషింప జేయుచున్నది.

## 5. అభినవశంకరభాష్యము

నాల్గవది – ఇప్పుడాగ్రీకరించి ప్రియపాఠకుల కరకమలములలో సమర్పించు చున్న యీ రుద్రభాష్యము. ఇది శ్రీమదభినవ శంకరాచార్య విరచితమని పారంపర్యముగ తెలియుచున్నది. ఆదిశంకరభగవత్పాదులకృతి యిది కాదనుటకు 'అభినవ' పదమే నిదర్శన మగుచున్నది. ఆద్యశంకరాచార్య ప్రతిష్ఠితములగు చతురామ్నాయ పీఠములలో నేదో యొక దాని నధిష్ఠించిన ఆచార్య పురుషుడనుటకు గూడ తగిన ఆధారములెవ్వియు కనిపించుటలేదు. కాని – భగవదవతారమూర్తులుగా ప్రసిద్ధులైన అద్వైతబ్రహ్మవిద్యా ప్రవర్తకులగు ఆద్యశంకరభగవత్పాదాచార్యుల సంప్రదాయమునకు చెందిన పరమహంస పరివ్రాజకు డనుటకు మాత్రము సందేహము లేదు.

ఈ విషయము – ఇందలి పంచమానువాకములోని **'వ్యుప్తకేశ'** పదభాష్యమును పరిశీలించిన విస్పష్టము కాగలదు. మఱియు ఆద్యశంకరాచార్యులను అపర శివావతారముగ పేర్కొనుటయేకాక, 'శంకరాచార్యస్వామినః' అని సబహుమానముగ బహువచనాన్తస్వామిపదముతో ఉల్లేఖించుటను బట్టి, వారి విషయమున ఈ భాష్యకర్తకు గల – అసాధారణములైన గౌరవభక్తిప్రపత్తులు అభివ్యక్తములగుచున్నవి. తైత్తిరీయ కృష్ణయజుర్వేదాన్తర్గతమగు రుద్రాధ్యాయమునకు భాష్యమును రచించుటనుబట్టియు, ఆ వేదశాఖలో – అన్తరాన్తరములలోనున్న అసాధారణములైన అనేక వచనములను తన భాష్యములో ప్రమాణముగ ఉదాహరించుటను బట్టియు, బోధాయనమహాన్యాససూత్రార్థ వివరణ మొనర్చుటనుబట్టియు, ఈ మహనీయుడు తైత్తిరీయకృష్ణయజుశ్శాఖీయుడనియే కాక, దక్షిణభారతవాసియనియు భావించవలసియున్నది. తైత్తిరీయశాఖీయులు సాధారణముగ ఆంధ్ర తమిళ కర్నాటక మహారాష్ట్రాభిజనులే గాని, దేశాన్తరాభిజనులు కారు. ఎందరో మహానుభావులయొక్కయు, పండిత ప్రకాండులయొక్కయు ఇతివృత్తముల

వలెనే యీ భాష్యకర్తకు సంబంధించిన అభిజన – పూర్వోత్తరాశ్రమ–నామ – ధామాది చారిత్రకాంకములు ఇంతకుమించి తెలియవచ్చుటలేదు.

ఈ భాష్యము ఆమూలాగ్రము సరళగంభీరమైన శైలి గలిగి అనేకార్థములతో, అన్వయవిశేషములతో, అపూర్వభావసంపదతో అలరారుచున్నది. అనేక విశేషణము లున్నపుడు, వానికి వ్యావర్తకత్వమునో వ్యవహార ప్రయోజకత్వమునో చెప్పి సార్థక్యమును సంపాదించుటయేకాక, హేతుగర్భత్వమును సహేతుకముగ నిరూపించి సమర్థించుటలో అభినవశంకరుల ప్రతిభ – అనన్యసామాన్యమైనది. రుద్రాధ్యాయమునకు కర్మోపాసనా జ్ఞానకాండోత్తమత్వమును, ఉపనిషత్త్వమును, సర్వోపనిషదుత్కృష్టత్వమును, సర్వాశ్రమిసంసేవ్యత్వమును ద్వైత–తాన్త్రిక ప్రోక్తార్థాసంగతత్వమును, శివాద్వైతపరత్వమును నిరూపించుచు ఆయన రచించిన ఊర్జస్వలమైన – ఉపోద్ఘాతము, నాయకరత్నమై భాష్యరత్నహారశోభను ఉద్దీపింపజేయుచున్నది.

ఆయనకు గల వేదవేదాఙ్గపారంగతత్వము, పూర్వోత్తరమీమాంసాశాస్త్ర–వైదుష్యము, ఇతిహాస పురాణధర్మశాస్త్ర ప్రావీణ్యము – అభియుక్తములను ఆశ్చర్య పరవశులను చేయుననుటలో – అతిశయోక్తిలేదు. ఈ లఘు గ్రంథములోనే సారవత్తరములైన అనేక పూర్వోత్తరమీమాంసాన్యాయముల నాయన ప్రసారము చేసినాడు. శివ–లింగ–స్కాన్ద–కూర్మ–భాగవతాది పురాణములనుండియు, రామాయణ–యోగవాసిష్ఠ–మహాభారత–హరివంశాది గ్రంథములనుండియు అసంఖ్యాకములగు వచనములను ఉక్తార్థోపబృంహక ప్రమాణములనుగ ఉదాహరించినాడు. ఇతర భాష్యకారు లెవ్వరును వివరించుటకు పూనుకొననట్టియు, విశిష్టోపకారకమైనట్టియు బోధాయన మహాన్యాస సూత్రార్థమును వివరించుట – ఈ భాష్యములోని మఱియొక సంస్తవనీయమైన సన్నివేశ విశేషము.

ఈ సంయమిసార్వభౌముడు, **'పథీనాం పతయే నమః'** అను రుద్రాధ్యాయ ద్వితీయానువాకములోని మంత్రభాగమునకు భాష్యమును రచించుచు, ప్రాసఙ్గికముగ వివిధ తాన్త్రిక వాద ప్రవృత్తినిమిత్తమును ప్రతిపాదించి, తాన్త్రికమతఖణ్డనాత్మకమగు 'పాషణ్డగజకేసరి' యను ప్రబంధము నొకదానిని తాను రచించినట్లు పేర్కొనినాడు. కాని ఇపుడది యెచటను కానరాకున్నది. మన దురదృష్టవశమున అనర్ఘములైన యిట్టి గ్రంథము లెన్నియో కాలగర్భమున గలసిపోయినవి. అవైదికములగు తాన్త్రికాచారముల కలవాటుపడిన ప్రతిపక్షులే యీ గ్రంథము ఇహలోకమున నుండదగదని పరలోకమునకు

పంపినను పంపియుండవచ్చును. పంచపాదికగా మిగిలిన పద్మపాదుని బ్రహ్మసూత్ర శాంకరభాష్యవ్యాఖ్యానమును, అన్యమతానురక్తులైన అతని రక్తసంబంధులే అగ్నిసంపృక్తము గావించిన ఆఖ్యాయిక సుప్రసిద్ధమే గద!

అభినవశంకరులు పాషణ్డగజకేసరినే కాక, ఇంక నేవేవి కృతులను గూడ రచియించినారేమో తెలియదు. ఉపలభ్యమానమైన కృతి యీ రుద్రాధ్యాయ భాష్యమే యైనను, చుక్కలలో చంద్రుడువలె ఇది – చదువరుల హృదయకైరవములను అవశ్యము ఆహ్లాదింపజేయగలదనుటకు సందేహము లేదు.

రుద్రాధ్యాయార్థ వివరణార్థములైన – మఱికొన్ని – శాఖాన్తరీయభాష్యములు గూడ నున్నవి. విస్తరభీతిచే వానిని గూర్చి యిట ప్రస్తావించుట లేదు.

## 6. అనువాదప్రవృత్తినిమిత్తము

ఈ భాష్యములన్నియు సంస్కృతభాషలో నిబద్ధములైయున్నవి. సమగ్రమైన సంస్కృతజ్ఞానములేని ఆంధ్ర సహృదయుల సంతుష్టి నభిలక్షించి పలువురు పండిత ప్రకాండులు ఆ యా భాష్యములను ఆంధ్రీకరించినారు. ఐతే నాకు తెలిసినంతలో అభినవ శంకరభాష్యములోని విషయములను అంశికముగ సంగ్రహించినవారు కొందరున్నారు గాని, ఆమూలాగ్రమాంధ్రీకరించినవారు లేరు. వారి కిందలి శాస్త్రీయవిషయములు కొఱుకుడు పడలేదో,కొఱగానివిగా తోచినవో తెలియదు. నా కిది యొక సదవకాశ మనిపించినది.

సర్వదేవతలును సమానులేయన్న శాస్త్రీయ సంస్కారమొకప్రక్క జాగరూకమై యున్నను – ఆదిదేవుడన్నను, అతని పవిత్ర విచిత్ర చరిత్రలన్నను అన్తరంగ ముప్పొంగు చుండును. ఇది నాకు ఆబాల్యసిద్ధమైన భావము. అట్లని ఇతర దేవతల విషయమున ద్వేష మీషన్మాత్రము గూడ లేదు. ఈ నా చిత్తవృత్తికి కారణ మేమో నాకు తెలియదు. దీనినిగూర్చి తలచుకొనినపు డెల్లా 'తథాఽపి భక్తిస్తరుణేన్దుశేఖరే' అను భర్తృహరి సుభాషితము స్మృతిపథమున నవతరించు చుండును. అప్పటికి నిప్పటికి నిదియే నా స్థితి.

ఇది ఇట్లుండగా సుమారు నలుబది సంవత్సరములకు పూర్వము విజయవాడలో విద్యాభ్యాసము జేయుచున్న కాలములో ఈ అభినవశంకర రుద్రభాష్యమును

యాదృచ్ఛికముగా జూచుట జరిగినది. అంతకు పూర్వము విద్యారణ్య-భట్టభాస్కర భాష్యముల గూర్చియే కాని ఇతర భాష్యముల గూర్చి వినియైనను నుండని నేను ఆదరముతో నా గ్రంథము నటునిటు చూచితిని. ఔత్సుక్యముతో ఒకటి రెండు పుటలు చదివితిని. దానితో అభిలాష అతిశయింపగా గ్రంథస్వామి నడిగి తీసికొని ఆమూలాగ్రము పఠించితిని. అమందానందము నొందితిని. అప్పుడే దాని నాంధ్రీకరించిన బాగుండు ననిపించినది కాని, అవకాశము లభించినది కాదు.

పదునైదు సంవత్సరముల తరువాత నిచట (సికిందరాబాదులో) కొందరు సహృదయుల కోరికపై ప్రత్యేకముగ రుద్రభాష్య ప్రవచనము జేయు సందర్భమున అభినవశంకర భాష్య విశేషములను గూడ క్రోడీకరించి ఉపన్యసించుటయు, శ్రోతలు సంతోషించి యీ భాష్యము నాన్ధ్రీకరించి ప్రచురించిన బాగుండునని ప్రోత్సహించుటయు జరిగినది. దానితో నా పూర్వసంస్కారము పునరుద్బుద్ధమైనది. అనువాదము నారంభించి పదునైదు దినములలో పూర్తిచేసితిని. కాని ముద్రణావకాశము మృగ్యమగుటతో ఆ చిత్తు వ్రాతప్రతి అట్లే ఉండిపోయినది. ఇపుడు దీనికి వెలుగుజూచు కాలము వచ్చినది కాబోలు! శివసంకల్పము మిక్కిలి చిత్రమైనది.

## 7. అనువాదపద్ధతి.

ఇక నా యనువాదవిధానమును గూర్చి నాల్గు మాటలు చెప్పి యీ భూమికను ముగింతును. ఇది-అభినవశంకరభాష్యమునకు మక్కికి మక్కిగా జేసిన ప్రతిపదార్థానువాదము కాదు. చదువరులకు భాష్యార్థము సుబోధము కావలయునను తలంపుతో జేయబడిన భావప్రధానమైన-స్వతంత్రానువాదము. కావుననే తదనుగుణముగ **'పాఠక్రమాదర్థక్రమో బలీయాన్'** అను న్యాయము ననుసరించి అవసరమునుబట్టి పాఠక్రమములో ఒకింత మార్పు గావించినను, మూలము (భాష్యము)లో లేని విషయములను చేర్చుటగాని, ఉన్నవిషయములను తీసివేయుటగాని జరుగలేదు. భాష్యములో సూచించిన విధముగ ఆపేక్షితములగు అధ్యాహారానుషంగములలో అన్వయక్రమము ననుసరించి ప్రతి మంత్రమునకును ముందు 'అర్థము' వ్రాయబడినది. అటువైపు భాష్యకారోక్తములగు శబ్దనిష్పత్తి ప్రకారములు, తాత్పర్యవిశేషములు, ఆక్షేప సమాధానములు, మన్త్ర-పురశ్చరణ-వినియోగాదులు 'వివరణము' అను శీర్షికతో విశదీకరింపబడినవి. భాష్యములలో ప్రమాణముగ ఉదాహరింపబడిన శ్రుతి స్మృతి పురాణాది వచనములు అధికసంఖ్యలో నున్నపుడు, అనువాదములో మఱల వాని

నామూలాగ్రముదహరించుట అనావశ్యకము. గ్రంథవిస్తరణకారణము నగునను తలంపుతో, ప్రత్యాహారపద్ధతిలో వచనముల నుల్లేఖించి, వాని భావము సంగ్రహముగ వ్రాయబడినది. ఎచటనేని భాష్యప్రతిపాదితమైన విషయము– వివరణసాపేక్షమని గాని, ఆక్షేపావకాశము గలిగియున్నదని గాని తోచినపుడు క్రింద లఘుటిప్పణములో అది సవిమర్శముగ నిరూపింపబడినది.

ఈ అభినవశంకరరుద్రభాష్యము – సరళముగ నున్నట్లు భాసించినను అతిగంభీరార్థమను విషయము అభిజ్ఞులకు తెలియనిది కాదు. దీని లోతుపాతులను యథాతథముగ గుర్తించుట–దుర్ఘటమనుటకును సందేహము లేదు. కాగా దీని ననువదించుటకు పర్యాప్తమైన పాండిత్యము గలవాడ నను అహంభావముతో నేనీ పనికి బూనుకొనలేదు. ముందుగనే మనవిజేసినట్లు నాకే తెలియని నాలోని ఒకానొక సంస్కారము ఉద్బుద్ధమైనది. అదియే ఔత్సుక్యమును రేకెత్తించినది. అనుదింపజేసినది. ఇందేవేని దొసగులు పొసగినచో, అవి – అల్పజ్ఞుడనైన నావి. గుణములున్నచో, అవి – గురుకరుణా కటాక్షమున్మీలితములైనవి.

## 8. ముద్రణ సంవిధానము.

ఈ గ్రంథముద్రణకు గాను మా విన్నపమును మన్నించి తమ "ధార్మిక గ్రంథప్రకాశన సహాయప్రణాళిక" ద్వారా దశసహస్ర రూప్యాత్మకమగు (రూ. 10,000/–) ఆర్థిక సహాయ్యమున ప్రకటించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి కృతజ్ఞతాభినందనముల నర్పించుచున్నాను. శ్రీనివాసుడు వారిని సకలశ్రేయముల సమకూర్చుగాక!

మఱియు ఈ గ్రంథముద్రణ వృత్తాన్తమును విని భక్త్యుత్సాహభరితమైన హృదయముతో అయాచితముగ సముచితమగు ఆర్థికసాహాయ్య మొనర్చిన సహృదయులు, శ్రీ గడియారం అన్నపూర్ణమ్మ–ఆంజనేయశర్మ దంపతులకు సకల శుభముల సమకూర్చమని ఆదిదంపతులగు పార్వతీపరమేశ్వరులను ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథముద్రణమును స్వకార్యముగ భావించి నిర్ణీతవ్యవధిలో హృద్యముగను, నిరవద్యముగను ముద్రించిన ఆర్.కె.ప్రింటర్స్ వారికి, వారి సహాయకార్య నిర్వాహకులు – పూజ్యులు శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి ఎం.ఏ., మహాశయులకును, తక్కుంగల ముద్రణాలయ పరివారమునకును మా మిత్రులు–న్యాయ సాహిత్య విద్యాప్రవీణులు–

శ్రీ కంభంపాటి సీతారామాంజనేయులు, ఎం.ఏ., గారికిని, నా హృదయపూర్వక ధన్యవాదములు. వారిని సర్వాభీష్టప్రదానపూర్వకముగ భగవానుడు సంరక్షించుగాక.

## 9. సమర్పణము

ఈ నా కృతిని మా అభిజనగ్రామము (చౌటపాపాయపాలెము)లోని మా కులదైవము - శ్రీ బాలా త్రిపురసున్దరీ పార్వతీసహిత శ్రీవిశ్వేశ్వరస్వామివారి చరణ సరసీరుహ సన్నిధానమున సప్రశ్రయ ప్రణామ సహస్రపురస్సరముగ సమర్పించుచున్నాను.

ఓమ్-తత్-సత్

సికింద్రాబాద్,
1-6-1989

**స.లక్ష్మీనారాయణమూర్తి**



శ్లో॥ గండిసోదరయత్నేన
నిర్మితాం యోనిరూపికామ్ ।
నమామి సర్వశక్తిం తా
మదృశ్యశివధారిణీమ్ ॥

# రుద్రభాష్య-విషయానుక్రమణిక

## ఉపోద్ఘాతభాష్యే

## మన్త్రభాష్యే

1. ప్రథమానువాకే పఞ్చదశభిః ఋగ్భిః భగవత్ప్రసాదప్రార్థనా
2. ద్వితీయానువాకే ఉభయతో నమస్కారాత్మకైః యజుర్మన్త్రైః సర్వేశ్వరత్వ సర్వాత్మకత్వ– సర్వాన్తర్యామిత్వాది రూపేణ భగవత్ప్రార్థనా
3. తృతీయానువాకే ”
4. చతుర్థానువాకే ”
5. పఞ్చమానువాకే – అన్యతో నమస్కారాత్మకైః యజుర్మన్త్రైః పూర్వవత్ భగవత్ప్రార్థనా.
6. షష్ఠానువాకే ”
7. సప్తమానువాకే ”
8. అష్టమానువాకే ”
9. నవమానువాకే ”
10. దశమానువాకే – ద్వాదశభిః ఋఙ్మన్త్రైః భగవత్ప్రార్థనా
11. భగవదంశభూతానాం రుద్రాణాం ప్రార్థనా

ఓమ్

శ్రీసద్గురుశ్శరణమ్

# శివసఙ్కల్పః

శివనామరూపభావం,
శివయా సహ భాసమానమసమానమ్।
చిన్తితసర్వార్థప్రద–
చిన్తామణిమాశ్రయామి విశ్వేశమ్॥

ఆన్ధ్రీకృతాని కైశ్చిత్
ప్రాజ్ఞైరన్యాని రుద్రభాష్యాణి।
అభినవశఙ్కరభాష్యం
నాన్ధ్రీకృతమేతదస్తి మమ భాగ్యమ్॥

శ్రీ సన్నిధానవంశ్యః, సూనుశ్శ్రీ విశ్వనాథవిదుషోఽగ్ర్యః।
ఆన్ధ్రీకరోమి–‘లక్ష్మీనారాయణమూర్తి’ నామధేయోఽహమ్॥

అద్వైతార్థపరత్వాత్,
ఔత్సుక్యాత్సద్గురోశ్చ కారుణ్యాత్।
లఘుతరధిషణోఽప్యస్మిన్
గురుతరకార్యేఽస్మి దత్తచిత్తోఽహమ్॥

శివ ఏవ విశ్వమఖిలం,
కర్తా భోక్తా కృతిశ్చ శివ ఏవ।
తృణమపి న చలతి నూనం
జగతి వినైవ దివ్యశివసఙ్కల్పమ్॥



ఓమ్

శ్రీ సద్గురుశ్శరణమ్

శ్రీమదభినవశంకరాచార్యవిరచితమ్

# శ్రీరుద్రభాష్యమ్

ఆన్ధ్రానువాదసహితమ్

## ఉపోద్ఘాతః

మఙ్గళాచరణమ్

**భాష్యమ్–**

**ఈశానః సర్వవిద్యానామీశ్వరో నిఖిలాత్మనామ్।**
**జయత్యఖణ్డసర్వజ్ఞో జగదాదిగురుః శివః॥** **1**

**అనువాదము:** సకలవిద్యాప్రవర్తకుడు, నిఖిలజీవనియామకుడు, అఖండసర్వజ్ఞమూర్తియు, అఖిలలోకముల కాదిగురుడునగు **శివుడు** సర్వోత్కృష్టుడై వెలయుచున్నాడు.

**'ఈశానస్సర్వవిద్యానామ్'** 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' 'ఆచార్యవాన్పురుషో వేద' ఇత్యాది శ్రుత్యర్థ మిందు సంగ్రహించబడినది. దీనినిబట్టి యిచట శివుడనగా – సర్వజ్ఞత్వసర్వశక్తిమత్త్వాదిలక్షణ లక్షితమగు పరమాత్మ స్వరూపమేగాని, కేవలము తమోగుణప్రధానుడు, జగత్ప్రళయ కారకుడు, త్రిమూర్తులలో నొకడు మాత్రమే కాదని గ్రహించవలసియున్నది. మరియు అతిబాల్యముననే అఖిల విద్యల నేర్చినట్టియు, ఆగమవిరుద్ధములగు మతముల నన్నింటిని ఖండించి తన్మతానుయాయుల నందరిని వశీకరించుకొన్నట్టియు, సర్వజ్ఞపీఠము నధిష్ఠించి సర్వలోకస్తవనీయుడైనట్టియు, ఇదంప్రథమముగ అన్వర్థమగు జగద్గురుపదము నధిగమించినట్టియు, సాక్షాత్ పరశివావతారమైనట్టియు శ్రీమదాద్యశంకరభగవత్పాదా–చార్యుల దివ్యచరిత్రము నీ పద్యము నందలి పదములు సూచించుచున్నవి.

**భాష్యమ్–**

**ప్రసాధితయజుశ్శాఖం ప్రపద్యే శతరుద్రియమ్।**
**సారముద్ధృత్య రుద్రాణాం సమ్యగ్వ్యాఖ్యా విధీయతే॥ 2**

శతాధికములగు శాఖలతో విస్తరిల్లిన యజుర్వేదమునకు సహజాలంకారముగ నున్న శతరుద్రీయము(నమకము)ను శరణుజొచ్చుచున్నాను. రుద్రమహిమాప్రతిపాదకములగు అందలి మంత్రములకు సారసముద్ధరణపూర్వకముగ సముచితమగు వ్యాఖ్యానము నాచే రచింపబడుచున్నది.

రుద్రమంత్రసముదాయరూపమగు శతరుద్రీయము–శబ్దరాశి. అది యచేతనము. దానిని శరణుజొచ్చు టేమిటి? అని యేమైన కరుణించునా? వరమిచ్చునా? అను శంక కలుగవచ్చును. మంత్రప్రతిపాద్యము దేవత యని మన సిద్ధాన్తము. ఆదరాతిశయమును పురస్కరించుకొని ప్రతిపాదకమగు మంత్రమునకు ప్రతిపాద్యమగు దేవతతో అభేదానుసన్ధాన మొనర్చు స్థితిలో నిది దోషముకాదు సరికదా, గుణమే యగుచు ఫలప్రద మగును. శబ్దదేవతావాదులగు మీమాంసకుల మతమున నీ శంకకు ప్రసక్తియే లేదు.

**భాష్యమ్–**

**భసితకవచితానాం బద్ధరుద్రాక్షదామ్నా–**
**మమృతకిరణమౌలేరఙ్ఘ్రిమూలే స్థితానామ్।**
**ప్రతిదినశతరుద్రప్రశ్నశుద్ధాశయానా–**
**మమరపతినుతానామస్మి దాసానుదాసః॥ 3**

**అనువాదము:** భస్మమునే కవచముగా ధరించి, రుద్రాక్షమాలాసమలంకృతులై అమృత కిరణుడగు చంద్రుని శిరోభూషణముగ ధరించిన శివుని చరణముల శరణుజొచ్చినట్టియు, ప్రతిదినరుద్రప్రశ్నజపముచే పరిశుద్ధహృదయులై అమరేన్ద్రాదులకు సైత మభినంద నీయులైనట్టియు, ఆర్యులకు నేను దాసానుదాసుడ నగుచున్నాను.

## శ్రీరుద్రోపనిషదః సర్వవేదోత్తమత్వమ్

**భాష్యమ్ –** ఇహ కిల శ్రుతిస్మృతీతిహాసపురాణప్రసిద్ధమేవ శ్రీరుద్రోపనిషదః సర్వవేదోత్తమత్వమ్. తథా హి – జాబాలోపనిషది తావత్ **'అథ హైనం బ్రహ్మచారిణ**

**ఊచుః, కిం జప్యేనామృతత్వం బ్రూహి'** ఇతి మోక్షసాధనజప్యప్రశ్నే **'స హోవాచ యాజ్ఞ్యవల్క్యః శతరుద్రీయేణేతి ఏతాని హ వా అమృతస్య నామధేయాని, ఏతైర్హ వా అమృతో భవతి'** ఇతి శతరుద్రీయశబ్దవాచ్యశ్రీరుద్రోపనిషదః ప్రాధాన్యేన మోక్షసాధనత్వం ప్రతిపాద్యతే.

**అనువాదము:** శ్రీరుద్రోపనిషత్తు సమస్తవేదములలో ఉత్తమమను విషయము శ్రుతి-స్మృతీతిహాసపురాణప్రసిద్ధము. జాబాలోపనిషత్తులో (అథ హైనం...బ్రూహి) దేనిని జపించుటచే అమృతత్వము సిద్ధించునో చెప్పుమని బ్రహ్మచారులు ప్రశ్నించగా, (స హోవాచ... అమృతో భవతి.) యాజ్ఞవల్క్యమహర్షి శతరుద్రీయజపముచే అమృతత్వము సిద్ధించును. అందలి నామధేయములన్నియు అమృతస్వరూపుడగు పరమాత్మను బోధించునవియే, వానిని జపించువాడు అమృతస్వరూపుడే యగును అని సమాధాన మిచ్చుటనుబట్టి శతరుద్రీయ శబ్దవాచ్యమగు రుద్రోపనిషత్తు మోక్షసాధనములలో ప్రధానమైనదిగా ప్రతిపాదింపబడుచున్నది.

## శతరుద్రీయ నామనిర్వచనమ్

**భాష్యమ్-** శతం రుద్రా దేవతా అస్యేతి శతరుద్రియమ్ **'సాఽస్య దేవతా'** ఇత్యధికారే **'శతరుద్రాద్ఘశ్చ'** ఇతి సూత్రేణ శతరుద్రశబ్దాద్దేవతార్థే ఘప్రత్యయస్య, చకారేణ ఛ-ప్రత్యయస్య చవిధానేన **శతరుద్రియం శతరుద్రీయం** ఇతి రూపద్వయస్య వైయాకరణైర్వ్యుత్పాదనాత్. శతపదం చానన్త్యపరమ్, **'శతమనన్తం భవతి'** ఇతి శ్రుతేః, **'విశ్వం శతం సహస్రం చ సర్వమక్షయ్యవాచకమ్'** ఇతి మహాభారతవచనాచ్చ. అనన్తాశ్చేహ రుద్రాః ప్రతిపాద్యన్తే, **'సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్' 'యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశః'** ఇతి శ్రవణాత్. మన్త్రప్రతిపాద్యతయా తేషాం దేవతాత్వమ్, **'మన్త్రవాచ్యార్థో దేవతా'** ఇతి నిరుక్తకారవచనాత్.

యద్వా రుద్రస్యేదం రుద్రీయమ్, **'వృద్ధాచ్ఛః'** ఇతి ఛ-ప్రత్యయః, తథా ఘ-ప్రత్యయశ్చ. కేవలాదపి రుద్రశబ్దాత్సంబన్ధార్థేషు ఘ ప్రత్యయస్య 'యా తే అగ్నే రుద్రియా తనూః' **'యథాతోకాయ'** ఇత్యాదిషు దర్శనాత్. ఏవం చ రుద్రీయపదం రుద్రసంబన్ధి శ్రీరుద్రోపనిషత్పరమ్. శతే శాఖాసు పఠ్యతే రుద్రీయం శతరుద్రీయమ్, తదుక్తం స్కాన్దే సూతసంహితాయామ్-

**'శతశాఖాగతం సాక్షాచ్ఛతరుద్రీయముత్తమమ్।**
**తస్మాత్తజ్జపమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే॥'** ఇతి.

భట్టభాస్కరేణాప్యుక్తమ్ – **'ఏకశతం యజుశ్శాఖాస్తాసు రుద్రోపనిషదామ్నాయతే'** ఇతి.

అథవా – రుద్రస్యేమాని రుద్రీయాణి, రుద్రనామధేయాని, శతమనన్తాని రుద్రనామధేయాని యస్మింస్తచ్ఛతరుద్రీయమ్. తదిదముక్తం **'ఏతాని హ వా అమృతస్య నామధేయాని'** ఇతి. ఉక్తం చ కూర్మపురాణే భగవతైవ – **'ఇమాని మే రహస్యాని నామాని శృణు చానఘ'** ఇతి. భారతే చ ద్రోణపర్వణి శతరుద్రీయాధ్యాయే వర్ణ్యతే – తత్ర హి **'నామధేయాని లోకేఽస్మిన్ బహూన్యస్య యథార్థవత్'** ఇతి పరమేశ్వరనామానన్త్యం ప్రతిజ్ఞాయ, **'వేదే చాస్య సమామ్నాతం శతరుద్రీయముత్తమమ్'** ఇతి వేదగత శతరుద్రీయామ్నాతం తదుపపాదకత్వేనోదాహృతమ్. తేన చ రుద్రనామానన్త్యం శతరుద్రీయపదప్రవృత్తినిమిత్తమిత్యుక్తం భవతి.

**అనువాదము:** శతసంఖ్యాకులగు రుద్రులు దేవతలుగా గలదిగాన నీ మంత్రసముదాయము **'శతరుద్రీయ'** మనబడుచున్నది. **'సాఽస్య దేవతా'** అను అధికారము (ప్రకరణము)లో నున్న 'శతరుద్రాద్ఘశ్చ' అను సూత్ర(వార్తిక)ముచే శతరుద్రశబ్దముకంటె దేవతార్థమున ఘ–ప్రత్యయము, చకారముచే ఛ–ప్రత్యయము విధింపబడుటచే, శతరుద్రియ శతరుద్రీయ అను రెండు రూపములును సిద్ధించు నని వైయాకరణులు వివరించుచున్నారు. 'శతమనన్తం భవతి' అను శ్రుతి ననుసరించియు, 'విశ్వం శతం సహస్రం చ సర్వమక్షయ్యవాచకమ్' అను మహాభారతవచనమును బట్టియు శతపదము – ఆనన్త్యార్థకము. 'సహస్రాణి సహస్రశో యే రుద్రా అధి భూమ్యామ్' 'యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితా స్సహస్రశః' అను మంత్రములలో అనంతములగు రుద్రమూర్తులున్నట్లు రుద్రాధ్యాయము ప్రతిపాదించుచున్నది. మంత్రప్రతిపాద్యులగుటచే ఆ రుద్రమూర్తులకు దేవతాత్వము సిద్ధించుచున్నది. **'మన్త్రవాచ్యార్థో దేవతా'** అని నిరుక్తకారవచనము.

లేదా– 'రుద్రస్యేదం రుద్రీయమ్' **'వృద్ధాచ్ఛః'** అను సూత్రముచే ఛ–ప్రత్యయమును చేర్చగా 'రుద్రీయ' శబ్దము నిష్పన్నమగును. అట్లే ఘ–ప్రత్యయమును చేర్చినచో 'రుద్రియ' అను రూపము సిద్ధించును. 'యా తే అగ్నే రుద్రియా తనూః' 'యథాతోకాయరుద్రియమ్' ఇత్యాది ప్రయోగములనుబట్టి కేవల రుద్రశబ్దముకంటె గూడ సంబంధార్థములో ఘ–ప్రత్యయము కనిపించుచున్నది. కాగా– రుద్రీయపదము 'రుద్రునకు సంబంధించినది' అను నర్థము ననుసరించి శ్రీరుద్రోపనిషత్పరము. ఇయ్యది

శతసంఖ్యాకములగు వేదశాఖలలో పఠింపబడుచున్నది గాన శతరుద్రీయమనబడు చున్నది. ఈ యర్థమును 'శతశాఖాగతం...ప్రముచ్యతే' అను స్కాన్దపురాణాంతర్గత మగు సూతసంహితావచనము సమర్థించుచున్నది. భట్టభాస్కరుడుగూడ ఏకశత (101) సంఖ్యాకములగు యజుర్వేదశాఖలలో రుద్రోపనిషత్తు ఆమ్నాతమై యున్నట్లు చెప్పియున్నాడు.

లేదా – రుద్రస్యేమాని రుద్రీయాణి – రుద్రనామధేయాని. శతం–అనంతాని రుద్రనామధేయాని యస్మింస్తత్ శతరుద్రీయమ్ – అను వ్యుత్పత్తిచే అనంతములగు రుద్రనామములతో గూడిన మంత్రసముదాయముగాన నిది శతరుద్రీయ శబ్దవాచ్య మగుచున్నది. ఈ విషయమును 'ఏతాని హ వా అమృతస్య నామధేయాని' అను వచనము బోధించుచున్నది. కూర్మపురాణమునందు సైతము (ఇమాని మే రహస్యాని నామాని శృణు చానఘ–అని) శతరుద్రీయములోనివన్నియు తన రహస్యనామములని భగవానుడే స్వయముగ జెప్పియున్నాడు. భారతమునందలి ద్రోణపర్వములో, శతరుద్రీయాధ్యాయ వర్ణనలో (నామధేయాని లోకేఽస్మిన్ బహూన్యస్య యథార్థవత్–అని) పరమేశ్వర నామముల అపరిమితత్వమును ప్రస్తావించి అద్దానికి ఉపోద్బలకముగ (వేదే చాస్య సమామ్నాతం శతరుద్రీయముత్తమమ్–అని) వేదములోని శతరుద్రీయాధ్యాయము ఉదాహరింపబడినది. కాగా – రుద్రనామము లనన్తములై యుండుట – శతరుద్రీయ పదమునకు ప్రవృత్తినిమిత్త మని చెప్పినట్లగుచున్నది.

**భాష్యమ్ –** న చ పరమేశ్వరనామత్వేన నైఘణ్టుకాదిభిరననుశిష్టానాం కథం తన్నామత్వమితి వాచ్యమ్; **'ఏతాని హ వా అమృతస్య నామధేయాని'** ఇతి సాక్షాద్వేదేనోక్తస్యార్థస్య నిఘణ్ట్వనుక్త్యా పరిత్యాగాయోగాత్. **'ఇమాని మే రహస్యాని నామాని'** ఇతి కూర్మపురాణ–వచనేన వేదరహస్యనామధేయతయావగతత్వేన తేషు నైఘణ్టుకాపరిగ్రహస్యాన్యథా–సిద్ధత్వాచ్చ లోకప్రసిద్ధకావ్యనాటకాదిప్రయుక్తకతిపయనామమాత్రసఙ్గ్రాహిణో హి నైఘణ్టుకాః, న వేదరహస్యేషు వ్యాప్రియన్తే. దృశ్యన్తే హి నైఘణ్టుకైరపరిగృహీతాన్యేతాదృశాని పరస్సహస్రం వైదికనామధేయాని, యథా – **'తదితి హ వా ఏతస్య మహతో భూతస్య నామ భవతి' 'ఏతద్వా అపాం నామధేయం గుహ్యం యదాధావాః' 'తస్యోదితి నామ'** ఇత్యాదీని. న హ్యేతేషు నైఘణ్టుకాపరిగ్రహస్తన్నామత్వమపనేతుం ప్రభవతి; ప్రత్యుత వేదరహస్యత్వమేవ తేషాముపోద్బలయతి. **'ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః'** ఇతి, **'ఆతానతప్తా ఇవ ధావసంఘాః'** ఇత్యాది భారతవచనప్రయోగాత్తేషాం

తన్నామత్వమవగమ్యత ఇతి చేత్, అహో దేవానాం ప్రియస్య శ్రద్ధా' యోఽయం వేదోక్తమశ్రద్దధానః కేనచిదితిహాసపురాణవచనేన తదభ్యుపగచ్ఛతి. అస్తి చ తాదృశం భారతవచనమ్ – **'నామధేయాని లోకేఽస్మిన్ బహూన్యస్య యథార్థవత్, వేదే చాస్య సమామ్నాతం శతరుద్రీయముత్తమమ్'** ఇతి ప్రాగుదాహృతమ్. సన్తి చ ప్రత్యేకమపి ప్రయోగాః, **'హరికేశస్తథేత్యుక్త్వా దీర్ఘదర్శితయా ప్రభుః'** **'న తే గిరిత్రాఖిలలోకపాలవిరిఞ్చి–వైకుణ్ఠసురేన్ద్రగమ్యమ్'. 'తతో మీఢ్వాం సమామన్త్ర్య' 'తతో మీఢుష్టమోదితమ్'** ఇత్యాది భారతభాగవతవచనేషు శ్రీరుద్రామ్నాతహరికేశమీఢుష్టమాదీనాం ప్రయోగాత్. తస్మాదేతాదృశేషు నామసు న నైఘణ్టుకానాం సంబన్ధోఽస్తీత్యాస్తాం తావత్.

**అనువాదము:** పరమేశ్వరనామములుగ నిఘంటుకారులచే నిర్దేశింపబడని పదములు తన్నామములనుట యుక్తము కాదందురేమో; **'ఏతాని హ వా అమృతస్య నామధేయాని'** అని సాక్షాత్తుగ వేదముచే విధింపబడిన విషయమును, నిఘంటుకారులు చెప్పనంత మాత్రమున, నిరాకరించుటకు వీలులేదు. 'ఇమాని మే రహస్యాని నామాని' అను కూర్మపురాణవచనముచే, ఇవి వేదగతములగు పరమేశ్వరుని రహస్యనామములని తెలియుచుండగా, నిఘంటువులలో నిర్దేశింపబడకపోవుటయనునది – ఇవి పరమేశ్వర నామములు కావు – అని నిరాకరించుటకు తగిన కారణము కాజాలదు. లోకప్రసిద్ధములగు కావ్యనాటకాదులలోని కొన్ని పదములను మాత్రము సంగ్రహించు నిఘంటుకారులు వేదరహస్యనామసంగ్రహణమునకు పూనుకొనియుండకపోవచ్చును. నిఘంటుకారులచే నిబంధింపబడిన వేలకొలది వైదికనామములు కనబడుచున్నవి. చూడుడు! 'తదితి హ వా ఏతస్య మహతో భూతస్య నామ' 'ఏతద్వా అపాం నామధేయం గుహ్యం యదాధావాః' 'తస్యోదితి నామ' ఇత్యాదివచనములనుబట్టి **'తత్'** అనునది పరమాత్మనామమనియు 'అధావాః' అనునది ఉదకనామధేయమనియు, 'ఉత్ అనునది గూడ పరమాత్మనామ మనియు తెలియుచున్నది. ఇవి నిఘంటువులలో నిర్దేశింపబడనంత మాత్రమున, తత్తన్నామములు కాకపోవు. పైగా ఇవి వేదరహస్యరూపములనుట కిది ఉపోద్బలక మగుచున్నది. ఐతే– 'ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః' 'ఆతానతప్తా ఇవ ధావసంఘాః' ఇత్యాది భారత ప్రయోగమును బట్టి అవి తత్తన్నామము లని తెలియుచున్న–దందురేమో; ఔరా! సాక్షాద్వేదవచనమును విశ్వసించక, ఇతిహాసపురాణవచనబలముతో అట్టి యర్థము నంగీకరింపగోరు దేవానాంప్రియుని (మూర్ఖుని) ఆస్తిక్యబుద్ధి నేమనవలెను? శతరుద్రీయములోనివి గూడ పరమేశ్వరనామములే యని తెలుపు భారతవచనములును లేకపోలేదు. **'నామధేయాని లోకేఽస్మిన్'** అను భారతవచన మింతకుముందే ఉదాహరింప

బడినది. ఇంతేకాక ప్రత్యేక ప్రయోగములుగూడ పెక్కు కలవు. 'హరికేశస్తథేత్యుక్త్వా దీర్ఘదర్శితయా ప్రభుః' 'న తే గిరిత్రాఖిలలోకపాలవిరిఞ్చివైకుణ్ఠసురేన్ద్రగమ్యమ్' 'తతో మీఢ్వాం సమామంత్ర్య' 'తతో మీఢుష్ఠమోదితమ్' ఇట్లు భారత–భాగవతాదిగ్రన్థములలో శ్రీరుద్రాధ్యాయోక్తములగు హరికేశ–గిరిత్ర–మీఢుష్టమాదిశబ్దములు ప్రయోగింపబడి యున్నవి. అందువలన ఈ విధములగు నామములలో నిఘంటుసంబంధము లేకపోవుట దోషము కాజాలదు. ఈ విషయము నింతటితో ముగింతము.

## శ్రీరుద్రస్య సర్వవేదోత్తమత్వే – జాబాలోపనిషనిత్సంవాదః

**భాష్యమ్–** ప్రస్తుతమేవ రుద్రాధ్యాయస్య మహిమానమనుసరామః. యద్యపి **"స హోవాచ యాజ్ఞవల్క్యః శతరుద్రీయేణ"** ఇత్యుక్త్యా శతరుద్రీయస్య మోక్షసాధనజప్యత్వమాత్రం ప్రతిపాద్యతే. తథాऽపి ప్రశ్నోత్తరస్వరూపపర్యాలోచనయా తస్య సర్వోపనిషదుత్తమత్వం ప్రతిపాద్యత ఇతి బ్రూమః. తథా హి – ఔపనిషదబ్రహ్మాత్మతత్త్వజ్ఞానైకసాధ్యం మోక్షం ప్రతి అన్వయవ్యతిరేకాభ్యాముపనిషదాం సాధనత్వాత్ మోక్షసాధనజప్యాన్యుపనిషద ఇతి వస్తుస్థితిః. సా చ బ్రహ్మచారిభిర్వస్తుస్థితిర్యద్యవగతా, తదా ప్రశ్నాసంగతిః; న హ్యుపనిషదాం మోక్షసాధనజప్యత్వావగమే జాతే **"కిం జప్యేనామృతత్వమ్?"** ఇతి పునః ప్రశ్నో ఘటతే, యది చ నావగతా. తదా **"శతరుద్రీయేణ"** ఇత్యుత్తరం న సంగచ్ఛతే. న హ్యుపనిషదాం మోక్షసాధనజప్యత్వం వస్తువృత్తమనవగత్య **"కిం జప్యేనామృతత్వమ్"** ఇతి ప్రశ్నే శతరుద్రీయేణేత్యుత్తరం సంగచ్ఛతే, కిన్తు **"ఉపనిషదస్తథా"** ఇత్యేవ తదుత్తరం యుక్తమ్. అన్యథా – **"విశేషగ్రహణం శేషప్రతిషేధార్థమ్"** ఇతి న్యాయేన శతరుద్రీయాతిరిక్తానా–ముపనిషదాం మోక్షసాధనజప్యత్వాభావప్రసంగాత్. యథా ఖలు "కో వాస్మిన్ గ్రామే పణ్డిత" ఇతి ప్రశ్నే, "దేవదత్తః పణ్డిత" ఇత్యుక్తే హి తద్వ్యతిరిక్తానాం యజ్ఞదత్తాదీనామ–పణ్డితత్వం భవతి, తద్వత్. తస్మాదిత్థం ప్రశ్నోత్తరయోః సామానాధికరణ్యం వక్తవ్యమ్ – సామాన్యేనోపనిషన్మాత్రం మోక్షసాధనజప్యమితి నిశ్చిత్య, తన్మధ్యే కిముత్తమం జప్యమితి ప్రశ్నః, తథాభూతం శతరుద్రీయమితి, **"శతరుద్రీయేణ"** ఇత్యుత్తరం చేతి. అత ఏవ కథం శతరుద్రీయస్య సర్వోపనిషదుత్తమత్వమితి శంకాయామ్ **"ఏతాని హ వా అమృతస్య నామధేయాని"** ఇత్యాదినా తదుపపాద్యతే. ఏతాని శతరుద్రీయామ్నాతాని అమృతస్య నిత్యముక్తస్య పరమేశ్వరస్య నామధేయాని – ఇత్యర్థః. అస్తు. తతః కిమ్? అత్రాహ. **"ఏతైర్హ వా అమృతో భవతి."** హ వా ఇత్యేతదవధారణార్థే. ఏతైరేవ నామధేయైర్ముక్తో భవతి, తిష్ఠత్వేతత్ప్రతిపాద్యబ్రహ్మాత్మతత్త్వానుసన్ధానమ్, ఏతద్గతాని పరమేశ్వర

దివ్యనామాన్యేవ కేవలం జపమాత్రేణైవ మోక్షప్రదాని, ఉపనిషదన్తరే తు నైవమ్, అతః సర్వోపనిషదుత్తమత్వమస్యేతి భావః. "ఏతాని హ వా" ఇత్యేనేన శతశాఖాగతత్వప్రసిద్ధిః సూచ్యతే. తేన చాయమర్థః ప్రదర్శితో భవతి. యద్యపి సర్వాణ్యపి పరమేశ్వరస్యైవ నామధేయాని. అత ఏవ **"ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః"** ఇతి శ్రుతిః ప్రత్యక్షసన్నిధాపిత–సకలశబ్దరాశేః పరమేశ్వరాభిధానత్వం ప్రతిపాదయతి. అత ఏవాశ్వలాయనేన శివం ప్రస్తుత్యోక్తమ్, **"సర్వాణి హ వా ఏతస్య నామధేయాని"** ఇతి. తథాపి శతశాఖామ్నాతత్వేన మోక్షసాధనత్వేన చ ప్రసిద్ధతయా ముఖ్యత్వాదేతాని నామధేయానీత్యుక్తిరుపపద్యతే. **"షట్త్రింశదహో వా ఏష యజ్ఞో యద్ద్వాదశాహః"** ఇతి షట్త్రింశతాహోభిః సాధ్యస్యాపి క్రతోః ద్వాదశసుత్యాహాని ముఖ్యానీతి ద్వాదశాహవ్యపదేశవదితి.

**అనువాదము:** ప్రస్తుతమగు రుద్రాధ్యాయమహత్త్వమునే ప్రతిపాదించుచున్నాము. జాబాలోపనిషత్తులో – 'స హోవాచ యాజ్ఞవల్క్యః శతరుద్రీయేణ' అని చెప్పుటచే శతరుద్రీయజపము మోక్షసాధన మని మాత్రము తెలియవచ్చుచున్నది. అంతమాత్రమే కాదు; అచటి ప్రశ్నోత్తరస్వరూపమును పరిశీలించినచో శతరుద్రీయము సర్వోపనిషత్తులలో నుత్తమ మను విషయము సైత ముపపాదింపబడుచున్నదని చెప్పుచున్నాము. ఎట్లనగా – మోక్షము ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మాత్మతత్త్వజ్ఞానముచేత మాత్రమే సాధ్యముగును గావున ఉపనిషత్తులకు మోక్షసాధననత్వము ('అది యున్నప్పుడే ఇదియు నుండును' అనుట – అన్వయము. 'అది యుండనిచో ఇదియు నుండదు' అనుట – వ్యతిరేకము. ప్రకృతమున – ఉపనిషత్ప్రతిపాద్యమైన ఆత్మతత్త్వజ్ఞాన మున్నప్పుడే మోక్షము ఉండును (సిద్ధించును). అనునది అన్వయము. జ్ఞానము లేనపుడు మోక్షమును లేదు – అనుట వ్యతిరేకము. అన్వయవ్యతిరేకములచే కార్యకారణ భావాదికము నిశ్చిత మగును.) అన్వయవ్యతిరేకసిద్ధము. కావున ఉపనిషజ్జపము మోక్షసాధన మనునది – వస్తుస్థితి. ఈ విషయము ప్రశ్నించిన బ్రహ్మచారులకు తెలియునా? తెలియదా? తెలియునన్నచో ఈ ప్రశ్నయే అసంగతమగును. ఉపనిషజ్జపము మోక్షసాధన మని తెలిసినప్పుడు, (కిం జప్యేనామృతత్వమ్?) దేనిని జపించిన అమృతత్వము చేకూరును? అని ప్రశ్నించుట సంభవించదు గదా! తెలియదన్నచో, అపుడు (శతరుద్రీయేణ) శతరుద్రీయజపము మోక్షసాధనమను యాజ్ఞవల్క్యుని సమాధానము సరిపడదు. ఉపనిషజ్జపము మోక్షసాధనమను వాస్తవిక (సాధారణ) జ్ఞానము గూడ లేని స్థితిలో దేనిని జపించిన మోక్షము సిద్ధించు నని సాధారణముగ ప్రశ్నించినపుడు. 'ఉపనిషజ్జపముచే' అను సాధారణసమాధానము సరిపడదు గద! అట్లు కానిచో (విశేషగ్రహణం శేషప్రతిషేధార్థమ్) 'విశేషగ్రహణమునకు తదితర (సాధారణ) నిషేధమే

ప్రయోజనము’ అను న్యాయముచే శతరుద్రీయాతిరిక్తములగు ఉపనిషత్తులకు మోక్షసాధనత్వము లేకపోవలసివచ్చును. ఎట్లనగా – ఈ గ్రామములో పండితు డెవడు? అని యడిగినప్పుడు, దేవదత్తుడు పండితుడు’ అని సమాధాన మిచ్చినచో, తదితరులగు యజ్ఞదత్తాదులు పండితులు కారని చెప్పినట్లే యగును గద! కావున పై ప్రశ్నోత్తరముల కిట్లు సామంజస్యమును సంపాదించవలయును – సామాన్యముగ ఉపనిషత్తులన్నియు మోక్షసాధనజపార్హము లను నిశ్చయము కలిగిన మీదటనే, వానిలో నేది యుత్తమ మను విశేషప్రశ్న యుదయించినది. తదనుగుణముగ ‘అట్టిది శతరుద్రీయము’ అని విశేషసమాధాన మొసంగబడినది. కావుననే సర్వోపనిషత్తులలో శతరుద్రీయము ఉత్తమ మెట్లగును? అను శంక కలుగగా ‘ఏతాని హ వా అమృతస్య నామధేయాని’ ఇత్యాదిగా సమాధానము ప్రతిపాదింపబడుచున్నది. ఏతాని = ఈ శతరుద్రీయములో ఆమ్నాతము లైనవి. అమృతస్య = నిత్యముక్తుడగు పరమేశ్వరునకు నామధేయము లని యర్థము. అగుగాక, అంత మాత్రమున నేమి ప్రయోజన మందురేమో; ‘ఏతైర్హ వా అమృతో భవతి’ హ వా అను నిపాతములు నిశ్చయార్థకములు. ఈ నామధేయములచేతనే ముక్తుడగును. ఏతత్ప్రతిపాద్యమగు బ్రహ్మాత్మతత్త్వానుసంధానము మాట నట్లుండనిండు; ఇందలి పరమేశ్వరుని దివ్యనామములే – కేవలము జపమాత్రముననే మోక్షప్రదములైనట్టివి. ఇతరోపనిషత్తు లట్టివి కావు. కావున శతరుద్రీయము సర్వోపనిషత్తులలో నుత్తమ మని తాత్పర్యము. ‘ఏతాని హ వా’ అనుటచే శతశాఖాగతత్వ రూపమగు ప్రసిద్ధి సూచింపబడుచున్నది. దానిచే గూడ ఈ యర్థము సిద్ధించుచున్నది. పరిశీలించితి మేని, ఒకవిధముగా ప్రపంచములోని సర్వశబ్దములును పరమేశ్వర నామములే. కావుననే ‘ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః అను శ్రుతి ప్రత్యక్షగోచరమగు శబ్దరాశి యంతయు పరమేశ్వరవాచక మని – ప్రతిపాదించుచున్నది, కావుననే ఆశ్వలాయన మహర్షి శివుని ఉద్దేశించి – ‘సర్వాణి హ వా ఏతస్య నామధేయాని’ అని చెప్పియున్నాడు. ఏమైనను, శతశాఖామ్నాతములై మోక్షసాధనములుగా ప్రసిద్ధము లగుటచే ప్రధానములైనవి గాన ‘ఏతాని నామధేయాని’ అని ప్రత్యేకించి చెప్పుట యుక్తమగుచున్నది. ‘షట్త్రింశదహో వా ఏష యజ్ఞో యద్ద్వాదశాహః’ అను శ్రుతిలో ప్రకృతమగు క్రతువు ముప్పదియారు దినము లనుష్ఠింపదగినదైనను అందు సుత్యాహస్సులు పండ్రెండు ప్రధానములు గాన తదనుసారము క్రతువును **“ద్వాదశాహ”** శబ్దముతో నిర్దేశించుటను ఇందుకు దృష్టాన్తముగ గ్రహించవచ్చును.

**భాష్యమ్ –** సోఽయమర్థః సర్వోఽపి కూర్మపురాణే దర్శితః, తత్ర హి వసుమనసో రాజర్షేః బ్రహ్మవరలబ్ధసాగ్రసంవత్సరశతానుష్ఠితగాయత్ర్యుపాసనాయా ప్రసన్నం పరమేశ్వరం ప్రస్తుత్యేదం పఠ్యతే –

> **"తదా ప్రాహ మహాదేవో రాజానం ప్రీతమానసః।**
> **ఇమాని మే రహస్యాని నామాని శృణు చానఘ॥**
>
> **సర్వవేదేషు గీతాని సంసారశమనాని చ।**
> **నమస్కురుష్వ సతతమేభిర్నామపదైః శుచిః॥**
>
> **అధ్యాయం శతరుద్రీయం యజుషాం సారముత్తమమ్।**
> **జపస్వానన్యచేతస్కో మయ్యేవాసక్తమానసః॥**
>
> **బ్రహ్మచారీ మితాహారో భస్మనిష్ఠః సమాహితః।**
> **జపేదా మరణాద్రుద్రం స యాతి పరమాం గతిమ్॥"** ఇతి.

అత్ర **"యజుషాం సారమ్"** ఇతి యజుస్సారత్వేనైవ యజుర్వేదోత్తమత్వే సిద్ధే, పునరుత్తమపదమృగ్వేదాద్యపేక్షయా ఉత్తమత్వపరమ్. ఏవం చ సర్వవేదోత్తమం శతరుద్రీయమధ్యాయం జపేదితి విధిః. తేన – **"స హోవాచ యాజ్ఞవల్క్యః"** ఇతి శ్రుతి–సారాభిప్రాయో దర్శితః. తత్ర కథం సర్వవేదోత్తమత్వమిత్యాకాఙ్క్షాయాం తదుపపాదనాయ **"సంసారశమనాని"** ఇతి నామవిశేషణమ్. న కేవలం జపమాత్రతః సంసార–మోచకమదీయనామనికురమ్బకరమ్బితత్వమాత్రేణాస్య సర్వవేదోత్తమత్వమ్, కిన్తు తాదృశమదీయనమస్కారకరమ్బితత్వేనాపీత్యభిప్రాయేణోక్తమ్ – **"నమస్కురుష్వ సతతమేభిర్నామపదైః"** ఇతి. నమస్కారఘటితతత్తన్నామపదాత్మకతత్తన్మన్త్రజపస్య వాచికమదీయనమస్కారరూపత్వాత్ జపం కుర్వంస్త్వం నమస్కారానపి కృతవాన్భవేరిత్యర్థః. తథా చ కేవలనామధేయాన్యేవ సంసారనాశకాని, తైర్నమస్కారోఽపి చేత్, కిము వక్తవ్యమ్, సంసారదుఃఖమున్మూలయన్తీత్యభిప్రాయః. తదనేన **"ఏతైర్హ వా అమృతో భవతి"** ఇతి శ్రుతిభాగో వ్యాఖ్యాతః. **"ఇమాని మే నామాని"** ఇత్యనేన చ **"ఏతాని హ వా అమృతస్య నామధేయాని"** ఇత్యంశో వ్యాఖ్యాయతే – అత్ర ఏతానీత్యస్య ప్రతిపదం – ఇమానీతి. అమృతశబ్దార్థప్రదర్శనం మే ఇతి. సర్వవేదేషు గీతానీత్యనేన **'ఏతాని హ వై'** ఇతి నిపాతనార్థః శతశాఖామ్నాతత్వరూపా ప్రసిద్ధిర్దర్శితా, రహస్యానీత్యనేన వేదరహస్యేఽర్థే నైఘణ్టుకాద్యప్రసిద్ధికుతర్కానవకాశ ఇత్యుక్తమ్ అనఘేత్యనేన చ సాగ్రవర్షశతానుష్ఠిత–గాయత్ర్యుపాసనాపరిక్షీణపాపస్య తవ రుద్రాధ్యాయే నిరవగ్రహోఽధికార ఇత్యుక్తం భవతి.

తథా చ జపమాత్రేణ మోక్షదాతర్యస్మిన్ సత్యప్యశ్రద్ధాదోషేణ లోకః సంసారే మజ్జతి; అహో పాపమహిమేతి భావః. తేన చ బ్రహ్మోత్తరఖణ్డే కథా స్మర్యతే. తత్ర హి – శ్రీరుద్రజపాదఖిలేషు పాతకేషు నష్టేషు జగతి పాపిష్ఠస్యైవాభావాత్ నిరధికార–వైవస్వతచిత్రగుప్తాదిభిర్విజ్ఞాపితేన బ్రహ్మణా నియోజితాభ్యామశ్రద్ధాదుర్మేధాభ్యాముపహతో లోకః శ్రీరుద్రవిముఖో జాత ఇత్యుపాఖ్యాయతే. తాని వచనాన్యనుపదమేవోదాహరిష్యామః. తస్మాదేతత్ స్థితమ్, ఏతత్కూర్మపురాణోపబృంహితజాబాలోపనిషద్రుద్రాధ్యాయస్య సర్వవేదోత్తమత్వం ప్రతిపాదయతీతి. సోఽయమర్థః పణ్డితానాం హృదయఙ్గమ ఏవ.

**జాబాలోపనిషత్సాధ్వీ మమ జ్ఞానస్య సిద్ధయే।**
**ప్రధానసాధనాన్యాహ ప్రాణినామాదరేణ తు॥**

**అవిముక్తం మమ క్షేత్రం మన్నామ పరమం శుభమ్।**
**శతరుద్రీయజాపిత్వం తథా సంన్యాసముత్తమమ్॥**

ఇతి పరాశరోపపురాణవచనాన్యత్ర ఉపబృంహణమ్, శతరుద్రీయస్య జ్ఞానం ప్రతి సాధనత్వం జాబాలశ్రుత్యర్థ ఇతి కణ్ఠరవేణైవాభిధానాత్. తత్ర చ **'మన్నామ పరమమ్'** ఇత్యవిముక్తస్య విశేషణం, ప్రణవాఖ్యేన మన్నామ్నా పరమముత్కృష్టమిత్యర్థః. **'అత్ర హి జన్తోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే'** ఇతి శ్రుతేః. ఏవం చోపాసనానాం మధ్యే అవిముక్తోపాసనమ్, జప్యానాం మధ్యే శతరుద్రీయమ్, ఆశ్రమాణాం మధ్యే సంన్యాసశ్చ జ్ఞానముఖ్యసాధనమితి ప్రతిపాదయద్భగవతః పరాశరస్య వచనం సర్వవేదోత్తమమితి దర్శయతి; తదుపబృంహితజాబాలశ్రుతిస్తత్ర ప్రమాణమ్.

**అనువాదము:** ఆ యా విషయమంతయు కూర్మపురాణములో వివరింపబడినది. అందు – బ్రహ్మదేవుని వరముచే లభించిన సాగ్రసంవత్సరశతాయుర్దాయముతో గాయత్ర్యుపాసన మొనర్చిన వసుమను దను రాజర్షినిగూర్చి ప్రసన్నుడైన పరమేశ్వరుడు పలికిన వాక్యము లిట్లుదాహరింపబడినవి – (తదా ప్రాహ మహాదేవో... న యాతి పరమాం గతిమ్) 'అపుడు సంతుష్టచిత్తుడై రాజును గూర్చి యిట్లు పలికెను – పాపరహితుడవగు ఓ రాజా! రహస్యములగు ఈ నా నామముల నాకర్ణింపుము. ఇవి సర్వవేదములలో గానము చేయబడినవి. సంసారదుఃఖమును శమింపజేయునవి. శతరుద్రీయాధ్యాయము యజుర్వేదములోనే కాక సర్వవేదములలో నుత్తమమైనది. ఇతర చింతలు మాని నాయందే చిత్తమును నిలిపి దీనిని జపింపుము. శుచివై ఈ నామములతో నమస్కరింపుము. బ్రహ్మచారియై, మితాహారియై, భస్మోద్ధూళితవిగ్రహుడై, చిత్తమును స్వాయత్తము జేసి

మరణపర్యన్తము రుద్రమును జపించువాడు పరమగతినొందును' అని యీ వాక్యముల సారాంశము. ఇందు– 'యజుషాం సారం' అనుటచేతనే యజుర్వేదములో నుత్తమమను నర్థము సిద్ధించుచుండగా, మరల 'ఉత్తమమ్' అను పదప్రయోగమువలన సర్వవేదోత్తమత్వము వివక్షిత మని తెలియుచున్నది. కాగా సర్వవేదోత్తమమగు శతరుద్రీయమును జపించవలెనని విధించుటలో ఈ వాక్యమునకు తాత్పర్యము. అద్దాన 'సహోవాచ యాజ్ఞవల్క్యః' అను శ్రుత్యభిప్రాయము ప్రదర్శింపబడినది. అచట– శతరుద్రీయము సర్వవేదోత్తమమెట్లగునను ఆకాంక్షను వారించుటకై 'సంసారశమనాని' అను విశేషణము ప్రయోగింపబడినది. కేవలజపమాత్రముననే సంసారబంధమును శమింపజేయు నామసమూహముతో గూడినదగుటచేతనే కాక, అట్టి నమస్కార సమన్వితమగుటచే గూడ ప్రశస్తతరమను నభిప్రాయముతో 'నమస్కురుష్వ సతతమేభిర్నామ పదైః' అని చెప్పబడినది. నమస్కారసహితతత్తన్నామరూప మన్త్రజపము వాచిక నమస్కార రూపము గావున, జపము జేయుచున్న నీవు నమస్కారములను గూడ జేసినవాడ వగుదువని యర్థము. కాగా – కేవలనామములే సంసారమోచకములైనప్పుడు, ఆ నామములతో నమస్కారములు గూడ కలసినచో సంసారదుఃఖమును సమూలముగ నున్మూలించునని – వేరుగ జెప్పవలసినదేమున్నదని యభిప్రాయము. దీనితో 'ఏతైర్హ వా అమృతో భవతి' అను శ్రుతి భాగము వ్యాఖ్యాతమైనది. 'ఇమాని మే నామాని' అనుదానిచే, 'ఏతాని హ వా అమృతస్య నామధేయాని' అను శ్రుత్యంశము వ్యాఖ్యానింపబడుచున్నది– ఇచట– 'ఏతాని' అనుదానికి 'ఇమాని' అనునది ప్రతిపదము. 'మే' అనునది 'అమృతస్య' అను శబ్దముయొక్క అర్థము ననువదించును. 'సర్వవేదేషు గీతాని' అనుటచే **'ఏతాని హ వై'** అను వాక్యములోని శతశాఖామ్నాతత్వరూపమగు నిపాతనార్థమైన ప్రసిద్ధి నిరూపింపబడినది. 'రహస్యాని' అనుటచే, వేదరహస్యార్థ విషయమున నైఘంటుకా ప్రసిద్ధిరూపమగు కుతర్కమునకు తావులేనిదని తెలిపినట్లైనది. 'అనఘ' అను పదముచే సాగ్రవత్సరశతానుష్ఠితమగు గాయత్ర్యుపాసనముచే పరిక్షీణకల్మషుడవగు నీకు రుద్రాధ్యాయమునందు అప్రతిహతమగు అధికారము కలదని నిర్దేశింపబడినది. కాగా– జపమాత్రముచే మోక్షమొసగు రుద్రాధ్యాయమున్నను, అశ్రద్ధాదోషముచే లోకము సంసారశోకనిమగ్న మగుచున్నది. ఔరా! పాపప్రభావమెట్టిదో గదా! అని భావము. ఈ చెప్పినదానిని బట్టి బ్రహ్మోత్తరఖండములోని కథ స్మృతికి వచ్చుచున్నది. అందు శ్రీరుద్రజపమువలన సమస్తపాపములు నశించగా లోకములో పాపియే లేకపోవుటచే పాపులను శిక్షించు అధికారములో నియుక్తులైన

యమచిత్రగుప్తాదులకు పనియే లేకపోయెను. అపుడు వారి ప్రార్థన ననుసరించి బ్రహ్మచే ప్రవర్తింపబడిన అశ్రద్ధా-దుర్మేధలచే అణచివేయబడి లోకము శ్రీరుద్రముపట్ల పరాఙ్ముఖమైనదట. ఆ వచనములను ముందు ఉదాహరింపబోవుచున్నాము. దీనినిబట్టి కూర్మపురాణోప బృహింతమగు జాబాలోపనిషత్తు రుద్రాధ్యాయముయొక్క సర్వవేదోత్తమత్వమును ప్రతిపాదించుచున్నదను విషయము సుస్పష్టము. ఈ విషయము పండితులకు హృదయంగమమైనదే.

**జాబాలోపనిషత్సాధ్వీ మమ జ్ఞానస్య సిద్ధయే।**
**ప్రధానసాధనాన్యాహ ప్రాణినామాదరేణ తు॥**

**అవిముక్తం మమ క్షేత్రం మన్నామ పరమం శుభమ్।**
**శతరుద్రీయజాపిత్వం తథా సంన్యాసముత్తమమ్॥**

అను పరాశరోపపురాణవచనములుగూడ పూర్వోక్తార్థమునకు ఉపబృంహకములైయున్నవి. ఇందు- శతరుద్రీయము జ్ఞానసాధనమని చెప్పుటలోనే జాబాలోపనిషత్తునకు తాత్పర్య మని కంఠరవతో చెప్పబడినది. వీనిలో 'మన్నామ పరమం' అనునది 'అవిముక్తం' అనుదానికి విశేషణము. ప్రణవరూపమగు నా నామముచే పరమము - ఉత్కృష్టమని యర్థము. **'అత్ర హి జన్తోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే'** అను శ్రుతి ఇచట మరణించు జీవులకు ప్రాణోత్క్రమణకాలమున రుద్రుడు తారకబ్రహ్మోపదేశ మొనర్చునని తెలుపుచున్నది. కాగా-ఉపాసనలలో అవిముక్తోపాసనము, జపించ దగినవానిలో- శతరుద్రీయము, ఆశ్రమములలో - సంన్యాసము, జ్ఞానమునకు ముఖ్య సాధనములని చెప్పుచున్న పరాశరమహర్షి వచనము. శ్రీరుద్రమునకు సర్వవేదోత్తమత్వమును ప్రదర్శించుచున్నది. ఏతదుపబృంహితమైన జాబాలశ్రుతి అందుకు ప్రమాణము.

## శ్రీరుద్రస్య సర్వవేదోత్తమత్వే కైవల్యోపనిషత్సంవాదః

**భాష్యమ్ -** ఏవం కైవల్యోపనిషద్యపి బ్రహ్మవివిదిషయోపసన్నమాశ్వలాయనం ప్రతి పరమేష్ఠినా బ్రహ్మాత్మతత్త్వముపదిశ్య తత్సాధనత్వేనేదమామ్నాయతే- **"యః శతరుద్రీయ-మధీతే సోఽగ్నిపూతో భవతి సురాపానాత్పూతో భవతి బ్రహ్మహత్యాత్పూతో భవతి కృత్యాకృత్యాత్పూతో భవతి తస్మాదవిముక్తమాశ్రితో భవత్యాత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్, అనేన జ్ఞానమాప్నోతి సంసారార్ణవనాశనమ్"** ఇతి. అత్ర సంసారతారణజ్ఞానకామః శతరుద్రీయం జపేదితి ప్రథమో విధిః. తత్ర చ కర్మోపాసనజ్ఞానకాణ్డాత్మకే వేదరాశౌ

సర్వమన్యత్పరిత్యజ్య శతరుద్రీయస్య జ్ఞానసాధనత్వోపదేశే కో హేతురిత్యాశఙ్క్య, సర్వవేదోత్తమత్వం వక్తుం ప్రథమం కర్మకాణ్డాపేక్షయా తస్యోత్తమత్వం ప్రతిపాదయతి– **"యః శతరుద్రీయం"** ఇత్యాదినా, **"కృత్యాకృత్యాత్పూతో భవతి"** ఇత్యన్తేన.

ఏతచ్చ, సూతసంహితాయాముపబృంహితమ్ –

**"యః శ్రద్ధయా యుతో నిత్యం శతరుద్రీయమభ్యసేత్।**
**అగ్నిదాహాత్సురాపానాదకృత్యాచరణాత్తథా।**
**ముచ్యతే బ్రహ్మహత్యాయా ఇతి కైవల్యశాఖినః॥"** ఇతి.

అత్రాకృత్యాచరణాదిత్యనేన **"కృత్యాకృత్యాత్పూతః"** ఇతి వ్యాఖ్యాతమ్. కృత్యవదాచరితం యదకృత్యం తత్కృత్యాకృత్యమ్, అకృత్యాచరణమితి యావత్, తస్మాత్పూతో భవతీతి తదర్థః. తథా చ రుద్రాధ్యాయీ న కేవలం బ్రహ్మహత్యాసురాపానమాత్రాత్పూతో భవతి, కిన్తు సర్వస్మాదపి పాపాదితి శ్రుత్యభిప్రాయః ప్రదర్శితో భవతి.

బ్రహ్మోత్తరఖణ్డే చాయమర్థః ప్రపఞ్చేనోపపాదితః. తత్ర హి –

**"సర్గాత్పురా నిరాలోకే పదే తన్నిష్కలం పరమ్।**
**చిదానన్దమయం జ్యోతిః స ఆత్మా కేవలః శివః॥**

**స ఏవాదౌ రజోరూపం సృష్ట్వా బ్రహ్మాణమాత్మనః।**
**సృష్టికర్మనియుక్తాయ తస్మై వేదాంశ్చ దత్తవాన్॥**

**పునశ్చ జగతామీశ ఆత్మతత్త్వైకసంగ్రహమ్।**
**సర్వోపనిషదాం సారం రుద్రాధ్యాయం చ దత్తవాన్॥**

**న ఏష మునిభిః పూర్వైర్మరీచ్యత్రిపురోగమైః।**
**స హ దేవైర్ధృతస్తేభ్యస్తచ్ఛిష్యా జగృహుః శతమ్॥**

**ఏష వః పరమో మన్త్ర ఏష వః పరమం తపః।**
**రుద్రాధ్యాయజపః పుంసాం పరం కైవల్యసాధనమ్॥**

**యే మహాపాతకైర్యుక్తా ఉపపాతకినశ్చ యే।**
**రుద్రాధ్యాయజపాత్సద్యస్తేఽపి యాన్తి పరాం గతిమ్॥**

ఇతి ప్రస్తుత్యైవ పఠ్యతే –

పుణ్యకర్మఫలం స్వర్గో నరకస్తద్విపర్యయః।
తయోర్ద్వావధిపౌ ధాత్రా కృతౌ శతమఖాన్తకౌ॥

కామః క్రోధశ్చ లోభశ్చ మదమానాదయస్తథా।
అధర్మస్య సుతా ఆసన్ సర్వే నరకనాయకాః॥

క్రోధాత్పితృవధో జాతస్తథా మాతృవధోఽపరః।
బ్రహ్మహత్యా తు కన్యైకా పశ్చాత్సమభవత్తతః॥

గురుతల్పః సురాపానస్తథాఽన్యత్పుల్కసీగమః।
కామస్య తనయా హ్యేతే ప్రధానాః పరికీర్తితాః॥

దేవస్వహరణం చైవ బ్రహ్మస్వహరణం తథా।
సువర్ణస్తేయ ఇత్యేతే లోభస్య తనయాః స్మృతాః॥

ఏతానాహూయ చణ్డాలాన్యమః పాతకనాయకః।
నరకస్య వివృద్ధ్యర్థం పట్టబన్ధం చకార హ॥

తే యమేన సమాదిష్టాస్సర్వే పాతకనాయకాః।
నరకాన్పూరయామాసుః స్వభృత్యైశ్చోపపాతకైః॥

రుద్రాధ్యాయే భువం ప్రాప్తే సాక్షాత్కైవల్యసాధనే।
భీతాః ప్రదుద్రువుః సర్వే తే వై పాఠకనాయకాః॥

యమే విజ్ఞాపయామాసుః సహ తైశ్చోపపాతకైః।
నరకస్య వివృద్ధ్యర్థం సాధికారాస్త్వయా కృతాః॥

అధునా వర్తితుం లోకే న శక్తాః స్మః స్వయం ప్రభో।
రుద్రజాప్యప్రభావేన నిర్దగ్ధాశ్చైవ విద్రుతాః॥

గ్రామే గ్రామే నదీతీరే పుణ్యేష్వాయతనేషు చ।
రుద్రజాప్యేన పర్యాప్తే కథం పరిచరేమహి॥

ప్రాయశ్చిత్తసహస్రం వా గణయామో న కిఞ్చన।
రుద్రజాప్యం క్షణేనాపి సోఢుం శక్తా వయం న చ॥

**మహాపాతకముఖ్యానామస్మాకం సోపజీవినామ్।**
**రుద్రజాప్యం పరం ఘోరం రుద్రజాప్యం మహద్విషమ్॥**

**ఇతి విజ్ఞాపితస్సాక్షాద్యమః పాతకనాయకైః।**
**బ్రహ్మణోఽన్తికమాసాద్య తస్మై సర్వం వ్యజిజ్ఞపత్॥**

**ఇతి విజ్ఞాపితో ధాతా యమేన పరిఖిద్యతా।**
**రుద్రజాప్యవిఘాతార్థముపాయం పర్యకల్పయత్॥**

**అశ్రద్ధాం చైవ దుర్మేధామవిద్యాయా ఉభే సుతే।**
**శ్రద్ధామేధావిఘాతిన్యౌ మర్త్యేషు సమచోదయత్॥**

**తాభ్యాం విమోహితే లోకే రుద్రాధ్యాయపరాఙ్ముఖే।**
**యమః స్వస్థానమాసాద్య కృతార్థ ఇవ సోఽభవత్॥"** ఇతి.

ఏవం పురాణాన్తరేష్వపి సర్వత్రాయమర్థః సూచితః; తత్సర్వం విస్తరభయాన్న లిఖ్యతే.

**అనువాదము:** ఇట్లే కైవల్యోపనిషత్తులో గూడ బ్రహ్మజిజ్ఞాసతో వచ్చి ఆశ్రయించిన ఆశ్వలాయనునకు పరివేష్ఠి – బ్రహ్మాత్మతత్త్వము నుపదేశించి, తత్సాధనము నిట్లు పేర్కొనెను. ('యః శతరుద్రీయమధితే సోఽగ్నిపూతో భవతి... సంసారార్ణవనాశనమ్') 'శతరుద్రీయమును జపించువాడు అగ్నివలె పరిశుద్ధుడగును స్వర్ణస్తేయము. సురాపానము, బ్రహ్మహత్య మున్నగు మహాపాపములనుండి విముక్తుడగును. నిషిద్ధాచరణప్రయుక్తములగు సర్వపాపములను పరిత్యజించి పవిత్రుడగును. తన్మూలమును అవిముక్తము నాశ్రయించిన వాడగును. సంన్యాసి దీనిని నిరన్తరము, లేదా కనీస మొకసారియైనను జపించవలెను. దీనిచే సంసారసముద్రమును తరింపజేయు తత్త్వజ్ఞానము సంప్రాప్తమగును.'

ఇందు – సంసారమును తరింపజేయు జ్ఞానము నపేక్షించువాడు శతరుద్రీయమును జపించవలె ననునది– ముఖ్యమైన విధి. ఈ సందర్భములో కర్మోపాసనాజ్ఞానకాండాత్మకమగు వేదమునందు, తదితరమును సర్వమును పరిత్యజించి శతరుద్రీయమే జ్ఞానసాధనమని యుపదేశించుటకు హేతువేమి? అని శంకించుకొని, తత్సమాధానముగ శతరుద్రీయమునకు గల సర్వవేదోత్తమత్వము నుపపాదించుటకై మున్ముందు – "యశ్శతరుద్రీయమధీతే" అని యారంభించి "కృత్యాకృత్యాత్పూతో భవతి" అనునంతవరకు కర్మకాణ్డోత్తమత్వము జెప్పుట జరిగినది. ఈ విషయము "యః శ్రద్ధయా...ఇతి కైవల్యశాఖినః" అను సూతసంహితావచనము బలపఱచుచున్నది. ఇందలి

"అకృత్యాచరణాత్" అనునది "కృత్యాకృత్యాత్పూతః" అను శ్రుతిభాగమునకు వ్యాఖ్యానము. కృత్యాకృత్యశబ్దమునకు – చేయదగినదానినివలె చేసిన – చేయగూడని పని యని యర్థము. అకృత్యాచరణ మని తాత్పర్యము. అట్టిదానినుండి ముక్తుడై పరిశుద్ధుడగును. కాగా– రుద్రాధ్యాయి కేవలము బ్రహ్మహత్యాసురాపానాదులనుండియేకాక, సమస్తపాపములనుండి ముక్తుడగునని శ్రుత్యభిప్రాయము స్పష్టము.

బ్రహ్మోత్తరఖండమునందు గూడ ఈ విషయము సవిస్తరముగ నిట్లు చెప్పబడినది. (సర్గాత్పురా నిరాలోకే... పరాం గతిమ్) సృష్టికి పూర్వమీ ప్రపంచమంతయు అనాద్యవిద్యారూపమగు మూలప్రకృతిలో లీనమై తమోమయమైయున్న స్థితిలో అఖండ సచ్చిదానందాత్మకుడు, స్వయంజ్యోతిస్స్వరూపుడు నగు శివుడొక్కడే సర్వసాక్షియై యుండెను. అతడే మొట్టమొదట తననుండి రజోగుణప్రధానుడగు బ్రహ్మను సృజించి, ప్రపంచసృష్టిలో నియోగించుచు, అతనికి వేదముల నిచ్చెను. ఇంతేగాక, ఆత్మతత్త్వప్రతిపాదకము సర్వోపనిషత్సారమునగు రుద్రాధ్యాయమును గూడ నా జగదీశ్వరుడగు శివుడు బ్రహ్మ కనుగ్రహించెను. ఆ యీ రుద్రాధ్యాయము మరీచి అత్రి మున్నగు ఋషులచేతను, దేవతలచేతను బ్రహ్మనుండి గ్రహింపబడగా, వానినుండి అసంఖ్యాకులగు వారి శిష్యులు గ్రహించిరి. ఈ రుద్రాధ్యాయము మహామన్త్రస్వరూపము. రుద్రాధ్యాయజపము – మహాతపస్సు. ఇది జీవులకు కైవల్యసాధనమై యున్నది. మహాపాపముల జేసినవారు, ఉపపాతకముల నాచరించినవారు గూడ రుద్రాధ్యాయజపముచే, పరిశుద్ధులై పరమగతి నొందెదరు" అని ప్రారంభించి, (పుణ్యకర్మఫలం స్వర్గః... కృతార్థ ఇవ సోఽభవత్) పుణ్యకర్మ ఫలము– స్వర్గము, పాపకర్మఫలము – నరకము. స్వర్గలోకమునకు ఇంద్రుని, నరకలోకమునకు – యముని అధిపతులనుగా విధాత నియమించెను, అధర్మపుత్రులగు కామ–క్రోధ–లోభ–మద–మానాదులందరు నరకలోకమున నాయకులైరి. వారిలో క్రోధునకు– పితృవధుడు, మాతృవధుడు అను కుమారులును, బ్రహ్మహత్య యను కూతురును జన్మించిరి. గురుతల్పగామి, సురాపాయి, పుల్కసీగామి అనువారలు – కాముని కుమారులలో ప్రధానులు. లోభునకు–దేవస్వహరుడు, బ్రహ్మస్వహరుడు, సువర్ణస్తేయుడు అనువారలు పుత్రులుగా బుట్టిరి. చండాలరూపులగు వీరినందరి నాహ్వానించి యముడు, నరకలోకమును పెంపొందించు కార్యములో పట్టాభిషిక్తుల జేసెను. వారు యముని యాజ్ఞగొని తమ భృత్యులగు ఉపపాతకాదులతో నరకమును నింపివేసిరి. ఈ స్థితిలో సాక్షాన్మోక్షప్రదమగు రుద్రాధ్యాయము భూలోకములో ప్రచారము నొందగా, భయగ్రస్తులై పరుగునబోయి పాతకనాయకు లందరు యముని కిట్లు విన్నవించుకొనిరి – "స్వామీ!

భూలోకవాసులలో పాపాభిరతిని పెంపొందించుటద్వారా, నరకలోకము నభివృద్ధిపఱచు నిమిత్తము మీరు మమ్ము అధికారులనుగ నియోగించినారు. కాని ఇప్పుడు మేము భూలోకమున నిలువజాలకున్నాము. రుద్రాధ్యాయప్రభావము పాపరూపులమగు మమ్ము దహించివేయుచుండగా పఱుగెత్తివచ్చినాము. ఎల్ల గ్రామములు, నదీతీరములు, పుణ్యక్షేత్రములు రుద్రాధ్యాయముతో నిండిపోగా, ఇక మీ సేవనెట్లు చేయజాలుదుము? వేయి ప్రాయశ్చిత్తముల నైనను లెక్కపెట్టని మేము, రుద్రాధ్యాయము నొక్క క్షణమైనను సహింపజాలకున్నాము. ఉపపాతకరూపమగు మా అనుచరవర్గమునకును, మహాపాతకుల మగు మాకును రుద్రాధ్యాయము– మహాభయంకరము, మహావిషస్వరూపము." అన విని యముడు ఖిన్నుడై బ్రహ్మసమీపమున కేగి ఆయనకీ వృత్తాన్తమును సమగ్రముగ నివేదించెను. అపుడు రుద్రజపవిఘాతార్థమై బ్రహ్మ ఒక ఉపాయమును పన్నెను. అవిద్యయొక్క పుత్రికలగు అశ్రద్ధా–దుర్మేధలను, మానవులలో వ్యాపించియున్న శ్రద్ధామేధలను నశింపజేయుటకై పురికొల్పెను. ఆ అక్కసెల్లెళ్ల వ్యామోహములోబడి లోకమంతయు శ్రీరుద్రజపపరాఙ్ముఖము కాగా, యముడు స్వస్థానమునకేగి తనను కృతకృత్యునిగా తలచెను' అని సారాంశము.

ఇట్లే ఇతరపురాణములలో గూడ ఈ విధముగా సూచింపబడినది. కాని విస్తరభీతిచే దానినంతటిని ఇచట వివరించుటలేదు.

## శ్రీరుద్రస్య కర్మకాణ్డోత్తమత్వమ్

**భాష్యమ్ –** ఇత్థం శ్రుతిసిద్ధం పురాణైశ్చోపబృంహితం రుద్రాధ్యాయస్య నిఖిలపాతక–ప్రాయశ్చిత్తత్వం స్మృతికారా అపి స్మరన్తి. యథా –

**"మద్యం పీత్వా గురుదారాంశ్చ గత్వా**
**స్తేయం కృత్వా బ్రహ్మహత్యాం చ కృత్వా।**
**భస్మచ్ఛన్నో భస్మశయ్యాశయానో**
**రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః॥"** – ఇతి శాతాతపస్మృతివచనమ్.

**"ఏకాదశగుణాన్వాపి రుద్రానావృత్య ధర్మవిత్।**
**మహాపాపైరపి స్పృష్టో ముచ్యతే నాత్ర సంశయః॥"** – ఇత్యత్రిస్మృతివచనమ్.

**"సురాపీ స్వర్ణహారీ చ రుద్రజాపీ జలే స్థితః।**
**సహస్రశీర్షజాపీ చ ముచ్యతే సర్వకిల్బిషైః॥"** – ఇతి యాజ్ఞవల్క్యస్మృతివచనమ్.

**“వేదమేకగుణం జప్త్వా తదహ్నైవ విశుధ్యతి।**
**రుద్రైకాదశినీం జప్త్వా తత్క్షణాదేవ శుధ్యతి॥”** – ఇతి స్మృతివచనమ్.

ఏవమన్యాన్యప్యుదాహరణీయాని. తదేవమ్ **“యశ్శతరుద్రీయమధీతే సోఽగ్నిపూతో భవతి కృత్యాకృత్యాత్పూతో భవతి”** ఇతి శతరుద్రీయస్య సకలపాప-నివర్తకత్వోక్త్యా కర్మకాణ్డోత్తమత్వం దర్శితం భవతి – జ్ఞానాపేక్షితచిత్తశుద్ధిజనకత్వేన హి కర్మకాణ్డస్య జ్ఞానోపకారకత్వమ్, సా చ కర్మకాణ్డోక్తసర్వకర్మానుష్ఠానజన్యపాపనివృత్తిరూపా చిత్తశుద్ధిరేకస్మాదేవ రుద్రజపాత్సిధ్యతీతి తస్య కృత్స్నకర్మకాణ్డోత్తమత్వసిద్ధిరితి. న చ శ్రీరుద్రస్య కర్మకాణ్డఫలభూతచిత్తశుద్ధిజనకత్వవత్ తత్ఫలభూతస్వర్గాదిజనకత్వాభావాత్కథం తదపేక్షయోత్తమత్వమితి వాచ్యమ్;

**వృక్షస్య మూలసేకేన శాఖాః పుష్యన్తి వై యథా।**
**శివే రుద్రజపాత్ప్రీతే ప్రీతా ఏవాస్య దేవతాః।**
**అతో రుద్రజపాదేవ భుక్తిముక్తి ప్రసిధ్యతః॥**

ఇతి సూతసంహితోక్తరీత్యా పరమేశ్వరం ప్రీణయతః శ్రీరుద్రాధ్యాయినః తదవయవేన్ద్రాగ్న్యాది-ప్రీతిఫలభూతస్వర్గాదితుచ్ఛఫలాపేక్షాసత్త్వే తేషామేవ ఫలానామహమహమికయా స్వత ఏవ పురతోఽవస్థానస్య **“యద్యదిచ్ఛేత్తత్తదాప్నోతి హి న సంశయః”** **“తదేతత్పాపక్షయార్థీ వ్యాధివిమోచనార్థీ శ్రీకామశ్శాన్తికామ ఆయుష్యకామ ఆరోగ్యకామశ్చ కుర్యాదేతత్సర్వమవాప్నోతి”** ఇత్యాదివచనసిద్ధత్వాత్.

**శతరుద్రాన్ జపేద్యస్తు ధ్యాయమానో మహేశ్వరమ్।**
**యశ్చ సాగరపర్యన్తాం సశైలవనకాననామ్॥**

**దద్యాత్కాఞ్చనసంయుక్తాం భూమిమోషధిసంయుతామ్।**
**తస్మాదప్యధికం తస్య సకృద్రుద్రజపాద్భవేత్॥**

ఇత్యాదిశైవపురాణవచనైః శ్రీరుద్రజపస్య ప్రతిపదోక్తతత్తత్కర్మఫలాధికఫలజనకత్వ-ప్రతిపాదనాచ్చ. తస్మాత్సిద్ధం శ్రీరుద్రస్య కృత్స్నకర్మకాణ్డఫలజనకత్వేన తదుత్తమత్వమ్. అత ఏవ ఖల్వగ్నిహోత్రదర్శపూర్ణమాస–పశు–చాతుర్మాస్య–జ్యోతిష్టోమ–సహస్రసంవత్సర– రూపసర్వకర్మణామపి ఫలతః శ్రీరుద్రాన్తర్భావేన తదఙ్గత్వమభిప్రేత్య శ్రీరుద్రలఘున్యాసే **“అగ్నిహోత్రాత్మనే హృదయాయ నమః”** ఇత్యాదినా తేషాం తదఙ్గకోటౌ నివేశః కృత ఇత్యాస్తాం తావత్.

**అనువాదము:** ఈ విధముగా శ్రుతిసిద్ధమై పురాణోపబృంహితమైన రుద్రాధ్యాయము సర్వపాపప్రాయశ్చిత్తరూపమను విషయమును – స్మృతికర్తలు గూడ స్మరించుచున్నారు – “మద్యం పీత్వా” అను శాతాతపస్మృతివచనము– సురాపానముజేసినను, గురుదారా గమనము గావించినను, సువర్ణస్తేయమొనర్చినను, బ్రహ్మహత్య నాచరించినను, భస్మోద్ధూలితదేహుడై భస్మముపై శయనించుచు నిరన్తరము రుద్రమును జపించుచో సర్వపాపములనుండి విముక్తుడగునని తెలుపుచున్నది. “ఏకాదశగుణాన్వాపి” అను అత్రిస్మృతి. మహాపాపములకు బాల్పడినవాడైనను శాస్త్రవిధి నెఱిగి ప్రతిదినము పదునొకండు పర్యాయములు రుద్రాధ్యాయము నావృత్తిచేసినచో పరిశుద్ధుడగు ననియు, ఇందు సందేహము లేదనియు – వక్కాణించుచున్నది. యాజ్ఞవల్క్యస్మృతి – నదీజలము నడుమ నిలిచి **శ్రీరుద్రమును పురుషసూక్తమును** జపించినచో సురాపాన–సువర్ణస్తేయాది సమస్తపాపములు తొలుగునని – బోధించుచున్నది. “వేదమేకగుణం జప్త్వా” అను మఱియొక స్మృతి – వేదమును సకృదావృత్తిగ జపించిన నొక్కరోజులో శుద్ధిని కలిగించు ననియు, రుద్రైకాదశినీజపము తత్క్షణమే శుద్ధిని సమకూర్చుననియు – వచించుచున్నది. ఇట్లే ఇతర స్మృతివచనములు గూడ ఉదాహరింపదగియున్నవి.

కాగా ఇంతవరకు చెప్పినదాని ననుసరించి “యః శతరుద్రీయమధీతే” అను కైవల్యశ్రుతిలో – శతరుద్రీయము సర్వపాపహర మని చెప్పుటనుబట్టి, కర్మకాండలో నిది యుత్తమమని పేర్కొనినట్లైనది. జ్ఞానమునకు, కావలసిన చిత్తశుద్ధిని కలిగించునది గావుననే గదా, కర్మకాండ, జ్ఞానోపకారక మగుచున్నది! అట్టి కర్మకాండోక్త సర్వకర్మానుష్ఠానజన్యమగు పాపనివృత్తిరూపమైన చిత్తశుద్ధి – ఒక్క రుద్రజపముచేతనే లభించుటవలన దీనికి సర్వకర్మకాండోత్తమత్వము సిద్ధించుటకు సందేహ మేమున్నది!

ఐతే – శ్రీరుద్రజపము కర్మకాండఫలభూతమగు చిత్తశుద్ధిని కలిగించినను, కర్మకాండవలె స్వర్గాది ఫలజనకము కాదు గావున, ఇది దానికన్న ఉత్తమమెట్లగును? అందురేమో; “(వృక్షస్య మూలసేకేన) చెట్టుకు మూలభాగమున నీరుపోయగా కొమ్మలు వృద్ధినొందు విధమున, శివుడు, రుద్రాధ్యాయజపముచే సంతుష్టుడు కాగా సర్వదేవతలు సంతుష్టులగుదురు. అందువలన శ్రీరుద్రజపముచే భుక్తిముక్తులు రెండును చేకూరును” అని సూతసంహితలో చెప్పబడిన దానినిబట్టి, రుద్రజపముచే పరమేశ్వరుని యనుగ్రహమునకు బాత్రుడైనవానికి, తదంగభూతులగు ఇంద్రాగ్న్యాదిదేవత లనుగ్రహించి యిచ్చు స్వర్గాది తుచ్ఛఫలములపై కోరికయుండవలెనే గాని. ఉన్నచో ఆ ఫలములే

తమకు తామే "అహమహమికతో" అని వాని నాశ్రయించు నని – "యద్యదిచ్ఛన్ జపేత్తత్తదాప్నోతి హి న సంశయః" "తదేతత్పాపక్షయార్థీ, వ్యాధివిమోచనార్థీ, శ్రీకామః, శాన్తికామ, ఆయుష్యకామ, ఆరోగ్యకామశ్చ కుర్యాదేతత్సర్వమవాప్నోతి" ఇత్యాది వచనములు తెలుపుచున్నవి. ఇంతేకాక "పర్వతారణ్యపరీవృతమై సర్వసస్యాఢ్యమై సముద్రపర్యన్తము వ్యాపించియున్న యీ భూమిని సువర్ణదక్షిణాసహితముగా దానము జేసినవానికి గలుగు పుణ్యముకన్న, పరమేశ్వరుని ధ్యానించుచు ఒక్క మారు శతరుద్రీయమును జపించినవానికి అధికపుణ్యము కలుగునని శైవపురాణములు చెప్పుచుండుటను బట్టి కూడ ఏకైక స్వర్గాదిఫలసాధనములగు ఇతర కర్మలకన్న, కృత్స్నకర్మకాండ ఫలసంపాదకమగు శతరుద్రీయము సమస్తకర్మకాండోత్తమ మను విషయము సిద్ధించుచున్నది. అందువల్లనే గదా, అగ్నిహోత్ర–దర్శపూర్ణమాస–పశు–చాతుర్మాస్య–జ్యోతిష్టోమ సహస్రసంవత్సరరూపములగు సర్వకర్మలును ఫలదృష్ట్యా శ్రీరుద్రములో అన్తర్భూతములగుచున్నవి గావున, తదంగములను నభిప్రాయముతో శ్రీరుద్రలఘున్యాసమున **'అగ్నిహోత్రాత్మనే హృదయాయ నమః'** ఇత్యాదిగ కర్మలకు తదఙ్గకోటిలో ప్రవేశము కల్పింపబడినది, అది అట్లుండుగాక.

## శ్రీరుద్రస్య ఉపాసనాకాణ్డోత్తమత్వమ్

**భాష్యమ్ –** ప్రస్తుతమేవానుసరామః. ఇత్థం శతరుద్రీయస్య కర్మకాణ్డోత్తమత్వముక్తమ్. ఇదానీముపాసనాకాణ్డోత్తమత్వమాహ – **"తస్మాదవిముక్తమాశ్రితో భవతి"** ఇతి. తస్మాదిత్యనేన **"శతరుద్రీయమధితే"** ఇతి పూర్వవాక్యోక్తం శతరుద్రీయాధ్యయనం పరామృశ్యతే. తథా చాయమర్థః– శతరుద్రీయాధ్యయనాత్తస్మాదవిముక్తమాశ్రితో భవతీతి. అవిముక్తాశ్రయణరూపం తదుపాసనం కృతవాన్భవతీతి, అవిముక్తోపాసనాఫలం ప్రాప్నోతీతి యావత్. అనేనోపాసనాకాణ్డోత్తమత్వం సిద్ధ్యతి. తథా హి, జాబాలోపనిషది– **"తస్మాదవిముక్తం నిషేవేత"** ఇత్యవిముక్తోపాసనమ్, **"ప్రాణేషూత్క్రమమాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే, యేనాసావమృతీ భూత్వా మోక్షీ భవతి"** ఇతి తత్ఫలం చోక్తమ్.

తత్రావిముక్తోపాసనం ద్వివిధం–ఆధ్యాత్మికమాధిభౌతికమితి, తత్ర భ్రువోర్ఘ్రాణస్య చ యః సన్ధిః, తస్మిన్ సన్ధావీశ్వరోపాసనం త్వాధ్యాత్మికమ్. కాశ్యామవిముక్తక్షేత్రే పరమేశ్వరదర్శనమాధిభౌతికమితి శాస్త్రవ్యవస్థా. తదేతద్ద్వివిధోపాసనఫలమపి తారకబ్రహ్మవిద్యాఖ్యమాత్మతత్త్వజ్ఞానం శ్రీరుద్రజపమాత్రేణానాయాసేన భవతి, న త్వవిముక్తోపాసనాయామివాయాసో భవతి. అవిముక్తోపాసనే కాశీమరణం వినా

తారకబ్రహ్మవిద్యా న లభ్యత ఇతి తదర్థం ప్రయాసోఽపేక్షితః, ఆధ్యాత్మికే తు యద్యపి కాశీమరణాపేక్షా నాస్తి. **“తస్మాద్యత్ర త్వేవ గచ్ఛతి తదేవమన్యత ఇతీదం వై కురుక్షేత్రం దేవానాం దేవయజనం సర్వేషాం భూతానాం బ్రహ్మసదనమత్ర హి జన్తోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే యేనాసావమృతీ భూత్వా మోక్షీ భవతి”** ఇతి శ్రుతేః. తథాఽపి జపాపేక్షయావిముక్తోపాసనాయామస్త్యేవ భూయాన్ప్రయాసః.

అత ఏవ జాబాలోపనిషది అవిముక్తోపదేశానన్తరం చిత్తైకాగ్ర్యాదిప్రయాససాధన–ముపాసనం కర్తుమశక్త్యా కేవలం జపమాత్రేణ మోక్షమిచ్ఛతాం బ్రహ్మచారిణామ్ **“కిం జప్యేనామృతత్వమ్”** ఇతి ప్రశ్నే, **“శతరుద్రీయేణ”** ఇత్యుత్తరమ్, **“ఏతైరేవామృతో భవతి”** ఇతి తదుపపాదనం చ కృతం ప్రదృశ్యతే. తథా చాధ్యాత్మికావిముక్తోపాసనాపేక్షయానాయాసేనైవ తత్ఫలదం శతరుద్రీయమితి, తత్తస్య తదుత్తమత్వం సిద్ధ్యత్సర్వోపాసనోత్తమత్వరూపమేవ సిద్ధ్యతి. సర్వాసాముపాసనానాం చిత్తైకాగ్ర్యక్లేశసాధ్యతయానాయాసేనైవ తత్ఫలజనకస్య శ్రీరుద్రస్య సర్వోపాసనాకాణ్డోత్తమత్వలాభాత్. ఏవం చ – సర్వాణ్యుపాసనాని కృతవాన్భవతి– ఇతి వక్తవ్యే **“అవిముక్తమాశ్రితో భవతి”** ఇతి విశిష్యావిముక్తగ్రహణం జాబాలోపనిష– ద్యవిముక్తశ్రీరుద్రయోరపి జ్ఞానసాధనత్వోపదేశాత్తయోస్తుల్యత్వముత్తానదృష్ట్యా ప్రాప్యత ఇతి తన్నివారణాయ తదపేక్షయా ఉత్తమత్వం ప్రదర్శయితుమితి – సర్వమతిరమణీయమ్,

**అనువాదము:** ప్రకృతము ననుసరించుచున్నాము. ఇంతవరకు శతరుద్రీయము కర్మకాణ్డలో నుత్తమమని ఉపపాదింపబడినది. ఇక నిప్పుడు ఉపాసనాకాణ్డలో గూడ నుత్తమమని ఉపపాదింపబడుచున్నది. ఈ విషయమును **“తస్మాదవిముక్తమాశ్రితో భవతి”** అను శ్రుతివచనము సూచించుచున్నది. ఇందలి “తస్మాత్” అను పదముచే “శతరుద్రీయమధితే” అను పూర్వవాక్యోక్తమగు “శతరుద్రీయాధ్యయనము” గ్రహింపబడుచున్నది. కాగా– అట్టి శతరుద్రీయాధ్యయనమువలన అవిముక్తాశ్రయణరూపమగు ఉపాసనము నాచరించిన వాడగునను నర్థము సిద్ధించుచున్నది. అవిముక్తోపాసనా ఫలమును పొందునని సారాంశము. దీనిచే ఉపాసనాకాండోత్తమత్వము సిద్ధించుచున్నది. ఎట్లనగా – జాబాలోపనిషత్తునందు “తస్మాదవిముక్తం నిషేవేత” అని అవిముక్తోపాసనము కర్తవ్యమని బోధించి, **“ప్రాణేషూత్క్రమమాణేషు...మోక్షీభవతి”** అను వచనముచే “ప్రాణములు శరీరమునుండి విడిపోవునపుడు రుద్రుడు తారకబ్రహ్మోపదేశ మొనర్చును, దానిచే

అమృతస్వరూపుడై ముక్తినొందును'' అని తత్ఫలము గూడ తెలుపబడినది. అవిముక్తోపాసనము– ఆధ్యాత్మిక మనియు, ఆధిభౌతికమనియు ద్వివిధము. కనుబొమ్మలు–నాసిక ఈ రెంటియొక్క సంధిలో ఈశ్వరు నుపాసించుట–ఆధ్యాత్మికము. అవిముక్తముగా ప్రసిద్ధమైన కాశీక్షేత్రమునందు పరమేశ్వరుని దర్శించుట–ఆధిభౌతికము. శాస్త్రమునందిట్లు వ్యవస్థ చేయబడినది. ఈ యుపాసనాద్వయమునకును ఫలమైన తారకబ్రహ్మవిద్య యనబడు– ఆత్మతత్త్వజ్ఞానము, శ్రీరుద్రజపమాత్రమున అనాయాసముగ లభించుచున్నది. అవిముక్తోపాసనలోవలె ఇందాయాసము లేదు. అవిముక్తోపాసనమునందు కాశీమరణము లేనిదే తారకబ్రహ్మవిద్య లభించదుగాన, అందుకై ప్రయాస యవసరము. ఇక ఆధ్యాత్మికమగు అవిముక్తోపాసనములో "తస్మాద్యత్రత్వేవ గచ్ఛతి...మోక్షీభవతి" అను శ్రుతిలో – ఉపాసకు డెచటికి వెళ్ళునో అదియే కురుక్షేత్రం, అదియే దేవయజనము, అదియే బ్రహ్మసదనము. అచటనే అతనికి ప్రాణోత్క్రమణకాలమున రుద్రుడు తారకబ్రహ్మోపదేశ మొనర్చును. దానిచే నతడు అమృతస్వరూపుడై ముక్తుడగును" అని చెప్పబడుటచే కాశీమరణావశ్యకత లేకున్నను, శ్రీరుద్రజపము కన్న అధికతరప్రయాస మనివార్యము.

కావుననే జాబాలోపనిషత్తునందు– అవిముక్తోపాసనము నుపదేశించిన పిమ్మట, చిత్తైకాగ్ర్యాదిప్రయాససాధ్యమగు ఉపాసనను చేయు శక్తిలేకపోవుటచే జపమాత్రముచే మోక్షము నపేక్షించుచున్న బ్రహ్మచారులు "కిం జప్యేనామృతత్వమ్" అని ప్రశ్నించగా, "శతరుద్రీయేణ" అని సమాధాన మిచ్చుటయు, **"ఏతైరేవామృతో భవతి"** అని దానిని సమర్థించుటయు కనిపించుచున్నది. కాగా– ఆధ్యాత్మికావిముక్తోపాసనకన్నను అనాయాసముగ తత్ఫలప్రదము– "శతరుద్రీయ" మనుటచే దానికన్న నుత్తమమని మాత్రమే కాక, సర్వోపాసనలకన్న నుత్తమమని గూడ సిద్ధించుచున్నది. అన్ని యుపాసనలును అధికప్రయాససాధ్యములై యుండగా, శ్రీరుద్రము అనాయాసముగ తత్ఫలసాధనమై యుండుటయే అందుకు కారణము. కాగా– "శ్రీరుద్రమును జపించినచో సర్వోపాసనల జేసినవాడగును" అని చెప్పదగియుండగా, "అవిముక్తమాశ్రితో భవతి" అని విశేషించి అవిముక్తోపాసనను గ్రహించుటకు కారణమేమని ప్రశ్నింతురేమో; జాబాలోపనిషత్తులో – అవిముక్తము, రుద్రజపము ఈ రెండును జ్ఞానసాధనములుగ చెప్పబడుటచే ఈ రెండును సమాన ప్రతిపత్తిగలవను భావము – పైపైన జూచువారికి (స్థూలదృష్టులకు) కలుగవచ్చును. తన్నివారణపూర్వకముగ – అవిముక్తముకన్న నుత్తమమని ప్రదర్శించుటకే ఇట్లు చెప్పబడినది. కావున సర్వము సమంజసమగుచున్నది.

## శ్రీరుద్రస్య జ్ఞానకాణ్డోత్తమత్వం, ఉపనిషత్త్వోపపాదనఞ్చ

**భాష్యమ్ –** ఇత్థముపాసనాకాణ్డోత్తమత్వముక్తమ్. జ్ఞానకాణ్డోత్తమత్వమహ– **"అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్. అనేన జ్ఞానమాప్నోతి సంసారార్ణవనాశనమ్"** ఇతి. అత్ర **"సర్వదా సకృద్వా జపేత్"** ఇతి వికల్పేన శ్రీరుద్రస్య సకృజ్జపాదపి జ్ఞానలాభోక్త్యా తస్య జ్ఞానకాణ్డోత్తమత్వముక్తం భవతి. **జ్ఞానకాణ్డో హ్యుపనిషదః, తాశ్చ జ్ఞానార్థమావర్తనీయాః** ఇత్యావృత్త్యధికరణే (బ్ర.సూ. 4.1–1) వ్యవస్థాపితమ్. తథా చ ఆవర్తనీయత్వేన సర్వదా జప్యాత్ జ్ఞానకాణ్డాత్సకృజ్జపేన జ్ఞానజనకస్య శ్రీరుద్రస్యోత్తమత్వం సిద్ధ్యతి. యద్యప్యుపనిషదన్తరేష్వివ శ్రీరుద్రోపనిషద్యపి ప్రతిపాద్యబ్రహ్మతత్త్వసాక్షాత్కారపర్యన్తం శ్రవణమనననిదిధ్యాసనానామావర్తనీయతయా తత్ప్రయుక్తోపనిషదావృత్తిరపేక్షితైవ. తథాఽపి ద్వేధాత్ర జ్ఞానోత్పత్తిః – ఏకా శ్రవణమననాదిప్రణాడ్యా, ఏకా తు శ్రవణాదికం వినాఽపి **"ఏతైర్హ వా అమృతో భవతి"** ఇతి జాబాలశ్రుత్యుక్తరీత్యా కేవలం జపమాత్రేణై–వాహమహమికయా మోచకైః పరమేశ్వరదివ్యనామభిః స్వయముపనతాదీశ్వరప్రసాదాత్ జ్ఞానోత్పత్తిః. తత్రాద్యపక్షే శ్రవణాద్యావృత్తిప్రయుక్తా శ్రీరుద్రావృత్తిరస్తి. ద్వితీయపక్షే తు–కూర్మపురాణోక్తభస్మనిష్ఠాపరమేశ్వరాసక్తిపూర్వకాత్ ప్రతిదినం సకృద్రుద్రజపాదేవ శివానుగ్రహేణ జ్ఞానోత్పత్తిః. తమిమం పక్షమాదాయ శ్రీరుద్రస్య సర్వోత్తమత్వసిద్ధిరితి శ్రుత్యభిప్రాయః.

**"అత్యాశ్రమీ జపేత్"** ఇతి నేతరాశ్రమిపరిసంఖ్యా క్రియతే, జాబాలోపనిషది బ్రహ్మచారిణః ప్రత్యపి శ్రీరుద్రజపోపదేశేన,

**గృహస్థైశ్చ వనస్థైశ్చ తథైవ బ్రహ్మచారిభిః।**
**శతరుద్రీయసంజ్ఞస్తు మన్త్రో జప్యోమహత్తమః॥**

ఇత్యాది తదనుసారిపురాణవచనసహస్రదర్శనేన చ తద్విరోధాత్. నాపి సంన్యాసితం ప్రతి రుద్రప్రాప్త్యర్థమ్ **"అత్యాశ్రమీ జపేత్"** ఇతి విధిభావః, **"సర్వోపనిషదాం సారం రుద్రాధ్యాయం చ దత్తవాన్"** ఇతి తస్యా ఉపనిషత్త్వేన శ్రీరుద్రస్య సంన్యాసినం ప్రతి ప్రాప్తేః, "సర్వేష్వామరణమావర్తయేదుపనిషదమావర్తయేత్" ఇతి సంన్యాసినా–ముపనిషదామావృత్తి విధానాచ్చ. న చ శ్రీరుద్రస్యోపనిషత్త్వే మానాభావః.

**సర్వోపనిషదాం సారో రుద్రాధ్యాయః సమర్థితః।**
**భోగార్థినో ముముక్షోర్వా ప్రాయశ్చిత్తార్థినోఽపి వా।**
**రుద్రోపనిషదం ముక్త్వా గతిరన్యా న విద్యతే॥**

ఇత్యాది శివపురాణవచనైః, **"ఏకశతం యజుశ్శాఖాస్తాసు రుద్రోపనిషదామ్నాయతే."** ఇతి భట్టభాస్కరాద్యభియుక్తవ్యవహారేణ, ఉపనిషచ్ఛబ్దార్థపర్యాలోచనయా చ శ్రీరుద్రస్యోపనిష-త్త్వావగతేః.

ద్వేధా హ్యుపనిషచ్ఛబ్దః సాంప్రదాయికైర్వ్యుత్పాదితః – ఉప సమీపే పరబ్రహ్మణో నిషీదన్తి – వర్తన్తే ఇత్యుపనిషదో వేదాన్తాః. తే హి సాక్షాద్బ్రహ్మణి తాత్పర్యేణ వర్తన్తే, న తు కర్మకాణ్డవత్తదారాధనయజ్ఞాదివిధానద్వారేతి. అథవా ఉప–ని–పూర్వకాత్ షద్ ధాతోరవసాదనకర్మణః క్విపి నిష్పన్నోఽయముపనిషచ్ఛబ్దః సాక్షాత్సంసారమూలా-విద్యావసాదినీం బ్రహ్మవిద్యామాచష్టే, తత్సాధనతయా తు వేదాన్తేషు **"లాఙ్గలం జీవనమ్"** ఇత్యాదివద్వర్తత ఇతి. సేయం ద్విధా వ్యుత్పత్తిః శ్రీరుద్రేఽతిస్వరసైవ.

తస్మాదత్యాశ్రమిగ్రహణమిహ **"ఛత్రిణో గచ్ఛన్తి"** ఇత్యాదావివాజహల్లక్షణయా అత్యాశ్రమి–తదితరసాధారణ్యేన సర్వేషామప్యాశ్రమాణాముపలక్షణార్థమ్, చతుర్ష్వాశ్రమేషు యః కోఽపి ప్రతిదినం శ్రీరుద్రస్య సర్వదా సకృద్వా జపేన జ్ఞానమాప్నోతీతి. ఏవం చ **"యః శతరుద్రీయమధీతే"** ఇత్యుపక్రమ ఇవ **"అత్యాశ్రమీ జపేత్"** ఇత్యుపసంహారేఽప్యత్యాశ్రమిపదస్య శ్రీరుద్రజపాధికారిపురుషమాత్రపరత్వాదుపక్ర-మోపసంహారయోరేకవాక్యత్వం భవతి. తథా–

**యః పుమాఞ్ఛతరుద్రీయం పఠతి శ్రద్ధయా సహ।**
**దినే దినే మహావిష్ణో! మరణాదూర్ధ్వమైశ్వరమ్॥**

**జ్ఞానం లబ్ధ్వా స విజ్ఞానాదేవ యాతి పరాం గతిమ్।**
**గృహస్థైశ్చ వనస్థైశ్చ తథైవ బ్రహ్మచారిభిః॥**

ఇతి సూతసంహితావచనాన్యప్యేకవాక్యతాపరత్వేన సమర్థితాని భవన్తి.

**అనువాదము:** ఇట్లు శ్రీరుద్రమునకు ఉపాసనాకాణ్డోత్తమత్వము నిరూపింపబడినది. ఇటుపై **"అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్ అనేన జ్ఞానమాప్నోతి సంసారార్ణవనాశనమ్"** అను శ్రుతివచనము ననుసరించి జ్ఞానకాండోత్తమత్వము ప్రతిపాదింపబడుచున్నది. ఇందలి "సర్వదా–సకృద్వా" అను వికల్పమును బట్టి శ్రీరుద్రమును ఒక్కమారు జపించినను

తత్త్వజ్ఞానము లభించునని చెప్పుటచే ఇది జ్ఞానకాండోత్తమ మని చెప్పినట్లగుచున్నది. జ్ఞానకాండ మనగా - ఉపనిషత్తులేగద! ఆవిజ్ఞానార్థము ఆవర్తనీయములని అవృత్త్యధికరణము (బ్ర.సూ. 4-1-1)లో *(వేదాన్తవాక్య శ్రవణముద్వారా ఆత్మస్వరూపము నొక్కసారి గ్రహించినజాలునా? లేక దానిని ఆవృత్తిచేయవలెనా? అను సంశయమును ప్రదర్శించి, దర్శపూర్ణమాసేష్ట్యంగముగ విధింపబడిన ప్రయాజాదులు ఒకసారి అనుష్ఠించుటతో చరితార్థము లగుచున్నవి. అట్లే ఆత్మజ్ఞానార్థములగు శ్రవణాదులను గూడ ఒకసారి చేసిన జాలును. ఆవృత్తి అనావశ్యకము- అని పూర్వపక్ష మొనర్చి, అదృష్టార్థములైన ప్రయాజాది విధులు సకృదనుష్ఠానముతోనే చరితార్థము లగును. కాని- **'వ్రీహీనవహన్తి'** ఇత్యాది వాక్యములచే విహితములైన అవహననాదులు దృష్టార్థములు గాన, తండులనిష్పత్తిరూపమగు దృష్టప్రయోజనము సిద్ధించువరకు వానిని ఆవృత్తి చేయవలసియుండును. శ్రవణాదులు గూడ ఆత్మసాక్షాత్కారరూపమగు దృష్టప్రయోజనము నుద్దేశించి విధింపబడినవిగాన, సాక్షాత్కారపర్యన్తము ఆవృత్తిచేయక తప్పదు. ఆత్మతత్త్వము దుర్విజ్ఞేయము. కావుననే **'తత్త్వమసి'** అను వేదాన్తమహావాక్యము **తొమ్మిది మారులు** ఉపదేశింప బడినట్లు ఛాన్దోగ్యములో చెప్పబడినది - అని సిద్ధాన్తము చేయబడినది.)* నిర్ణయింపబడినది. కాగా- ఆవృత్తి చేయదగినదిగా చెప్పబడుటచే సర్వదా జపించవలసిన జ్ఞానకాండకన్నను, సకృజ్జప మాత్రమున జ్ఞానజనకమగు శ్రీరుద్రము ఉత్తమమని సిద్ధించుచున్నది. ఐతే- ఇతరోపనిషత్తులలో వలె రుద్రోపనిషత్తులో గూడ ప్రతిపాద్యమగు బ్రహ్మతత్త్వము సాక్షాత్కరించువరకు శ్రవణ-మనన-నిదిధ్యాసనముల నావృత్తిచేయవలసి యున్నందున, తత్ప్రయుక్తమగు ఉపనిషదావృత్తియు అనివార్యమే. ఐనను ఇచట జ్ఞానోత్పత్తికి రెండు మార్గములున్నవి - ఒకటి- శ్రవణమననాదిక్రమమున గలుగునట్టిది, రెండవది- శ్రవణమననాదులతో బనిలేకయే **'ఏతైర్వై వా అమృతో భవతి'** అని జాబాలోపనిషత్తులో చెప్పిన చొప్పున కేవలము జపమాత్రముననే అహమహమికతో ముక్తినిచ్చు పరమేశ్వరుని దివ్యనామములచే తనకు తానై ప్రాప్తమైన యీశ్వరానుగ్రహమువలన గలుగునట్టిది. ఇందు మొదటిపక్షములో శ్రవణాద్యావృత్తిప్రయుక్తమగు రుద్రోపనిషదావృత్తియు అపేక్షితమే. రెండవపక్షములో మాత్రము కూర్మపురాణోక్తక్రమమున భస్మనిష్ఠా పరమేశ్వరాసక్తి పూర్వకముగ ప్రతిదినము ఒక్కమారు రుద్రమును జపించిన మాత్రముననే శివానుగ్రహముచే తత్త్వజ్ఞానము సమకూరును. ఈ పక్షము ననుసరించియే శ్రీరుద్రమునకు సర్వోత్తమత్వము సిద్ధించునని శ్రుత్యభిప్రాయము.

**'అత్యాశ్రమీ జపేత్'** అను వాక్యమును 'సంన్యాసియే, జపించవలెను', అను రీతిలో పరిసంఖ్యావిధిగా గ్రహించి, ఇతరాశ్రమములవారు జపించరాదను నర్థమును

గ్రహించకూడదు. అట్లేయగుచో – జాబాలోపనిషత్తులో బ్రహ్మచారులకు శ్రీరుద్ర ముపదేశింపబడియుండుటయు, 'గృహస్థైశ్చ వనస్థైశ్చ' మొదలగు వేలకొలది పురాణవచనములు గృహస్థ–వనస్థ–బ్రహ్మచారులకు గూడ రుద్రాధ్యాయము జప్యమని బోధించుచుండుటయు– విరుద్ధము కాగలదు. సంన్యాసిని గూర్చి అప్రాప్తమగు రుద్రజపమును ప్రాప్తింపజేయుటకై అపూర్వవిధిగా ఈ 'అత్యాశ్రమీ జపేత్' అను వాక్యము ప్రవర్తించినదనుటయు సంగతము కాదు. ఏలయన – **'సర్వోపనిషదాం సారం రుద్రాధ్యాయం చ దత్తవాన్'** అను వచనము ననుసరించి శ్రీరుద్రము ఉపనిషద్రూపము గావున, **'సర్వేష్వామరణమావర్తయేదుపనిషదమావర్తయేత్'** అను వచనముచే రుద్రోపనిషదావృత్తియు సంన్యాసికి ప్రాప్తించియే యున్నది.

'శ్రీరుద్రము – ఉపనిషత్తు' అనుటకు ప్రమాణము లేదందురేమో: (సర్వోపనిషదాం సారో – గతిరన్యా న విద్యతే) 'రుద్రాధ్యాయము సర్వోపనిషత్సారముగా వెలువడినది. భోగముల నాకాంక్షించువారికి, ముముక్షువులకు, ప్రాయశ్చిత్తము నపేక్షించువారికి రుద్రోపనిషత్తు కాక, మరియొక మార్గము లేదు.' ఈ మొదలగు శివపురాణవచనముల చేతను, 'ఏకశతం యజుశ్శాఖాస్వాసు రుద్రోపనిషదామ్నాయతే, అని అభియుక్తులగు భట్టభాస్కరాదులు వ్యవహరించి యుండుటచే తను మాత్రమే కాక, ఉపనిషచ్ఛబ్దార్థ పర్యాలోచనముచే గూడ శ్రీరుద్రము– ఉపనిషత్తని సిద్ధమగుచున్నది. ఉపనిషచ్ఛబ్దమును సాంప్రదాయకులు రెండు విధముల వ్యాఖ్యానించియున్నారు– **'ఉప = సమీపే పరబ్రహ్మణో నిషీదన్తి = వర్తన్తే ఇత్యుపనిషదః'** అను వ్యుత్పత్తిచే 'పరబ్రహ్మముకు జేరువగా నుండునది' అని ఉపనిషచ్ఛబ్దమున కర్థము. అనగా – కర్మకాండ బోధించినట్లు ఈశ్వరారాధన – యజ్ఞానుష్ఠానాదుల ద్వారా (పరంపరగా) కాక, సాక్షాత్తుగ బ్రహ్మతత్త్వమును బోధించు తాత్పర్యముతో ప్రవర్తించునవి – ఉపనిషత్తులని భావము. లేదా – ఉప.ని అను ఉపసర్గలతో గూడిన విశరణా (వినాశా)ర్థకమగు షద్ ధాతువుకు క్విప్ప్రత్యయమును చేర్చగా ఉపనిషచ్ఛబ్దము నిష్పన్నమగుచున్నది. అది–సంసారమూలమగు అవిద్యను సాక్షాత్తుగ నశింపజేయు బ్రహ్మవిద్యను బోధించును. తత్సాధనములగుటచే శబ్దరూపములగు వేదాన్తములయందీ శబ్దము 'లాంగలం జీవనం' అన్నట్లు ఔపచారికముగ ప్రయుక్తమగు చున్నది. ఈ రెండు విధములగు వ్యుత్పత్తులును శ్రీరుద్రమునందు సుసంగతములే యగుచున్నవి.

కాగా 'అత్యాశ్రమి' పదమిచట *(ఒక గుంపుగా కొందరు వెళ్ళుచున్నారు. వారిలో కొందరు ఛత్రధారులున్నారు. ఛత్రము లేనివారుగూడ పలువురున్నారు. ఐనను ఆ గుంపును దృష్టిలో*

*పెట్టుకొని 'ఛత్రిణో గచ్ఛన్తి' అని పలుకుట లోకవ్యవహారములో కలదు. అట్టిచో 'ఛత్రిణః' అను పదము ఛత్రధారులనే కాక, ఛత్రధారులు కాని - ఆ గుంపులోనున్నవారి నందరిని బోధించును. ఇట్లు బోధించుటకు కారణమైన శబ్దవృత్తికి 'అజహల్లక్షణ' యని పేరు. దీనినే* ***ఛత్రిన్యాయ*** *మనియందురు. ఈ విషయము పూ.మీ.ప్రథమాధ్యాయ చతుర్థపాదములోని 'తత్సిద్ధిపేటిక'లో వివరింపబడినది. ప్రకృతమున - సంన్యాసాశ్రమపరమగు 'అత్యాశ్రమి' పదము సంన్యాసులు కాకపోయినను- తత్సహచరితులైన బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థాశ్రమములవారిని గూడ బోధించునని భావము.)*

**'ఛత్రిణో గచ్ఛన్తి'** ఇత్యాది ప్రయోగములలో వలె అజహల్లక్షణావృత్తిచే, అత్యాశ్రమి- తరతరసాధారణ మగుచు, సర్వాశ్రమముల వారిని బోధించుచున్నది. కాగా- నాలుగాశ్రమములకు చెందినవారిలో నెవ్వడైనను ప్రతిదినము ఎల్లప్పుడు, లేదా- ఒక్కమారైనను శ్రీరుద్రమును జపించిన తత్త్వజ్ఞానసంపన్నుడగునని సారాంశము. కాగా- 'యః శతరుద్రీయమధీతే' అను ఉపక్రమవాక్యమునందువలె- 'అత్యాశ్రమీ జపేత్' అను ఉపసంహారవాక్యమునందు గూడ అత్యాశ్రమిపదము - శ్రీరుద్రజపాధికారిపురుషసామాన్య పరమగుటచే ఉపక్రమోపసంహారముల కేకవాక్యత చేకూరును. అట్లే- (యః పుమాఞ్ఛతరుద్రీయం... బ్రహ్మచారిభిః) 'ప్రతిదినము శ్రద్ధతో శతరుద్రీయమును పఠించువాడు బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థులలో నెవడైనను అవసానమున ఈశ్వరజ్ఞానమును పొంది, తన్మూలమున ముక్తుడగును' అను సూతసంహితవచనములు సైతము ఏకవాక్యతనొంది సమర్థితము లగుచున్నవి.

**భాష్యమ్-** యద్యేవమ్, **"యః శతరుద్రీయమ్"** ఇత్యుపక్రమగతకర్తృసామాన్యేన **'సర్వదా సకృద్వా జపేత్'** ఇత్యుపసంహారగతజపక్రియాపేక్షితకర్త్రాకాంక్షానివృత్తేరత్యాశ్రమిపదం దత్త్వా తేన కర్తృసామాన్యోపలక్షణస్య కిం ప్రయోజనమితి చేత్; ఆకర్ణయ, కైవల్యోపనిష దుపక్రమే- **"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః"** ఇతి మోక్షహేతుత్వ- ముపదిష్టమ్. జాబాలోపనిషది చ శ్రీరుద్రస్య మోక్షసాధనత్వోపదేశానన్తరం **"అథ జనకో హ వై యాజ్ఞవల్క్యముపసంగమ్యేత్యువాచ - భగవన్ సంన్యాసమనుబ్రూహి"** ఇతి ప్రశ్నే తం ప్రతి సపరికరం సంన్యాసస్వరూపముపదిశ్య **"పరివ్రాట్ వివర్ణవాసా ముణ్డోऽపరిగ్రహశ్శుచిరద్రోహీ భైక్షమాణో బ్రహ్మభూయాయ భవతి"** ఇతి తస్య మోక్షసాధనత్వ- ముపదిష్టమ్. తథా చ సంన్యాసశ్రీరుద్రయోస్తుల్యమేవ జ్ఞానసాధనత్వమితి ప్రాప్తే, తద్వారణార్థమత్యాశ్రమిగ్రహణమ్. తేన చ సంన్యాసినామపి జ్ఞానసిద్ధ్యర్థం ముఖ్యతయా రుద్రజపవిధానాత్తస్య తతోऽప్యతిశయః ప్రదర్శితో భవతి - జ్ఞానోత్పత్తౌ సంన్యాసస్య శ్రీరుద్రసాపేక్షత్వాత్, శ్రీరుద్రస్య తు బ్రహ్మచార్యాదీన్ప్రత్యపి మోక్షసాధన

జప్యత్వేన సంన్యాసానపేక్షత్వాదితి. తదేతదత్యాశ్రమిపదేన సర్వాశ్రమోపలక్షణకరణస్య ప్రయోజనమ్.

న చైవం సంన్యాసినః ప్రణవం వినా మన్త్రాన్తరనిషేధవిరోధ ఇతి వాచ్యమ్; **"ఉపనిషదమావర్తయేత్"** ఇత్యారణ్యోపనిషద్వచనేన సామాన్యతః సంన్యాసినః ప్రతి ఉపనిషత్త్వేన శ్రీరుద్రవిధానేన, తత్రాపి **"శ్రీరుద్రం ప్రణవం చైవ నిత్యమావర్తయేద్యతిః"** ఇతి విశ్వేశ్వరస్మృత్యాదివచనైః తాన్ప్రతి విశిష్య రుద్రవిధానేన, **"అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్"** ఇతి కైవల్యోపనిషది కృత్స్నజ్ఞానకాణ్డాపేక్షయా ముఖ్యజ్ఞానసాధనతయా శ్రీరుద్రవిధానేన చ వివిదిషుసంన్యాసినః శ్రీరుద్రజపావశ్యంభావేన, తం ప్రతి మన్త్రాన్తర-నిషేధవచనస్య శ్రీరుద్రవ్యతిరిక్తమన్త్రవిషయత్వేనావశ్యం వాచ్యత్వాత్. విద్వత్సంన్యాసినస్తు కృతకృత్యతయా **"తస్య కార్యం న విద్యతే"** ఇతి శాస్త్రోక్త్యా తం ప్రతి ప్రణవవిధేః, మన్త్రాన్తరనిషేధస్య చాసంభవాత్ సర్వాణి విధినిషేధశాస్త్రాణి అవిద్వద్విషయాణీతి. తస్మాత్సిద్ధమ్ **"అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్"** ఇతి వచనేన శ్రీరుద్రస్య జ్ఞానకాణ్డోత్తమత్వమితి.

**అనువాదము:** ఇట్లగుచో, **'యః శతరుద్రీయం'** అను ఆరంభవాక్య బోధితమగు కర్తృసామాన్యముచేతనే, **'సర్వదా సకృద్వా జపేత్'** అను అన్తిమవాక్యగతమగు జపక్రియకుగల కర్త్రాకాంక్ష నివర్తించుచుంగా, మరల కర్తృసామాన్యోపలక్షకముగ 'అత్యాశ్రమి' పదమును గ్రహించుటకు ప్రయోజనమేమి? అందురేమో; వినుడు! కైవల్యోపనిషత్తుయొక్క ఆరంభములో 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' అని సంన్యాసము మోక్షసాధనముగ ఉపదేశింపబడినది. జాబాలోపనిషత్తులో గూడ శ్రీరుద్రమును మోక్షసాధనమునుగ ఉపదేశించిన పిమ్మట, (అథ జనకో హ వై.. బ్రహ్మ భూయాయ భవతి) 'జనకుడు యాజ్ఞవల్క్యుని కడకు వచ్చి 'భగవన్! సంన్యాసము నుపదేశింపుము' అని ప్రశ్నించగా, అతనికి సంన్యాసవిధిని సాంగముగ నుపదేశించి, **'శిరోముండనమును జేయించుకొని, కాషాయాంబరధారియై, దేనినీ పరిగ్రహించక, ఏ భూతమునకు ద్రోహమును తలపెట్టక బిక్షాటనతో ప్రాణధారణజేయు పరివ్రాజకుడు బ్రహ్మీభూతుడగును'** అని సంన్యాసము మోక్షసాధనముగ ఉపదేశింపబడినది. కాగా– సంన్యాస–శ్రీరుద్రజపములకు జ్ఞానసాధనత్వములో సమానత్వము ప్రాప్తమగుచున్నందున, దానిన వారించుటకై అత్యాశ్రమిపదము గ్రహింపబడినది. 'సంన్యాసులకు గూడ జ్ఞానప్రాప్తికై రుద్రజపమును ముఖ్యముగ

విధించుటవలన సంన్యాసము కన్న రుద్రజపమునకు గల వైశిష్ట్యము విదితమగుచున్నది. జ్ఞానోత్పత్తిలో సంన్యాసము– శ్రీరుద్రజపముయొక్క సాహాయ్యము నపేక్షించును. శ్రీరుద్రమన్ననో – బ్రహ్మచారులకు సైతము రుద్రజపము విధింపబడుటనుబట్టి – సంన్యాసము నపేక్షించదు. అత్యాశ్రమిపదముచే సర్వాశ్రమముల నుపలక్షించుటచే గలుగు ప్రయోజనమిదియే. ఐతే– సంన్యాసికి ఒక్క ప్రణవము తప్ప, తక్కిన మన్త్రములు నిషేధింపబడియున్నందున, ఇది (రుద్రజపము) ఎట్లు ఘటించును? అని శంకింతు రేమో; 'ఉపనిషదమావర్తయేత్' అను ఆరుణికోపనిషద్వచనముచే రుద్రముగూడ నుపనిషత్తే గావున – తజ్జపము గూడ విహితమగుచున్నది. **'శ్రీరుద్రం ప్రణవం చైవ నిత్యమావర్తయే–ద్యతిః'** ఇట్టి విశ్వేశ్వరస్మృత్యాది వచనములచే సంన్యాసులను గూర్చి ప్రత్యేకించి రుద్రజపము విధింపబడుటచేతను, 'అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్' అను కైవల్యోపనిషద్వాక్యములో సమస్తజ్ఞానకాండకన్నను ముఖ్యజ్ఞానసాధనముగ **శ్రీరుద్రము** విహితమై యుండుటచేతను 'వివిదిషు సంన్యాసినః' శ్రీరుద్రజపము తప్పనిసరి యగుచున్నది. కాగా – 'సంన్యాసి యితరమన్త్రములను జపించరాదు' అను నిషేధము– శ్రీరుద్రవ్యతిరిక్తమన్త్రవిషయిక మని అంగీకరింపక తప్పదు. 'విద్వత్సంన్యాసి' కృతకృత్యుడు గావున, 'తస్య కార్యం న విద్యతే' అను శాస్త్రము ననుసరించి అట్టివానికి ప్రణవవిధిగాని, ఇతరమన్త్రనిషేధముగాని, ఏదియు వర్తించదు. విధినిషేధములన్నియు అవిద్వద్విషయకములే. కావున– **'అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్'** అను వచనముచే శ్రీరుద్రమునకు సమస్తజ్ఞానకాణ్డోత్తమత్వము సిద్ధించుచున్నది.

**భాష్యమ్** – న చేదం వచనం న శ్రీరుద్రస్య సకృజ్జపాత్ జ్ఞానజనకత్వపరం, కైవల్యోపనిషద ఏవ తథాత్వపరమ్. శ్రీరుద్రస్య తు **"యః శతరుద్రీయమధీతే"** ఇత్యారభ్య **'తస్మాదవిముక్త–మాశ్రితో భవతి"** ఇత్యేతదన్తమేవ ప్రకరణమితి వాచ్యమ్; తథా సతి కైవల్యోపనిషది శతరుద్రీయాభిధానస్య సంబన్ధాభావేన తద్వాక్యస్య వైయర్థ్యప్రసఙ్గాత్. జ్ఞానసాధనతయా నాత్ర శతరుద్రీయాభిధానమ్, కైవల్యోపనిషదుపక్రమ ఏవ **"వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయశ్శుద్ధసత్త్వాః"** ఇతి వేదాన్తానాం జ్ఞానసాధనత్వోక్త్యా తద్విషయాకాంక్షవిరహేణ శ్రీరుద్రస్య తత్సాధనత్వోక్తేరనాకాంక్షితాభిధానత్వాత్. కిన్తు జ్ఞానాపేక్షితచిత్తశుద్ధ్యుపాయతామాత్రేణ తదుక్తిరితి వాచ్యమ్; చిత్తశుద్ధ్యుపాయస్యాఽపి వేదాన్తసంన్యాసయోగాదేరుపక్రమ ఏవోక్తత్వేన తదభిధానస్యాఽప్యనాకాంక్షితత్వాత్. న చ సంన్యాసాద్యపేక్షయాఽపి ముఖ్యచిత్తశుద్ధ్యుపాయః కః? ఇత్యాకాంక్షాయాం శ్రీరుద్రాభిధానం యుక్తమితి వాచ్యమ్; తథా సతి సంన్యాసవేదాన్తాద్యతిశాయిచిత్తశు–

ద్ధ్యుపాయత్వేనావిముక్తోపాసనాఫలజనకత్వేన చోద్యమానస్య సర్వోత్తమత్వాప్త్యా ఘట్టకుటీ-ప్రభాతన్యాయాపాతేన శ్రీరుద్రస్య సర్వోత్తమత్వాభావవాదినా త్వయా తథాఽపి వక్తుమశక్యత్వాత్.

తస్మాదిత్థం వక్తవ్యమ్ - జ్ఞానసాధనత్వేన పూర్వోక్తానామపి వేదాన్తశబ్ద-వాచ్యోపనిషదాం మధ్యే కిముత్తమమిత్యాకాంక్షాయామ్ **"యః శతరుద్రీయమ్"** ఇత్యాదివాక్యం తస్య సర్వోత్తమత్వం ప్రతిపాదయతీతి. తథా చ శ్రీరుద్రస్య ప్రతిపాదనపరేఽస్మిన్ వాక్యసందర్భే యద్యత్యాశ్రమీతి వచనం తస్య జ్ఞానకాణ్డోత్తమత్వం న ప్రతిపాదయేత్, తథా వివక్షితార్థప్రతిపాదనం వినా స్వయమప్యపర్యవస్యదిదం వాక్యమసంబద్ధప్రలాప ఏవ స్యాదితి, తేన తస్య జ్ఞానకాణ్డోత్తమత్వప్రతిపాదనమవశ్యాభ్యుపేయమితి యుక్తముత్పశ్యామః.

**అనువాదము:** ఐతే, ఈ వచనము శతరుద్రీయము నొక్కమారు జపించినంతనే జ్ఞానము కలుగునను తాత్పర్యముతో ప్రవర్తించినదికాదు. మరేమనగా- కైవల్యోపనిషత్తు సకృజ్జపముచే జ్ఞానజనకమని బోధించుటలో దీనికి తాత్పర్యము ఏలయనగా- **'యః శతరుద్రీయమధీతే'** అని ప్రారంభమై, 'తస్మాదవిముక్తమాశ్రితో భవతి' అను వాక్యముతో శ్రీరుద్రునకు సంబంధించిన ప్రకరణము సమాప్తమైనది- అని యందురేమో; అట్లే యగుచో కైవల్యోపనిషత్తులో శతరుద్రీయమును గూర్చి చెప్పవలసిన పని యేమున్నది? సంబంధము లేనిదానిని చెప్పినచో ఆ వాక్యము నిరర్థకమగును. ఇంతేకాక, జ్ఞానసాధనముగ శతరుద్రీయము నిచట చెప్పవలసినయవసరము లేదు. ఏలయనగా- కైవల్యోపనిషదారంభమునందే 'వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయ-శ్శుద్ధసత్త్వాః' అని వేదాన్తశబ్దవాచ్యములగు ఉపనిషత్తులు జ్ఞానసాధనములని చెప్పుటచే తద్విషయకమగు ఆకాంక్ష శమించినది గావున మరల శతరుద్రీయమునకు గూడ జ్ఞానసాధనత్వమును చెప్పుచో, అది - అనవసర ప్రసంగమే యగును. ఇక- జ్ఞానాపేక్షితమగు చిత్తశుద్ధికి సాధనముగ శ్రీరుద్రము చెప్పబడినదనవలయును. కాని చిత్తశుద్ధి సాధనములుగ, వేదాన్తసంన్యాసయోగాదులు పూర్వమే చెప్పబడినందున మరల దానినే చెప్పుటయు, అప్రసక్తప్రసంగమే యగును. ఐతే- సంన్యాసాదులు చిత్తశుద్ధ్యుపాయములుగ చెప్పబడినను, వానిలో ముఖ్యోపాయ మేది? అను ఆకాంక్ష కలుగుట కవకాశమున్నదిగాన, సమాధానముగ శ్రీరుద్రము గూర్చి చెప్పుట సముచితమే యందురేమో; అట్లే యైనచో సంన్యాసవేదాన్తాదులను మించిన చిత్తశుద్ధ్యుపాయముగను, అవిముక్తోపాసనాఫలజనకముగను విధింపబడినదానికి సర్వోత్తమత్వము సిద్ధించుటచే

*(ఘట్టమనగా - ప్రభుత్వపు రహదారులలో పయనించు శకటాదులకు సుంకమును వసూలుచేయు స్థానము. అచట వసూలుచేయు ఉద్యోగి నివసించు గుడిసెయే ఘట్టకుటి. ఒక వ్యాపారి ఆ సుంకమును తప్పించుకొనవలెనను దురూహతో అర్ధరాత్రముననే ప్రయాణించి, దారితప్పి అటునిటు తిరిగి తుదకు తెల్లవారునప్పటికి ఆ ఘట్టకుటికడకే చేరినాడుట, ఇంకేమి? వృథాశ్రమపడుటయే జరిగినదిగాని, సుంకమీయక తప్పలేదు. ఇది* ***ఘట్టకుటీప్రభాతన్యాయము.*** *దేనినో మనసులో పెట్టుకొని ఋజుమార్గమును వదలి అపమార్గమున సంచరించువారికి తుదకు శ్రమయే మిగులును. ఋజుమార్గము నాశ్రయించకనూ తప్పదని- దీని సారాంశము. అట్లే ప్రకృతమున - శ్రీరుద్రము సర్వోత్తమమను సిద్ధాన్తము నంగీకరించక, ఇతర పక్షముల నాశ్రయించినను, అవి కార్యకారులు కాకపోవుటతో చివరకు రుద్రసర్వోత్తమత్వము నంగీకరించుట- తప్పనిసరియైనదని తాత్పర్యము.)* ఘట్టకుటీప్రభాతన్యాయము ప్రసక్తమగును. కాన - శ్రీరుద్రమునకు సర్వోత్తమత్వము లేదని వాదించు నీవు అట్లనుటకును అవకాశముల లేదు. కాగా జ్ఞానసాధనములుగా పూర్వము పేర్కొనబడిన వేదాన్తశబ్దవాచ్యములగు నుపనిషత్తులలో గూడ నేది యుత్తమము? అను నాకాంక్ష గలిగినప్పుడు 'యః శతరుద్రీయమధీతే' ఇత్యాదివాక్యము శ్రీరుద్రమునకు సర్వోత్తమత్వమును ప్రతిపాదించుచున్నదని చెప్పుట యుక్తము. అట్టిచో శ్రీరుద్రప్రతిపాదన పరమగు ప్రకృతవాక్యసందర్భములో 'అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్' అను వచనము శ్రీరుద్రమునకు జ్ఞానకాండోత్తమత్వమును ప్రతిపాదించదేని, చెప్పవలసిన యర్థమును చెప్పజాలని యీ వాక్యము అసంబద్ధప్రలాపమే యగును. కావున తద్దోషపరిహారార్థ మీ వాక్యము, జ్ఞానకాండోత్తమత్వ ప్రతిపాదనపరమని యంగీకరించుట తప్పనిసరియని భావించుచున్నాము.

**భాష్యమ్ -** నను తథాఽపి శ్రీరుద్రస్య న సర్వోపనిషదుత్తమత్వం సిధ్యతి. **'యోఽథర్వశిరసం బ్రాహ్మణో నిత్యమధీతే, తేన రుద్రాణాం శతసహస్రాణి జప్తాని భవన్తి'** ఇత్యథర్వశిరోవచనేన శతసహస్రరుద్రజపఫలస్య సకృదథర్వశిరోజపమాత్రాదేవ సిద్ధివర్ణనేన శ్రీరుద్రాదప్యథర్వశిరస ఏవోత్తమత్వప్రాప్తేః. న చేదమథర్వశిరఃప్రశంసాపర-తయాన్యథాసిద్ధమితి వాచ్యమ్; **'సర్వదా సకృద్వా జపేత్'** ఇత్యాదేరపి రుద్రప్రశంసా-మాత్రత్వస్య సువచత్వాదితి చేత్, ఉచ్యతే- అథర్వశిరస్యేవ ఖలు తద్వచనం శ్రూయతే, న తు తత్సజాతీయోపనిషదన్తరే, తథా చ - ప్రకరణ్యథర్వశిరః ప్రశంసాపరత్వేన తస్య వచనస్యాన్యథాసిద్ధిరుపపద్యతే. శ్రీరుద్రోత్కర్షవచనం తు న శ్రీరుద్రోపనిషది శ్రుతమ్, యేన తద్వదన్యథాసిద్ధిః స్యాత్. కిన్తు శ్రీరుద్రోపనిషత్సమానస్కన్ధేషు జాబాలకైవల్యోపనిష-దాదిషు. తత్ర యది తద్వచనం శ్రీరుద్రప్రశంసార్థవాదమాత్రమేవ స్యాత్ న స్వార్థపరమ్,

తదా రుద్రప్రశంసాయాః కైవల్యజాబాలాదివిధ్యసంబన్ధాత్, తదనన్వితస్య స్వతః -ప్రామాణ్యాసంభవాత్ అర్థవాదాధికరణ (పూ.మీ. 1-2-1) పూర్వపక్షన్యాయేన తద్వచనమనర్థకమేవ స్యాత్. అతః స్వార్థపరమేవ తదభ్యుపేయమ్. తథా చ - తీర్థే తీర్థాన్తరస్తుతిన్యాయేన, ప్రతివాదికరార్పితజయపత్రికాన్యాయేన చ జాబాలకైవల్య-శ్రుతిగతశ్రీరుద్రోత్కర్షవచనం తస్య సర్వోత్తమత్వం ప్రతిపాదయత్ న కేనాఽపి వారయితుం శక్యత ఇత్యలం బహునా.

**అనువాదము:** ఇచట కొందరిట్లు శంకించుచున్నారు - ఇంత మాత్రమున శ్రీరుద్రము సర్వోపనిషత్తులలో నుత్తమ మనుటకు వీలులేదు. 'యోఽథర్వశిరసం బ్రాహ్మణో నిత్యమధీతే, తేన రుద్రాణాం శతసహస్రాణి జప్తాని భవన్తి' అను అథర్వశీర్షోపనిష-ద్వచనము- శతసహస్రరుద్రజపఫలము. ఒక్కమారు అథర్వశీర్షమును జపించినంత మాత్రముననే సిద్ధించునని వర్ణించుచున్నందున, రుద్రముకన్న నథర్వశీర్షమే అత్యన్తముత్తమమని తెలియుచున్నది. ఈ యథర్వశీర్షవచనము ప్రశంసాపరముగాను, దీనికి స్వార్థతాత్పర్యము లేదనుటకు వీలులేదు. అట్లగుచో - రుద్రమును గూర్చి పూర్వముదాహరించిన 'సర్వదా సకృద్వా జపేత్' అను వచనము గూడ ప్రశంసామాత్ర-పరమే యేల కారాదు? అందురేమో; అథర్వశీర్షమత్యుత్తమమను వచనము, ఆ యథర్వశీర్షమునందే కనిపించుచున్నది గాని, తత్సజాతీయమగు మరియొక ఉపనిషత్తులో దేనియందును కనిపించుటలేదు. కాగా- అచట ప్రకరణి (ప్రకృతము) అథర్వశీర్షము. దాని యుత్కృష్టతను బోధించుటలోనే ఆ వచనమునకు తాత్పర్యము గాని, శ్రీరుద్రము నికృష్టమనుట- దానికి వివక్షితము కాదు. ఇక- శ్రీరుద్రమునకు ఉత్కర్ష నుపాదించు వచనములన్ననో, అవి రుద్రోపనిషత్తులోనివి కావు. అట్లే యైనచో అథర్వశీర్షవచనములవలెనే ఇవియు రుద్రప్రశంసామాత్రపరములై యుండెడివి. కాని- సమానస్కన్ధములగు కైవల్య-జాబాలాద్యుపనిషత్తులలో నివి యున్నవి. అందలి యీ వచనములు స్వార్థపరములు కాక, కేవల ప్రశంసాపరములే యగుచో ఆ (రుద్ర) ప్రశంస, కైవల్యజాబాలాది విధికి సంబంధించినది కాకపోవుటచే- ఆ విధితో ఏకవాక్యతలేని యీ ప్రశంసకు స్వతఃప్రామాణ్యము సంభవించదు గాన *('ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానాం తస్మాదనిత్యముచ్యతే" అనునది అర్థవాదాధికరణపూర్వపక్ష ప్రధానసూత్రము. వేదమునకు (అంశత్రయవిశిష్టభావనారూప) క్రియాప్రతిపాదకమగుటనుబట్టి తద్భూతాధికరణము (1-1-7)లో ప్రామాణ్యము నిశ్చయింపబడినది. ఆ విధముగ క్రియా ప్రతిపాదకములు కాక, కేవల ప్రశంసాది ప్రతిపాదకములగు అర్థవాదవాక్యములు నిష్ప్రయోజనములు*

*గాన, వానికి ప్రామాణ్యము సంభవించదని –* **సూత్ర తాత్పర్యము.** *ప్రకృతమున – కైవల్యజాబాలా ద్యుపనిషత్తులలో రుద్రోత్కర్షవచనములు – రుద్రవిధిపరములు కాక, కేవల ప్రశంసాపరములేయగుచో అనర్థకములై అప్రమాణములు కావలసివచ్చును. కావున విధిపరత్వము నంగీకరించవలెనని పర్యవసితార్థము.)* అర్థవాదాధికరణ (పూ.మీ. 1–2–1) పూర్వపక్షన్యాయముచే అప్రమాణమే కావలసివచ్చును. ఈ దోషమును వారించవలెనన్న, ఆ వచనములకు స్వార్థపరత్వము నంగీకరించుటయే శరణ్యము. అప్పుడు– *('తీర్థ'శబ్దమునకు– శాస్త్రము,యజ్ఞము, పుణ్యక్షేత్రము ఇత్యాద్యర్థము లున్నవి ఉదాహరణకు 'శాస్త్రము'ను గ్రహించుచో ఏ శాస్త్రముకు సంబంధించిన ప్రశంస ఆ శాస్త్రములో నుండుట సహజమే అట్లుకాక, ఒక శాస్త్రములో మరియొక శాస్త్రముయొక్క ప్రశంస యున్నచో. అది స్వశాస్త్రప్రశంసకన్న ప్రబలము. తచ్ఛాస్త్రవైశిష్ట్యమునకు గమకము అట్లే – కర్మకాండలోనున్న శ్రీరుద్రోపనిషత్ప్రశంసావచనముల కన్న, ఉపనిషత్కాండలోని తత్ప్రశంసావచనములు స్వార్థపరము లగుచు శ్రీరుద్రముయొక్క సర్వోత్తమత్వమును ప్రతిపాదింపజాలియున్నవని – భావము)* **'తీర్థే తీర్థాన్తరస్తుతి'** న్యాయము ననుసరించియు, **'ప్రతివాదికరార్పితజయపత్రికా'** న్యాయము ననుసరించియు, కైవల్యజాబాలశ్రుతిగీతములగు శ్రీరుద్రోత్కర్షవచనములు అద్దానికి సర్వోత్తమత్వమును ప్రతిపాదించును. దానిని నిరోధింపజాలిన దేదియును లేదు. ఈ విషయము నింక విస్తరింపబనిలేదు.

## శ్రీరుద్రస్య సర్వోత్తమత్వే ధర్మశాస్త్రసంవాదః

**భాష్యమ్ –** ఇత్థం శ్రుతిసిద్ధమేవ శ్రీరుద్రస్య సర్వోత్తమత్వం ధర్మశాస్త్రకారైరపి స్మర్యతే – యథా చ భగవతా బోధాయనేన శ్రీరుద్రమహాన్యాసవిధౌ, **'శివసంకల్పం హృదయం, పురుషసూక్తం శిరః, ఉత్తరనారాయణం శిఖా, అప్రతిరథం కవచమ్'** ఇత్యాదినా శివసంకల్పాదీనాం, మన్వాదిభిరఖిలపాపనివర్తకతయా మహాఫలత్వేన ప్రదర్శితానా– మన్యేషాం చ త్ర్యమ్బకపఞ్చబ్రహ్మమన్త్రాదీనామపి శ్రీరుద్రాఙ్గతయా ప్రతిపాదనాత్తస్య సర్వవేదోత్తమత్వం దర్శితమ్. ఏవమన్యదప్యుదాహార్యమ్. అతస్సిద్ధం శ్రుతిస్మృతి– పర్యాలోచనయాఽస్య సర్వోత్తమత్వమ్.

> **వేదమేకగుణం జప్త్వా తదహ్నైవ విశుద్ధ్యతి।**
> **రుద్రైకాదశినీం జప్త్వా సద్య ఏవ విశుద్ధ్యతి॥** –ఇతి యమస్మృతిః.

ఏవమ్ **"రుద్రజాపీ జలే స్థితః సహస్రశీర్షజాపీ చ"** ఇత్యాదినా తత్తద్ధర్మశాస్త్రేషు పురుషసూక్తాదిప్రాయపాఠః – పాపహరత్వాంశాభిప్రాయేణ, న తు సమానప్రధానతయా, అఙ్గాఙ్గీనోస్తారతమ్యయోగాదితి స్మృత్యభిప్రాయః.

**అనువాదము:** ఇట్లు శ్రుతిప్రతిపాదితమైన శ్రీరుద్రముయొక్క సర్వోత్తమత్వమునే ధర్మశాస్త్రకర్తలు గూడ స్మరించుచున్నారు. భగవానుడగు బోధాయనుడు శ్రీరుద్రమహాన్యాస విధానమునందు – **'శివసంకల్పం హృదయం, పురుషసూక్తం శిరః, ఉత్తరనారాయణం శిఖా, అప్రతిరథం కవచమ్'** ఈ విధముగ శివసంకల్పాదులనే గాక అఖిలపాపహరము లగుటచే మహాఫలదాయకములుగ మన్వాదులచే పేర్కొనబడిన త్ర్యంబక–పంచబ్రహ్మ మన్త్రాదులను గూడ శ్రీరుద్రమున కంగములనుగ ప్రతిపాదించుటనుబట్టి అద్దాని సర్వవేదోత్తమత్వము స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రమాణముల నింకను ఉదాహరించవచ్చును. ఈ విధముగ శ్రుతిస్మృతిపర్యాలోచనముచే శ్రీరుద్రముయొక్క సర్వోత్తమత్వము సిద్ధమగుచున్నది. కాగా – "వేదమేకగుణం జప్త్వా తదహ్నైవ విశుద్ధ్యతి। రుద్రైకాదశినీం జప్త్వా సద్య ఏవ విశుద్ధ్యతి' అను యమస్మృతిలోను, 'రుద్రజాపీ జలే స్థితః, సహస్రశీర్షజాపీ చ' ఇత్యాదిగ ఆ యా ధర్మశాస్త్రములలోను, పురుషసూక్తాదులతో – రుద్రము సమానకక్ష్యగా నిర్దేశింపబడుట– రెండిటియందును పాపవినాశకత్వమను నంశము ఉండుటను బట్టి మాత్రమేగాని, రెండును సమప్రధానములను నభిప్రాయముతో కాదు. అంగమునకును అంగికిని తారతమ్యము తప్పనిసరిగద!

## శ్రీరుద్రస్య సర్వోత్తమత్వే ఇతిహాససంవాదః

**భాష్యమ్ –** ఏవమితిహాసోఽపి శ్రీరుద్రస్య సర్వవేదోత్తమత్వం ప్రతిపాదయతి. తథా హి. మహాభారతే ఆనుశాసనికే పర్వణి–

> **దుర్వాససః ప్రసాదాత్తే శఙ్కరస్య మహాత్మనః।**
> **ఆసీత్కిలేహ విజ్ఞానం తన్మే వ్యాఖ్యాతుమర్హసి॥**
>
> **మహాభాగ్యం యచ్చ తస్య నామాని చ మహాత్మనః।**
> **సర్వం తచ్ఛ్రోతుమిచ్ఛామి శర్వస్య వదతాం వర॥** – ఇతి యుధిష్ఠిరప్రశ్నే,

**'హన్త తే కథయిష్యామి నమస్కృత్వా కపర్దినమ్.'** ఇతి తం ప్రతి శ్రీకృష్ణస్య వచనం ప్రస్తుత్యేదం శ్రూయతే –

> **నామధేయాని లోకేషు బహూన్యస్య యథార్థవత్।**
> **నిరుచ్యన్తే బహుత్వాచ్చ విభుత్వాత్కర్మభిస్తథా॥**
> **వేదే చాస్య విదుః ప్రాజ్ఞాః శతరుద్రీయముత్తమమ్॥** – ఇతి.

ద్రోణపర్వణ్యప్యర్జునం ప్రతి ఏవమేవ వ్యాసవచనం దృశ్యతే. అత్రోభయత్రాపి **'శతరుద్రీయముత్తమమ్'** ఇతి శతరుద్రీయస్యోత్తమత్వం కిమపేక్షయేత్యాకాంక్షాయాం, వేదే చేతి పూర్వవాక్యశ్రుతవేదపరిత్యాగేన అశ్రుతప్రతియోగికల్పనాయోగాత్ సన్నిహితవేదస్యైవ ప్రతియోగిత్వేనాన్వయ ఇతి, శ్రీరుద్రస్య వేదోత్తమత్వం కణ్ఠతః ప్రతిపాదితం భవతి. తత్ర హేతురపి జపమాత్రేణ సర్వపురుషార్థప్రదత్వరూప ఇతి తత్రైవ భగవతా ప్రదర్శితమ్.

> **ప్రయతః ప్రాతరుత్థాయ యదధీతే విశాం పతే।**
> **ప్రాఞ్జలిః శతరుద్రీయం నాస్య కిఞ్చన దుర్లభమ్॥**

ఇతి భగవతా శ్రీరుద్రం జపతః సర్వార్థలాభః స్వస్వానుభవసిద్ధ ఇతి స్వాభిప్రాయః ప్రదర్శితో భవతి.

తేన చ కూర్మ-లైఙ్గ-హరివంశాద్యుక్తం భగవతో వాసుదేవస్య తత్తదిష్టావాప్తి-ఫలకం శ్రీరుద్రపఞ్చాక్షరజపానుష్ఠానం ప్రత్యభిజ్ఞాప్యతే. శ్రూయతే హి కూర్మపురాణే-

> **అత్ర పూర్వం హృషీకేశో విశ్వాత్మా దేవకీసుతః।**
> **ఉవాస వత్సరం కృష్ణః సదా పాశుపతవ్రతః॥।**
>
> **భస్మోద్ధూలితసర్వాఙ్గో రుద్రాధ్యయనతత్పరః।**
> **ఆరాధయన్ హరిః శంభుం కృత్వా పాశుపతవ్రతమ్॥** - ఇతి.

లైఙ్గే-

> **ఏవం స్తుత్వా మహాదేవం దణ్డవత్ప్రణిపత్య చ।**
> **జజాప రుద్రం భగవాన్ కోటివారం జలే స్థితః॥** - ఇతి.

హరివంశే చ -

> **"భాస్వత్త్రిపుణ్డ్రో భసితైస్సితస్సన్ - మౌనీ జటీ వల్కలవాన్ ముకున్దః।**
> **నిరన్తరం చేతసి చన్ద్రచూడం - విచిన్తయన్ పఞ్చ జజాప వర్ణాన్॥** - ఇతి.

ఏవం భారతే కైలాసయాత్రాయాం మానససరఃస్థితపాశుపతాస్త్రప్రసాదనార్థం శ్రీమత్కృష్ణకృతశ్రీరుద్రజపవచనాన్యప్యుదాహరణీయాని. ఏవం చ యద్యప్యవాప్త-సమస్తకామస్య పరబ్రహ్మణో వాసుదేవస్య న కిఞ్చిజ్జప్యం వా, తతః ప్రాప్యం వా విద్యతే. తథాఽపి -

**యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥**

ఇతి గీతోక్తరీత్యా లోకసఙ్గ్రహార్థం తదనుష్ఠానముపపద్యత ఏవ. ఉక్తం హి మహాభారతే భగవతైవ -

**మయా ప్రమాణం యదతో లోకస్తదనువర్తతే।**
**న హ్యదేయోఽస్తి కశ్చిన్మే వరః పాణ్డవనన్దన॥**

**ఇతి సంచిన్త్యమనసా పురాఽహం విశ్వమీశ్వరమ్।**
**పుత్రార్థమారాధితవానహమాత్మానమాత్మనా॥**

కూర్మపురాణే -

**న వై పశ్యన్తి తం దేవం మోహితా మాయయా మమ।**
**తతోఽహం స్వాత్మనో మూలం జ్ఞాపయన్ పూజయామి తమ్॥** - ఇతి.

తథా చ లోకశిక్షార్థమాచరితశ్రీరుద్రజపో భగవాన్ వాసుదేవ ఏవాస్మాకం తన్మహిమా ప్రమాణమితి సిద్ధమ్. ఏవమితిహాసేనాపి శ్రీరుద్రస్య సర్వోత్తమత్వమ్.

**అనువాదము:** ఇట్లే ఇతిహాసము గూడ శ్రీరుద్రమునకు సర్వవేదోత్తమత్వమును ప్రతిపాదించుచున్నది. మహాభారతమునందలి ఆనుశాసనికపర్వములో, ధర్మరాజు - (దుర్వాససః ప్రసాదాత్తే... శతరుద్రీయముత్తమమ్) "వక్తలలో శ్రేష్ఠుడవైన ఓ కృష్ణా! దుర్వాసోమహర్షి యనుగ్రహమునవలన నీకు లభించినట్టి, మహాత్ముడగు శంకరునియొక్క విజ్ఞానమును, అనగా నిరతిశయమగు అతని యైశ్వర్యమును, ఆ మహాత్ముని దివ్యనామములను నాకు వివరించి చెప్పుము. వినగోరుచున్నాను' అని ప్రశ్నించగా, శ్రీకృష్ణుడు సమాధానమిచ్చుచు 'పరమేశ్వరుని నామములు లోకములో బహువిధముల ప్రసిద్ధములైయున్నవి. అవి యన్నియు యథార్థములుగా నిర్వచనము చేయబడినవి. విశ్వవ్యాప్తి యగు ఆ దేవుని లీలలు అనన్తములు. తదనుగుణముగ ఆ లీలలను బోధించు అతని నామములును అనన్తములే. తదీయదివ్యనామాత్మకమగు శతరుద్రీయము సర్వవేదసారమని విజ్ఞులు తలంచుచున్నారు' – అని తెలిపియున్నాడు. ద్రోణపర్వములో గూడ అర్జునునకు వ్యాసమహర్షి ఈ విధముగనే యుపదేశించినట్లు పేర్కొనబడినది. ఈ రెండు సందర్భములలో గూడ 'శతరుద్రీయముత్తమమ్' అని చెప్పబడినది. కాగా- శతరుద్రీయము దేనికన్న నుత్తమము? అను ఆకాంక్ష కలుగుట సహజము. ఐతే-

తత్పూర్వవాక్యములలో సన్నిహితమై వేదపదము శ్రుతమగుచుండగా, దానిని విడచి, మరియొకదానిని గ్రహించుటకు ప్రమాణ మేమియు లేదు గాన వేదోత్తమత్వమే కంఠోక్తిగ ప్రతిపాదితమగుచున్నది. జపమాత్రమున సర్వపురుషార్థసాధన మగుటయే అందుకు కారణమని గూడ – (ప్రయతః ప్రాతరుత్థాయ... కిఞ్చన దుర్లభమ్) 'ఓ ధర్మరాజా! ప్రాతఃకాలముననే లేచి స్నానాదులచే శుచియై పరమేశ్వరున కంజలిఘటించి శతరుద్రీయమును జపించువానికి దుర్లభమైన దేదియును లేదు' అని భగవానుడు తెలిపియున్నాడు.

శ్రీరుద్రమును జపించువానికి సర్వార్థములు సిద్ధించునను విషయము స్వానుభవ సిద్ధమైన శ్రీకృష్ణుని యభిప్రాయమని పై వచనము సూచించుచున్నది. దీనిచే, కూర్మ–లింగ–హరివంశాదులలో చెప్పబడిన విధముగ, ఆ యా అభీష్టఫలములను సంపాదించుకొనుటకై భగవానుడగు వాసుదేవుడు శ్రీరుద్ర–పంచాక్షరజపాదుల ననుష్ఠించిన వృత్తాన్తము స్మృతికి వచ్చుచున్నది. కూర్మపురాణములో – (అత్ర పూర్వం హృషీకేశో... పాశుపతవ్రతమ్) 'ఇచట పూర్వము, విశ్వాత్మకుడయ్యు దేవకీసుతుడుగా నవతరించిన శ్రీకృష్ణుడు పాశుపతవ్రతము నవలంబించి భస్మోద్ధూలితసర్వాంగుడై, నిరన్తర రుద్రజపపరాయణుడై శివారాధన మొనర్చుచు సంవత్సరకాలము నివసించెను' అనియు, లింగపురాణములో– (ఏవం స్తుత్వా = జలే స్థితః) 'ఈ ప్రకారము మహాదేవుని స్తుతించి, దండ (వత్) ప్రణామ మాచరించి, జలమధ్యగతుడై కృష్ణభగవానుడు కోటిపర్యాయములు శ్రీరుద్రమును జపించెను' అనియు, హరివంశములో – **(భాస్వత్త్రిపుణ్డ్రో = పంచ జజాప వర్ణాన్)** 'సర్వాంగభస్మోద్ధూళనముచే తన కృష్ణరూపము శుక్లరూపముకాగా, నొసట భస్మత్రిపుండ్రము వెలుగొందుచుండగా, జటా–పల్కలముల ధరించి, మౌనము నవలంబించి ముకుందుడు చిత్తమునందు నిరంతరముగ చంద్రశేఖరుని ధ్యానించుచు పంచాక్షరమహామంత్రమును జపించెను' అనియు చెప్పడినది. ఇట్లే భారతమునందలి కైలాసయాత్రాప్రకరణములో– మానససరోవరమునందున్న పాశుపతాస్త్రమును ప్రసన్నము జేసికొను సందర్భమున శ్రీకృష్ణుడు శ్రీరుద్రమును జపించినట్లు తెలుపుచున్న వచనములు గూడ ఇచట ఉదాహరింపదగియున్నవి. ఐతే– ఆప్తకాముడగు శ్రీకృష్ణపరమాత్మకు జపముగాని, తజ్జన్యమగు ఫలముగాని ఆపేక్షితము కాకపోవచ్చును. ఐనను 'యద్యదాచరతి శ్రేష్ఠః = లోకస్తదనువర్తతే' అని గీతలో చెప్పినట్లు లోకసంగ్రహార్థమై పెద్దలావిధముగ అనుష్ఠించుట ఉపపన్నమే యగుచున్నది. మహాభారతములో – (మయా ప్రమాణం =

ఆత్మానమాత్మనా) 'ఓ పాండునందనా! నిజమునకు నాకు కోరదగిన వరమేదియు లేదు. కాని లోకము నన్ను ప్రమాణభూతునిగ గ్రహించి అనువర్తించుచుండును. దీనిని మనసులో నుంచుకొనియే పూర్వము పుత్రప్రాప్తికై విశ్వమయుడనగు నేను నా స్వరూపమైన విశ్వేశ్వరు నారాధించితిని' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు కలదు. కూర్మపురాణము నందు గూడ- (న వై పశ్యన్తి పూజయామి తమ్) "తాత్త్వికదృష్టిలో మేము (శివ-కేశవులు) ఏకరూపులమే. ఐనను నా మాయచే మోహింపజేయబడిన లోకము మమ్ము భిన్నముగా జూచుచున్నది. వారి యజ్ఞానమును పోగొట్టుటకే నేను నా స్వరూపమేయగు శివుని బూజించుచున్నాను" అని చెప్పబడినది. కాగా- ఇట్లు లోకశిక్షణకై స్వయముగ రుద్రమును జపించిన వాసుదేవుడే శ్రీరుద్రమాహాత్మ్యవిషయమున మనకు ప్రమాణభూతుడగుచున్నాడు. ఈ విధముగ ఇతిహాసముచే గూడ శ్రీరుద్రముకు సర్వోత్తమత్వము సిద్ధించుచున్నది.

## శ్రీరుద్రస్య సర్వోత్తమత్వే పురాణసంవాదః

**భాష్యమ్ -** ఏవం పురాణేనాపి తస్య సర్వోత్తమత్వమవగమ్యతే. తత్ర బ్రహ్మోత్తరఖణ్డ-కూర్మపురాణాదివచనాని కానిచిత్పూర్వమేవోదాహృతాని. అన్యాన్యపి పరశ్శతాని దృశ్యతే. తేషాం సర్వేషాముదాహరణే బహువిస్తరః స్యాదితి స్థాలీపులాకన్యాయేన కిఞ్చిదుదాహ్రియతే. సూతసంహితాయామ్-

**రుద్రజాపీ విముచ్యేత మహాపాతకపఞ్జరాత్।**
**సమ్యగ్జ్ఞానం చ లభతే తేన ముచ్యేత బన్ధనాత్।**
**అనేన సదృశం జప్యం నాస్తి సత్యం శ్రుతౌ స్మృతౌ॥** - ఇతి.

**అనువాదము:** ఇట్లే పురాణముగూడ శ్రీరుద్రముయొక్క సర్వోత్తమత్వమును తెలుపుచున్నది. అందు బ్రహ్మోత్తరఖండ-కూర్మపురాణాదివచనములు ఇంతకుముందే ఉదాహరింప బడినవి. ఇంకను శతాధికములగు వచనములు కనిపించుచున్నవి. వాటి నన్నింటిని ఉదాహరించినచో బహువిస్తరమగును గాన. స్థాలీపులాకన్యాయము ననుసరించి కొన్నింటిని మాత్రముదాహరించుచున్నాము- (రుద్రజాపీ విముచ్యేత, శ్రుతౌ స్మృతౌ) 'రుద్రమును జపించువాడు పంచమహాపాతకపంజరమునుండి విముక్తుడగును. దీనిచే సంసార బంధమోచకమగు సమ్యగ్జ్ఞానము గలుగును. శ్రుతిలోగాని స్మృతిలోగాని దీనితో సమానమైన- జప్యమగు మన్త్రము మరియొకటి లేదు. ఇది యథార్థము అని సూతసంహితలో చెప్పబడినది.

## తాన్త్రికాక్షేపః తత్పరిహారశ్చ

**భాష్యమ్ –** తదేవం శ్రుతిస్మృతీతిహాసపురాణావగతమహామహిమశాలిని రుద్రాధ్యాయే యదర్వాచీనైర్మూర్ఖతాన్త్రికైః ప్రలపితం, తన్నిరాకుర్మః. తే స్వల్పేవమాహుః – అగ్నిపరమేవ శతరుద్రీయమ్, న పరమేశ్వరపరమ్; అగ్నిచయనే **'రుద్రో వా ఏష యదగ్నిః స ఏతర్హి జాతో యర్హి సర్వశ్చితః'** ఇతి చితిసంపూర్తికాలోత్పన్నమగ్నిం రుద్రముక్త్వా **'స యథా వత్సో జాతః స్తనం ప్రేప్సత్యేవం వా ఏష ఏతర్హి భాగధేయం ప్రేప్సతి తస్మై యదాహుతిర్న జుహుయాదధ్వర్యుం చ యజమానం చ ధ్యాయేచ్ఛతరుద్రీయం జుహోతి'** ఇతి తస్మిన్నగ్నౌ శతరుద్రీయహోమవిధానేన తస్యాగ్నిపరత్వావగమాత్.

**గౌణం లాక్షణికం వాఽపి వాక్య భేదేన వా పునః।**
**వేదోఽయమాశ్రయత్యర్థం కో న్వత్ర ప్రతికూలయేత్॥**

ఇతి భట్టవార్త్తికోక్తరీత్యా సాక్షాద్వేదేన కృతం వ్యాఖ్యానమనాదృత్య శ్రుతిలిఙ్గాదిన్యాయైరన్య-పరత్వస్య వక్తుమశక్యత్వాత్. న హి **'సప్తదశ ప్రాజాపత్యాన్ పశూనాలభతే'** ఇతి సాప్తదశ్యోక్తిబాధితం బహువచనస్య త్రిత్వే పర్యవసానం కపిఞ్జలాధికరణన్యాయేన కల్పయితుం శక్యమ్. అస్తు వా పరమేశ్వరపరమ్; తథాఽపి న తతః సర్వేశ్వరత్వాదే స్సాత్త్వికత్వసిద్ధిః, నమస్కారైరిష్టానిష్టప్రాప్తిపరిహారప్రార్థనాలిఙ్గైశ్చ శ్రీరుద్రస్య స్తుతిపరత్వావసాయాదితి.

**అనువాదము:** కాగా ఈ విధముగ, మహామహిమగలదిగా శ్రుతిస్మృతీతిహాసాదులచే పేర్కొనబడిన శ్రీరుద్రాధ్యాయమునుగూర్చి మూర్ఖులగు నవీన తాన్త్రికులు కొందరు చేయు ప్రలాపములను ఇపుడు నిరాకరించుచున్నాము. వారిట్లనుచున్నారు – శతరుద్రీయము అగ్నిపరమగునేగాని, పరమేశ్వరపరము కాదు. అగ్నిచయనప్రకరణములో 'రుద్రో వా ఏష యదగ్ని... శతరుద్రీయం జుహోతి' అను శ్రుతి, ఇష్టకలతో నిర్మించి చితిపూర్తియైన కాలములో ఉత్పన్నమైన చితిరూపమైన – అగ్నినే రుద్రునిగా పేర్కొని, అప్పుడే పుట్టిన శిశువు స్తన్యమునపేక్షించునట్లు ఆ యగ్ని గూడ స్వోచితమగు భాగము (ఆహుతి) నపేక్షించుననియు ఆహుతినీయని గో–అధ్వర్యు–యజమానులకు హానిగలిగించుననియు, అతని శాంతింపజేయుటకై శతరుద్రీయముతో (అజాక్షీరమును) హోమము జేయవలె ననియు – చెప్పుచున్నది. దీనినిబట్టి శతరుద్రీయము అగ్నిపరమని నిశ్చిత మగుచున్నది. రుద్రశబ్దమునకు, అగ్ని – ముఖ్యార్థము కాకపోవచ్చును. కాని – 'గౌణం లాక్షణికం వాఽపి' అని భట్టకుమారిలవార్తికములో జెప్పినట్లు అది గౌణమగుగాక, లాక్షణిక

మగుగాక, వాక్యభేదాపాదకమగుగాక సాక్షాత్తుగ వేదముచేసిన వ్యాఖ్యానమును త్రోసిపుచ్చి, శ్రుతిలిఙ్గాదిన్యాయములచే అర్థాన్తరపర మని చెప్పుట కవకాశము లేదు. 'సప్తదశ ప్రాజాపత్యాన్ పశూనాలభతే' అను వాక్యములో ప్రత్యక్షశ్రుతమగు సప్తదశత్వ (17) సంఖ్యచే బాధితమగుచున్న స్థితిలో *('వసన్తాయ కపింజలానాలభేత' అను వాక్యములోని కపింజలపదమున బహువచనము శ్రూయమాణమగుచున్నది. బహువచనముకు త్రిత్వము (మూడు) మొదలు పరార్థపర్యన్తము ఏ సంఖ్యనైన బోధించు సామర్థ్యమున్నది. అట్లని యిచ్చట ఇష్టమైన ఏదో యొక సంఖ్యను గ్రహించుటకు వీలులేదు. త్రిత్వసంఖ్యతోనే బహువచనార్థము సిద్ధించును. అది ప్రథమోపస్థితము గూడను. దాని నతిక్రమించి చతుష్ట్వ (నాలుగు) ప్రభృతి సంఖ్యలను గ్రహించుచో నియామకములేనందున అవ్యవస్థ యేర్పడును. కావున మూడు కపింజలములనే గ్రహించవలె నని కపింజలాధికరణములో సిద్ధాన్తము చేయబడినది.*

*ఈ న్యాయమును బట్టి 'సప్తదశ ప్రాజాపత్యానాలభతే' అను వాక్యములోని బహువచనమునకు గూడ త్రిత్వములోనే పర్యవసానమనుటకు వీలులేదు. కారణ మేమనగా - ఇందు సంఖ్యావిశేష బోధకమగు 'సప్తదశ' పదము ప్రయుక్తమైనది. కావున పదునేడు పశువులనే గ్రహించవలెను. ఇట్టి విశేష బోధకమగు ప్రమాణములేని తావున మాత్రమే **కపింజలాధికరణన్యాయము** వర్తించును.)* కపింజలాధికరణ (11-1-8) న్యాయముచే బహువచనమునకు త్రిత్యము (3)లో పర్యవసానమును కల్పించుట - శక్యము కాదు గదా! అథవా - పరమేశ్వరపరమే యగుగాక. ఐనను అంతమాత్రమున తత్ప్రతిపాదితమగు సర్వేశ్వరత్వాదికమునకు వాస్తవికత్వము సంభవించదు. మరేమనగా - నమస్కారముల చేతను. ఇష్టప్రాప్తి - అనిష్ట పరిహార ప్రార్థనారూపములగు లింగముల చేతను శ్రీరుద్రమునకు స్తుతిపరత్వమే నిశ్చితమగుచున్నది - అని వారి యాశయము.

**భాష్యమ్ -** అత్ర బ్రూమః - యథా హి **'రుద్రో వా ఏష యదగ్నిః'** ఇత్యగ్నిపరత్వ-వ్యాఖ్యానశ్రుతిః, ఏవం **'ఏతాని హ వా అమృతస్య నామధేయాని'** ఇతి పరమేశ్వర-పరత్వవ్యాఖ్యానశ్రుతిరుపలభ్యతే. సా చ **'వేదే చాస్య సమామ్నాతం శతరుద్రీయముత్తమమ్'** **'ఇమాని మే రహస్యాని'** ఇతి పూర్వోదాహృతైరితిహాసపురాణైరుపబృంహితత్వాత్ నార్థాన్తరపరత్వశఙ్కాస్పదమ్. **'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'** ఇతి వచనేన శ్రుతిస్మృతీతిహాసపురాణానాం **వనసింహన్యాయేన** పరస్పరానుగ్రాహ్యానుగ్రాహక-భావాపన్నతయా ప్రబలత్వేన తదవగతార్థస్యాప్రకమ్ప్యత్వాత్. ఏవం చాగ్నిపరత్వ ఇవ బ్రహ్మపరత్వేఽపి సాక్షాద్వేదేన కృతం వ్యాఖ్యానమవిశిష్టమితి కథమత్ర నిర్ణయ ఇతి సంశయే న్యాయతో వ్యవస్థా కర్తవ్యా. తదుక్తం భట్టవార్తికే -

**ధర్మే ప్రమీయమాణే హి వేదేన కరణాత్మనా।**
**ఇతికర్తవ్యతాభాగం మీమాంసా పూరయిష్యతి॥** – ఇతి.

తతశ్చ శ్రుతిలిఙ్గాదిన్యాయైః శ్రీరుద్రస్య బ్రహ్మపరత్వమేవావధార్యతే. యథా ఖలు– **అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి। ఈశానో భూతభవ్యస్య.** ఇతి కఠవల్లీ–శ్రుతిరీశానశ్రుతిబలాత్పరమేశ్వరపరైవ, న తు జీవపరేతి **'శబ్దాదేవ ప్రమితః'** ఇత్యధికరణే వ్యవస్థాపితమ్, తథాఽత్రాపి శివ–శంకర–భవ–శర్వ–పశుపతి– రుద్రాద్యభిధానశ్రుతిశతబలాద్బ్రహ్మపరైవ శ్రీరుద్రోపనిషదితి వ్యవస్థా ఆశ్రీయతే. యథా చ **'ఆకాశస్తల్లిఙ్గాత్' 'అన్తస్తద్ధర్మోపదేశాత్' అన్తర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవపదేశాత్' అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః'** ఇత్యాద్యధికరణేషు **'అస్య లోకస్య కా గతిరితి ఆకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే' 'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే'** ఇత్యాదిశ్రుతీనాం సర్వభూతకారణత్వ– సర్వాత్మకత్వలిఙ్గబలాద్బ్రహ్మపరత్వం వ్యవస్థాపితమ్, తథాఽత్రాపి సర్వేశ్వరత్వ– సర్వాత్మకత్వ– సర్వాన్తర్యామిత్వాదిలిఙ్గ–బలాద్బ్రహ్మపరత్వమాశ్రయితవ్యమ్.

దృశ్యతే హి శ్రీరుద్రోపనిషది– **'దిశాం చ పతయే నమః'** ఇత్యాదినా ప్రపఞ్చాన్తర్గతైకైకవస్త్వాధిపత్య ప్రదర్శనపూర్వకముపపాద్యమానమ్, **'జగతాం పతయే నమః'** ఇతి సర్వజగదీశ్వరత్వమ్, **'ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ'** ఇత్యాదావేకైకాత్మకత్వ–ప్రదర్శనపూర్వకముపపాద్యమానం సర్వాత్మకత్వమ్, **'నమః స్రుత్యాయ చ'** ఇత్యాదినా తథైవోపపాద్యమానం సర్వాన్తర్యామిత్వం చ బ్రహ్మాసాధారణధర్మః. ఏవం నీలగ్రీవత్వ–కపర్దిత్వ–పినాకపాణిత్యాదివిశిష్టం పారమేశ్వరాసాధారణం నిరూపితమ్. అన్యాని చ తథాభూతాని లిఙ్గాని వాక్యాని చ ద్రష్టవ్యాని. న హ్యేతత్సర్వేశ్వరత్వాదికమగ్నేః సంభవతి.

**అనువాదము:** ఇందుకు సమాధానమును చెప్పుచున్నాము – **'రుద్రో వా ఏష యదగ్నిః'** అను శ్రుతి శతరుద్రీయమునకు అగ్నిపరత్వమును చెప్పుచున్నట్లే 'ఏతాని హ వా అమృతస్య నామధేయాని' అను శ్రుతి పరమేశ్వరపరత్వమును చెప్పుచున్నది. ఇయ్యది – 'వేదే చాస్య సమామ్నాతం శతరుద్రీయముత్తమమ్' 'ఇమాని మే రహస్యాని' ఇట్టి పూర్వోదాహృతములగు ఇతిహాసపురాణవచనములచే నుపబృంహితమగుచున్నది గాన అన్యవిషయకమనుట కవకాశము లేదు. 'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అను వచనము ననుసరించి, శ్రుతి–స్మృతీతిహాసపురాణములు *(అడవి దట్టముగ నున్నపుడు*

*అందలి సింహమునకు రక్షణ సిద్ధించును. సింహము ఉన్నప్పుడు దాని భయమువలన జనులు చెట్లను నఱకుటకు ప్రయత్నించరు గాన అడవి కూడ రక్షితమగును. ఇట్లు ఒకదానికొకటి– పరస్పరము– సహకారులై వృద్ధినొందుట–* ***వనసింహన్యాయము.*** *ఈ విధముగనే శ్రుతిస్మృతీతిహాస పురాణములు పరస్పరము ఏకవాక్యతగలిగి, ప్రమాణములై పురుషార్థసాధనక్షమము లగునని – భావము.)* **'వన–సింహన్యాయము'** చే పరస్పరము అనుగ్రాహ్యానుగ్రాహకభావముతో నొప్పారుచు ప్రబలములై యుండుటవలన అవి బోధించిన యర్థము అప్రకంప్యమగుచున్నది. ఐతే– పైన జెప్పినట్లు అగ్నిపరముగనే కాక, బ్రహ్మపరముగ గూడ సాక్షాత్ వేదమే సమానముగ వ్యాఖ్యానించుచున్నపుడు, ఇందేది గ్రాహ్యము? అను శంక కలుగుట– సహజము. ఇట్టిచో మీమాంసాన్యాయము ననుసరించి వ్యవస్థ జేయవలసియుండును. ఈ విషయము భట్టవార్తికములో ఇట్లు చెప్పబడినది– 'ధర్మే ప్రమీయమాణే హి... మీమాంసా పూరయిష్యతి' ధర్మాధర్మజ్ఞానమునకు వేదమే సాధనమైనను, దాని ననుష్ఠించువిధానమును బోధించునట్టి **మీమాంస** ఆ జ్ఞానమునకు సమగ్రతను సంపాదించునని – దీని భావము. కాగా శ్రుతిలిఙ్గాది న్యాయములచే శ్రీరుద్రమునకు బ్రహ్మపరత్వమే నిశ్చిత మగుచున్నది. ఎట్లనగా – 'అఙ్గుష్ఠమాత్రః... ఈశానో భూతభవ్యస్య' అను కారక శ్రుతి, "ఈశాన" శబ్ద శ్రుతి బలముచే పరమేశ్వరపరమే గాని, జీవపరము కాదని– "శబ్దాదేవ ప్రమితః" (బ్ర.సూ. 1–3–7) అను అధికరణములో వ్యవస్థచేయబడినది. అట్లే ప్రకృతమున గూడ, శివ–శంకర–శర్వ– పశుపతి–రుద్రాదిశబ్దశ్రుతిబాహుల్యమును బట్టి శ్రీరుద్రోపనిషత్తు బ్రహ్మపరమను వ్యవస్థయే స్వీకరింపబడుచున్నది. మరియు *(ఆకాశాధికరణములో– 'సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యన్తే, ఆకాశం ప్రత్యస్తం యన్తి, ఆకాశో హ్యేవైభ్యో జ్యాయాన్, ఆకాశః పరాయణమ్' అను ఛాన్దోగ్యశ్రుతిలోని "ఆకాశ" శబ్దము– భూతాకాశ పరమా? పరబ్రహ్మపరమా? అను సంశయమును ప్రదర్శించి, లోక–వేద ప్రసిద్ధి ననుసరించి భూతాకాశ పరమేయని పూర్వపక్ష మొనర్చి, శ్రుతిప్రతిపాదితములైన సర్వభూతోత్పత్తికారణత్వము – సర్వభూతలయాధారత్వము – అనన్తత్వము మున్నగు బ్రహ్మలిఙ్గము (లక్షణము)లు భూతాకాశమునందు సంభవించవుగాన పరబ్రహ్మపరమే యని సిద్ధాన్తము చేయబడినది.)* "ఆకాశాస్తల్లిఙ్గాత్" (1–1–8) *(అన్తర్యామ్యధికరణములో – "యః పృథివ్యాం తిష్ఠన్పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః" అను బృహదారణ్యక వచనములో పేర్కొనబడిన అన్తర్యామి – పృథివ్యాద్యభిమానిదేవతయా? లేక అణిమాద్యైశ్వర్య సంపన్నుడైన యోగియా? కాక పరమాత్మయా? అని త్రిధా సంశయము నుల్లేఖించి, దేవతగాని, యోగిగాని, ఐయుండవలయును. వారు శరీరేన్ద్రియాదులు కలిగియుందురుగాన, పృథివ్యాదులలో ప్రవేశించుట,*

*నియమించుట - ఇత్యాదులు సంభవించును. శరీరేన్ద్రియాదిరహితుడగు పరమాత్మ కిది సంభవించదు. కావున అన్తర్యామి - పరమాత్మ కాదు - అని పూర్వపక్షము జేసి, పృథివ్యాదికము, తదధిదేవత- ఇత్యాదిక మంతయు వికారజాతమే. సర్వవికారజాతమును నియమించగలవాడు, సర్వకారణమైన, సర్వశక్తుడైన పరమాత్మయే గాని తదితరుడు కాజాలడు. "ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః" అను శ్రుతి లోని అన్తర్యామి విశేషణములగు "ఆత్మా" "అమృతః" అను శబ్దములు గూడ పరమాత్మను గ్రహించినప్పుడే సమంజసములగును. ఆ యీ లిఙ్గములను బట్టి, అన్తర్యామి - పరమాత్మయే యని సిద్ధాన్తీకరింపబడినది.)* ''అన్తర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్'' (1-2-5) (అదృశ్యత్వాధికరణములో- "యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అను ముణ్డకశ్రుతి నుదాహరించి ఇందు అద్రేశ్య (అదృశ్య)త్వ- భూతయోనిత్వాది గుణములుగల వస్తువు - సాంఖ్యుల ప్రధానమా? జీవుడా? పరమాత్మయా? అని కోటిత్రయాత్మకమైన సంశయము పేర్కొనబడినది. దానిపై- అదృశ్యత్వాది ధర్మములు ప్రధానము నందున్నవి. అది అచేతనమే యైనను భూతయోని యగుటకు బాధకమేమియు లేదు. అచేతనములైన పృథివ్యాదులనుండి ఓషధివనస్పత్యాదులు పుట్టుచుండుట లోకానుభవసిద్ధము. లేక - యోనిశబ్దముచే ఉపాదానకారణమును కాక, నిమిత్తకారణమును గ్రహించుచో భూతయోనిశబ్దముచే జీవుని పేర్కొనవచ్చును. ఏలయనగా- ధర్మాధర్మముల ద్వారా అతడు భూతజాతమును ఆర్జించును. అంతేకాని ఈ మన్త్రము పరమేశ్వరప్రతిపాదకము కాదు- అని పూర్వపక్షము రాగా ఇచట **"యః సర్వజ్ఞః సర్వవిత్"** ఇత్యాది పరమేశ్వరధర్మములు పేర్కొనబడినవి. అదృశ్యత్వాదిగుణములను కథంచిత్ ప్రధానమునందును జీవునియందును అన్వయింపజేసినను, సర్వజ్ఞత్వాదులు అచేతనమైన ప్రధానమునందు గాని, ఉపాధిపరిచ్ఛిన్నుడైన జీవునియందు గాని, ఎంతమాత్రము సమన్వితములు కావు. కావున పరమేశ్వరపరమే యీ వాక్యము- అని సిద్ధాన్తము చేయబడినది.) అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" (1-2-6) ఇత్యాద్యధికరణములలో- "అస్య లోకస్య కా గతిరితి ఆకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా... సముత్పద్యన్తే" "య ఏషోఽన్తరాదిత్యే... దృశ్యతే" ఇత్యాది శ్రుతులలోని సర్వభూతకారణత్వము సర్వాత్మకత్వము మున్నగు లింగముల బలముచే బ్రహ్మపరత్వము నంగీకరించినట్లే, ప్రకృతిమునగూడ సర్వేశ్వరత్వము, సర్వాత్మకత్వము, సర్వాన్తర్యామిత్వము మున్నగు లింగముల బలముచే బ్రహ్మపరత్వము నంగీకరించవలసియున్నది. శ్రీరుద్రోపనిషత్తులో **"దిశాం చ పతయే నమః"** ఇత్యాదిగా ప్రపంచాన్తర్గత-ఏకైకవస్త్వాధిపత్య ప్రదర్శనపూర్వకముగ "జగతాం పతయే నమః" అని సర్వజగదీశ్వరత్వ ముపపాదింపబడినది. "ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ" ఇత్యాదిగా ఏకైకాత్మకత్వప్రదర్శన పూర్వకముగ సర్వాత్మకత్వము ప్రదర్శింపబడినది.

**"నమస్త్రస్సుత్యాయ చ"** ఇత్యాదిగా సర్వాన్తర్యామిత్వము సమర్థింపబడినది. ఇవి (సర్వేశ్వరత్వ–సర్వాత్మకత్వ–సర్వాన్తర్యామిత్వములు) బ్రహ్మయొక్క అసాధారణ ధర్మములు. ఇట్లే నీలగ్రీవత్వ–కపర్దిత్వ–పినాకపాణిత్వాదులతో గూడిన పరమేశ్వరుని అసాధారణ స్వరూపము నిరూపింపబడినది. ఇంకను ఇట్టి యితర లింగములను, వాక్యములను గూడ దర్శించవచ్చును. ఈ విధమైన సర్వేశ్వరత్వాదిక మగ్నికి సంభవించదు గద.

**భాష్యమ్ –** శ్రూయతే హి తలవకారిణాముపనిషది – పురా దేవాసురయుద్ధే స్వస్వమహిమ్నైవ జయో జాత ఇతి గర్విష్ఠానాం దేవానాం దర్పమపనేతుం తేషాం పురతో యక్షరూపేణ శివః ప్రాదుర్భూయ నిజస్వరూపజిజ్ఞాసయా సమీపమాగతస్య సకలజగద్దహనసామర్థ్యమదావలిప్తస్యాగ్నేః పురతస్తృణమేకం నిధాయ తావన్మాత్రమపి దగ్ధుం తస్యాసామర్థ్యమ్, తథైవ వాయోః తచ్చలయితుమప్యశక్తిమాపాద్య స్వయం తిరోదధే. తతః కోऽసౌ యక్షరూపీ దివ్యః పురుష ఇతి జిజ్ఞాసయా ఖిద్యతాం దేవానాం పురస్తాత్తత్స్వరూపోపదిదిక్షయా పరబ్రహ్మవిద్యాధిదేవతా భగవతీ హైమవతీ ఉమా స్వయమావిర్భూయ పరమేశ్వర ఏవ యక్షరూపేణావిరాసీదిత్యుపదిదేశ. దేవాశ్చ పరమేశ్వరమేవ తం జయ మహిమానమన్వజానన్నిత్యుపాఖ్యానం పురాణేషు చ ప్రపఞ్చితమ్ ఏవం **'జనితాగ్నేర్జనితా సూర్యస్య' 'భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ' 'యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనా వివేశ'** ఇత్యుపాఖ్యాన–మప్యనుసన్ధేయమ్. తథా చ పరమేశ్వరసృష్టస్య తన్నియమ్యస్య తదాయత్తశక్తికస్యాగ్నేః సర్వాన్తర్యామిత్వ–సర్వాత్మకత్వాద్యసంభవాత్ సాగ్నీన్ద్రాదిసకలజగత్స్రష్టుః తన్నియన్తుః పరమేశ్వరస్యైవ తదసాధారణం లిఙ్గమ్. తదేవం శ్రుతిలిఙ్గాదిన్యాయైః, తదుపోద్బలితై–రితిహాసపురాణబోధాయనధర్మశాస్త్రాద్యుపబృంహణైః తదుభయోపబృంహితత్వేన అప్రకంప్యస్వార్థతయా, తథాऽऽదిత్యాదీనామయనేషు సంవత్సరసత్రేష్వహర్గణత్వ–సామాన్యాద్ద్వాదశాహికవిధ్యన్తప్రాప్తౌ సంవత్సరసత్రత్వేనాన్తరఙ్గసాదృశ్యాత్ గవామయనవిధ్యన్త ఏవ గ్రాహ్య ఇతివత్ ఉపనిషదర్థనిర్ణయే ఉపనిషత్కృతమేవ వ్యాఖ్యానం గ్రాహ్యమన్తరఙ్గసాదృశ్యాత్, న తు కర్మకాణ్డకృతం వ్యాఖ్యానమితి ప్రత్యాసత్త్యతిశయే–నావశ్యగ్రాహ్యతయా, తథా – **'యత్కిఞ్చిత్ప్రాచీనమగ్నీషోమీయాత్తేనోపాంశు ప్రచరన్తి'** ఇతి సావకాశాదుపాంశుస్వరవిధానాత్ **'మన్ద్రం ప్రాయణీయాయామనుబ్రూయాన్మన్ద్రతర–మాతిథ్యాయామ్'** ఇతి ప్రాయణీయాదిగతస్వరాన్తరవిధానస్యైవ, అర్థవాదత్వేన స్తుత్యాదిపరతయా సావకాశాత్ తద్రాహిత్యేన నిరవకాశతయా చ ప్రబలేన **'ఏతాని హ**

**వా అమృతస్య నామధేయాని'** ఇతి జాబాలోపనిషద్వ్యాఖ్యానేన పారమేశ్వరమేవేదం శతరుద్రీయమితి వ్యవస్థీయతే.

**అనువాదము:** సామవేదాన్తర్గతమగు తలవకారో(కేనో)పనిషత్తులో ఇట్లు చెప్పబడినది – పూర్వమొకప్పుడు దేవాసురసంగ్రామములో దేవతలు, ఎవరికి వారు – తమ సామర్థ్యము చేతనే జయము సిద్ధించినదని గర్విష్ఠులై యుండగా, వారి గర్వము నడంచుటకై శివుడొక యక్షరూపమున వారికి ప్రత్యక్షమయ్యెను. తత్స్వరూపమును తెలిసికొనగోరి సమీపమున కేతెంచిన దేవతలలో – సమస్త ప్రపంచమును దహించివేయగల సామర్థ్యము తనకు గలదని గర్వోద్రిక్తుడైయున్న అగ్ని యెదుట నొక తృణము నుంచగా దానిని గూడ నాతడు దహించజాలకపోయెను. అట్లే వాయువు ఆ తృణమును గదల్పజాలకపోయెను. అంతలో నాయక్షము అంతర్ధానము నొందుటయు, ఈ యక్షరూపమున సాక్షాత్కరించిన దివ్యపురుషు డెవడై యుండునని చింతించుచున్న దేవతల యెదట వారి ననుగ్రహించు తలంపుతో పరబ్రహ్మ విద్యాధిదేవతయగు భగవతి–హైమవతి–ఉమాదేవి సాక్షాత్కరించి, యక్షరూపమున ఆవిర్భవించినది– పరమేశ్వరుడేయని తత్త్వోపదేశ మొనర్చెను. అపుడు దేవతలు– పరమేశ్వరుని మహిమవల్లనే తాము అసురులను జయించగలిగినామని గుర్తించిరి. ఈ యుపాఖ్యానము పురాణములలో గూడ విశదీకరింపబడియున్నది. ఇట్లే – "జనితాగ్నేర్జనితా సూర్యస్య" "భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ" "యో రుద్రో అగ్నౌ...వివేశ" అను శ్రుత్యర్థము గూడ నీసందర్భమున అనుసన్ధానము జేయదగియున్నది. కాగా– పరమేశ్వరునిచే సృజింపబడి, తన్నియమ్యుడై తదధీనసామర్థ్యము గలవాడైన అగ్నికి – సర్వాన్తర్యామిత్వ–సర్వాత్మకత్వాదులు సంభవించవుగాన, అగ్నీన్ద్రాదిసహితమైన సకల ప్రపంచమునకు స్రష్టయు, నియంతయునగు పరమేశ్వరునకే అది అసాధారణ లక్షణము.

ఇట్లు శ్రుతిలింగాదిన్యాయములచేతనే కాక ఇతిహాస–పురాణ–బోధాయన ధర్మశాస్త్రాదులచే సైతము ఉపబృంహితమైనందున అప్రకంప్యమగు స్వార్థము గలిగియున్నందువల్లను,

సంవత్సరసత్రరూపములగు ఆదిత్యాద్యయనములలో అహర్గణత్వసాధర్మ్యమును బట్టి అతిదేశముచే ద్వాదశాహాఙ్గకలాపము ప్రాప్తమగుచుండగా, సంవత్సరసత్రత్వ రూపమగు అన్తరఙ్గసాదృశ్యము ననుసరించి గవామయనము యొక్క *(సోమయాగము– ఏకాహము, అహీనము, సత్రము – అని త్రివిధము. అందు ఒకే సుత్యాహస్సు (ప్రధానయాగము జరుగుదినము) గలది – ఏకాహమనబడును. రెండు మొదలు – పదనొకండువరకు సుత్యలు గలవానికి*

– అహీనములని పేరు. పదమూడు, అంతకన్న నధిక సుత్యలు గలవి – సత్రములు. వానిలోనే–*360*, అంతకన్న నధిక సుత్యలు గల సత్రములకు 'అయన' మనునది విశేష సంజ్ఞ. పంద్రెండు సుత్యలుగల– మధ్యస్థమైన– ద్వాదశాహము ఉభయాత్మకము. అంతకన్న తక్కువ సుత్యలు గల అహీనములకును, ఎక్కువ సుత్యలుగల సత్రములకును ప్రకృతిగా పరిగణింపబడినది. అహర్గణసాధ్యమైయుండుటే కాక, అఙ్గసమృద్ధికలదై యుండుట గూడ అందుకు ముఖ్యకారణము. కావుననే అనేకాహసాధ్యములైన యాగములలో అపేక్షితములైన అంగములు ద్వాదశాహమునుండి అతిదేశన్యాయముచే గ్రహింపబడు చుండును. అయనములలో గూడ ఇతర అయనములందన్న గవామయనము – అఙ్గసమృద్ధమై యున్నది.

ఈ స్థితిలో – 'ఆదిత్యానామయనము' 'తపస్వినామయనము' ఇత్యాదుల ననుష్ఠించునపుడు, అపేక్షితమైన అంగకలాపమును ద్వాదశాహమునుండి గ్రహించవలెనా? గవామయమునుండి గ్రహించవలెనా? అని సంశయము కలుగగా– ఆదిత్యానామయనాదులు అహర్గణసాధ్యములు. ద్వాదశాహము గూడ అహర్గణ సాధ్యమే. కాగా– 'అహర్గణసాధ్యత్వ' రూపమగు సాదృశమునుబట్టి ద్వాదశాఙ్గ కలాపమే గ్రాహ్యము – అని పూర్వపక్షి పేర్కొనుటయు, దానిపై – అహర్గణ సాధ్యత్వరూపమగు సాదృశ్యము, అహీన రాత్రిసత్రాది సాధారణము. అది యట్లుండగా, 'సంవత్సరసాధ్యత్వ' రూపమైన విశేషసాదృశ్యము– గవామయనములో నున్నది అది అన్తరఙ్గము ప్రబలము. కావు– గవామయన ధర్మములే ఆదిత్యానామయనాదులలో గ్రాహ్యము లని– సిద్ధాన్తము చేయబడినది. ఈ విచారమును పూర్వమీమాంసాష్టమాధ్యాయ ప్రథమపాదములో సమగ్రముగ దర్శించవచ్చును. సాధారణ– అసాధారణ సాదృశ్యములలో అసాధారణసాదృశ్యమే గ్రాహ్యమని – దీని సారాంశము.

ప్రకృతములో – శ్రీరుద్రోపనిషత్తాత్పర్యమును గ్రహించునపుడు, కర్మకాండరూపమైన వేదభాగములోని వ్యాఖ్యానము గ్రాహ్యమా? జాబాలాద్యుపనిషత్తులలోని వ్యాఖ్యానము గ్రాహ్యమా? అను సంశయము కలిగినప్పుడు సాధారణమైన, 'వేదసాదృశ్యము'ను బట్టి కర్మకాండ వ్యాఖ్యానమును గ్రహించుటకన్నను, 'ఉపనిషత్సాదృశ్యము, అసాధారణము అన్తరఙ్గముగాన దానిననుసరించి, జాబాలాద్యుపనిషద్వ్యాఖ్యానమే గ్రాహ్యమని భావము.) అంగకలాపమే గ్రాహ్యమని (పూ. మీ. 8–1–1) చెప్పినవిధముగ, ఉపనిషదర్థనిర్ణయముజేయు సందర్భమున మరియొక ఉపనిషత్తులో జేయబడిన వ్యాఖ్యానమే– అన్తరంగమగుటచే– గ్రాహ్యమగునుగాని, కర్మకాండకృతవ్యాఖ్యానము కాదని – అత్యన్తసన్నిహితత్వమును పురస్కరించుకొని అవశ్యము గ్రహించవలసియున్నందువల్లను,

'మన్ద్రం ప్రాయణీయాయాం...' అను వచనముచే ప్రాయణీయేష్ట్యంగముగ విధింపబడిన మన్ద్రస్వరము నిరవకాశమగుటచే, 'యత్కించిత్ప్రాచీనమగ్నీషోమీయాత్తేనో–

పాంశు ప్రచరన్తి' అను వాక్యముచే విహితమైన ఉపాంశు స్వరమును సావకాశమగుటచే- అన్యత్ర (ప్రాయణీయాదివ్యతిరిక్తములగు ఉపసదాదులలో) సంకోచపఱచినట్లు, అర్థవాద రూపమగు 'రుద్రో వా' ఇత్యాది వాక్యమును స్తుతిపరముగ వ్యాఖ్యానించుట కవకాశము కలదుగాన, నిరవకాశ మగుటచే ప్రబలమైన 'ఏతాని హ వా అమృతస్య నామధేయాని' అను జాబాలోపనిషద్వ్యాఖ్యానము ననుసరించి, శతరుద్రీయము పరమేశ్వరపరమే యని నిశ్చితమగుచున్నది.

**భాష్యమ్ –** యదగ్నిచయనహోమవిధ్యర్థవాదకోణే స్థితమ్ **'రుద్రో వా ఏష యదగ్నిః'** ఇతి వ్యాఖ్యానమ్, తత్తు మన్త్రాధికరణ (పూ.మీ. 1-2-4) సిద్ధదృష్టార్థకత్వనిర్వాహాయ శతరుద్రీయమన్త్రస్య తత్ప్రతిపాద్యరుద్రాత్మనా అగ్నేః స్తుత్యభిప్రాయేణాగ్నౌ వినియోగ ఇతి తావన్మాత్రరూపం తద్వివరణమితి, న తతః శతరుద్రీయస్య శ్రుతిలిఙ్గాద్యననుగుణాగ్ని-పరత్వసిద్ధిః. స్వారసికప్రతీతిరహితేఽర్థే వినియుజ్యమానస్య మన్త్రస్య యథాకథఞ్చిల్లక్షణా-గౌణ్యధ్యాహారాదిభిస్తదర్థప్రకాశకత్వేఽపి తత్పరత్వాభావాత్. ఏతదభిప్రాయకమేవ **'గౌణం లాక్షణికం వా'** ఇతి వార్తికవచనమ్. అత ఏవ **'ఐన్ద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే'** ఇతి గార్హపత్యోపస్థానే వినియోగేఽప్యైన్ద్ర్యా ఋచో న గార్హపత్యపరత్వమిష్యతే.

అత ఏవ చ పురుషసూక్తస్య **'పురుషాద్దక్షిణతః పురుషేణ నారాయణేన బ్రహ్మాఽభిష్టౌతి సహస్రశీర్షా పురుషః'** ఇతి శతపథబ్రాహ్మణేన **'ఉపాకృతవాన్ దక్షిణతోఽవస్థాయ బ్రహ్మా సహస్రశీర్షా పురుష ఇతి పురుషేణ నారాయణేన పరా చానుశంసతి'** ఇత్యాపస్తంబసూత్రేణ చ పురుషమేధే పశుత్వేన వినియుక్తానాం స్తవనే, తథా **'పురస్తాత్ప్రతీచీనం పురుషాకృతిం చినోతి పురుషశిరోఽస్యాః శిరో భవతి'** ఇతి మహాగ్నౌ పురుషాకృత్యుపస్థానం విధాయ **'సహస్రశీర్షా పురుష ఇత్యుపసంనిహితాం పురుషేణ నారాయణేన యజమాన ఉపతిష్ఠతి'** ఇత్యాపస్తంబసూత్రేణ పురుషాకృత్యుపస్థానే వా,

> ***"యజేత్పురుషసూక్తేన వరుణం విశ్వరూపిణమ్"***
> ***"యజేత్పురుషసూక్తేన ధనదం విశ్వరూపిణమ్"***

ఇతి శాతాతపస్మృత్యాదిషు వరుణధనదాదియజనే వినియుక్తత్వేఽపి న తత్పరత్వమితి భూయానస్య విషయః. తస్మాద్బహూన్పశ్యన్త్యా బహుభిర్భాషమాణాయా అపి పతివ్రతాయా హృదయం పత్యావివ బహుభిర్వచనైరితస్తతో నీయమానాయా అపి భగవత్యాః శ్రీరుద్రోపనిషదో హృదయం శ్రీమతి సామ్బపరబ్రహ్మణ్యేవ వ్యవతిష్ఠత ఇతి, తామన్య-పరాం చికీర్షమాణా రామానుజాదయః భగవతీం సీతామాత్మసాత్కర్తుం ప్రవృత్తరావణవత్ మహాపాపిష్ఠా ఇత్యాస్తాం తావత్.

**అనువాదము:** అగ్నిచయనవిధికి సంబంధించిన అర్థవాదవాక్యజాతములో నొక మూలనున్న ''రుద్రో వా ఏష యదగ్నిః'' అను వ్యాఖ్యానము– *(మీమాంసా తృతీయాధ్యాయములో లక్షణోదాహరణపూర్వకముగ అఙ్గత్వవిచారము చేయబడినది. అఙ్గత్వమును బోధించుటలో, శ్రుతి–లిఙ్గ–వాక్య–ప్రకరణ–స్థాన–సమాఖ్య లను ఆరు సహకారి ప్రమాణములను నిర్దేశించుటే కాక, వానిలో విరోధము ప్రసక్తమైనప్పుడు పూర్వపూర్వము ప్రబలమనియు, ఉత్తరోత్తరము దుర్బలమనియు వ్యవస్థ గూడ చేయబడినది.*

*ఈ స్థితిలో – ఐన్ద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే" అను వాక్యము ఇన్ద్రదేవతాకమైన ఋక్కుతో గార్హపత్యాగ్నిని గూర్చి ఉపస్థానము జేయవలెనని విధించుచున్నది. ఉపస్థాన మనగా– నియతమైన స్థానములో నుండి మన్త్రముతో దేవతను ప్రార్థించుట. "కదాచనస్తరీరసి..." అను ఋక్కు– "ఓ ఇంద్రుడా! నీవెప్పుడును హింసించువాడవు కాదు. హవిస్సు నిచ్చిన యజమానునకు అత్యన్తసన్నిహితుడవై ఫలము నిచ్చుచుందువు. ఈ యజమాను డిచ్చు హవిస్సు నీకు పునః పునః అందుచున్నది." అను నర్థమును బోధించుచున్నది గాన, లిఙ్గమునుబట్టి ఇది ఇన్ద్రదేవతాకమనుటకు సందేహము లేదు.* ***లిఙ్గమనగా– అర్థప్రకాశనసామర్థ్యము*** *ఐతే– 'ఐన్ద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే' అను వాక్యముచే విధింపబడిన ఉపస్థానములో, నిరపేక్షరవరూపములగు ద్వితీయా– తృతీయాశ్రుతులననుసరించి గార్హపత్యమునకు ప్రాధాన్యము, ఐన్ద్రీ ఋక్కునకు అంగత్వము అవగతమగుచున్నందున, శ్రుతిప్రాబల్యమును బట్టి లింగమును బాధించి, ఇన్ద్రదేవతాకమైన ఋక్కును గార్హపత్యోపస్థానములో వినియోగించవలెనని సిద్ధాన్తము. అట్టిచో మన్త్రములోని ఇన్ద్రాదిపదములకు ముఖ్యార్థమును పరిత్యజించి గౌణీలక్షణాదులచే అగ్నిరూపమైన అన్యార్థమును స్వీకరించవలసియుండును. తావన్మాత్రమున మన్త్రమునకు సహజమైన ఇన్ద్రపరత్వము బాధితము కాదని భాష్యాశయము.)* మన్త్రాధికరణములో నిర్ణయించినవిధముగ మన్త్రములకు దృష్టార్థత్వమును నిర్వహించుటకై, శతరుద్రీయముచే తత్ప్రతిపాద్యరుద్ర స్వరూపునిగ అగ్నిని స్తుతించవలె ననుటలో తాత్పర్యము కలిగియున్నది. అంతమాత్రమున శతరుద్రీయమునకు శ్రుతిలింగాదివిరుద్ధమగు అగ్నిపరత్వము సిద్ధించదు. స్వారసిక ప్రతీతిరహితమగు అర్థమునందు ప్రబలప్రమాణముచే వినియోగింపబడు మన్త్రమునకు ఏదో యొక విధముగ, లక్షణా–గౌణీ–అధ్యాహారాదుల ద్వారా ప్రకృతార్థబోధకత్వమును కల్పించినంతమాత్రమున, అది తత్పరము కాజాలదు. "గౌణం లాక్షణికం వాఽపి" అనువార్తికము ఈ యభిప్రాయముతోనే ప్రవర్తించినది.

కావుననే "ఐన్ద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే" అను శ్రుతిచే ఐన్ద్రమన్త్రమునకు గార్హపత్యాగ్న్యుపస్థానములో వినియోగము చెప్పబడినను, గార్హపత్యపరత్వము చెప్పబడలేదు.

కావుననే "పురుషాద్దక్షిణతః పురుషేణ నారాయణేన బ్రహ్మాభిష్టౌతి – సహస్రశీర్షా పురుష ఇతి" అను శతపథబ్రాహ్మణముచేతను, "ఉపాకృతవాన్దక్షిణతోఽవస్థాయ బ్రహ్మా సహస్రశీర్షా పురుష ఇతి పురుషేణ నారాయణేన పరా చానుశంసతి" అను ఆపస్తంబ సూత్రముచేతను *(పురుషమేధక్రతువులో పశువులుగా నిర్దేశింపబడిన బ్రాహ్మణ క్షత్రియాదులను స్తుతించుటలో శ్రుతిచే తాత్కాలికముగ వినియోగింపబడినంత మాత్రమున పురుషసూక్తమునకు గల సహజమైన పరమ(విరాట్)పురుష పరత్వమునకు వ్యాఘాతము కలుగనట్లే రుద్రాధ్యాయమున కూడ కలుగదని సారాంశము.*

**పురుషమేధ** *మనునది – పఞ్చాహస్సాధ్యమైన సోమయాగవిశేషము. అందు పురుష (మనుష్య)లను పర్యగ్నికరణాన్తసంస్కారములు జరిగిన పిదప దేవత నుద్దేశించి ఉత్సర్జనము (విడచివేయుట) చేయవలెనని శాస్త్రము విధించుచున్నది. కాగా – ఇతరపశువులనువలె హింసింతురనునది – (భ్రమమూలకమైన పామరజనప్రవాదము మాత్రమే)* పురుషమేధములో పశువులుగా వినియుక్తులైన పురుషులను స్తుతించుటలోను,

అట్లే – 'పురస్తాత్ప్రతీచీనం పురుషాకృతిం చినోతి పురుషశిరోఽస్యాశ్శిరో భవతి' ఇత్యాదిగ మహాగ్నిచయనములో పురుషాకృత్యుపధానమును విధించి, 'సహస్రశీర్షా పురుష ఇత్యుపసంనిహితాం పురుషేణ నారాయణేన యజమాన ఉపతిష్ఠతి' అను ఆపస్తంబ సూత్రముచే పురుషాకృత్యుపస్థానములోను,

అట్లే – **'యజేత్పురుషసూక్తేన వరుణం విశ్వరూపిణమ్'** అను శాతాతప స్మృత్యాదులచే వరుణ–కుబేరాది యాగములలోను వినియుక్తమగుచున్నను, పురుషసూక్తము – తత్పరము కాదు. ఈ విషయము విస్తృతవిచారార్హమైనది.

కావున – పలువురిని చూచుచున్నను, పలువురితో మాటలాడుచున్నను పతివ్రతయొక్క హృదయము పతియందే లగ్నమైయుండునట్లు, వివిధవచనములచే విభిన్న క్రియలలో వినియోగింపబడినను భగవతియగు రుద్రోపనిషత్తు యొక్క హృదయము సాంబశివపరబ్రహ్మమునందే సంసక్తమై యున్నది. దానిని అన్యపరముగ వ్యాఖ్యానము చేయు రామానుజాదులు – సతీమతల్లియగు సీతను స్వాయత్తము జేసికొనగోరిన రావణునివలె మహాపాపిష్ఠులే యగుదురు. ఈ విషయమింతటితో విరమింపబడుచున్నది.

## శ్రీరుద్రస్య అర్థవాదత్వశఙ్కా తత్సమాధానఞ్చ

**భాష్యమ్ –** యత్తూక్తం నమస్కారైరిష్టానిష్టప్రాప్తిపరిహారప్రార్థనాలిఙ్గైః శ్రీరుద్రస్య స్తుతిపరత్వాత్ న సర్వేశ్వరత్వసర్వాన్తర్యామిత్వాదికం తాత్త్వికం సిద్ధ్యతీతి, తత్తుచ్ఛమ్;

నమస్కారో హి నమస్కార్యోత్కర్షప్రయుక్తః, లోకే తథైవ దర్శనాత్. ఆరాధయితురారాధ-నీయోత్కర్షానుసన్ధానపూర్వకః ప్రహ్వీభావో నమస్కార ఇతి శాస్త్రకారైః నమస్కారశబ్దార్థ-నిర్వచనాచ్చ. నమస్కార్యోత్కర్షగవేషణాయాం చ శ్రుతవిశేషణసమర్పితముత్కర్షమపహా-యోత్కర్షాన్తరపరిగ్రహాయోగాత్ నమస్కారమన్త్రగతతత్త్వద్విశేషణసమర్పితః సర్వేశ్వరత్వ-సర్వాన్తర్యామిత్వాదిరూపస్తాత్త్విక ఏవ సిద్ధ్యతి. కుతస్తస్మిన్నతాత్త్వికత్వశఙ్కా?

యద్యపి ఉత్కర్షాదివ భయాదపి లోకే నమస్కారో దృశ్యతే- **'నమస్తే హరసే శోచిషే నమస్తే అస్త్వర్చిషే, అన్యన్తే అస్మత్తపన్తు హేతయః పావకోఽస్మభ్యగ్ం శివో భవ'** ఇతి చ. తథా చ పరమేశ్వరస్య భీమత్వేన భయప్రయుక్తోఽయం నమస్కార ఇత్యన్యథాసిద్ధిః శఙ్కితుం శక్యా; తథాఽపి భయప్రయుక్తోఽపి నమస్కారః శ్రుతావస్యోత్కర్షం వినా న సంభవతి. అత ఏవ **'నమస్తే హరసే శోచిష ఇత్యాహ నమస్కృత్య హి వసీయాగ్ం సముపచరన్తి'** ఇతి తన్మన్త్రబ్రాహ్మణే తన్నమస్కారస్య ఔత్సర్గికస్వవిషయోత్కర్షాపరిత్యాగో వర్ణితః.

వస్తుతో భయప్రయుక్తత్వేఽపి తన్నమస్కారస్య న క్షతిః, శ్రీరుద్రస్యానితర-సాధారణనమస్కారభూయస్త్వస్య భయభూయస్త్వప్రయుక్తతయోత్కర్షజ్ఞాపకత్వస్యా-పరిహార్యత్వాత్. భయభూయస్త్వం హి పరబ్రహ్మలిఙ్గమ్, **'భీషాస్మాద్వాతః పవతే' 'మహద్భయం వజ్రముద్యతమ్'** ఇత్యాది శ్రుతేః. అతో నమస్కారో న స్తుతిలిఙ్గమ్. ఇష్టానిష్టప్రాప్తిపరిహారప్రార్థనా తు యద్యపి స్తుతిలిఙ్గం భవతి, తథాఽపి పరమేశ్వరాదన్యత్రైవ సా తథా, న తు పరమేశ్వరే. తథా సతి పురుషసూక్తైకవాక్యతాపన్నే **'అద్భ్యస్సంభూతః'** ఇత్యుత్తరనారాయణానువాకే **'ఇష్టం మనిషాణ అముం మనిషాణ-సర్వం మనిషాణ'** ఇతి ప్రార్థనాదర్శనేన పురుషసూక్తస్యాపి స్తుతిమాత్రపరత్వాత్ తదుపనీతమమృతేశానత్వవిరాట్స్రష్టృత్వాదికమప్యతాత్పర్యమితి చోద్యే తవ కిముత్తరమ్? అతో యత్కిఞ్చిదేతదిత్యాస్తామతివిస్తరః.

**అనువాదము:** నమస్కారములతోను, ఇష్టప్రాప్తి – అనిష్టపరిహారములకు సంబంధించిన ప్రార్థనతోను సమన్వితమైన శ్రీరుద్రము స్తుతిపరముగ నున్నందున, దానివల్ల తాత్త్వికమగు సర్వేశ్వరత్వ–సర్వాన్తర్యామిత్వాదికము సిద్ధింపజాలదను కొందరి వాదము – నిస్సారము. లోకవ్యవహారమునుబట్టి, నమస్కారము. నమస్కరింపబడువాని గొప్పదనముపై ఆధారపడియుండు నని తెలియుచున్నది. ఆరాధించువానికి – ఆరాధింపబడువానియొక్క గొప్పదనమును గుర్తించుట మూలముగా గలిగెడు నమ్రభావమే నమస్కారమని – శాస్త్రకారులు నమస్కారశబ్దార్థమును నిర్వచించియున్నారు. ప్రకృతమున – నమస్కా-

ర్యోత్కర్షను గూర్చి విచారించుచో ప్రత్యక్షశ్రుతములగు విశేషణములచే బోధింప బడిన ఉత్కర్షను విడనాడి, ఇతరవిధమగు ఉత్కర్షను గ్రహించుట అనుచితముగాన నమస్కారమన్త్రములలోని ఆ యా విశేషణములచే బోధింపబడెడి – సర్వేశ్వరత్వ సర్వాన్తర్యామిత్వాదిరూపమైన ఉత్కర్ష తాత్త్వికమే యగుచున్నది. కాగా – అతాత్త్విక మను శంక కవకాశ మెక్కడ? ఐతే లోకవ్యవహారములో – నమస్కరించుట యనునది ఉత్కర్షనుబట్టి మాత్రమే కాక, భయమువల్ల గూడ సంభవించుచున్నది. శ్రుతిలోగూడ – 'నమస్తే హరసే శోచిషే...శివో భవ' అనుచో తీక్ష్ణములగు జ్వాలలతో సంతాపమును గలిగించు అగ్నికి జేయు నమస్కారము – భయప్రయుక్తమే గాని, భక్తిప్రయుక్తము కాదు. అట్లే పరమేశ్వరుడు గూడ భీముడు (భయంకరుడు) గాన అతని నుద్దేశించి చేయు నమస్కారము గూడ భయప్రయుక్తమే యగుచున్నది. కాగా – ఉత్కర్షప్రయుక్తమను వాదము *(అన్యథా సిద్ధ మనగా – చెప్పిన హేతువుచేకాక, మఱియొక హేతువుచే సిద్ధించిన దని యర్థము. ప్రకృతమున – భగవానుని నమస్కరించుట. అతని గొప్పతనము బట్టి కాక, భయంకరత్వమును బట్టి జరుగుచున్నదని భావము.)* అన్యథాసిద్ధమని – కొందరాక్షేపించవచ్చును. కాని శ్రుత్యుక్తమగు నమస్కారము భయప్రయుక్తమే యైనను నమస్కార్యునియందు ఉత్కర్షలేనపుడది సంభవించదు. కావుననే – 'నమస్తే హరసే...సముపచరన్తి' అను బ్రాహ్మణములో సహజమగు స్వవిషయోత్కర్షను విడనాడకుండుట గమనింపదగియున్నది. వస్తుస్థితిలో ఈ నమస్కారము భయప్రయుక్తమే యన్నను బాధ లేదు. శ్రీరుద్రము అనన్యసామాన్యమైన నమస్కారప్రాచుర్యము గలిగి యున్నది. ఇందుకు భయప్రాచుర్యమే నిమిత్తము. ఇది శ్రీరుద్రోత్కర్షకు జ్ఞాపక మనక తప్పదు. ఎందువల్లననగా – భయప్రాచుర్యము పరబ్రహ్మలిఙ్గము. 'భీషాస్మాద్వాతః పవతే' 'మహద్భయం వజ్రముద్యతమ్' ఇత్యాది శ్రుతులిందుకు ప్రమాణము. కాగా – నమస్కారము కేవలము స్తుతిలింగము కాదు. ఇక – ఇష్టానిష్టప్రాప్తిపరిహారప్రార్థన యందురా, అది స్తుతిలింగము కావచ్చును. ఐతే – పరమేశ్వరుడు కాక తదితరవ్యక్తుల విషయముననే అది యట్లగుట కవకాశమున్నది గాని, పరమేశ్వరవిషయమునందు గాదు. ఈ వ్యవస్థ నంగీకరించని పక్షములో – పురుషసూక్తశేషమగు **'అద్భ్యస్సంభూతః'** అను ఉత్తరనారాయణానువాకములో 'ఇష్టం మనిషాణ...' అని ఐహికాముష్మిక సర్వాభీష్టప్రార్థన కనిపించుచున్నదిగాన పురుషసూక్తము గూడ స్తుతిమాత్రపర మగుచున్నందున, తత్ప్రతిపాదితమగు అమృతేశానత్వ–విరాట్స్రష్టృత్వాదికము గూడ తాత్పర్య విషయము కాదని శంకించుచో నీవేమి సమాధానము జెప్పగలవు? కావున నిస్సారమగు నీ విషయము నింకను విస్తరింపక నింతటితో విరమింతము.

# మహాన్యాసవివరణమ్

**భాష్యమ్ –** ఇత్థం శ్రీరుద్రస్య శ్రుతిస్మృతీతిహాసపురాణప్రసిద్ధం సర్వవేదోత్తమత్వం – తత్తాత్పర్యం చ ప్రపఞ్చేన వివేచితమ్. ఇదానీం బోధయనోక్తశ్రీరుద్రమహాన్యాసో జపాదికృతాముపకారాయ సంప్రదాయేనార్థతో వివిచ్యతే – 'అథాతః పఞ్చాఙ్గరుద్రాణాం మహాన్యాసపూర్వకం జపహోమార్చనాభిషేకవిధిం వ్యాఖ్యాస్యామః' ఇతి. అత్ర పఞ్చాఙ్గరుద్రపదస్యాయమర్థః – పఞ్చ ప్రకారా అఙ్గన్యాసా యేషామ్ రుద్రాణాం తే పఞ్చాఙ్గరుద్రాః. తథా హి – **శిఖాద్యస్త్రాన్తమేకత్రింశదఙ్గన్యాసః ప్రథమః, మూర్ధాదిపాదాన్తం దశాఙ్గన్యాసః ద్వితీయః, పాదాదిమూర్ధాన్తం పఞ్చాఙ్గన్యాసః తృతీయః, గుహ్యాదిమస్తకాన్తం పఞ్చాఙ్గన్యాసః చతుర్థః, హృదయాద్యస్త్రాన్తం పఞ్చాఙ్గన్యాసః పఞ్చమః.** తత్రాద్యన్యాసం దర్శయతి – **యా తే రుద్ర ఇతి శిఖాయామ్, అస్మిన్మహత్యర్ణవ ఇతి శిరసి, సహస్రాణీతి లలాటే, హగ్ంసశ్శుచిషదితి భ్రువోర్మధ్యే, త్ర్యంబకం యజామహ ఇతి నేత్రయోః, నమస్స్రుత్యాయ చేతి కర్ణయోః, మానస్తోక ఇతి నాసికాయామ్, అవతత్యేతి ముఖే, నీలగ్రీవౌ ద్వౌ కణ్ఠే, నమస్తే అస్త్వాయుధాయేతి బాహ్వోః, యా తే హేతురిత్యుపబాహ్వోః, యే తీర్థానీతి హస్తయోః, సద్యోజాతమితి పఞ్చానువాకాన్ పఞ్చస్వఙ్గులీషు, నమో వః కిరికేభ్య ఇతి హృదయే, నమో గణేభ్య ఇతి పృష్ఠే, నమో హిరణ్యబాహవ ఇతి పార్శ్వయోః, విజ్యం ధనురితి జఠరే, హిరణ్యగర్భ ఇతి నాభౌ, మీఢుష్టమేతి కట్యామ్, యే భూతానామితి గుహ్యే, యే అన్నేష్విత్యణ్డయోః, సశిరా జాతవేదా ఇత్యపానే, మా నో మహాన్తమిత్యూర్వోః, ఏష తే రుద్ర ఇతి జాన్వోః, సగ్ంసృష్టజిదితి జఙ్ఘయోః, విశ్వం భూతమితి గుల్ఫయోః, యే పథామితి పాదయోః, అధ్యవోచదితి కవచమ్, నమో బిల్మిన ఇత్యుపకవచమ్, నమో అస్తు నీలగ్రీవాయేతి తృతీయనేత్రమ్, ప్రముఞ్చ ధన్వన ఇత్యస్త్రమ్ య ఏతావన్తశ్చేతి దిగ్బన్ధః'** ఇతి.

అస్యార్థః – **'యా తే రుద్ర శివా తనూః** ఇతి మన్త్రముక్త్వా, శిఖాయై నమః ఇత్యుచ్చార్య శిఖాదీన్ స్పృశేత్. నీలగ్రీవౌ ద్వౌ కణ్ఠ ఇత్యత్ర కణ్ఠస్యోత్తరదక్షిణభాగయోః క్రమేణ నీలగ్రీవమన్త్రద్వయన్యాసః. యా తే హేతిరిత్యుపబాహ్వోరిత్యత్ర ఉపబాహుశబ్దేన మణిబన్ధాదుపరిభాగావుచ్యేతే. సద్యోజాతమితి పఞ్చానువాకాన్ పఞ్చస్వఙ్గులీష్విత్యత్ర సద్యోజాతమన్త్రముక్త్వాఙ్గుష్ఠాభ్యాం నమ ఇత్యుచ్చార్య అఙ్గుష్ఠయోర్న్యసేత్. ఏవం తర్జన్యోర్వామదేవం మధ్యమయోరఘోరమ్ అనామికయోస్తత్పురుషం కనిష్ఠికయోరీశానం చ న్యసేదిత్యర్థః. **'సశిరా జాతవేదా'** ఇతి – సశిరా జాతవేదా అక్షరం పదమ్, వేదానాం

సారముద్ధృతమ్, జాతవేదసే శిరసే స్వాహా - ఇత్యయం మన్త్రః సశిరా జాతవేదా ఇత్యనేనోచ్యత ఇత్యేకః సంప్రదాయః. **'జాతవేదసే సోమమరాతీయతః' 'అగ్నే త్వం పారయ' 'అగ్నే నయ సుపథా రాయే' 'విశ్వాని నో దుర్గహా' 'పృతనాజితగ్ం సహ'** ఇత్యేతే షణ్మన్త్రాః, 'సశిరా జాతవేదా' ఇత్యనేన గృహ్యన్తే ఇత్యపరః సంప్రదాయః. ఆచారతో వ్యవస్థా. అధ్యవోచదితి మన్త్రేణ కవచాయ హుమితి న్యసేత్. నమో బిల్మినే చేత్యనేనోపకవచాయ హుమితి న్యసేత్. నమో అస్తు నీలగ్రీవాయేత్యనేన తృతీయనేత్రాయ నమః ఇతి న్యసేత్. ప్రముఞ్చ ధన్వన ఇత్యనేనాస్త్రాయ ఫడితి న్యసేత్. సోఽయం శిఖాద్యస్త్రాన్తో దిగ్బన్ధసహితః ప్రథమో న్యాసః.

**అనువాదము:** ఈ విధముగ శ్రుతిస్మృతిపురాణప్రసిద్ధి ననుసరించి శ్రీరుద్రము సర్వవేదోత్తమ మనియు, అద్దానికి అమృతత్వప్రాప్తియందే తాత్పర్యమనియు సవిస్తరముగ నిరూపింపబడినది. ఇప్పుడిక బోధాయనోక్తమగు శ్రీరుద్రమహాన్యాసమునకు - జపాదుల నొనర్చువారి కుపకరించుటకై సంప్రదాయసిద్ధమైన యర్థము వివరింపబడుచున్నది -

'అథాతః పఞ్చాఙ్గరుద్రాణాం ... వ్యాఖ్యాస్యామః' ఇందలి పఞ్చాఙ్గరుద్ర శబ్దమునకు **'పఞ్చ ప్రకారాః అఙ్గన్యాసాః యేషాం రుద్రాణం తే పఞ్చాఙ్గరుద్రాః.** అను వ్యుత్పత్తిచే, ఐదు విధములైన అఙ్గన్యాసములుగల రుద్రులు- అని యర్థము' ఎట్లనగా-

**శిఖాది అస్త్రాన్తము ఏకత్రింశదఙ్గన్యాసము మొదటిది,**
**మూర్ధాదిపాదాన్తము దశాఙ్గన్యాసము రెండవది,**
**పాదాదిమూర్ధాన్తము పఞ్చాఙ్గన్యాసము మూడవది,**
**గుహ్యాదిమస్తకాన్తము పఞ్చాఙ్గన్యాసము నాల్గవది,**
**హృదయాది అస్త్రాన్తము పఞ్చాఙ్గన్యాసము ఐదవది.**

వానిలో మొదటిన్యాసము - 'యా తే రుద్రేతి శిఖాయామ్ ... య ఏతావన్తశ్చేతి దిగ్బన్ధః' అనునది. దీని యర్థమేమనగా - 'యా తే రుద్ర శివా తనూః' అను మన్త్రము నుచ్చరించి, 'శిఖాయై నమః' అని పలికి శిఖను స్పృశించవలెను. ఇట్లే 'అస్మిన్మహతి' ఇత్యాది వాక్యములను గూడ యథోచితముగ నన్వయించుకొనవలెను. 'నీలగ్రీవౌ ద్వౌ కణ్ఠే' అనుచో కంఠమునకు ఉత్తరదక్షిణభాగములలో క్రమముగ నీలగ్రీవమన్త్రద్వయముతో న్యాస మొనర్చవలెను. 'యా తే హేతిరిత్యుపబాహ్వోః' అను వాక్యములో ఉపబాహుశబ్దముచే మణికట్టుకు పైభాగములు వివక్షితము లగుచున్నవి. 'సద్యోజాతం' ఇత్యాది పఞ్చానువాకాన్ పఞ్చస్వఙ్గులీషు' అనుచో - సద్యోజాతమన్త్రమును జెప్పి 'అఙ్గుష్ఠాభ్యాం నమః' అని

యుచ్చరించి అఙ్గుష్ఠములలో న్యాసముజేయవలెను. ఇట్లే తర్జనులలో వామదేవమన్త్రమును, మధ్యమలలో అఘోరమన్త్రమును, అనామికలలో తత్పురుషమన్త్రమును, కనిష్ఠికలలో ఈశానమన్త్రమును న్యసించవలె నని యర్థము. 'సశిరా జాతవేదా ఇత్యపానే' అను వాక్యములో – 'సశిరా జాతవేదాః ... శిరసే స్వాహా' అను నొక్క మన్త్రమునే గ్రహించవలె నని యొక సంప్రదాయము. 'జాతవేదసే' 'అగ్నే త్వం పారయ' 'అగ్నే నయ సుపథా' 'విశ్వాని నో దుర్గహా' 'పృతనాజితగ్ం సహమానం' అను (వానితో సహా మొత్తము) ఆరు మన్త్రములను గ్రహించవలెనని మరియొక సంప్రదాయము. వీనిలో, ఆచారము ననుసరించి ఏదో యొక సంప్రదాయము గ్రాహ్యము. 'అధ్యవోచత్' అను మన్త్రముతో 'కవచాయ హుం' అని న్యసించవలెను. 'నమో బిల్మినే చ' అను మన్త్రముతో 'ఉప కవచాయ హుం' అనియు, 'నమో అస్తు నీలగ్రీవాయ' అను మన్త్రముతో 'తృతీయ నేత్రాయ నమః' అనియు న్యసించవలెను. 'ప్రముఞ్చ ధన్వనస్త్వం' అను మన్త్రముతో 'అస్త్రాయ ఫట్' అని న్యసించవలెను. ఇది శిఖాది – అస్త్రాన్తమైన దిగ్బంధసహితమగు మొదటి న్యాసము.

**భాష్యమ్ –** అథ ద్వితీయన్యాసమహ – **'ఓం నమో భగవతే రుద్రాయ'** ఇతి నమస్కారం న్యసేత్.

> **ఓఙ్కారం మూర్ధ్ని విన్యస్య నకారం నాసికాగ్రతః।**
> **మోకారం తు లలాటే స్యాద్భకారం ముఖమధ్యతః।**
> **గకారం కణ్ఠదేశే చ వకారం హృది విన్యసేత్।**
> **తేకారం దక్షిణే హస్తే రుకారం వామతో న్యసేత్।**
> **ద్రాకారం నాభిదేశే తు యకారం పాదయోర్న్యసేత్॥** – ఇతి.

అస్యార్థః – పూర్వోక్తదిగ్బన్ధనసహితప్రథమన్యాసానన్తరమ్ **'ఓం నమో భగవతే రుద్రాయ'** ఇతి మన్త్రముచ్చార్య నమస్కృత్య, 'ఓం మూర్ధ్నే నమః' ఇతి మూర్ధ్ని, 'నం నాసికాయై నమః' ఇతి నాసికాయామ్, 'మోం లలాటాయ నమః' ఇతి లలాటే, 'భం ముఖాయ నమః, ఇతి ముఖే, 'గం కణ్ఠాయ నమః' ఇతి కణ్ఠే, 'వం హృదయాయ నమః' ఇతి హృదయే, 'తేం దక్షిణహస్తాయ నమః' ఇతి దక్షిణహస్తే, 'రుం వామహస్తాయ నమః' ఇతి వామహస్తే, 'ద్రాం నాభ్యై నమః' ఇతి నాభౌ, 'యం పాదాభ్యాం నమః' ఇతి పాదయోః న్యసేదితి. సోఽయం ద్వితీయన్యాసః.

**అనువాదము:** రెండవ న్యాసమును చెప్పుచున్నాడు – 'ఓం నమో భగవతే రుద్రాయ'

అను మన్త్రాక్షరముల నాయా స్థానములయందు నమస్కారసహితముగ న్యసించవలెను' ఎట్లనగా – 'ఓఙ్కారం మూర్ధ్ని విన్యస్య ... పాదయోర్న్యసేత్' దీని యర్థమేమనగా – పూర్వోక్తమైన దిగ్బంధసహితమగు ప్రథమన్యాసమునకు పిమ్మట 'ఓం నమో భగవతే రుద్రాయ' అను మన్త్రము నుచ్చరించి నమస్కరించి 'ఓం మూర్ధ్నే నమః' అని మూర్ధ (తల) యందు న్యసించవలెను. ఇట్లే క్రమముగ 'నం నాసికాయై నమః' అని నాసికయందును, 'మోం లలాటాయ నమః' అని లలాటమునందును, 'భం ముఖాయ నమః' అని ముఖమునందును, 'గం కణ్ఠాయ నమః' అని కంఠమునందును, 'వం హృదయాయ నమః' అని హృదయమునందును, 'తేం దక్షిణహస్తాయ నమః' అని దక్షిణహస్తమునందును, 'రుం వామహస్తాయ నమః' అని వామహస్తమునందును. 'ద్రాం నాభ్యై నమః' అని నాభియందును, 'యం పాదాభ్యాం నమః' అని పాదములయందును న్యసించవలెను. ఇది ద్వితీయన్యాసము.

**భాష్యమ్** – అథ తృతీయన్యాసమాహ –

> **సద్యం** చ పాదయోర్న్యస్య **వామం** న్యస్యోరుమధ్యతః।
> **అఘోరం** హృది విన్యస్య ముఖే **తత్పురుషం** న్యసేత్।
> **ఈశానం** మూర్ధ్ని విన్యస్య హంసో నామ సదాశివః।
> ఏవం న్యాసవిధిం కృత్వా తతస్సంపుటమారభేత్॥

'త్రాతారమిన్ద్రం' 'త్వం నో అగ్నే' 'సుగం నః పన్థామ్' 'అసున్వన్తమ్' 'తత్త్వాయామి' ఆనో–నియుద్భిః' 'వయం సోమ' 'తమీశానమ్' 'అస్మే రుద్రా' 'స్యోనా పృథివీ' ఇత్యేతత్సంపుటమిన్ద్రాదిదిక్షు విన్యస్య, ఏవమేవాత్మని రౌద్రీకరణం కృత్వా త్వగస్థిగతైః సర్వపాపైః ప్రముచ్యతే, సర్వభూతేష్వపరాజితో భవతి, తతో భూతప్రేతపిశాచ–బ్రహ్మరాక్షసయక్షయమదూతశాకినీడాకినీసర్పశ్వాపదతస్కరాద్యుపద్రవాద్యుపఘాతాః సర్వే గ్రహా జ్వలన్తం పశ్యన్తు' ఇతి.

అస్యార్థః – సద్యోజాతమన్త్రముచ్చార్య 'పద్భ్యాం నమ' ఇత్యుచ్చార్య పాదౌ స్పృశేత్. ఏవం వామదేవాదిభిరూర్వాదిమూర్ధాన్తం న్యసేత్. అనన్తరం హంస హంసేత్యుక్త్వా మూర్ధానం స్పృశేత్. హంసో నామ సదాశివ ఏవ. తథా చ ఏవం కుర్వన్ హంసో నామ హంస ఇతి ప్రసిద్ధః సదాశివ ఏవ భవతీతి. ఏతదనన్తరకృత్యమాహ – **'తతః సంపుటమారభేత్'** ఇతి. సంపుటశబ్దవాచ్యామఞ్జలిముద్రాం విధాయ, తాం ప్రథమం ప్రాఙ్ముఖీం కృత్వా, **'త్రాతారమిన్ద్రం'** ఇతి మన్త్రముచ్చార్య, 'ఇన్ద్రాయ నమ' ఇతి బ్రూయాత్.

తత ఆగ్నేయాభిముఖీం కృత్వా 'త్వం నో అగ్నే' ఇతి మన్త్రముచ్చార్య, అగ్నయే నమ ఇతి బ్రూయాత్. ఏవం యామ్యాదీశానాన్తం కుర్యాత్. తదనన్తరం రౌద్రీకరణం కుర్వీత. తచ్చ ద్వివిధమ్ – 'విభూరసి ప్రవాహణః' ఇత్యాది 'అహరసి బుధ్నియః' ఇత్యన్యేషు సర్వేష్వపి మన్త్రేషు 'రౌద్రేణానీకేన పాహి మాగ్నే పిపృహి మా మా మా హిగ్ంసీః' ఇత్యనుషఙ్గేణానుష్ఠీయమానం రౌద్రీకరణమేకమ్. అన్యత్తు – **'ప్రజననే బ్రహ్మా తిష్ఠతు ఇత్యారభ్య – సర్వతోఽగ్నిర్జ్వాలామాలాపరివృతాస్తిష్ఠన్తు, మాం రక్షన్తు'** ఇత్యేన్తేన వక్ష్యమాణరీత్యా స్వశరీరే దేవతాస్థాపనరూపం రౌద్రీకరణమ్, యథాసంప్రదాయ–మాచరణీయమ్. తదేతస్య సర్వస్య ఫలమాహ – **'త్వగస్థిగతైః సర్వపాపైః ప్రముచ్యతే'** ఇత్యాదినా. సోఽయం తృతీయో న్యాసః.

**అనువాదము:** మూడవ న్యాసము – 'సద్యం చ పాదయోర్న్యస్య ... జ్వలన్తం పశ్యన్తు.' దీని యర్థమేమనగా – సద్యోజాతమన్త్రమును చెప్పి, 'పద్భ్యాం నమః' అని పలికి పాదములను స్పృశించవలెను. ఇట్లే వామదేవాది మన్త్రములతో ఊరువు (తొడ)లు మొదలు శిరస్సువరకు న్యాసమును జేయవలెను. పిమ్మట 'హంసహంస' అను మన్త్రముతో శిరస్సును స్పృశించవలెను. హంస యనగా సదాశివుడే కాగా – ఇట్లుచేయువాడు 'హంస'గా ప్రసిద్ధుడైన సదాశివుడే యగుచున్నాడు. తదనన్తరకర్తవ్యమును 'తతస్సంపుట మారభేత్' ఇత్యాదిగా చెప్పుచున్నాడు. సంపుట మనగా అంజలి యని యర్థము. అంజలిని ఘటించి, మొదట దానిని ప్రాఙ్ముఖముగా జేసి 'త్రాతరమిన్ద్రం' అను మన్త్రము నుచ్చరించి 'ఇన్ద్రాయ నమః' అని పలుకవలెను. పిమ్మట అంజలిని ఆగ్నేయాభిముఖ మొనర్చి 'త్వం నో అగ్నే' అను మన్త్రము నుచ్చరించి 'అగ్నయే నమః' అని పలుకవలెను. ఇట్లే దక్షిణము మొదలు ఈశానదిక్పర్యంతము చేయవలెను. అటుపైన రౌద్రీకరణము నాచరించవలెను. అది రెండు విధములై యున్నది. **'విభూరసి ప్రవాహణః'** మొదలు 'అహిరసి బుధ్నియః' వరకు గల అన్ని మన్త్రములలో 'రౌద్రేణానీకేన పాహి మాగ్నే పిపృహి మా మా మా హిగ్ంసీః' అను వాక్యశేషమును అనుషక్తముగావించి (జోడించి) అనుష్ఠించు రౌద్రీకరణమొకటి. 'ప్రజననే బ్రహ్మా తిష్ఠతు' అని యారంభించి 'సర్వతోఽగ్నిర్జ్వాలామాలాపరివృతాస్తిష్ఠన్తు, మాం రక్షన్తు' అను వరకు గల వాక్యములతో చెప్పబోవురీతిని స్వశరీరమునందు దేవతాస్థాపనరూపముగ జేయునది మరియొకటి. దీనిని తమ తమ సంప్రదాయము ననుసరించి యాచరించునది. 'త్వగస్థిగతైస్సర్వపాపైః ప్రముచ్యతే...' ఇత్యాది వాక్యజాతము దీనికంతటికి ఫలమునుచెప్పుచున్నది.

**భాష్యమ్ –** అథ చతుర్థన్యాసమాహ – 'మనోజ్యోతిరబోధ్యగ్నిరగ్నిర్మూర్ధా మూర్ధానం మర్మాణి తే జాతవేదా ఇతి గుహ్యనాభిహృదయకణ్ఠముఖశిరాంస్యభిమన్త్ర్యాత్మరక్షా కర్తవ్యా' ఇతి. అస్యార్థః – మనో జ్యోతిరితి మన్త్రముచ్చార్య, గుహ్యాయ నమ ఇత్యుక్త్వా గుహ్యం స్పృశేత్. ఏవమబోధ్యగ్నిరిత్యాదిభిః **'నాభ్యై నమః'** ఇత్యుక్త్వా నాభిహృదయకణ్ఠముఖ–శిరాంసి స్పృశేత్. ఇదమేవ గుహ్యాద్యభిమన్త్రణమాత్మరక్షేతి వ్యపదిశ్యతే. సోఽయం చతుర్థో న్యాసః.

**అనువాదము:** నాల్గవ న్యాసము – 'మనో జ్యోతిరబోధ్యగ్నిః ... ఆత్మరక్షా కర్తవ్యా.' దీని యర్థమిది – 'మనో జ్యోతిః' అను మన్త్రము నుచ్చరించి, 'గుహ్యాయ నమః' అని పలికి గుహ్యాఙ్గమును స్పృశించవలెను. ఇట్లే – 'అబోధ్యగ్నిః' ఇత్యాదిమన్త్రముల నుచ్చరించి, 'నాభ్యై నమః' ఇత్యాదివాక్యములను పలుకుచు క్రమముగ నాభి–హృదయ–కంఠ–ముఖ–శిరస్సులను స్పృశించవలెను. ఈ విధముగ చేయు గుహ్యాద్యభిమన్త్రణమే 'ఆత్మరక్ష' యనబడుచున్నది.

**భాష్యమ్ –** అథ పఞ్చమన్యాసమాహ – 'శివసఙ్కల్పం హృదయమ్, పురుషసూక్తం శిర, ఉత్తరనారాయణం శిఖా, అప్రతిరథం కవచమ్, ప్రతిపూరుషమితి నేత్రమ్, శతరుద్రీయ–మిత్యస్త్రమ్, భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః' ఇతి. అస్యార్థః – **'యేనేదం భూతం భువనం భవిష్యత్'** ఇత్యాది షట్త్రింశన్మన్త్రాత్మకం శివసంకల్పసూక్తం పఠిత్వా **'హృదయాయ నమః'** ఇతి హృదయే న్యసేత్. పురుషసూక్తం పఠిత్వా శిరసే స్వాహేతి శిరసి విన్యసేత్. **'ప్రతిపూరుషమేకకపాలాన్నిర్వపతి'** ఇత్యనువాకః, **'జాతా ఏవ ప్రజా రుద్రాన్నిరవదయతే'** ఇతి తద్బ్రాహ్మణానువాకశ్చ ప్రతిపూరుషమ్, తత్పఠిత్వా **'నేత్రత్రయాయ వౌషట్'** ఇతి నేత్రత్రయం స్పృశేత్.

'త్వమగ్నే రుద్ర' ఇత్యనువాకః, తథా **'దేవా దేవేషు శ్రయధ్వమ్'** ఇత్యనువాకశ్చ శతరుద్రీయమ్. యద్యపి **'త్వమగ్నే రుద్ర'** ఇత్యత్ర న ప్రాగుక్తశతరుద్రీయప్రవృత్తినిమిత్తమ్. తథాఽపి విశ్వదేవదేవత్యస్య **'విశ్వేదేవస్య నేతుః'** ఇతి మన్త్రస్య **'ద్యుమ్నం వృణీత పుష్యస ఇత్యాహ పౌష్ణేతేన'** ఇతి పౌష్ణత్వవత్, **'ఉద్బుధ్యస్వాగ్నే'** ఇతి మన్త్రస్య బుధప్రాతిపదిక–యోగమాత్రాత్ బుధదైవత్యత్వవత్, **'శం నో దేవీ'** ఇత్యాదేః శనిప్రాతిపదికావయవా–చ్ఛనిదైవత్యత్వవచ్చ, అగ్నిదైవత్యస్యాఽపి **'త్వమగ్నే రుద్ర'** ఇత్యస్య రుద్రపదయోగమాత్రా–చ్ఛతరుద్రీయత్వం మన్యతే. వస్తుతస్తు **'త్వమగ్నే రుద్ర'** ఇత్యనువాకప్రతిపాద్యస్యాగ్నేః శతరుద్రాత్మనా స్తుతిరితి తస్య శతరుద్రీయత్వవ్యపదేశః. **'దేవా దేవేషు'** ఇత్యనువాకస్య

**'దేవాస్త్రిరేకాదశాస్త్రిస్త్రయస్త్రిగ్ంశాః'** ఇతి శతరుద్రప్రతిపాదనేన తత్ర కిఞ్చిదవయవార్థాను-గమాచ్ఛతరుద్రీయత్వం ద్రష్టవ్యమ్. తావేతావనువాకౌ పఠిత్వా **అస్త్రాయ** ఫడితి న్యసేత్. సోఽయం పఞ్చమో న్యాసః.

**అనువాదము:** ఐదవ న్యాసము – 'శివసంకల్పం హృదయం ... దిగ్బన్ధః' దీని యర్థమేమనగా – 'యేనేదం భూతం భువనం భవిష్యత్' మొదలు ముప్పదియారు మన్త్రములుగా నున్న శివసంకల్పసూక్తమును పఠించి **'హృదయాయ నమః'** అని పలికి హృదయమున న్యసించవలెను. 'పురుషసూక్తమును పఠించి, 'శిరసే స్వాహా' అని పలికి శిరస్సును న్యసించవలెను. 'ప్రతిపూరుషమేకకపాలాన్నిర్వపత్యేకమతిరిక్తమ్' అను (తై.సం. 1–8–6) సంహితానువాకము, 'ప్రతిపూరుష...జాతా ఏవ ప్రజా రుద్రాన్ని-రవదయతే' అను (తై.బ్రా. 1–6–10) తద్బ్రాహ్మణానువాకమును 'ప్రతిపూరుష' మనబడుచున్నది. దానిని బఠించి, 'నేత్రత్రయాయ వౌషట్' అని పలికి నేత్రత్రయమును స్పృశించవలెను. 'త్వమగ్నే రుద్రః' అను (1–3–4) సంహితానువాకము, అట్లే 'త్వమగ్నే... దేవాదేవేషు శ్రయధ్వమ్' అను (1–11–2) బ్రాహ్మణానువాకమును 'శతరుద్రీయ' మనబడుచున్నది. ఐతే– 'త్వమగ్నే రుద్రః' అను అనువాకము నందు శతరుద్రీయపదము ప్రవర్తించుటకు దగిన నిమిత్తము లేదు. ఐనను విశ్వదేవదేవత్యమగు 'విశ్వేదేవస్య నేతుః' అను మన్త్రమునకు 'ద్యుమ్నం వృణీత పుష్యస ఇత్యాహ పౌష్ణేతేన' అను బ్రాహ్మణవాక్యముచే పూషదేవత్యత్వము చెప్పబడినట్లును, 'ఉద్బుధ్యస్వాగ్నే' అను మన్త్రమును బుధప్రాతిపదిక గలిగియున్నమాత్రమున బుధగ్రహారాధనములో వినియోగించినట్లును, 'శన్నో దేవీః' అను మన్త్రమునకు శనిప్రాతిపదికావయవ (శకార)యోగముచే శని దేవత్యత్వమును స్వీకరించినట్లును, 'త్వమగ్నే రుద్రః' అను అనువాకము అగ్ని దైవత్యమైనను, రుద్రపద సంబంధమాత్రమున శతరుద్రీయముగా స్వీకరింపబడుచున్నది. వస్తుస్థితిలో – త్వమగ్నే రుద్రః అను అనువాకముచే ప్రతిపాదింపబడు అగ్నిని శతరుద్రాత్మకునిగా స్తుతించుట – ఇచట వివక్షితము. కాన నీ యనువాకము శతరుద్రీయముగా నిర్దేశింపబడినది. 'దేవదేవేషు' అను అనువాకమునందు 'దేవాస్త్రిరేకాదశాస్త్రిస్త్రయస్త్రిగ్ంశాః' అని శతరుద్ర ప్రతిపాదనము చేయబడుటచే అవయవార్థము సైత మొకింత అనుగతమైయుండుటనుబట్టి గూడ శతరుద్రీయత్వము సిద్ధించుచున్నది. ఈ రెండనువాకములను పఠించి 'అస్త్రాయ ఫట్' అని న్యసించవలెను. *(ఇచట శతరుద్రీయపదముచే గౌణార్థము ననుసరించి 'త్వమగ్నే రుద్రః అను అనువాకమును గ్రహించుటకన్న, ముఖ్యార్థము ననుసరించి 'నమస్తే రుద్ర' అను ప్రశ్నను గ్రహించుటచే యుక్తమని – కొందరాధునిక పండితుల యభిప్రాయము.)*

**భాష్యమ్ –** అథ పఞ్చాఙ్గన్యాసానన్తరకృత్యమాహ 'పఞ్చాఙ్గం సకృజ్జపేదష్టాఙ్గం ప్రణమ్య' ఇతి। సద్యోజాతాదిరూపపఞ్చాఙ్గం సకృజ్జపేత్; అథాష్టాఙ్గకం ప్రణామం కుర్యాత్। తానేవాష్టమన్త్రానాహ – **'హిరణ్యగర్భః' 'యః ప్రాణతః' 'బ్రహ్మజజ్ఞానం' 'మహీ ద్యౌః' 'ఉపశ్వాసయ' 'అగ్నే నయ' 'యా తే అగ్నే', 'ఇమం యమప్రస్తరమ్'** ఇత్యష్టాఙ్గం ప్రణమ్య ఇతి. ఏతేషాం మన్త్రాణాం పాఠమాత్రేణ నిర్వృత్తః ప్రణామ ఇత్యేకః పక్షః. ఏభిర్మన్త్రైః సాష్టాఙ్గం దణ్డవత్ప్రణామ ఇత్యపరః పక్షః. తదనన్తరకృత్యమాహ – **అథాత్మానం శ్రీరుద్రరూపం ధ్యాయేత్ –**

**శుద్ధస్ఫటికసఙ్కాశం త్రిణేత్రం పఞ్చవక్త్రకమ్।**
**గఙ్గాధరం దశభుజం సర్వాభరణభూషితమ్॥**

**నీలగ్రీవం శశాఙ్కాఙ్కం నాగయజ్ఞోపవీతినమ్।**
**వ్యాఘ్రచర్మోత్తరీయం చ వరేణ్యమభయప్రదమ్॥**

**కమణ్డల్వక్షసూత్రాద్యైరన్వితం శూలపాణినమ్।**
**జ్వలన్తం పిఙ్గలజటం శిఖాముద్యోతకారిణమ్॥**

**అమృతేనాప్లుతం హృష్టముమాదేహార్ధధారిణమ్।**
**దివ్యసింహాసనాసీనం దివ్యభోగసమన్వితమ్॥**

**దిగ్దేవతాసమాయుక్తం సురాసురనమస్కృతమ్।**
**నిత్యం చ శాశ్వతం శుద్ధం ధ్రువమక్షరమవ్యయమ్॥**

**సర్వవ్యాపినమీశానం రుద్రం వై విశ్వరూపిణమ్।**
**ఏవం ధ్యాత్వా ద్విజః సమ్యక్తతో యజనమారభేత్॥** ఇతి.

అభిషేకవిధివ్యాఖ్యామాహ – 'అథాతో రుద్రస్నానార్చనాభిషేకవిధిం వ్యాఖ్యాస్యామః. ఆదిత ఏవ తీర్థే స్నాత్వోదేత్యాహతం వాసః పరిధాయ శుచిః ప్రయతో బ్రహ్మచారీ శుక్లవాసాః ఈశానస్య ప్రతికృతిం కృత్వా తస్య దక్షిణతః ప్రత్యగ్దేశే తన్ముఖః స్థిత్వా ఆత్మని దేవతాః స్థాపయేత్ – ప్రజననే బ్రహ్మా తిష్ఠతు, పాదయోర్విష్ణుస్తిష్ఠతు, హృదయే శివస్తిష్ఠతు, ఉదరే పృథివీ తిష్ఠతు, జఠరే అగ్నిస్తిష్ఠతు, కణ్ఠే వసవస్తిష్ఠన్తు, వక్త్రే సరస్వతీ తిష్ఠతు, నాసికయోర్వాయుస్తిష్ఠతు, నయనయోశ్చన్ద్రాదిత్యౌ తిష్ఠేతామ్, కర్ణయోరశ్వినౌ తిష్ఠేతామ్, లలాటే రుద్రాస్తిష్ఠన్తు, పృష్ఠే పినాకీ తిష్ఠతు, పృష్ఠతశ్శూలీ తిష్ఠతు, పార్శ్వయోః శివాశఙ్కరౌ తిష్ఠేతామ్, సర్వతో వాయుస్తిష్ఠతు, తతో బహిః సర్వతోఽగ్నిర్జ్వాలామాలాపరివృతస్తిష్ఠతు,

సర్వేష్వఙ్గేషు సర్వా దేవతాస్తిష్ఠన్తు మాం రక్షన్తు. **'అగ్నిర్మే వాచి శ్రితః'** ఇతి యథాలిఙ్గమఙ్గాని సంస్పృశ్యాత్మానం గన్ధపుష్పధూపదీపనైవేద్యైర్మానసైరారాధయేత్. అథైనం ప్రసాదయేత్–

**ఆరాధితో మనుష్యైస్త్వం సిద్ధైర్దేవాసురాదిభిః।**
**ఆరాధయామి భక్త్యా త్వాం మాం గృహాణ మహేశ్వర॥** ఇతి. త్ర్యమ్బకమితి చ.

**అనువాదము:** పఞ్చాఙ్గన్యాసానన్తరము చేయవలసిన దానినిట్లు చెప్పుచున్నాడు. 'పఞ్చాఙ్గం సకృజ్జపే దృష్టాఙ్గం ప్రణమ్య' సద్యోజాతాదిమన్త్రపఞ్చకరూపమగు పఞ్చాఙ్గము నొకమారు జపించి, అష్టాఙ్గప్రణామమాచరించవలెను. ఇచట– 'హిరణ్యగర్భః' 'యః ప్రాణతః' 'బ్రహ్మజజ్ఞానం' 'మహీ ద్యౌః' 'ఉపశ్వాసయ' 'అగ్నే నయ' 'యా తే అగ్నే' 'ఇమం యమప్రస్తరమ్' అనునవి అష్టాఙ్గమన్త్రములు వీనిని పఠించుటచేతనే అష్టాఙ్గప్రణామము సిద్ధించునని యొక పక్షము. మన్త్రోచ్చారణపూర్వకముగ దండవత్ప్రణామ మాచరించవలెనని మరియొక పక్షము. పిమ్మట చేయదగుదాని నిట్లు చెప్పుచున్నాడు– 'అథాత్మానం శ్రీరుద్రరూపం ధ్యాయేత్ ... తతో యజనమారభేత్' అనగా శుద్ధస్ఫటిక సంకాశ–త్రిణేత్ర–పంచవక్త్రత్వాది లక్షణములతో గూడిన శ్రీరుద్రస్వరూపునిగ తనను ధ్యానించి (భావించి) పూజ నారంభించవలె నని యర్థము. అనన్తరము అభిషేకవిధిని వివరించుచున్నాడు– 'అథాతో రుద్రస్నానార్చనాభిషేకవిధిం వ్యాఖ్యాస్యామః ... త్ర్యమ్బకమితి చ' అనగా– పుణ్యతీర్థమున స్నాన మొనర్చి ధౌతవస్త్రముల ధరించి శుచియై బ్రహ్మచారియై భగవానుని మూర్తికి అభిముఖముగ తద్దక్షిణభాగమున నిలచి, 'ప్రజననే బ్రహ్మా తిష్ఠతు' ఇత్యాది మన్త్రములతో తన అవయవములయం దా యా దేవతల నావహింపజేయవలెను. పిమ్మట 'అగ్నిర్మే వాచి శ్రితః' ఇత్యాది మన్త్రములతో మన్త్రలిఙ్గానుసారము తన యఙ్గములను స్పృశించి, ఆత్మస్వరూపమును మానసికములగు గన్ధపుష్పధూపదీపనైవేద్యములతో ఆరాధించి, 'ఆరాధితో మనుష్యైస్త్వం' 'త్ర్యంబకం' అను మన్త్రములచే ప్రసన్నుని జేసికొనవలెను.

**భాష్యమ్ –** ఏవమాత్మపూజానన్తరం బాహ్యపూజాప్రకారమాహ – **ఆత్వా వహన్తు హరయః సచేతసః శ్వేతైరశ్వైః సహ కేతుమద్భిః వాతాజితైర్బలవద్భిర్మనోజవైరాయాహి శీఘ్రం మమ హవ్యాయ శర్వోమ్'** ఇత్యావాహయతి. స్థాపితే తు నావాహనమ్. (భాష్యోక్తమగు సద్యోజాతాది మన్త్రపూజావిధానము ఆంధ్రదేశయాచారమునకు ఇంచుక భిన్నముగ నున్నది. స్వస్వసంప్రదాయానుసారము పూజించుట సమంజసము.) అథాసనం దదాతి **'సద్యోజాత'**మితి. 'భవే భవే' ఇతి పాద్యమ్. **'భవోద్భవాయ నమః'** ఇత్యర్ఘ్యమ్. **'వామదేవాయ నమః'** ఇత్యాచమనీయమ్.

అథైనం స్నాపయతి – ఆపో హి ష్ఠాదిభిస్తిసృభిః, హిరణ్యవర్ణా ఇతి చతసృభిః, పవమానః సువర్జన ఇత్యనువాకేన మార్జయిత్వా, 'సర్వో వై రుద్రః' 'కయా నశ్చిత్రః' 'ఆపో వా ఇదగ్ం సర్వమ్' ఇత్యేతైశ్చ. **'వామదేవాయ నమః'** ఇతి వస్త్రమ్. **'జ్యేష్ఠాయ నమః'** ఇత్యుపవీతమ్. **'రుద్రాయ నమః'** ఇత్యాచమనీయమ్. **ప్రణవేన** భూషణమ్. **'కాలాయ నమః'** ఇతి గన్ధమ్. **'కలవికరణాయ నమః'** ఇత్యక్షతమ్. **'బలవికరణాయ నమః'** ఇతి పుష్పమ్. **'బలప్రమథనాయ నమః'** ఇతి ధూపమ్. **'సర్వభూతదమనాయ నమః'** ఇతి దీపమ్. **"మనోన్మనాయ నమః"** ఇతి నైవేద్యం దదాతి. అథాస్మై అష్టభిర్మన్త్రైరష్టౌ పుష్పాణి దదాతి – "భవాయ దేవాయ నమః" ఇతి. అథాస్య రుద్రతనూరుపతిష్ఠతే – **"అఘోరేభ్యోఽథ ఘోరేభ్యః"** ఇతి. అథ రుద్రగాయత్రీం జపేత్ – **"తత్పురుషాయ విద్మహే"** ఇతి శతకృత్వోఽపరిమితకృత్వో వా దశవారం వా. అథైనమాశిషమాశాస్తే – **"ఈశానః సర్వవిద్యానామ్"** ఇతి.

అథాస్య మూర్ధని కలశధారయా సన్తతమభిషిఞ్చన్ **"నమస్తే రుద్రమన్యవే"** ఇత్యేకాదశానువాకాఞ్జపేత్. "సర్వో వై రుద్రః" "ఇమా రుద్రాయ" ఇతి ద్వాదశర్చమన్యాంశ్చ రౌద్రమన్త్రాఞ్జపేత్. జపానన్తరం **"అగ్నావిష్ణూ సజోషసేమా"** ఇత్యేకాదశానువాకానా మేకైకమనువాకం జపేత్. ఏతత్ పాపక్షయార్థీ వ్యాధివిమోచనార్థీ శ్రీకామః శాన్తికామ ఆయుష్కామ ఆరోగ్యకామశ్చ కుర్యాత్. ఏవం కుర్వన్నేతత్సర్వమాప్నోతి. పాయసాది మహాహవిర్నివేదయతి. అథ దక్షిణాం దదాతి– దశ గా ఏకాదశ, తదభావే ఏకాం గాం దద్యాదిత్యాహ భగవాన్ బోధాయన ఇతి.

ఇత్థం శ్రీరుద్రస్య సకలపాపనివర్తకత్వేన, సర్వోపాసనాఫలప్రదత్వేన, సకృజ్జపాదేవ జ్ఞానప్రదత్వేన చ కర్మోపాసనాజ్ఞానకాణ్డాత్మకసకలవేదోత్తమత్వం, తత్ర చ శ్రుతిస్మృతీతిహాస–పురాణతాత్పర్యం, తన్న్యాసవిధిశ్చేత్యేతత్సర్వం నిరూపితమ్. ఇదానీం శ్రీరుద్రోపనిషదమర్థతో వ్యాఖ్యాస్యామః.

**అనువాదము:** ఇట్లాత్మపూజను చెప్పి పిమ్మట బాహ్యపూజాపద్ధతిని చెప్పుచున్నాడు – 'ఆత్వా వహన్తు హరయః ... ఇత్యాహ భగవాన్ బోధాయనః' 'ఆత్వా వహన్తు' అను మన్త్రముతో భగవదావాహనము జేయవలెను. స్థిరప్రతిష్ఠితములైన మూర్తుల బూజించునప్పు డావాహన మక్కరలేదు. 'సద్యోజాతం ప్రపద్యామి' ఇత్యాదిమన్త్రములతో క్రమముగా ఆసనాది నైవేద్యాన్తముగలగు ఉపచారముల గావించవలెను. అటుపైని

'భవాయ దేవాయ నమః' మొదలగు అష్టమన్త్రములతో అష్టపుష్పములనర్పించి, 'అఘోరేభ్యః' అను మన్త్రముతో ఉపస్థానము జేయవలెను. తదుపరి 'తత్పురుషాయ విద్మహే' అను రుద్రగాయత్రిని పది పర్యాయములు, లేదా నూరు పర్యాయములు, అథవా అపరిమితముగ జపించి 'ఈశానస్సర్వవిద్యానాం' అను మన్త్రముతో అభీష్టమును ప్రార్థించవలెను. అనంతరము భగవానుని శిరమున సంతతధారగా కలశోదకముతో అభిషేకము జేయుచు, 'నమస్తే రుద్ర మన్యవే' మొదలగు పదనొకండు అనువాకములను, 'సర్వో వై రుద్రః' 'ఇమా రుద్రాయ' అను పండ్రెండు ఋక్కుల సూక్తమును, రుద్రదేవతాకములగు ఇతరమన్త్రములను జపించవలెను. జపమైన పిదప 'అగ్నా విష్ణూ సజోషసేమా' మొదలగు పదనొకండు అనువాకములలో ఒక్కొక్కదానిని జపించవలెను. పాపక్షయము నపేక్షించువాడు, వ్యాధిమోచనము నభిలషించువాడు, శ్రీకాముడు, శాన్తికాముడు, ఆయుష్యకాముడు, ఆరోగ్యకాముడు – ఇట్టివారందరును యథోక్తవిధి ననుష్ఠించి ఆ యా ఫలములను పొందుదురు. పాయసము మున్నగు మహాహవిస్సును నివేదించవలెను. అటుపైని పదనొకండు గోవులను, లేదా పదింటిని, అశక్తుడగుచో ఒక్కదానినైనను దక్షిణగా నీయవలెను. భగవానుడగు బోధాయను డిట్లు చెప్పినాడు.

ఈ విధముగ – శ్రీరుద్రము సమస్తపాపహరమగుటచేతను, సర్వోపాసనా ఫలప్రదమగుటచేతను, సకృజ్జపమాత్రముననే జ్ఞానజనకమగుటచేతను, కర్మోపాసనాజ్ఞాన కాణ్డాత్మకమగు సమస్తవేదరాశిలో నుత్తమ మను విషయమున శ్రుతిస్మృతీతిహాస–పురాణములు తాత్పర్యముగలవై యున్నవని నిరూపింపబడినది. శ్రీరుద్రన్యాసవిధియు వివరింపబడినది. ఇప్పుడిక **శ్రీరుద్రోపనిషత్తును** అర్థవివరణరూపముగ వ్యాఖ్యానించ గలము.

– 0 –

ఓమ్
శ్రీసద్గురుశ్శరణమ్
శ్రీమదభినవశఙ్కరాచార్యవిరచితే

# శ్రీరుద్రభాష్యే

## ప్రథమోఽనువాకః

**మూలమ్. ఓమ్ నమస్తే రుద్ర మన్యవ ఉతో త ఇషవే నమః।**

**నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః॥ 1**

**భాష్యమ్ -**

**ఆనన్దమానన్దకరం ప్రసన్నం - జ్ఞానస్వరూపం నిజబోధయుక్తమ్।**
**యోగీన్ద్రమీడ్యం భవరోగవైద్యం - శ్రీమద్గురుం నిత్యమహం నమామి॥**

**విద్యాగుమ్భసుధాపూరహృద్యాననసుధాంశవే।**
**రక్షితే సర్వలోకానాం దక్షిణామూర్తయే నమః॥**

ఇదానీం రుద్రోపనిషదర్థం వ్యాఖ్యాస్యామః – అత్ర హ్యేకాదశానువాకాః. తత్ర ఆద్యే భగవతః ప్రసాదః, ద్వితీయాదిష్వష్టసు సర్వేశ్వరత్వ–సర్వాత్మకత్వ–సర్వాన్తర్యామిత్వాది రూపేణ భగవన్నమస్కారః, తతో దశమే భగవతః ప్రార్థనా, ఏకాదశే భగవదంశభూత–రుద్రసంఘప్రార్థనేత్యేకాదశాత్మకశ్రీరుద్రాధ్యాయార్థః. తత్ర తావన్నిజపాపక్షయార్థమీశ్వరం ప్రసాదయితుం నమస్కరోతి – నమస్తే రుద్రేతి.

**అనువాదము:** ఆనందము – జ్ఞానము తన స్వరూపమైనవాడు, ఆ జ్ఞానానందములు రెండును రూపొందినవో యనునట్లు ప్రసన్నమూర్తియై ఆశ్రితులను ఆత్మతత్త్వోపదేశముచే జ్ఞానానన్దస్వరూపులనుగ జేయువాడు, యోగీశ్వరుడు, సకలలోకసంస్తవనీయుడు, జనన–

మరణజరాసంతాపదుఃఖాత్మకమైన సంసారరోగమును సమూలముగ శమింపజేయు ఘనవైద్యుడునగు శ్రీగురుదేవుని నిత్యము నమస్కరించుచున్నాను. (ఇచట – విశేషణసామర్థ్యసందర్భములను బట్టి నమస్కరించుట యనగా – కరచరణాదులతో జేయు కాయికనమస్కారము కాక, సాక్షాత్పరబ్రహ్మమై తత్త్వోపదేశ మొనర్చిన సద్గురుమూర్తిని స్వాత్మాభిన్నముగ భావించుటయే యని గ్రహించవలసియున్నది.)

విద్యలనెడి అమృతధారలను వర్షించు హృద్యమగు ముఖచన్ద్రబింబముతో విరాజిల్లువాడును, సకలలోకరక్షకుడునగు దక్షిణామూర్తికి నమస్కారము.

ఇపుడు రుద్రోపనిషదర్థమును వివరించుచున్నాము – శ్రీరుద్రములో పదునొకండు అనువాకములున్నవి. అందు మొదటిదానిలో భగవానుని ప్రసన్నుని జేసికొనుట, రెండు మొదలు ఎనిమిది అనువాకములలో సర్వేశ్వరత్వ – సర్వాత్మకత్వ – సర్వాన్తర్యామిత్వాది స్వరూపములతో భగవంతుని నమస్కరించుట, పదియవ అనువాకములో భగవత్ప్రార్థనము, పదునొకండవ అనువాకములో భగవదంశ సంభూత రుద్రసంఘప్రార్థనము. ఇది ఏకాదశానువాకాత్మకమగు రుద్రాధ్యాయముయొక్క సంగ్రహార్థము. అందు – స్వీయపాపక్షయార్థమై పరమేశ్వరుని ప్రసన్నునిగా జేసికొనుటకు 'నమస్తే రుద్ర' అను మన్త్రముతో నమస్కరించుచున్నాడు –

**భాష్యమ్ –** హే రుద్ర! – ప్రణతదుఃఖద్రావక!, తే – తవ, మన్యవే – క్రోధాయ, నమః అస్తు. న చ – నిరస్తసమస్తదోషనిఖిలకల్యాణగుణగణసముద్రే భగవతి కథం క్రోధప్రసక్తిరితి వాచ్యమ్; దుష్టనిగ్రహశిష్టానుగ్రహస్వభావే నిగ్రాహ్యవిషయే క్రోధస్యాలంకారత్వేనాదోషత్వాత్.

**శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లఙ్ఘ్య వర్తతే।**
**ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్వేష్యః స మే వధ్యశ్చ జాయతే॥**

ఇతి భగవతైవోక్తత్వాత్. న చైవం వైషమ్యనైర్ఘృణ్యప్రసక్తిరితి వాచ్యమ్; తత్తత్ప్రాణి–కర్మానుసారేణ నిగ్రహానుగ్రహౌ కుర్వతస్తస్య తదప్రసక్తేరితి – బ్రహ్మమీమాంసాయాం (2–1–12) ప్రపఞ్చః. అత్ర రుద్రేతి హేతుగర్భం సంబోధనమ్. అత్ర రుద్రశబ్దో హి రుతం ద్రావయతీత్యర్థే –

**రుద్దుఃఖం దుఃఖహేతుర్వా తద్ద్రావయతి నః ప్రభుః।**
**రుద్ర ఇత్యుచ్యతే తస్మాచ్ఛివః పరమకారణమ్॥**

ఇతి పౌరాణికైర్వ్యుత్పాదితః, పృషోదరాదిః, తథా చ ప్రణతదుఃఖతద్ధేతుభూతపాపద్రావకస్య

తవ ప్రణతే మయి పాపనిమిత్తకః క్రోధః పరిహర్తుం యుక్త ఏవేతి భావః. ఏవమగ్రేఽపి రుద్రపదసంబోధనాభిప్రాయో ద్రష్టవ్యః.

ఇత్థం భగవన్తం ప్రసాద్య తదాయుధాన్యపి నమస్కారేణ ప్రసాదయతి–ఉతో త ఇతి. ఉతో అపి. చేత్యర్థః–హే రుద్ర తే తవ, ఇషవే–బాణాయ, నమః–అస్తు. తథా ఇష్వపాదానభూతాయ తవ ధన్వనే–ధనుషే, నమః అస్తు. ఉత– అపి చ, ధనుర్బాణవ్యాప్తాభ్యాం హస్తాభ్యాం నమః అస్తు. శ్రుతిస్మృతిరూప– స్వాజ్ఞాతిలఙ్ఘినే పాపిష్ఠాయ పరమేశ్వరః క్రుధ్యతి, తతస్తత్ప్రహరణార్థమిషురుపతిష్ఠతే, తతస్తదపాదానే ధనుషి దృష్టిర్భవతి, తతో ధనుర్బాణగ్రహణాయ బాహూ వ్యాప్రియేతే– ఇతి క్రమః. అనేనైవ క్రమేణాత్ర నమస్కారక్రమః. అనన్తవిచిత్రశక్తేర్భగవతో దివ్యశక్తి– విలాసరూపా జగదుపాస్యదేవతామూర్తయ ఇవ ఇష్వాదయ ఇతి తన్నమస్కారప్రార్థనాదికం యుక్తమేవ. శ్రూయతే హి మహాభారతే – విస్మృతపాశుపతాస్త్రసంధానప్రకార– విశేషపరిజ్ఞానాయ కృష్ణార్జునయోః కైలాసయాత్రాయాం తత్ర క్వచిద్దివ్యసరస్యవస్థితం తదస్త్రమిహానయేతి పరమేశ్వరనియోగేన తదర్థం గతయోః తత్ర చానేకఫణిమణ్డలముఖోద్వాన్తవిషానల– జ్వాలాకరాలమతిభయంకరం పాశుపతాస్త్రమాసీత్. తచ్చ భగవతః శ్రీకృష్ణస్య శతరుద్రీయాధ్యాయజపమహిమ్నా శాన్తరూపం భూత్వా హస్తగతమాసీదితి. తదేతదత్రానుసంధేయమ్.

**అనువాదము:** (అర్థము) రుద్ర = ప్రణమిల్లినవారి దుఃఖమును దూరీకరించువాడా!, తే = నీయొక్క, మన్యవే = క్రోధమునకు, నమః = నమస్కారము, ఉతో = మరియు, తే = నీయొక్క, ఇషవే = బాణమునకు, నమః = నమస్కారము, తే = నీయొక్క, ధన్వనే = బాణప్రయోగమునకు అపాదాన (ఆలంబన) భూతమైన ధనుస్సునకు, నమః అస్తు = నమస్కార మగుగాక, ఉత = ఇంతేకాక, తే = నీయొక్క, బాహుభ్యామ్ = ధనుర్బాణములను ధరించియున్న హస్తములకును, నమః = నమస్కారము.

(వివరణము) ఇచట ప్రప్రథమముగ, రుద్రా! నీ క్రోధమునకు నమస్కారము – అని చెప్పబడినది. అఖిలదోషములకు అతీతుడు, సకలకల్యాణగుణసముద్రుడునగు భగవంతునియందు క్రోధము ఎట్లు సంభవించును? అను శంక కలుగవచ్చును. దుష్టనిగ్రహ–శిష్టానుగ్రహ స్వభావుడగు పరమేశ్వరునకు నిగ్రహించదగినవారి విషయమున క్రోధము అలంకారమేగాని, దోషావహము కాదు. (శ్రుతిస్మృతిః మమైవాజ్ఞా...జాయతే) శ్రుతిస్మృతులు నా యాజ్ఞారూపములు. వాని నుల్లంఘించి ప్రవర్తించువాడు నా యాజ్ఞను

ధిక్కరించినవాడే గాన, అట్టివాడు నాకు ద్వేషింపదగినవాడు, వధార్హుడు నగునని భగవానుడే చెప్పియున్నాడు. ఇట్లగుచో భగవంతునకు వైషమ్య–నైర్ఘృణ్యములు, ప్రసక్తములు కావా? అందురేమో; ఆ యా జీవుల కర్మానుగుణముగ నిగ్రహానుగ్రహముల నెరపు పరమేశ్వరుని యందు అట్టి దోషముల కవకాశమేలేదని బ్రాహ్మమీమాంసలో (2–1–12) వివరింపబడి యున్నది.

ఈ మన్త్రములో "రుద్ర" అనునది హేతుగర్భమగు సంబోధనము. (రుద్దుఃఖం... కారణమ్) "రుత్" అను శబ్దమునకు దుఃఖము – లేక– దుఃఖకారణము అని యర్థము. దానిని పారద్రోలువాడు అనునర్థములో పౌరాణికులచే రుద్రశబ్దనిర్వచనము చేయబడినది. (ఇది "పృషోదరాది" గణములో చేరినది) కాగా – ప్రణమిల్లినవారి దుఃఖమును, దుఃఖకారణమగు పాపమును బారద్రోలు నీకు ప్రణమిల్లిన నా విషయమున క్రోధమును విడనాడుట యుక్తమే యని భావము. ఇట్లే ముందుగూడ రుద్రపదసంబోధనాభిప్రాయము నెఱుంగునది. ఇట్లు భగవానుని ప్రసన్నుని గావించి, **"ఉతో త ఇషవే నమః"** ఇత్యాదిగ, అతని ఆయుధములను గూడ నమస్కారములతో ప్రసన్నముల గావించుచున్నాడు. ఇందలి విశేషమిది – శ్రుతిస్మృతిరూపములగు తన యాజ్ఞల నుల్లంఘించిన పాపిష్ఠుని విషయమున పరమేశ్వరుడు క్రుద్ధుడగును. వెంటనే దానిని శిక్షించుటకు బాణము సన్నిహితమగును. అంతట బాణమును సంధించుటకు ధనుస్సునందు దేవుని దృష్టి ప్రసరించును. ఆపైని ధనుర్బాణములను ధరించుట కాతని హస్తములు ఉద్యుక్తము లగును. ఈ క్రమము ననుసరించియే నమస్కారక్రమము సమన్వితమగుచున్నది. అనంత విచిత్రశక్తిస్వరూపుడగు భగవానుని దివ్యశక్తి విలాసవిశేషములే అతని యాయుధములు. కావుననే దేవతామూర్తులై లోకమునకు ఉపాస్యము లగుచున్నవి. అట్టిచో తన్నమస్కారప్రార్థనాదికము సమంజసమే యగును. ఒకప్పుడు పరమేశ్వరు దనుగ్రహించిన పాశుపతాస్త్రముయొక్క సంధాన ప్రకారమును మరచిపోయి మరల దానిని తెలిసికొను తలంపుతో కృష్ణార్జునులు కైలాసమున కేగినారట. అచటనొక దివ్యసరోవరమునందున్న ఆ యస్త్రమును పరమేశ్వరుని యాదేశముతో కొనివచ్చుటకేగిన కృష్ణార్జునులకు, పడగలు విప్పి మండలాకారముగ పరివేష్టించియున్న మహాసర్పముల ముఖములనుండి వెలువడుచున్న విషాగ్ని జ్వాలలతో ఆవృతమై అతిభయంకరమైయున్న పాశుపతాస్త్రము దర్శనమిచ్చినది. అప్పుడది శ్రీకృష్ణుడొనర్చిన శతరుద్రీయాధ్యాయజపప్రభావముచే ప్రసన్నమై హస్తగతమైనదట. ఈ భారతగాథ యిచట స్మరించదగియున్నది.

**భాష్యమ్ –** అథాస్య మన్త్రస్య ఋషిచ్ఛన్దోదేవతాః ప్రదర్శ్యన్తే – తద్‌జ్ఞానం వినా మన్త్రజపస్య నిషిద్ధత్వాత్. అత ఏవ ఛన్దోగా అధీయతే – 'యో హ వా అవిదితార్షేయచ్ఛన్దోదైవతేన బ్రాహ్మణేన మన్త్రేణ యజతి వాధ్యాపయతి వా స్థాణుర్వా భవతి గర్తం వా పద్యతే ప్ర వా భీయతే పాపీయాన్ భవతి తస్మాదేతాని మన్త్రే విద్యాత్' ఇతి;

**"నమస్తే రుద్ర మన్యవే"** ఇతి మన్త్రస్య ఆత్రేయ ఋషిః, అనుష్టుభ్ ఛన్దః, శ్రీరుద్రో దేవతా, **ధ్యానమ్–**

**ఆకర్ణకృష్టే ధనుషి జ్వలన్తీం దేవీమిషుం భాస్వతి సన్దధానమ్।**
**ధ్యాయేన్మహేశం మహనీయవేషం దేవ్యాయుతం యోధతనుం యువానమ్॥**

ప్రాజాపత్యకృచ్ఛ్రానుష్ఠానపూర్వకమేకాదశసహస్రజపాదస్య మన్త్రస్య సిద్ధిః. అనేన మన్త్రేణ ప్రదక్షిణనమస్కారాభ్యాం పరమేశ్వరప్రసాదః, పాపక్షయః, గాణపత్యం చ భవతి. తత్ప్రయోగభేదాస్తు రుద్రకల్పార్ణవాదౌ ద్రష్టవ్యాః. విస్తరభయాన్నేహ లిఖ్యన్తే. ఇతి ప్రథమమన్త్రః.

**అనువాదము:** ఇటుపైని యీ మంత్రముయొక్క ఋషి–ఛన్దస్సు–దేవత తెలుపబడుచున్నవి. వానిని తెలిసికొననిదే మంత్రమును జపించరాదు. కావుననే (యో హ వా ... విద్యాత్) అను ఛాన్దోగ్యశ్రుతి–మంత్రముయొక్క ఋషిచ్ఛన్దో దేవతలను, వినియోగమును చెప్పు బ్రాహ్మణమును తెలిసికొనకుండ చేయు యాజనాధ్యాపనాదులు అనేకానర్థములకు కారణ మగుననియు, కావున వానిని తప్పక తెలిసికొనవలెననియు – చెప్పుచున్నది. 'నమస్తే రుద్ర' అను మంత్రమునకు ఋషి–ఆత్రేయుడు. ఛన్దస్సు–అనుష్టుప్. దేవత–శ్రీరుద్రుడు. (ఆకర్ణకృష్టే...యువానమ్) ఆకర్ణాంతము లాగబడి ప్రకాశించుచున్న పినాకనామకమగు ధనుస్సునందు జ్వలించుచున్న దివ్యశరమును సంధించుచు యువవీరభటరూపమును ధరించి దేవీసమన్వితుడై పూజనీయమగు వేషముతో నున్నవానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. ప్రాజాపత్యకృచ్ఛ్రానుష్ఠానపూర్వకముగ పదునొకండువేల పర్యాయములు జపించిన మంత్రసిద్ధి యగును. ఈ మంత్రముతో ప్రదక్షిణనమస్కారముల నాచరించినచో పరమేశ్వరానుగ్రహము, పాపక్షయము, గణాధిపత్యము లభించును. ఆ ప్రయోగ–విశేషములను రుద్రకల్పార్ణవాదులలో జూడవచ్చును. విస్తరభీతిచే నిచట వ్రాయుటలేదు.

మూ. యా త ఇషుశ్శివతమా శివం బభూవ తే ధనుః।
శివా శరవ్యా యా తవ తయా నో రుద్ర! మృడయ॥ 2

**భాష్యమ్ –** ఏవం ప్రథమమన్త్రేణ భగవన్తం సపరికరం ప్రసాద్య ద్వితీయేన స్వస్య సుఖం ప్రార్థయతే– **యా త ఇషు**రితి. హే రుద్ర! యా తే – తవ, ఇషుః **శివతమా**– శాన్తతమా **బభూవ**, పూర్వం పాపిష్ఠే మయి ఘోరరూపా సతీ నమస్కారేణ శాన్తరూపా జాతేత్యర్థః. ఏవం యచ్చ **తే ధనుః** శివం– శాన్తరూపం బభూవ, యా చ తవ శరవ్యా శివా బభూవ, శరవ్యేతి హింసాహేతురాయుధవిశేషః, **'అవసృష్టా పరాపతశరవ్యే బ్రహ్మసగ్ంహితా'** ఇతి శ్రవణాత్. యద్వా– శృణోతేర్హింసాకర్మణః **ఉ**ప్రత్యయే శరుః. శరవః–శరాః, తేభ్యో హితా శరవ్యా– ఇషుధిః, తయా శరవ్యయా. ఉపలక్షణమేతత్– తేన ధనుషా, తయా ఇష్వా చ నః–అస్మాన్ మృడయ– సుఖయ. అస్య మన్త్రస్య ఆత్రేయ ఋషిః, అనుష్టుప్ ఛన్దః, శంభుర్దేవతా.

**ధ్యాయేద్దేవం సస్మితం స్యన్దనస్థం – దేవ్యా సార్ధం తేజసా దీప్యమానమ్।**
**ఇష్విష్వాసాలంకృతాభ్యాం భుజాభ్యాం – శూరాకారం స్తూయమానం సురౌఘైః॥**

ద్వాదశదినాని నిత్యకర్మావిరోధేన నిశీథినీవ్యతిరిక్తకాలే నిరన్తరజపాత్పురశ్చరణసిద్ధిః. తతః ప్రయోగార్హో భవతి. దుర్భిక్షరాష్ట్రక్షోభాదిపరిహారప్రధానోఽయం మన్త్రః.

**అనువాదము:** ప్రథమమంత్రముతో ధనుర్బాణాదిపరికరసహితుడగు భగవానుని ప్రసన్నుని గావించి, ద్వితీయమంత్రముతో తనకు సుఖము నిమ్మని ప్రార్థించుచున్నాడు–

(అర్థము) హే రుద్ర! = ఓ రుద్రుడా!, యా తే ఇషుః = ఏ నీ బాణము, శివతమా = మిక్కిలి శాన్తమైనది, బభూవ = అయ్యెనో, యత్ తే ధనుః = ఏ నీ ధనుస్సు, శివమ్ = శాన్తమైనది, బభూవ = అయ్యెనో, యా తవ శరవ్యా = ఏ నీ ఆయుధము (లేక) అమ్ములపొది, శివా బభూవ = శాన్తస్వరూప మయ్యెనో, తయా = అట్టి ధనుర్బాణశరవ్యములతో, నః = మమ్ము, మృడయ = సుఖింపజేయుము.

(వివరణము) ఇంతకు పూర్వము పాపాత్ముడనగు నా విషయమున పరమేశ్వరుని ధనుర్బాణాదులు ఘోరరూపములైయున్నను, ఇపుడాతని శరణుజొచ్చిన కారణమున శాన్తస్వరూపములైన వని భావము. ఇందలి 'శరవ్య' శబ్దము హింసాహేతువగు

ఆయుధవిశేషమును బోధించును. 'అవసృష్టా పరాపతశరవ్యే బ్రహ్మసగ్ంహితా' అను శ్రుతిలో శరవ్యశబ్ద మీ యర్థములో ప్రయోగింపబడినది లేక - హింసార్థకమగు శౄ ధాతువుకంటే ఉ ప్రత్యయమును చేర్చగా శరుశబ్దము నిష్పన్నమగును. దానికి శర(బాణ) మని యర్థము. శరభ్యో హితః శరవ్యః = శరములకు హితమైనది, అనగా- అమ్ముల పొది' యని పర్యవసితార్థము.

ఈ మంత్రమునకు ఆత్రేయుడు - ఋషి, ఛన్దస్సు-అనుష్టుప్, దేవత-శంభువు. (ధ్యాయేద్దేవం ... స్తూయమానం సురౌఘైః) ధనుర్బాణాలంకృతములగు హస్తములతో శూరాకారమునుధరించి పార్వతీసహితుడై దేవతాసంఘములు స్తుతించుచుండగా, చిఱునవ్వుతో రథారూఢుడైయున్నవానినిగా శ్రీశంభుమూర్తిని ధ్యానించవలెను. పండ్రెండు దినములు నిత్యకర్మలకు భంగము కలుగుకుండునట్లు అర్ధరాత్రము కాక తక్కిన కాలములో నిరంతరము జపించిన పురశ్చరణసిద్ధి యగును. అటుపైని ప్రయోగార్హమగును. దుర్భిక్షరక్షోబాధానివారణాదుల కిది ముఖ్యమైన మంత్రము.

**మూ. యా తే రుద్ర శివా తనూరఘోరాఽపాపకాశినీ।**
**తయా నస్తనువా శన్తమయా గిరిశన్తాభి చాకశీహి॥ 3**

**భాష్యమ్ -** ఏవం ద్వితీయేన సాంసారికసుఖమాశాస్య, తృతీయేన మోక్షహేతుజ్ఞానమాశాస్తే - యా తే రుద్రేతి. హే రుద్ర! తే-తవ, యా తనూః ప్రసిద్ధా, శ్రూయతే హి 'తస్యైతే తనువౌ ఘోరాన్యా శివాన్యా' ఇతి. భారతేఽపి -

**ద్వే తనూ తస్య దేవస్య దేవజ్ఞా బ్రాహ్మణా విదుః।**
**ఘోరా చాన్యా శివా చాన్యా తే చైవ శతధా పునః॥** ఇతి.

సా తనూః కీదృశీ- అఘోరా- ఆయుధైరకారణభయంకరీ ఘోరా, సా న భవతీత్యఘోరా. న కేవలం భయంకరత్వాభావమాత్రవతీ, కిం తు శివా- శివంకరీ సుఖప్రదా. న కేవలం సాంసారికసుఖమాత్రప్రదా, కిం తు పరమపురుషార్థభూత-మోక్షహేతుజ్ఞానప్రదాపీత్యాహ- అపాపకాశినీతి. అపాపశబ్దేన పాపవిరోధిబ్రహ్మాత్మతత్త్వ-జ్ఞానముచ్యతే, 'తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవం హ వాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే' ఇతి శ్రుతేః. 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' ఇతి స్మృతేశ్చ.

అపాపస్య కాశినీ– ప్రకాశయిత్రీ జ్ఞానప్రదేతి యావత్. **'ఆత్మబుద్ధిప్రకాశమ్'** ఇతి శ్రుతేః ఏవంవిధా యా తవ తనూరస్తి, తయా శంతమయా– నిరతిశయసుఖరూపయా తన్వా, నః– అస్మాన్ **అభిచాకశీహి–** అభితః సర్వతః ప్రకాశయుతాన్ కురు, అద్వితీయబ్రహ్మాత్మ తత్త్వమేవ సర్వతః ప్రకాశయ. **'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతమ్'** ఇతి శ్రుతేః. అభిచాకశీహీతి **యఙ్లుగన్తప్రయోగేన** భృశార్థరూపక్రియాసమాభిహారః ప్రదర్శితః అప్రతిబద్ధాపరోక్షబ్రహ్మసాక్షాత్కారయుక్తాన్ కుర్విత్యర్థః. శంతమయా అభిచాకశీహీత్యనేన పరమేశ్వరస్య చిదానందవిగ్రహత్వం ప్రదర్శితమ్. నను మన్నమస్కారమాత్రేణ మోక్షమిచ్ఛసి, తస్య శ్రవణమనననిదిధ్యాసనాది– బహుయత్నసాధ్యత్వాదిత్యాశంక్య, సంబోధయతి– **గిరిశంతేతి**, గిరి– ప్రతిజ్ఞారూపాయాం వాచి స్థిత్వా లోకానాం శం – మోక్షసుఖం తనోతీతి **గిరిశంతః**. శ్రవణాద్యాయాసం వినాపి కేవలం భగవన్నమస్కారఘటితదివ్య–నామధేయాత్మకశ్రీరుద్రజపమాత్రేణ యుక్తో మోక్షాభిలాషః, **"ఏతైర్హ వా అమృతో భవతి"** ఇతి శ్రుతేః – ఇతి ద్వితీయసంబోధనస్వారస్యమ్. అస్య మన్త్రస్య స్వరాట్ ఋషిః త్రివృదనుష్టుప్ ఛన్దః, శంభుర్దేవతా.

**స్మేరాననం చన్ద్రకలావతంసం – గంగాధరం శైలసుతాసహాయమ్।**
**త్రిలోచనం భస్మభుజఙ్గభూషం – ధ్యాయేత్పశూనాం పతిమీశితారమ్॥**

నిత్యకర్మావిరోధేన త్రిరాత్రం నిరన్తరజపాత్పురశ్చరణసిద్ధిః. గోశాన్త్యాదిఫలప్రదోఽయం మన్త్రః. ఇతి తృతీయః.

**అనువాదము:** ఇట్లు ద్వితీయమంత్రముచే సాంసారికసుఖమును ప్రార్థించి తృతీయ మన్త్రముచే మోక్షసాధనమగు జ్ఞానము నిమ్మని ప్రార్థించుచున్నాడు–

(అర్థము) హే రుద్ర! = ఓ రుద్రుడా!, అఘోరా = భయంకరము కానట్టియు (ఆయుధములను ధరించుటచే భయంకరమైనది. ఘోరము, తద్భిన్నమైనది అఘోరము), అంతమాత్రమే కాక, శివా = సుఖప్రదమైనట్టియు, కేవలసాంసారిక సుఖప్రదమగుటయే కాక, అపాపకాశినీ = పాపహరమగు బ్రహ్మాత్మతత్త్వవిజ్ఞానమును ప్రకాశింపజేయునట్టియు, యా తే తనూః = ప్రసిద్ధమైన యే నీ స్వరూపము కలదో, హే గిరిశన్త! = ప్రతిజ్ఞానుగుణ ముగ ఆశ్రితులకు మోక్షసుఖమునొసంగువాడా!, తయా = అట్టి, శన్తమయా = నిరతిశయ సుఖరూపమగు, తనువా = స్వరూపముతో, నః = మమ్ము, అభి చాకశీహి = సర్వత్ర ప్రకాశముగలవారిని జేయుము.

(వివరణము) ఈశ్వరునకు 'ఘోరా' 'శివా' అను రెండు తనువులు గలవని 'తస్మై తే తనువౌ ఘోరాన్యా శివాన్యా' అను తైత్తిరీయశ్రుతి తెలుపుచున్నది. మహాభారతములో గూడ (ద్వే తనూ తస్య దేవస్య ... శతధా పునః– అని) చెప్పబడినది. 'తద్యథేషీకాతూలం...' 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి...' అను శ్రుతిస్మృతులు– అగ్నిలో వేయబడిన రెల్లు దూది నశించునట్లు ఆత్మతత్త్వవేత్తయొక్క అఖిలపాపములు నశించుననియు, తత్త్వజ్ఞాన మను అగ్ని అజ్ఞానమూలకములగు సర్వకర్మలను భస్మీపటలము గావించుననియు – చెప్పుచున్నవి. 'అభి చాకశీహి' అనుచో, 'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతమ్' అను శ్రుతి ననుసరించి బ్రహ్మాత్మతత్త్వమే సర్వావభాసకముగాన దాని ననుగ్రహింపుమని తాత్పర్యము. మరియు నీ పదము యఙ్‌లుగన్తము గాన దీనిచే భృశా (అతిశయా)ర్థ రూపమగు క్రియాసమభిహారము ప్రదర్శింపబడినది. కాగా – అప్రతిబద్ధమగు అపరోక్షబ్రహ్మసాక్షాత్కారము గలవానినిగ జేయువను నర్థము సిద్ధించుచున్నది. శన్తమయా– అను పదముచే పరమేశ్వరుని చిదానన్దస్వరూపము ప్రదర్శింపబడినది. మరియు మోక్షము – శ్రవణమనననిదిధ్యాసనాది బహుయత్న సాధ్యమైయుండగా, కేవలము నాకు నమస్కారమును మాత్రమే జేసి, మోక్షమిమ్మని యర్థించుట యుక్తమా? అని పరమేశ్వరుడనునేమో! అని యాశంకించుకొని, 'గిరిశన్త!' అని సంబోధించుచున్నాడు. ప్రతిజ్ఞారూపమగు వాక్కున నిలచి (దానికి కట్టుబడి) జనులకు మోక్షసుఖము నిచ్చువాడా! అని దాని యర్థము. శ్రవణమననాది శ్రమలేకుండనే కేవలము భగవన్నమస్కారసహిత దివ్యనామధేయాత్మకమగు శ్రీరుద్రజపమాత్రముచే మోక్షమును కోరుట యుక్తమే. 'ఏతైర్హ వా అమృతో భవతి' అని కదా తదాజ్ఞారూపమగు శ్రుతి చెప్పుచున్నది.

ఈ మన్త్రమునకు ఋషి – స్వరాట్, ఛన్దస్సు త్రివృదనుష్టుప్, దేవత – శంభువు. (స్మేరాననం...పతిమీశితారమ్) చిఱునవ్వుతోగూడిన ముఖముగలవాడు. చన్ద్రకళను శిరోభూషణముగ ధరించినవాడు, గంగాధరుడు, పార్వతీసహితుడు, త్రిలోచనుడు, భస్మోద్ధూళితవిగ్రహుడు, నాగభూషణుడు, పశుపతి, సర్వనియామకుడు – ఇట్టి లక్షణములు గలవానినిగ శ్రీశంభుమూర్తిని ధ్యానించవలెను. నిత్యకర్మావిరోధముగ మూడు దినములు నిరన్తరము జపించుటచే పురశ్చరణము సిద్ధించును. ఈ మన్త్రము గోశాన్త్యాది ఫలప్రదము.

మూ. యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే।
శివాం గిరిత్ర తాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్॥

**భాష్యమ్** – ఏవం ద్వితీయతృతీయాభ్యామిష్టసిద్ధిః ప్రార్థితా. అథ చతుర్థమన్త్రేణా-నిష్టపరిహారం ప్రార్థయతే – యామిషుమితి. గిరౌ కైలాసే స్థిత్వా లోకానాం శం శివం తనోతీతి గిరిశన్తః. హే **గిరిశన్త! యామిషుం హస్తే బిభర్షి** – ధారయసి, కిమర్థమ్? **అస్తవే** – అసితుం పాపిష్ఠాన్ క్షేప్తుమ్, ఛన్దసి తుమర్థే తవేన్ప్రత్యయః. తామిషుం శివాం కురు – శివంకరస్త్వం ఇషుం శివాం కర్తుమర్హసీతి సంబోధనాభిప్రాయః. కీదృశమిషోః శివత్వమ్? తత్రాహ – మా హిగ్ంసీరితి. పురుషమ్ – అస్మదీయం పుత్రపౌత్రాదిరూపమ్, తథా జగత్ – అస్మదీయగోమహిష్యాదికం గృహారామక్షేత్రాదికం చ మా హిగ్ంసీః. ఏతదేవేషోః శివత్వకారణమితి భావః. అత్ర గిరిశన్తేత్యనేన చరితార్థతయా పునః **'గిరిత్ర'** ఇతి సంబోధనమధికం సత్ అర్థవిశేషం జ్ఞాపయతీతి తం దర్శయామః – అకృత్యా-కార్యకృదపి మాం భజతే చేత్, అవశ్యం రక్షిష్యామీతి పరమేశ్వరస్య ప్రతిజ్ఞా. అత ఏవ ఋగ్బ్రాహ్మణోపానువాక్యకాణ్డే **'మనుః పుత్రేభ్యో దాయం వ్యభజత్సనాభానేదిష్ఠం బ్రహ్మచర్యమ్'** ఇతి ప్రస్తుత్య, 'తం పశుభిశ్చరన్తం యజ్ఞవాస్తౌ రుద్ర ఆగచ్ఛత్సోఽబ్రవీన్మమ వా ఇమే పశవ ఇత్యదుర్వై మహ్యమిమానిత్యబ్రవీన్న వై తస్య త ఈశత ఇత్యబ్రవీద్యద్యజ్ఞావాస్తౌ హీయతే మమ వై తదితి తస్మాద్యజ్ఞవాస్తునాభ్యవేత్యమ్' ఇతి నాభానేదిష్ఠస్యాకృత్యముక్త్వా, తం ప్రతి **'యజ్ఞే మా భజాథ తే పశూన్నాభిమగ్ంస్యే'** ఇతి భగవతః ప్రతిజ్ఞా శ్రూయతే. పురాణేతిహాసేషు చ ఏవం జాతీయకాని భూయాంసి వచనాన్యస్య విషయః. తథా చ గిరి– ప్రతిజ్ఞారూపాయాం వాచి స్థిత్వా భజతస్త్రాయత ఇతి గిరిత్రః. హే **గిరిత్ర!** అకృత్యకారిణోఽపి మమ నాభానేదిష్ఠస్యేవ త్వాం భజతః పుత్రపౌత్రాదికం పాలయేతి సంబోధనాభిప్రాయః, ఇతి చతుర్థః.

**అనువాదము:** ఇట్లు ద్వితీయ తృతీయ మంత్రములచే అభీష్టమును సిద్ధింపజేయుమని ప్రార్థించుట జరిగినది. చతుర్థమంత్రముచే అనిష్టమును పరిహరింపుమని ప్రార్థించు చున్నాడు –

(అర్థము) హే గిరిశన్త! = కైలాసమునందుండి సమస్తలోకములకు శాంతిని విస్తరింపజేయువాడా!, యామ్ ఇషుమ్ = ఏ బాణమును, అస్తవే = పాపులపై

ప్రయోగించుటకు, హస్తే = హస్తమునందు, బిభర్షి = ధరించుచున్నావో, హే గిరిత్ర! = కైలాసముననుండియే సకల భక్తులను కాపాడువాడా!, తామ్ ఇషుమ్ = ఆ బాణమును, శివామ్ = శాన్తమైనదానినిగా, కురు = చేయుము, పురుషమ్ = మా పుత్త్రపౌత్త్రాదులను, జగత్ = గోమహిష్యాదులను, గృహక్షేత్త్రారామాదులను గూడ, మా హిగ్ంసీః = హింసింపకుము.

(వివరణము) 'గిరిశన్త' అనునది హేతుగర్భసంబోధనము. కైలాసము నందుండియు సమస్తలోకములకు శాన్తిని సమకూర్చజాలినవాడవు గావుననే బాణమును శాన్తింపజేయగలవని భావము. 'అస్తవే' అనునది క్షేపార్థకమగు 'అస్' ధాతువుకు 'తవేన్' ప్రత్యయమును చేర్చగా నిష్పన్నమైన రూపము. క్షేపమనగా విసరుట. తవేన్ ప్రత్యయము 'తు' మర్థము (కొఱకు అను నర్థము)లో వేదమునందు ప్రయోగింపబడుచుండును. మా పుత్త్రపౌత్త్రాదులకు హింసను కలిగించకుండుటకే బాణమును శాంతింపజేయు మని భావము. 'గిరిశన్త' అను సంబోనముచేతనే ప్రకృతమైన యర్థము సిద్ధించుచుండగా, అధికముగా ప్రయుక్తమైన 'గిరిత్ర' అను సంబోధనము అర్థవిశేషమునకు ద్యోతకమగు చున్నది. ఎట్లనగా – అకృత్యములను జేసినవాడైనను తనను భజించునేని, అవశ్యమాతని రక్షింతునని భగవంతుని ప్రతిజ్ఞ. కావుననే ఔపానువాక్యకాండము (తై.సం. 3–1–9)లో (మనుః పుత్రేభ్యో...నాభిమగ్గ్ంస్య ఇతి) నియమానుసారము రుద్రునకు చెందవలసియున్న యజ్ఞశిష్టములగు పశువులను తన యధీనము గావించుకొని సంచరించుచున్న అకృత్యకారియగు నాభానేదిష్ఠుని నిజభజనముచే నిర్దోషుని గావించి పశువుల నిచ్చి పరిపాలించినాడని చెప్పబడినది. పురాణేతిహాసములలో నిట్టి సన్నివేశము లెన్నియో గలవు. కాగా – శరణుజొచ్చిన అపరాధులను గూడ కాపాడెద నను ప్రతిజ్ఞను తప్పనివాడని సంబోధనార్థము. ఓ గిరిత్రా! అకృత్యములొనర్చియున్నను, నిన్ను భజించుచున్న నన్ను పుత్త్రపౌత్త్రాదులకు హానికలుగకుండ కాపాడు మని సారాంశము.

**మూ.** **శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి।**

**యథా నస్సర్వమిజ్జగదయక్ష్మగ్ం సుమనా అసత్। 5**

**భాష్యమ్ –** తదేవం నమస్తే రుద్రేతి నమస్కృత్య, ద్వితీయతృతీయచతుర్థైరిష్టప్రాప్త్యనిష్ట–పరిహారౌ ప్రార్థితౌ. ఇదానీం స్తుతిపూర్వకం తదుభయం ప్రార్థయతే – శివేన వచసేతి.

గిరిశబ్దేన గిరిరూపా వేదా ఉచ్యన్తే. తత్ర శ్రుతిః – **'తగ్ం హ త్రీన్ గిరిరూపానవిజ్ఞాతానివ దర్శయాంచకార'** ఇతి ప్రస్తుత్య, **'వేదా వా ఏతే'** ఇతి. తథా చ – గిరిరూపేషు వేదేషు శేతే – తిష్ఠతీతి **గిరిశః** – వేదప్రతిపాద్యః. హే గిరిశ! **అచ్ఛా** – నిర్మలమ్, త్వాం శివేన వచసా వదామసి స్తుమ ఇత్యర్థః. కీదృశీ స్తుతిస్తత్రాహ – యథా యేన ప్రకారేణ కృతయా స్తుత్యా, నః – అస్మాకం సంబంధి, **సర్వమిత్** – సర్వమపి, **జగత్** – పశుపుత్రాదిరూపం జంగమజాతమ్, అయక్ష్మమ్ – అరోగమ్, **సుమనాః** – సౌమనస్యోపేతం సుఖితం చ, **అసత్** – స్యాత్, తథా స్తుమ ఇతి. అత్ర గిరిశేత్యనేన నిఖిలవేదవర్ణనీయస్య స్తోత్రం యుక్తమేవేతి దర్శితమ్. తత్ర పాపిష్ఠస్య ఉక్తిసంబంధాత్పరమేశ్వరస్య మాలిన్యమాశంక్య **'అచ్ఛ'** ఇతి పునః సంబోధయతి. నిత్యం నిరవద్యస్య మలినమదుక్తి– సంబన్ధేఽపి న కాశ్చిత్ క్షతిః, న హి గఙ్గాజలస్య రథ్యోదకసంయోగేన పావనతా గచ్ఛతి, ప్రత్యుత గఙ్గాజలానుషఙ్గాద్రథ్యోదకమేవ స్వయం చ పావనీభూయ యమునోదకనిర్విశేషత్వం ప్రతిపాద్యతే, ఏవం పరమపావనే భగవతి నివేశితం మద్వచనమేవ వేదవచనవల్లోకమాన్యం భవతీతి సంబోధనాభిప్రాయః. అత ఏవ గఙ్గాప్రవాహప్రతితస్య రథ్యోదకస్య గఙ్గాత్వమివ శివే పతితస్యాపి మద్వచనస్య అతిశోభనతయా శివత్వమేవ సంపన్నమిత్యభిప్రేత్య శివేన వచసేత్యుక్తమ్.

తదేతత్ చతుర్థ – పఞ్చమమన్త్రద్వయం మిలిత్వా ఏకో మన్త్రః. అస్య మన్త్రస్య గౌతమ ఋషిః, గాయత్రీ ఛన్దః, రుద్రో దేవతా.

**సాగ్రామికేన వపుషా ప్రవిరాజమానం – దేవం పురత్రయవినాశనమన్దహాసమ్।**
**దైత్యాన్ధిధక్షుమచలేశ్వరచాపపాణిం – ధ్యాయేత్పురారిమథ భూమిరథాదిరూఢమ్॥**

ఏతాభ్యాం మన్త్రాభ్యామకాలమరణపరిహారాదిర్భవతి. ఏకవింశతిదినాని నిరన్తరజపాత్పురశ్చరణసిద్ధిః. ఇతి పఞ్చమః.

**అనువాదము:** 'నమస్తే రుద్ర' అను ప్రథమమంత్రముచే నమస్కరించి ద్వితీయతృతీయ చతుర్థమంత్రములతో ఇష్టప్రాప్తి – అనిష్టపరిహారములు ప్రార్థింపబడినవి. ఇప్పుడిక పంచమమంత్రముచే పూర్వోక్తఫలములనే స్తుతిపూర్వకముగ ప్రార్థించుచున్నాడు –

(అర్థము) హే గిరిశ! = వేదప్రతిపాద్యుడవైన పరమేశ్వరా!, అచ్ఛ! = నిర్మల స్వరూపా!, త్వామ్ = నిన్ను, శివేన = మఙ్గళరూపమైన, వచసా = వాక్కుతో, వదామసి = స్తుతించుచున్నాము. యథా = ఏ ప్రకారముగ (మా స్తుతిచేత), నః = మాయొక్క,

సర్వమ్ ఇత్ = పశుపుత్త్రాదిసముదాయ మంతయును, అయక్ష్మమ్ = రోగరహితమైనది, సుమనాః = సౌమనస్య (సుఖ)ముతో గూడినదియును, అసత్ = అగునో, ఆ ప్రకారముగ స్తోత్రముజేయుచున్నా మని సమన్వయము.

(వివరణము) 'గిరిశ' అను సంబోధనములో గిరిశబ్దమునకు వేదము లని యర్థము. 'తగ్ం హ త్రీన్గిరిరూపాన్' (తై.బ్రా. 3–0) అను కాఠకవచనములో – ఇన్ద్రుడు భరద్వాజునకు అపూర్వములగు మూడు పర్వతములను చూపించినాడని యుపక్రమించి, ఉపసంహారములో – **'వేదా వా ఏతే'** అను వాక్యముచే ఆ పర్వతములు వేదరూపములుగా నిర్దేశింపబడినవి. కాగా – అట్టి వేదరూపములగు గిరులయందు శయనించువాడు, అనగా – వేదప్రతిపాద్యు డని యర్థము. కావుననే స్తోత్రార్హు డను భావము సూచితమగు చున్నది. ఇక – స్తుతి జేయు జీవుడు పాపాత్ముడు గాన, అట్టి వాని స్తుతివచనసంపర్కముచే స్తుత్యుడగు పరమేశ్వరునకు పాపము ప్రసక్తము కాదా? అను శంకకు సమాధానముగా 'అచ్ఛ' అను రెండవ సంబోధనము ప్రయోగింపబడినది. నిత్యనిర్మలుడగు పరమేశ్వరునకు నా మలినవచస్సంపర్కము కలిగినను. అది మాలిన్యాపాదకము కాదు. వీథులలోని నీరు గంగలో కలిసినందున, గంగకు గల పవిత్రతకు భంగము వాటిల్లుచున్నదా! పైపెచ్చు గంగాప్రవాహసంపర్కముచే వీథులలోని నీరే పవిత్రమై యమునవలె గంగతో కలసి ప్రవహించుచున్నది. అట్లే పరమ పావనుడగు భగవానునితో స్తుతిరూపముగ సంగమించిన నా వాక్యమే వేదవాక్యమువలె లోకమాన్య మగుచున్నదని – సంబోధనాశయము. కావుననే గంగాప్రవాహ ప్రవిష్టమగు రథ్యోదకమునకు గంగాభావము కలిగినట్లు, శివునిలో ప్రవేశించిన నా స్తుతివచనమునకు శివభావమే సిద్ధించు నను తాత్పర్యమును **'శివేన వచసా'** అను పదద్వయము స్ఫుటీకరించుచున్నది.

పురశ్చరణవిధానములో, చతుర్థ–పంచమ మంత్రములు ఒకే మంత్రముగ పరిగణింపబడుచున్నవి. ఈ మంత్రమునకు ఋషి – గౌతముడు, ఛన్దస్సు – గాయత్రి, దేవత – రుద్రుడు, (సాంగ్రామికేన...రూఢమ్) దుష్టదైత్యులను సంహరించు తలంపుతో రథముగా రూపొందిన భూమి నధిష్ఠించి, పర్వతరాజమగు మేరువును ధనుస్సునుగా చేపట్టి అట్టహాసముజేయుచు యుద్ధోచితమగు వీరవేషముతో విరాజిల్లుచున్న త్రిపురమథనోద్యుక్తుడైన పురారాతినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రములచే అకాలమరణపరిహారాది ఫలములు చేకూరును. ఇరువదియొక్క దినములు నిరంతరము జపించుటచే పురశ్చరణసిద్ధి యగును.

మూ. అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్,

అహీగ్ంశ్చ సర్వాఞ్జమ్భయన్సర్వాశ్చ యాతుధాన్యః. 6

**భాష్యమ్** – నన్వేవం నమస్కారస్తోత్రాభ్యాం మయి ప్రసాదితేఽపి వైవస్వతచిత్రగుప్తాదీనా మతిదుర్దాన్తానామన్యేషాం చ త్వదీయపాపసాక్షిభూతానామన్యేషాం దేవానాం సత్త్వేన కథం తవానిష్టపరిహారః స్యాదిత్యాశఙ్క్య, త్వత్ప్రసాదే సతి తే సర్వేఽప్యకిఞ్చిత్కరా ఇత్యాహ – **అధ్యవోచదితి**. పక్షపాతవచనమధివచనమ్. **'యద్బ్రాహ్మణశ్చాబ్రాహ్మణశ్చ ప్రశ్నమేయాతాం బ్రాహ్మణాయాధిబ్రూయాత్'** (తై.సం.2–5–11) ఇతి శ్రవణాత్. తథా చాయమర్థః – **అధివక్తా** – భక్తేభ్యోఽధివచనస్వభావః, **ప్రథమః** – ప్రధానభూతః, శ్రేష్ఠ ఇతి యావత్. **దైవ్యః** – దేవేషు భవః దేవాన్తర్యామీత్యర్థః. **భిషక్** – పాపరోగసంసారదారిద్ర్యాదిసకలవ్యసన–చికిత్సకః, **'భిషక్తమం త్వా భిషజాం శృణోమి'** ఇతి శ్రుతేః. ఏవంవిధో భగవాన్ అధ్యవోచత్ – అధిబ్రవీతు, **'ఛన్దసి లుఙ్'** ఇతి లోడర్థే లుఙ్. మదీయోఽయమితి పక్షపాతం కరోత్విత్యర్థః. కిం కుర్వన్? సర్వానపి అహీన్ – సర్పవృశ్చికచోరవ్యాఘ్రాదీన్ప్రత్యక్ష–హింసకాన్, సర్వాశ్చ యాతుధాన్యః – యాతుధానజాతీః రక్షఃపిశాచాద్యపస్మారరూపాః పరోక్షహింసికాః జమ్భయన్ – నాశయన్ అధ్యవోచదితి.

అత్ర సర్వసమస్య భగవతః కథం త్వయి పక్షపాతవచనమ్? తథా సతి వైషమ్యనైర్ఘృణ్యప్రసఙ్గ ఇతి శఙ్కా పరిహారార్థమధివక్తేత్యుక్తమ్. భక్తేష్వధివచనం హి భజనకర్మప్రయుక్తమ్, అతో నేశ్వరస్య దోషమావహతి, **'వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్'** (బ్ర.సూ.2–1–12) ఇతి న్యాయాదితి భావః. సత్యపి భగవత్పక్షపాతే వైవస్వతాదిదేవతాన్తర–ప్రయుక్తః పాపఫలానుభవః కుతో న స్యాదితి శఙ్కానిరాసాయ 'ప్రథమ' ఇత్యుక్తమ్. 'యో దేవానాం ప్రథమః పురస్తాద్విశ్వాధికో రుద్రో మహర్షిః' 'తమీశ్వరాణాం ప్రథమం మహేశ్వరం తం దైవతానాం ప్రథమం చ దైవతమ్', 'యో దేవస్సర్వదేవేషు మహాదేవ ఇతి స్మృతః, తస్మై నమస్తు కుర్వాణా దివి తిష్ఠన్తి దేవతాః.' ఇత్యాది శ్రుతిస్మృతీతిహాస సహస్రావగతసర్వదేవతాశ్రేష్ఠభావే భగవతి మత్పక్షపాతిని సతి, న తదుపజీవిదేవతాన్తర ప్రయుక్తదుఃఖశఙ్కావకాశ ఇతి భావః. న కేవలం మే దేవతాన్తరప్రయుక్తదుఃఖాభావ మాత్రం, ప్రత్యుత సకలదేవతాపూజ్యత్వమపి, యతః తదన్తర్యామితయా తదీయపూజ్యతాబుద్ధిప్రేరకో భగవాన్ మత్పక్షపాతీ జాత ఇతేతత్ **'దైవ్య'** ఇత్యనేన దేవాన్తర్యామిత్వవాచినా దర్శితమ్.

భిషగిత్యనేన 'నిదానజ్ఞస్య భిషజో రుగ్ణే హింసాం ప్రయుఞ్జతః, న కిఞ్చిదత్ర నైర్ఘృణ్యం ఘృణైవాత్ర ప్రయోజికా' ఇతి శివపురాణోక్తభిషగ్దృష్టాన్తదర్శనేనోపపాదితం భగవతః పరమకారుణికత్వముక్తమ్. తేన చ అహియాతుధానీః హింసతః తద్విషయేఽపి దయాలుత్వమేవ ప్రదర్శితం భవతి. యథా వ్రణవైద్యః క్షారచ్ఛేదదాహాదిభిః వ్రణినస్తాత్కాలికదుఃఖకరోఽపి వ్రణనివారణేన తం సుఖయన్ దయాలురేవ, తథా సంసారవైద్యః పరమేశ్వరోఽపి అహియాతుధానీః హింసన్నపి తదీయక్రూరజన్మహేతు దురితనివారణేన తాననఘాన్ కృత్వా క్రమేణ సుఖం కరోతీతి న తస్య దయాలుత్వక్షతిరితి.

అధిబ్రువన్ జమ్భయతు ఇత్యనుక్త్వా **'జమ్భయన్నధ్యవోచ'** దిత్యుక్త్వా భగవతః నిరఙ్కుశమీశ్వరత్వం ప్రదర్శితమ్. అహియాతుధానీనాం, తత్ప్రేరకమృత్యుదేవతానాం చ నిగ్రహే స్వయమశక్తశ్చేత్ఖలు **'మదీయోఽయం న హింసితవ్య'** ఇతి తదనునయపూర్వక-మహియాతుధానీభ్యః ప్రణతం మోచయన్భగవానధిబ్రువన్ జమ్భయత్వితి ప్రార్థ్యేత, న త్వేవమ్; కిం తు స్వయం తచ్ఛక్తః ప్రథమమహియాతుధానీనాశనేన ప్రణతం పాలయన్, దేవైరాగత్య కథమయం పాపిష్ఠః పాల్య ఇతి పృష్టే, మదీయోఽయం – కుతోఽస్య పాపమితి పక్షపాతవచనం కరోతి అత ఏవ మహాపాతకినః కిరాతాదీన్ నినీషతో యమభటాన్నిజదూతైర్ఘాతయిత్వా పరమేశ్వరేణ తేషు కైలాసమానీతేషు యమచిత్రగుప్తాదిభిః తద్వృత్తాన్తే విజ్ఞాపితే తాన్ప్రతి భగవతా యదృచ్ఛయాఽపి మయి బిల్వదల క్షేపప్రణామాదికమాచరితవన్తో మదీయాః, తస్మాన్నైతేషు భవతామధికారోఽస్తీతి ఉక్తమితి పురాణేషు బహుశః కథా జోఘుష్యతే. తదేతదభిప్రేత్య అగ్రే **'రక్షా చ నో అధి చ దేవ బ్రూహి'** ఇతి ప్రథమం రక్షణం, పశ్చాదధివచనం ప్రతిపాదయతీతి. సోఽయం మన్త్రో విషజ్వరరక్షఃపిశాచాదినిఖిలపీడానివర్తకః, అత ఏవ కవచమిత్యస్య నామధేయమ్. యదాహ భగవాన్ బోధాయనః – 'అధ్యవోచదితి కవచమ్' ఇతి.

అస్య మన్త్రస్య కణ్వఋషిః, అనుష్టుప్ ఛన్దః, శంభుర్దేవతా.

**చన్ద్రార్ధమౌలిం కాలారిం వ్యాలయజ్ఞోపవీతినమ్।**
**జ్వలత్పావకసంకాశం ధ్యాయేద్దేవం త్రిలోచనమ్॥**

పఞ్చాయుతజపాదస్య పురశ్చరణస్య సిద్ధిః. ఇతి షష్ఠః॥

**అనువాదము:** ఇట్లు స్తుతినమస్కారములతో నన్ను బ్రసన్నుని జేసికొన్నను, మిక్కిలి దుర్దాన్తులగు యమచిత్రగుప్తాదులు, మరియు నీ పాపమునకు సాక్షిభూతులగు ఇతర

దేవతలు నుండగా, నీకు అనిష్టపరిహార మెట్లు సాధ్యమగును అని శంకింతువేమో; నీ యనుగ్రహము లభించినచో, వారేమియు చేయజాలరని – చెప్పుచున్నాడు –

(అర్థము) అధివక్తా = భక్తుల విషయమున పక్షపాతమును వహించి పలుకు స్వభావముగలవాడును, ప్రథమః = దేవతలలో ప్రధానుడును, దైవ్యః = దేవతల కన్తర్యామియు, భిషక్ = పాపరోగదారిద్ర్యాది సర్వవిధసాంసారికబాధలకు చికిత్సకుడును నగు భగవానుడు, సర్వాన్ అహీన్ = సమస్తములైన ప్రత్యక్ష హింసాజనకములగు సర్పవృశ్చికచోరవ్యాఘ్రాదులను, సర్వాశ్చ యాతుధాన్యః = సమస్తములైన పరోక్షహింసకము లగు రక్షఃపిశాచాదిజాతులను, జంభయన్ = నశింపజేయుచు, అధ్యవోచత్ = నా విషయమున పక్షపాతమును వహించి 'వీడు నా వాడు' అని పలుకుగాక.

(వివరణము) పక్షపాతముతో గూడిన వచనము – అధివచనము. 'యద్బ్రాహ్మణశ్చాబ్రాహ్మణశ్చ' అను శ్రుతిలో 'అధిబ్రూయాత్' అను పదమీ యర్థమునే బోధించుచున్నది 'అధ్యవోచత్' అనుచో 'ఛన్దసి లుఙ్ లఙ్ లిటః' అను సూత్రానుసారము లోదర్థమున లఙ్ ప్రయుక్తమైనది సర్వసముడగు భగవంతుడు ఒకని విషయమున పక్షపాతములో పలుకుటెట్లు ఘటించును? అట్లగుచో ఆయనకు గూడ అస్మదాదులకు వలె వైషమ్యనైర్ఘృణ్యములు ప్రసక్తములు కావా? ఈ శంకకు సమాధానముగా **'అధివక్తా'** అను పదము ప్రయోగింపబడినది. భక్తుల విషయమున పక్షపాతము వహించి పలుకుట– భజించువారి భక్తిరూపపుణ్యకర్మప్రయుక్తమేగాని, ఈశ్వరుని చిత్తదోషప్రయుక్తము కాదు. *(వైషమ్యనైర్ఘృణ్యాధికరణములో పూర్వోక్తమగు పరమేశ్వరునియొక్క జగత్సృష్టిస్థితిలయకారణత్వము నాక్షేపించి సమాధానము చెప్పబడినది.*

*ఈశ్వరుడే జగత్కారణ మన్నచో దేవతలు మున్నగువారిని అత్యన్త సుఖవంతులుగను, మనుష్య పశుపక్ష్యాదులను అల్పసుఖవంతులుగను సృజించునాతడు పక్షపాతి కావలసివచ్చును. ప్రళయకాలమున సర్వప్రాణులను సంహరించు నాతడు నిర్దయుడు క్రూరుడు గావలసివచ్చును. నిత్యశుద్ధుడుగా ప్రసిద్ధుడైన అతని కిది తగదని – ఆక్షేపించి, ఆ యా ప్రాణులయొక్క పూర్వకృతములగు పుణ్యపాపములే ముఖ్యకారణములు. ఈశ్వరుడు సాధారణకారణము మాత్రమే. వ్రీహి యవాదుల ఉత్పత్తిలో పర్జన్యుడు (వర్షము) సాధారణకారణమే. వ్రీహియవాదులలోని వైషమ్యముల కా యా బీజశక్తులే ముఖ్యకారణము లగుచున్నవి గదా! 'పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన' ఇత్యాది వచనములుగూడ ఇందుకు ప్రమాణములు – అని సమాధాన మీయబడినది.)* వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్తథా హి దర్శయతి' అను శారీరక మీమాంసాసూత్రము (2–1–12) లోని 'సాపేక్షత్వాత్' అను

పదముచే ఈ యర్థమే వివక్షితమగుచున్నది. ఒకవేళ భగవంతుడు పక్షపాతమును జూపినను, యమచిత్రగుప్తాదుల ద్వారా పాపఫలమగు నరకాదికము ప్రాప్తము గావచ్చును గదా? అను శంకానివారణార్థము 'ప్రథమః' అను విశేషణము. 'యో దేవానాం ప్రథమమ్. ...' 'తమీశ్వరాణాం ప్రథమం మహేశ్వరం...' 'యో దేవస్సర్వదేవేషు...' ఈ మొదలగు వేలకొలది శ్రుతిస్మృతీతిహాసములలో సర్వదేవతాధికుడుగా బ్రసిద్ధుడైన భగవానుడు మన పక్షమై యుండగా, తద్భృత్యులగు యమచిత్రగుప్తాదులవలన దుఃఖము కలుగునను భయమున కవకాశమే లేదని భావము. మఱియు అఖిలదేవతలకును అన్తర్యామియై, వారికి పూజ్యత్వమును కల్పించిన భగవానుడు నా యెడ పక్షపాతియై యుండుటవలన, కేవలము ఇతరదేవతలవలన భయము లేకపోవుటమాత్రమే కాదు; సకలదేవతా పూజ్యత్వము గూడ నాకు సంప్రాప్తమగునను భావము, దేవతాన్తర్యామి యను నర్థముగల 'దైవ్యః' అను విశేషణముచే ద్యోతితమగుచున్నది. 'భిషక్' అను విశేషణముచే, 'నిదానజ్ఞస్య భిషజో... ప్రయోజికా' అను శివపురాణవచనానుసారము, నిదానము (ఆదికారణము) నెరిగిన వైద్యుడు రోగికి శస్త్రచికిత్సాదులచేగాని, పథ్యపానాదులచేగాని తాత్కాలికముగ క్లేశమును కలిగించినను, అందుకు రోగియందలి దయయే కారణముగాని, కఠినహృదయత్వము కారణము కానివిధముగ, సర్పయాతుధానాదులను హింసించుటలో గూడ భవరోగవైద్యుడగు భగవానునకు కరుణయే కారణము గాని, కాఠిన్యముకాదని తెలియుచున్నది. ఇందుమూలమున ఆ యా జీవుల క్రూరజన్మములకు కారణమగు పాపమును బాపి, పరిశుద్ధుల గావించి, సుఖసంపన్నులజేయుటయే సంభవించుచున్నది. లౌకికవైద్యులు శారీరకములగు రోగములకు మాత్రమే చికిత్స గావించి తాత్కాలికముగ దుఃఖమును బోగొట్టుచున్నారు. భగవానుడన్ననో – సర్వదుఃఖమూలమగు సంసార రోగమునకే చికిత్స నొనర్చి అత్యన్తికదుఃఖనివృత్తిని గలిగించు ఘనవైద్యుడు. కావుననే శ్రుతి **'భిషక్తమం త్వా భిషజాం శృణోమి'** అని చెప్పుచున్నది. మఱియొక విశేషమేమనగా– ముందు భక్తులయెడ పక్షపాతమును ప్రదర్శించుట, అటుపైని సర్పయాతుధానాదులను, తత్ప్రేరకులగు మృత్యుదేవతలు మున్నగువారిని నిగ్రహించుట – అను క్రమము సముచితమై యుండగా, మంత్రములో ముందే ఇతరనిగ్రహమును, తదుపరి అధివదనమును చెప్పుటనుబట్టి పరమేశ్వరునకుగల నిరతిశయమగు నిగ్రహానుగ్రహసామర్థ్యము స్ఫుటమగుచున్నది. సామాన్యుడగుచో – ముందొకనిపై పక్షపాతమును జూపుట, ఆపైని యాతని నెవరేని హింసింపబూనుకొనుచో వారిని బ్రతిమాలి ఆ హింసనుండి తనవానిని తప్పించుటయు జరుగును. పరమేశ్వరుని పరిస్థితి అట్టిది కాదు; తనను శరణుజొచ్చిన

వానిని ముందు సర్పరాక్షసాదుల బరిమార్చి రక్షించును. పిదప 'ఈ పాపాత్ముని ఏల రక్షించితివి?' అని పాపులను శిక్షించు అధికారములోనున్న దేవతలు ప్రశ్నింతురేని, 'వీడు నా వాడు, నన్ను శరణుజొచ్చిన వీని కింకను పాప మెక్కడ నున్నది?' అని భక్తపక్షపాతమును ప్రదర్శించును. మహాపాతకులను కిరాతాదులను నరకమునకు గొనిపోవుచున్న యమభటులను, పరమేశ్వరుడు తన దూతలద్వారా నిరోధించి కైలాసమునకు తెప్పించినాడనియు, యమచిత్రగుప్తాదులు వచ్చి వారి పాపచరిత్రను నివేదించగా, 'వీరు యాదృచ్ఛికముగనే యైనను నాపై బిల్వదళముల నుంచి నమస్కరించుట మూలమున నా వారే యైనారు. కావున వీరిని గూర్చి విచారించు అధికారము మీకు లేదు' అని పలికినాడనియు – ఈ విధముగ అనేక పురాణగాథలు ప్రసిద్ధములై యున్నవి. ఈ యభిప్రాయముతోనే ముందుగూడ 'రక్షా చ నో అధి చ దేవ బ్రూహి' అను మంత్రములో మొదట రక్షణము, పిదప అధివదనము ప్రతిపాదింపబడినది.

ఈ మంత్రము – విషజ్వరరక్షఃపిశాచాదిపీడలను నశింపజేయును. కావుననే దీనికి **'కవచ'**మని నామధేయము. బోధాయనసూత్రములో – **'అధ్యవోచదితి కవచమ్'** అని చెప్పబడినది. దీనికి ఋషి – కణ్వుడు, ఛన్దస్సు – అనుష్టుప్, దేవత – శంభువు. (చంద్రార్ధమౌళిం...త్రిలోచనమ్) అర్ధచన్ద్రాలంకృతమైన శిరస్సుకలవాడు, కాలకాలుడు, సర్పములను యజ్ఞోపవీతముగ ధరించినవాడు, జ్వలించుచున్న అగ్నివలె ప్రకాశించు చున్నవాడు, త్రిలోచనుడు – ఇట్టివానిని శ్రీశంభువును ధ్యానించవలెను. ఏబదివేల పర్యాయములు జపించిన మన్త్రపురశ్చరణము సిద్ధించును.

**మూ. అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమఙ్గలః।**
**యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు।**
**శ్రితాస్సహస్రశో౽వైషాగ్ం హేడ ఈమహే॥ 7**

**భాష్యమ్** – ఇత్థం షడ్భిర్మన్త్రైః పరమేశ్వరః ప్రసాద్య ప్రార్థితః. ఇదానీమఖిలకర్మ–సాక్ష్యాదిత్యాత్మా భగవాన్ ద్వాభ్యాం ప్రసాద్య ప్రార్థ్యతే – అసౌ యస్తామ్ర ఇతి. యః పూర్వోక్తః భగవాన్ స ఏవ అసౌ ప్రత్యక్షం పరిదృశ్యమానః సూర్య ఇత్యర్థః. ప్రత్యక్షం పరిదృశ్యమానమేవ తద్రూపం విశేషణైర్దర్శయతి – తామ్రో అరుణ ఉత బభ్రుః సుమఙ్గలః.

ఉదయకాలే అత్యన్తరక్తవర్ణః - తామ్రః. తదనన్తరమీషద్రక్తః - అరుణః. తత ఊర్ధ్వం పిఙ్గలవర్ణః - బభ్రుః. యదాహుః -

**పిఙ్గలో నకులశ్చైవ ఖలతిర్విష్ణురేవ చ।**
**చత్వార ఏతైర్ నైరుక్తైర్బభ్రవస్సముదాహృతాః॥** ఇతి.

స చాన్ధకారహిమాదివారణేన జగత్సౌఖ్యహేతుత్వాత్ సుమఙ్గలః. అసతి హ్యాదిత్యరూపే అస్మిన్భగవతి, అన్ధకారాదిగ్రస్తం జగదమఙ్గలమేవ స్యాదితి భావః. ఏవంభూత-ఆదిత్యాత్మా భగవాన్రుద్రః, యే చ అన్యే రుద్రా ఆదిత్యేన సహైకీభూతాః, ఇమామ్ అభితః. అస్యా భూమేః పరితః దిక్షు శ్రితాః. పరమేశ్వరనియోగేన జనానాం పుణ్యపాపానురూప-తయానుగ్రహం నిగ్రహం చ కర్తుం ప్రాచ్యాదిదిక్షు స్థితాః. తే చ - సహస్రశః. అనేక-సహస్రసంఖ్యాకాః, **'సహస్రాణి సహస్రశః'** ఇత్యగ్రే వక్ష్యమాణాః, ఏషామ్ - ఆదిత్య రూపాణాం రుద్రాణామ్, హేడః - విహితాకరుణనిషిద్ధసేవానిమిత్తక్రోధమ్, అవేమహే - స్తుతినమస్కారాదిభిః అపనయామః. తే అస్మాకం ప్రసన్నా భవన్త్విత్యర్థః. ఇతి సప్తమః.

**అనువాదము:** ఇట్లు ఆరు మంత్రములచే పరమేశ్వరుని ప్రసన్నునిజేసి ప్రార్థించుట జరిగినది. సప్తమ - అష్టమ మంత్రములచే అఖిలకర్మసాక్షియైన ఆదిత్యస్వరూపుడగు భగవానుడు ప్రార్థింపబడుచున్నాడు -

(అర్థము) యః = ఏ రుద్రుడు, అసౌ = ప్రత్యక్షముగ గోచరించుచున్న సూర్యస్వరూపుడై, తామ్రః = ఉదయకాలమున మిక్కిలి ఎఱ్ఱనివాడుగను, అరుణః = తదుపరి కొంచెము ఎఱ్ఱనివాడుగను, బభ్రుః = అటుపై, పిఙ్గల (గోరోజన) వర్ణము గలవాడుగను, సుమఙ్గలః = చీకటిని తొలగించి లోకమునకు మంగళమును గలిగించు వాడుగను ప్రకాశించుచున్నాడో, ఉత = మరియు, యే చ రుద్రాః = ఏ రుద్రులైతే సూర్యునితో గలసియుండి, ఇమామ్ అభితః = ఈ భూమికి అన్నివైపుల, సహస్రశః = వేలకొలదిగ, దిక్షు శ్రితాః = అన్ని దిక్కులయందు నెలకొనియున్నారో, ఏషామ్ = ఆదిత్యరూపులైన యీ రుద్రులయొక్క, హేడః = క్రోధమును, అవ ఈమహే = స్తుతి నమస్కారాదులతో శమింపజేయుచున్నాము.

(వివరణము) పరమేశ్వరుడు ఆదిత్యరూపమున ప్రత్యక్షముగ ప్రకాశించు చుండుటను బట్టియే జగత్తునకు మంగళము (సౌఖ్యము) చేకూరుచున్నదనియు, అట్లు కానిచో అంధకార - నీహారాదిబంధురమై అమంగళమై యుండెడిదనియు 'సుమఙ్గలః' అను విశేషణము సూచించుచున్నది. మరియు, భగవానుడు సాక్షాత్తుగ ఆదిత్యరూపమున

భాసించుచుండుటయేగాక, భగవదాజ్ఞానువర్తులైన వేలకొలది రుద్రమూర్తులు ఆదిత్యునితో అవినాభూతులై అన్ని దిక్కుల సంచరించుచు ఆ యా ప్రాణికర్మానుగుణముగ నిగ్రహానుగ్రహములను చేయుచుందురనియు, వారిని గూడ స్తుతినమస్కారాదులచే బ్రసన్నుల గావించుకొను టావశ్యకమనియు మన్త్రముయొక్క ఉత్తరార్ధమునందలి సారాంశము.

**మూ. అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః।**

**ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః।**

**ఉతైనం విశ్వా భూతాని స దృష్టో మృడయాతి నః॥ 8**

**భాష్యమ్** - ఏవం సప్తమేన ప్రసాద్య అష్టమేనేష్టసిద్ధిం ప్రార్థయతే - అసౌ యోఽవసర్పతీతి. యః నీలగ్రీవః **'త్రిలోచనం నీలకణ్ఠం'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధః, స ఏవ అసౌ విలోహితః - విశేషేణ లోహితః సన్, అవసర్పతి - ప్రవర్తతే. కిమర్థం ప్రవర్తతే? తత్రాహ - ఉతైనమ్ ఇతి. ఏనమ్ = ఆదిత్యరూపం పరమేశ్వరమ్, గోపా ఉత - అజ్ఞానాం ప్రథమోదాహరణభూతా గోపాలకా అపి, అదృశన్ - పశ్యన్తి. తథా అదృశన్నుదహార్యః - ఉదకస్య హారికాః గోపాలేభ్యోఽప్యజ్ఞాః పశ్యన్తి. కియదితి విభజ్యాభిధేయమ్ ఉతైనం విశ్వా భూతాని - గోమహిష్యాదయః సర్వేఽపి ప్రాణినః పశ్యన్తి. తథా చ సర్వానపి స్వదర్శనేనానన్దయితుమేవ పరమేశ్వరః సూర్యాత్మా అవసర్పతి. శ్రూయతే హి - **'ఉద్యన్తం వా ఏతగ్ం సర్వాః ప్రజాః ప్రతినన్దన్తి'** (2-7-9) ఇతి. వేదాన్తైకసమాధిగమ్యం తు సచ్చిదానన్దాద్వైతరూపమితి దుర్విజ్ఞేయం, కైలాసాదివర్తి సగుణరూపముపాసకైరేవ దృశ్యం న తు సర్వైః. అతః సర్వప్రత్యక్షమేనం సర్వోఽప్యుపాస్య కృతకృత్యో భవతి, అహో మహిమేతి భావః, సః - తాదృశః ఆదిత్యాత్మా, దృష్టః - అనుచిన్తితః, నః - అస్మాన్. మృడయాతి - సుఖయతు.

**'ఏతాభ్యాం మన్త్రాభ్యామాదిత్యాత్మా భగవానుపస్థేయః'** ఇతి బ్రాహ్మణమ్. అత్ర **'అసౌ యస్తామ్రః'** ఇత్యస్య ఆస్తారపఙ్క్తిశ్ఛన్దః. **'అసౌ యోఽవసర్పతి'** ఇత్యస్య షట్పదా-జగతీచ్ఛన్దః, ద్వయోరపి మరుత్వానృషిః, ఆదిత్యరూపీ భగవాన్దేవతా.

**మణ్డలాన్తరగతం హిరణ్మయం – భ్రాజమానవపుషం శుచిస్మితమ్।**
**చణ్డదీధితిమఖణ్డితద్యుతిం – చిన్తయేన్మునిసహస్రసేవితమ్॥**

ఏవం కృచ్ఛ్రాచరణపూర్వకం షోడశదినేషు నిరన్తరజపాత్పురశ్చరణసిద్ధిః. అనావృష్టి పరిహారకోఽయం మన్త్రః. ఇతి అష్టమః.

**అనువాదము:** ఇట్లు సప్తమమన్త్రముచే శ్రీరుద్రుని ప్రసన్నుని జేసి, అష్టమమన్త్రముతో ఇష్టసిద్ధిని ప్రార్థించుచున్నాడు –

(అర్థము) యః నీలగ్రీవః = ఎవడు 'త్రిలోచనం నీలకణ్ఠం' ఇత్యాది శ్రుతులలో నీలకంఠుడుగా ప్రసిద్ధుడైయున్నాడో అతడే. అసౌ = ప్రత్యక్షసూర్యస్వరూపుడై, విలోహితః = ఉదయకాలమున విశేషించి యెఱ్ఱని వర్ణముగలవాడై, అవసర్పతి = సంచరించు చున్నాడు. (ఎందు కనగా?) ఏవమ్ = ఈ ఆదిత్యరూపముతోనున్న పరమేశ్వరుని, గోపా ఉత = అజ్ఞానులలో అగ్రగణ్యులగు గోపాలకులుగూడ, అదృశన్ = చూచుచున్నారు. ఉదహార్యః = అంతకన్నను అజ్ఞానులగు నీళ్లుమోసికొని జీవించు స్త్రీలు గూడ, అదృశన్ = చూచుచున్నారు. ఇట్లెన్నింటినని ప్రత్యేకించి చెప్పగలము? విశ్వాభూతాని ఉత = ఆవులు, గేదెలు మొదలగు సమస్త ప్రాణులు గూడ, ఏనమ్ = ఆదిత్యాత్మకుడగు శ్రీరుద్రుని– చూచుచున్నారు. సః = ఆ రుద్రుడు, దృష్టః = దర్శనధ్యానాదులచే సంభావితుడై, నః = మమ్ము, మృడయాతి = సుఖింపజేయుగాక.

(వివరణము) సర్వప్రాణులను తన దర్శనముచే సుఖింపజేయుటకే భగవానుడు సూర్యరూపమున గోచరించుచున్నాడు. ఈ విషయమునే 'ఉద్యన్తం వా ఏతగ్ం సర్వాః ప్రజాః ప్రతినన్దన్తి' (2–7–9) అను శ్రుతి గూడ బోధించుచున్నది. ఉపనిషన్మాత్రవేద్యమగు భగవానుని సచ్చిదానన్దాద్వైతస్వరూపము అత్యంతము దుర్విజ్ఞేయమైనది. కైలాసాది స్థానములలోనున్న సగుణరూపము గూడ ఉపాసకులకు మాత్రమే సాక్షాత్కరించును గాని, సర్వులకు కాదు. ఆదిత్యరూపమున ఆశేషలోక ప్రత్యక్షమగుచున్న పరమేశ్వర స్వరూపమన్ననో, ఎవరైనను దర్శించవచ్చును, కృతకృత్యులు కావచ్చును. అహో! భగవన్మహిమనేమని వర్ణింపగలమని – భావము.

ఈ రెండు మంత్రములకును ఆదిత్యరూప భగవదుపస్థానములో బ్రాహ్మణము వినియోగము జెప్పుచున్నది. ఈ రెంటికిని ఋషి–మరుత్వంతుడు, మొదటిదానికి ఛన్దస్సు– ఆస్తారపఙ్క్తి, రెండవదానికి – షట్పదజగతి, దేవత – ఆదిత్యరూపియగు భగవానుడు. (మణ్డలాన్తరగతం... సేవితమ్) హిరణ్మయమగు మూర్తితో విరాజిల్లుచు, ప్రచండములైన

కిరణములు, అఖండమైన తేజస్సుగలిగి వేలకొలది మునులచే సేవింపబడుచు నిర్మలమైన చిఱునవ్వుతో సూర్యమణ్డలాన్తర్గతుడై యున్నవానినిగా భగవానుని ధ్యానించవలెను. కృచ్ఛ్రాచరణపూర్వకముగ పదునారుదినములు నిరన్తరము జపించిన పురశ్చరణసిద్ధి యగును. ఈ మన్త్రము అనావృష్టిదోషమును పరిహరించును.

**మూ. నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే।**

**అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరన్నమః॥ 9**

**భాష్యమ్** – ఏవం సప్తమాష్టమాభ్యామాదిత్యరూపం ప్రసాద్య, నవమేన భూకైలాసినం శ్రీనీలకణ్ఠమూర్తిం ప్రసాదయితుం నమస్కరోతి. నమో అస్త్వితి. **నీలగ్రీవాయ** = నీలకణ్ఠమూర్తయే నమో అస్తు, కీదృశాయ? **సహస్రాక్షాయ** – అపరిమితవాచకః సహస్రశబ్దః. **'విశ్వం శతం సహస్రం చ సర్వమక్షయవాచకమ్'** ఇతి స్మృతేః. సహస్రమక్షీణి యస్య, తస్మై సహస్రాక్షాయ – అపరిచ్ఛిన్నదృష్టయే ఇత్యర్థః. అనేన కైలాసవాసినోఽపి తవ అత్ర మదీయనమస్కారః దృష్టివిషయ ఇత్యుక్తం భవతి. పునః కీదృశాయ? **మీఢుషే** – ప్రణతకామవర్షిణే, అనేన సమస్తేష్టసిద్ధిరూపనమస్కారఫలప్రదత్వం దర్శితమ్. నీలగ్రీవాయేత్యనేన చ కాలకూటగ్రసనకృతనీలకణ్ఠత్వశాలినే ఇత్యర్థేన –

**గుణదోషౌ బుధో గృహ్ణన్నిన్దుక్ష్వేలావివేశ్వరః।**
**శిరసా శ్లాఘతే పూర్వం పరం కణ్ఠే నియచ్ఛతి॥**

ఇతి ప్రసిద్ధో భగవన్మహిమా స్మర్యతే. తేన కాలకూటవిషతుల్యం దోషజాలమన్తరేవ నియమ్య కలామాత్రమపి గుణం శిరసా శ్లాఘమానః పరమేశ్వరః సుఖోపాస్యో వ్యజ్యతే. ఏవం భగవన్తం నమస్కృత్య తత్పారిషదాన్నమస్కరోతి – అథో య ఇతి. అథో – అపి చ, అస్య నీలకణ్ఠమూర్తేః, సత్వానః – సహనశీలాః ప్రత్యాసన్నాః ప్రమథగణాః, యే వర్తన్తే; ప్రసిద్ధా హి – **'దివ్యా గణా బహురూపాః పురాణాః'** ఇతి శ్రుతిషు భగవతః పారిషదాః. సామవేదే చ – **'అధిపతా ఇ క్షత్రపతా ఇ'** ఇత్యాదినా సర్వాధిపత్యేనోక్తాః. భారతేఽపి సౌషుప్తికే పర్వణి –

**కామకారకరాస్సిద్ధాస్త్రైలోక్యస్యేశ్వరేశ్వరాః।**
**నిత్యానన్దాః ప్రముదితా వాగీశా వీతమత్సరాః॥**

**ప్రాప్యాష్టగుణమైశ్వర్యం యేఽపి యాన్తి న విస్మయమ్।**
**యేషాం విస్మయతే నిత్యం కర్మభిర్భగవాన్భవః॥**

**శ్రుతేన బ్రహ్మచర్యేణ తపసా చ దమేన చ।**
**యే సమాసాద్య శూలాఙ్కం భవసాయుజ్యమాగతాః॥** ఇతి.

ద్రోణపర్వణి చ – **'తస్య పారిషదా దివ్యా నానారూపధరాః ప్రభో!'** ఇత్యాదినా ప్రపఞ్చితాః. పురాణేషు చ పరఃసహస్రం తన్మాహాత్మ్యవచనాని, తత్ర **'సహస్రాణి సహస్రశః'** ఇత్యత్ర కియదపి ఉదాహరిష్యతే. ఏవమథో యే అస్య సత్వానః ప్రమథగణాః, తేభ్యః నమః అకరమ్ – నమస్కరోమి.

అస్య మన్త్రస్య ఋషిః, దేవతా చ భగవానేవ. త్రిష్టుప్ ఛన్దః.

**శరచ్చన్ద్రప్రకాశేన వపుషా శీతలద్యుతిమ్।**
**ధ్యాయేత్సింహాసనాసీనముమయా సహితం శివమ్॥**

సుపుత్త్రావాప్తి ప్రధానోఽయం మన్త్రః. పురశ్చరణవిధిః సర్వోఽప్యర్ణవే ద్రష్టవ్యః. ఇతి నవమః.

**అనువాదము:** ఇట్లు సప్తమ–అష్టమమంత్రములచే ఆదిత్యరూపియగు శ్రీరుద్రుని ప్రసన్నుని గావించి, నవమమంత్రముచే భూకైలాసవాసియగు శ్రీనీలకంఠమూర్తిని ప్రసన్నునొనర్చుటకై నమస్కరించుచున్నాడు –

(అర్థము) సహస్రాక్షాయ = అనంతములైన కన్నులు గలిగినట్టియు, మీఢుషే = కామితార్థములను వర్షించునట్టియు, నీలగ్రీవాయ = నల్లని కంఠము గలిగినట్టియు రుద్రునకు, నమః అస్తు= నమస్కార మగుగాక, అథో = ఇంతే కాక, అస్య = ఈ నీలకంఠునియొక్క, సత్వానః = సన్నిహితులు సహనశీలులునగు ప్రమథులు, యే = ఎవరున్నారో, తేభ్యః = వారికొఱకున్ను, అహమ్ = నేను, నమః = నమస్కారమును, అకరమ్ = చేయుచున్నాను.

(వివరణము) 'నీలగ్రీవాయ' అను పదము లోకభయంకరమగు కాలకూట విషాగ్నిని భక్షించుటచే నలుపెక్కిన కంఠముగలవాడను నర్థమును బోధించుచు, **'గుణదోషౌ ...నియచ్ఛతి'** అను సుభాషితములో – 'విద్వాంసుడు పరుల గుణములను శ్లాఘించుచు దోషములను వ్యక్తీకరించక తన కంఠములోనే నిలిపి యుంచు' ననుటకు ఉపమానముగ

గ్రహింపబడిన భగవన్మహిమను స్మరింపజేయుచున్నది. అద్దానిచే – కాలకూట విషమునువలె దోషజాలమును మ్రింగివైచి, చంద్రకలనువలె గుణలేశమునైనను శిరస్సున ధరించి శ్లాఘించు పరమేశ్వరుడు భక్తులకు సులభోపాస్యుడని సూచితమగుచున్నది. 'సహస్రాక్షాయ' అను పదములోని సహస్రశబ్దము 'విశ్వం శతం సహస్రం చ' అను స్మృతి ననుసరించి 'అనన్త' మను నర్థమును బోధించును. కాగా – అపరిచ్ఛిన్న దృష్టిగలవాడని యా పదమునకు పర్యవసితార్థము. దీనిచే కైలాసమందున్నను ఇచటి భక్తుని ప్రణామమతని దృష్టిగోచర మగునను భావము సూచింపబడుచున్నది. మంత్రమునందలి పూర్వార్ధముచే పరమేశ్వరుని నమస్కరించి, ఉత్తరార్ధముచే ప్రమథగణములను నమస్కరించుచున్నాడు – ఈశ్వరభక్తులు, ఈశ్వరపారిషదులు, ఈశ్వరకార్యనిర్వాహకులునగు కొందరు 'ప్రమథగణములు' అను పేరుతో ఈశ్వరునకు సదా సన్నిహితులై యుందురని – శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి. 'దివ్యా గణా బహురూపాః పురాణాః' అను శ్రుతి సుప్రసిద్ధము. 'అధిపతా ఇ క్షత్రపతా ఇ' ఇత్యాదిగ సామవేదములో వారు సర్వాధిపత్యసంపన్నులుగ సంస్తుతింపబడినారు. మహాభారతములోని సౌషుప్తిక పర్వములో 'కామకారకరాస్సిద్ధా...భవసాయుజ్యమాగతాః' అనియు, ద్రోణపర్వములో – 'తస్య పారిషదా దివ్యా... నామరూపధరాః ప్రభోః' అని వారు నామరూపములలో ఈశ్వరుని బోలియుందురనియు తెలుపబడినది. పురాణములలో గూడ సహస్రాధికములగు తన్మాహాత్మ్యప్రతిపాదకములైన వచనములు కనిపించుచున్నవి. ముందు **'సహస్రాణి సహస్రశః'** అను మంత్రవ్యాఖ్యానములో గూడ ఈ విషయము కొంత వివరింపబడనున్నది.

ఈ మంత్రమునకు ఋషి దేవతయు భగవానుడే. ఛన్దస్సు – త్రిష్టుప్. (శరచ్చన్ద్ర ప్రకాశేన... సహితం శివమ్) శరత్కాలచంద్రునివలె ప్రకాశించుచున్న శరీరముతో చల్లని కాంతిగలిగి ఉమాదేవితో సహ సింహాసనాసీనుడై యున్నవానినిగ భగవానుని శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రమునకు సుపుత్త్రావాప్తి ప్రధానఫలము. సమగ్రపురశ్చరణ విధానమును 'అర్ణవము'లో జూచునది.

**మూ.** **ప్రముఞ్చ ధన్వనస్త్వముభయోరార్త్నియోర్జ్యామ్।**

**యాశ్చ తే హస్త ఇషవః పరా తా భగవో వప॥** **10**

**భాష్యమ్** – అథ దశమాదిషడ్భిరాయుధాన్యుపసంహారయితుం ప్రార్థయతే – యద్యపి

**'శివాం గిరిత్ర తాం కురు' 'మా హిగ్ంసీః'** ఇత్యాదినా పూర్వమేవ ప్రార్థితమ్, తథాఽపి భయాతిశయాత్పునః ప్రార్థ్యతే, అతో న పునరుక్తిశఙ్కావకాశః, ప్రముఞ్చేతి – హే భగవః– భగవన్!

**ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః।**
**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా॥**

ఇతి వచనోక్తసమగ్రైశ్వర్యాదిషడ్గుణసంపన్నమ్ – **'మతువసో రు సంబుద్ధౌ ఛన్దసి'** ఇతి రుత్వమ్. ధన్వనః = త్వదీయధనుషః సంబన్ధిన్యౌ యే ఆర్త్నీ కోటీ, తయోః స్థితాం జ్యామ్ – మౌర్వీం, త్వం ప్రముఞ్చ = శిథిలీకురు, న హి సమగ్రైశ్వర్యాదిసంపన్నస్య తవ ధనురన్యః కశ్చిత్ అవరోపయితుం శక్నోతి! **'ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః'** ఇత్యాది శ్రుతేః. అతస్త్వమేవ ప్రసన్నో భూత్వా ధనురపతతజ్యం కుర్విత్యర్థః. ఏవం ధనుషి అవరోపితేఽపి శరాః కబలయన్త ఇవ దృశ్యన్తే, అతః హే భగవః భగవన్! యాశ్చ తే – తవ హస్తే ఇషవః వర్తన్తే, తాః పరా వప– పరాఙ్ముఖీకురు. ఇతి దశమః.

**అనువాదము:** పదవమంత్రమునుండి ఆరు మంత్రములతో భయంకరములగు ఆయుధములను ఉపసంహరింపు మని భగవంతుని ప్రార్థించుచున్నాడు – ఐతే ఇట్టి ప్రార్థన 'శివాం గిరిత్ర తాం కురు' అను మంత్రముతో ఇతఃపూర్వమే చేయబడినది. ఐనను భయాతిశయముచే మరల జేయబడుచున్నది. అందువలన పునరుక్తిదోషశంక ప్రసక్తము కాదు.

(అర్థము) హే భగవః! = ఓ భగవంతుడా!, త్వమ్ = నీవు, ధన్వనః = నీ ధనుస్సుయొక్క, ఉభయోః ఆర్త్నియోః = రెండు అగ్రములనుండి, జ్యామ్ = అల్లెత్రాటిని, ప్రముఞ్చ = ఊడదీయుము, తే = నీయొక్క, హస్తే = హస్తమునందు, యాః ఇషవః = ఏ బాణములు కలవో, తాః = వాటిని, పరా వప = పరాఙ్ముఖములనుగా జేయుము.

(వివరణము) 'భగవః' అనునది – 'మతువసో రు సంబుద్ధౌ ఛన్దసి' అను సూత్రముచే మతుప్ప్రత్యయాన్తమగు భగశబ్దమునకు రుత్వవిసర్గలు చేర్చగా నిష్పన్నమైన సంబోధనపరమైన ఛాన్దసరూపము. దీనికి 'ఐశ్వర్యస్య సమగ్రస్య... భగ ఇతీరణా' అను వచనానుసారము సంపూర్ణైశ్వర్యవీర్యయశశ్శ్రీజ్ఞానవైరాగ్యరూపములగు షడ్గుణములు గలవాడని యర్థము. ఇట్టి అమేయప్రభావ సంపన్నుడవగు నీ ధనుస్సుయొక్క అల్లెత్రాటిని తొలగించుట ఇతరులకు సాధ్యముకాదు. గావున దయతో నీవే తొలగింపుమను భావమును

'త్వమ్' అను శబ్దము స్ఫురింపజేయుచున్నది. 'ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః' అను శ్రుతి శివధనుస్సును స్థిరధనుస్సుగా పేర్కొనుచున్నది.

**మూ. అవతత్య ధనుస్త్వగ్ం సహస్రాక్ష! శతేషుధే!।**
**నిశీర్య శల్యానాం ముఖా శివో నస్సుమనా భవ॥ 11**

**భాష్యమ్ –** ఏవం పరాఙ్ముఖీకరణమర్థయిత్వా తావన్మాత్రేణ భయశాన్తిమలభమాన ఇషూణాం కుణ్ఠితాగ్రత్వమాశాస్తే – అవతత్యేతి. శతసహస్రశబ్దావానన్త్యవాచినౌ. హే సహస్రాక్ష! అనన్తలోచన! శతేషుధే! అనన్తతూణీరేత్యర్థః. ఇషుధీనామానన్త్యాదేవ ఇష్వానన్త్య-మప్యుక్తం భవతి. లోకే హి పరిమితదృష్టిః పరిమితతూణీరశ్చ వేద్ధా ధానుష్కో దృష్టిపథ-పరిహారే, బాణవ్యయే వా సతి వేద్ధుం న ప్రభవతీతి కథంచిదనువర్తితుం శక్యః, త్వం తు అపరిచ్ఛిన్నదృష్టిరపరిమితబాణః న కథఞ్చిదనువర్తితుం శక్య ఇతి సంబోధనద్వయ-స్వారస్యమ్. అతః మదీయోపాయదుష్పరిహారే అస్మిన్నర్థే త్వమేవ ధనుః అవతత్య – అవరోపితజ్యాకం కృత్వా, శల్యానాం – బాణానామ్, ముఖా – ముఖాని, నిశీర్య – ఇషుధిషు న్యగ్భావేన శీర్ణాని కుణ్ఠితాగ్రాణి కృత్వా, ఏవం కృతేఽపి వేద్ధరి క్రూరే సతి మనో న విశ్రామ్యతి, అతో విశినష్టి – శివ ఇతి. సౌమ్యాకార ఇత్యర్థః. హార్దం వినా బహిః సౌమ్యాకృతిత్వమాత్రం న విస్రమ్భపదమిత్యతః సుమనా భవేతి. శరణాగతోఽయమనుగ్రాహ్య ఇతి దయామృతశీతలో భవేత్యర్థః. ఇత్యేకాదశః.

**అనువాదము:** ఇట్లు ధనుస్సును పరాఙ్ముఖము గావింపు మని ప్రార్థించియు, అంతటితో భయశాంతి కలుగనందున బాణములను గూడ కుంఠితాగ్రముల గావింపు మని కోరుచున్నాడు–

(అర్థము) హే సహస్రాక్ష! = అనంతములగు కన్నులుగలవాడా! శతేషుధే! = అనంతములగు అమ్ములపొదులు గలవాడా! త్వమ్ (ఏవ) = నీవే, ధనుః = ధనుస్సును, అవతత్య = తొలగింపబడిన అల్లెత్రాడు గలదానినిగ జేసి, శల్యానామ్ = బాణములయొక్క, ముఖా = అగ్రములను, నిశీర్య = విరుగగొట్టి (అధోముఖముగ అమ్ములపొదిలో బడవైచి) నః = మమ్ముగూర్చి, శివః = సౌమ్యమైన స్వరూపము గలవాడవు. సుమనాః = అనుగ్రహబుద్ధి గలవాడవున్ను, భవ = కమ్ము.

(వివరణము) శత–సహస్రశబ్దములు ఆనన్త్యార్థకము లని పూర్వమే చెప్పబడినది. లోకములో ధనుర్ధారియై బాణప్రయోగమొనర్చు వీరుడు – పరిమితదృష్టిగలవాడును, పరిమితములైన అమ్ములపొదులు గలవాడును ఐయుండును గాన, అతని దృష్టిలో పడకుండ తప్పించుకొనజాలినపుడు గాని, బాణములన్నియు ఐపోయిన స్థితిలో గాని, ఇక బాణములను ప్రయోగింపజాలడు గాన, ఎట్లో ఆత్మరక్షణము జేసికొనుట కవకాశమున్నది. కాని, నీ దృష్టి అపరిచ్ఛిన్నము. నీ బాణములు అనంతములు. నీ బారి పడకుండ తప్పించుకొనుట – అసంభవమను నభిప్రాయమును **'సహస్రాక్ష' 'శతేషుధే'** అను సంబోధనద్వయము సూచించుచున్నది. ధనుస్సునుండి అల్లెత్రాడును తొలగించుట గాని, బాణములను శిథిలాగ్రముల గావించుట గాని, అస్మద్దాదుల కశక్యముగాన, ఆ పనిని నీవే చేయవలె నను భావమును 'త్వమ్' పదము ప్రతిపాదించుచున్నది. బాణముల నుపసంహరించినను బాణప్రయోక్త క్రూరుడైనచో మనస్సునకు శాంతి యుండదుగాన, 'శివో భవ' సౌమ్యాకృతివి కమ్మని కోరుట జరుగుచున్నది. ఆకృతిసౌమ్యమగుట చాలదు; అన్తఃకరణముగూడ నట్టిదై యుండదగు నను భావమును 'సుమనాః' అను విశేషణము స్ఫురింపజేయుచున్నది.

**మూ.** **విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత।**

**అనేశన్నస్యేషవ ఆభురస్య నిషఙ్గథిః॥ 12**

**భాష్యమ్ –** ఇదానీం కుణ్ఠితాగ్రాణామపి బాణానామదర్శనం ప్రార్థయన్నాహ – విజ్యమితి. కపర్దినః – పరమేశ్వరస్య, ధనుః విజ్యం – విజ్యాకమ్, అస్త్వితి శేషః. బాణవాన్ ఉత – ఇషుధిరపి, విశల్యః – విగతబాణోఽస్తు, ఇషుధేర్విశల్యత్వేఽపి అన్యత్ర స్థితైః శల్యైర్వేధమాశఙ్క్యాహ – అనేశన్నితి. అస్య కపర్దినః ఇషవః అనేశన్ – వేద్ధుమసామర్థ్య–రూపం వినాశం ప్రాప్నువన్తు, నశేరాశిషి ఛన్దసి లఙ్. కిం చ – అస్య నిషఙ్గథిః – ఖడ్గకోశః, ఆభుః – ఈషత్ప్రభురస్తు. ఖడ్గం ధారయితుమేవ సమర్థః, న తు ఖణ్డనార్థం ఖడ్గాకర్షణపర్యన్తకార్యక్షమ ఇత్యర్థః.

అత్ర ప్రముఞ్చ ధన్వన ఇత్యాద్యాస్త్రయ ఏకో మన్త్రః. అస్య త్ర్యృచస్య నారద ఋషిః, అనుష్టుప్ఛన్దః, శ్రీరుద్రో దేవతా.

**ఉద్యద్భాస్కరకోటిప్రకాశమాదీప్తదహనధామా(మూర్ధా)నమ్।**
**భీషణభుజఙ్గభూషం ధ్యాయేద్వివిధాయుధం రుద్రమ్॥**

అనేన శత్రవో నశ్యన్తి. ఇతి ద్వాదశః.

**అనువాదము:** కుంఠితాగ్రములైన ఆ బాణములను గూడ తనకు కనిపించకుండునట్లు చేయుమని అర్థించుచున్నాడు –

(అర్థము) కపర్దినః = జటాజూటధారియైన పరమేశ్వరునియొక్క, ధనుః = పినాకనామకమైన ధనుస్సు, విజ్యమ్ (అస్తు) = విడిపోయిన అల్లెత్రాడుగలదియగుగాక, బాణవాన్ ఉత = అమ్ములపొదియును, విశల్యః (అస్తు) = బాణములు లేనిది యగుగాక. అస్య = ఈ కపర్దియొక్క, ఇషవః = బాణములు, అనేశన్ = వైరి శరీరములలో గ్రుచ్చుకొను సామర్థ్యములేనివై నశించుగాక. అస్య = ఈ రుద్రునియొక్క, నిషఙ్గథిః = ఖడ్గకోశము (కత్తినుంచు వర), ఆభుః = అల్పసామర్థ్యము గలది యగుగాక (నిరుపయోగ మగుగాక).

(వివరణము) 'ఆభుః' అను పదము – ఖడ్గమును దాచియుంచుటకు మాత్రమే ఉపయోగపడునట్టిదియు, పరులను ప్రహరించు తలంపుతో ఖడ్గము నాకర్షించుట కుపయోగించకుండునట్టిదియు కావలెనను భావమును తెలుపుచున్నది.

**'ప్రముఞ్చ ధన్వనః'** మొదలగు మూడు మంత్రములును పురశ్చరణ ప్రక్రియలో ఏకమంత్రముగా పరిగణింపబడును. ఈ తృచమునకు ఋషి – నారదుడు, ఛన్దస్సు – అనుష్టుప్, దేవత – శ్రీరుద్రుడు, (ఉద్యద్భాస్కరకోటి…రుద్రమ్) కోటిమంది సూర్యులొకేసారి ఉదయించిన నెంతటి ప్రకాశము కలుగునో అట్లు ప్రకాశించుచు, ప్రజ్వరిల్లుచున్న అగ్నికి ఆశ్రయమైన ఫాలభాగము గలిగి, భయంకరములగు సర్పములాభరణములుకాగా, వివిధాయుధములను ధరించియున్నవానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రము శత్రువినాశఫలప్రదము.

**మూ.** **యా తే హేతిర్మీఢుష్టమ! హస్తే బభూవ తే ధనుః।**
**తయాఽస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయా పరి బ్భుజ॥ 13**

**భాష్యమ్ –** ఏవం త్రిభిర్మన్త్రైరాయుధోపసంహారమర్థయిత్వా, తైరిదానీమాత్మరక్షణమాశాస్తే

– యా తే హేతిరితి. హే మీఢుష్టమ! – అతిశయేన భక్తకామవర్షిన్! ఇతి హేతుగర్భ–సంబోధనమ్. యా తే – తవ, హేతిః – ఖడ్గాద్యాయుధమ్, యదపి తే హస్తే ధనుః బభూవ – భవతి, తయా అయక్ష్మయా – భక్తారోగ్యహేతుభూతయా హేత్యా, తే – తవ, ధనుషా చేత్యపి ద్రష్టవ్యమ్. త్వమ్ అస్మాన్ విశ్వతః – సర్వస్మాద్దురితాత్, పరి బ్భుజ – పరిపాలయ. ఇతి త్రయోదశః.

**అనువాదము:** ఇట్లు మూడు మంత్రములతో ఆయుధోపసంహారము నర్థించి, ఇపుడు ఆయుధముల ద్వారా ఆత్మరక్షణము నాకాంక్షించుచున్నాడు –

(అర్థము) హే మీఢుష్టమ! = భక్తుల అభీష్టములను విశేషించి వర్షించువాడా!, యా తే హేతిః = ఏ నీ ఖడ్గాద్యాయుధము, మరియు, (యత్) ధనుః = ఏ ధనుస్సు, తే = నీయొక్క, హస్తే = హస్తమునందు, బభూవ = ఉన్నదో, అయక్ష్మయా = భక్తుల కారోగ్యప్రదమైన, తయా = ఆ ఆయుధముతోను, ఆ ధనుస్సుతోను, త్వమ్ = నీవు, అస్మాన్ = మమ్ము, విశ్వతః = సమస్తపాపరోగాదుల నుండి, పరిబ్భుజ = పరిపాలింపుము.

(వివరణము) 'మీఢుష్టమ' (భక్తాభీష్టములను విశేషించి వర్షించువాడా!) అనునది హేతుగర్భసంబోధనము. అట్టివాడు కనుకనే తన అభీష్టములను తప్పక నెరవేర్చునని తాత్పర్యము.

**మూ. నమస్తే అస్త్వాయుధాయానాతతాయ ధృష్ణవే।**
**ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే॥ 14**

**భాష్యమ్ –** అథైవం ప్రార్థ్య పునర్నమస్కరోతి – నమస్తే ఇతి. హే భగవన్! తే – తవ, ఆయుధాయ నమః అస్తు. కీదృశాయ? అనాతతాయ – ప్రహర్తుం వ్యాపృతమ్ ఆతతమ్, తదన్యత్ అనాతతమ్, తస్మై, ధృష్ణవే – స్వరూపేణ ప్రహర్తుం సమర్థాయ, ఉత – కించ, తే – తవ, ఉభాభ్యాం బాహుభ్యాం నమః అస్తు. బాహుభ్యామితి ద్వివచనేనైవ ద్విత్వే సిద్ధేఽపి, వేద్ధుముద్యతం బాహుద్వయముపలభ్య భయాతిరేకాత్ ఉభాభ్యామితి పునర్బ్రవీతి. తథా తవ ధన్వనే నమోఽస్తు ఇతి. ఇతి చతుర్దశః.

**అనువాదము:** ఇట్లు ప్రార్థించి మరల నమస్కరించుచున్నాడు –

(అర్థము) ఓ భగవంతుడా!, అనాతతాయ = శత్రువులపై ప్రయోగించుటకు

ఉద్యుక్తము కానట్టియు, ధృష్ణవే = సహజముగ ప్రయోగసమర్థమైనట్టియు, తే = నీయొక్క, ఆయుధాయ = ఆయుధముకొఱకు, నమః అస్తు = నమస్కారమగుగాక, ఉత = ఇంతేకాక, తే = నీయొక్క, ఉభాభ్యామ్ = రెండైనటువంటి, బాహుభ్యామ్ = బాహువులకొరకును, (తథా = అట్లే), తవ = నీయొక్క, ధన్వనే = ధనుస్సు కొఱకును, నమః = నమస్కార మగుగాక.

(వివరణము) 'బాహుభ్యామ్' అను ద్వివచనాన్తశబ్దముచేతనే రెండు బాహువులను నర్థము సిద్ధించుచుండగా ప్రత్యేకించి 'ఉభాభ్యాం' అని ప్రయోగించుటను బట్టి, ఆయుధమును ప్రయోగించుటకు ఉద్యుక్తమైయున్న బాహుద్వయమును జూచినపుడు కలిగిన భయాతిశయము సూచితమగుచున్నది.

**మూ. పరి తే ధన్వనో హేతిరస్మాన్వృణక్తు విశ్వతః।**
**అథో య ఇషుధిస్తవారే అస్మన్ని ధేహి తమ్॥ 15**

**భాష్యమ్ –** అథ నమస్కృత్య పునః ప్రార్థయతే – పరి తే ధన్వన ఇతి. హే భగవన్! తే ధన్వనః = ధనుషః సంబంధినీ, ధనుష్యారోపితేతి యావత్. ఏతాదృశీ యా హేతిః – బాణరూపమాయుధమ్, సా హేతిః అస్మాన్ విశ్వతః – సర్వస్మాదుపద్రవాత్ పరివృణక్తు = పరివర్జితాన్ కరోతు, రక్షత్విత్యర్థః. కథం పునః పాపరాశౌ విద్యమానే తవ ఉపద్రవ-పరిహారః స్యాత్? తత్రాహ – అథో – అపి చ, యః తవ ఇషుధిః – యత్ర తీక్ష్ణా ఇషవస్తిష్ఠన్తి, తమ్, అస్మత్ – అస్మాకం సంబంధిని, ఆరే – అరీణాం సమూహే పాపరాశౌ, నిధేహి – స్థాపయ, నాశయేత్యర్థః. ఇతి పఞ్చదశో మన్త్రః.

అత్ర 'యా తే హేతి' రిత్యాది త్ర్యృచస్య అనుష్టుప్ఛన్దః, ఋషిర్దేవతా చ భగవానేవ.

**ప్రణమదమరసఙ్ఘమౌలిమాలాకుసుమరజోఽరుణపాదపద్మయుగ్మమ్।**
**అనవరతమనుస్మరేద్భవాన్యా సహ జగతాం పితరం పినాకపాణిమ్॥**

శత్రునాశప్రధానోఽయం మన్త్రః.

**– ఇతి ప్రథమోఽనువాకః –**

**అనువాదము:** ఇట్లు నమస్కరించి మరల ప్రార్థించుచున్నాడు –

(అర్థము) ఓ భగవానుడా!, తే = నీయొక్క, ధన్వనః = ధనుస్సుకు సంబంధించిన (అనగా ధనుస్సునం దెక్కు పెట్టబడిన), హేతిః = బాణరూపమైన ఆయుధము, అస్మాన్ = మమ్ము, విశ్వతః = సమస్తోపద్రవములనుండి, పరి వృణక్తు = విడిపించు (రక్షించు) గాక. అథో = మరియు, యః తవ ఇషుధిః = తీక్ష్ణబాణసమన్వితమగు నీయొక్క తూణీర మేది కలదో, తమ్ = దానిని, అస్మత్ = మాకు సంబంధించిన, ఆరే = పాపరూపమైన శత్రుసమూహమునందు, నిధేహి = స్థాపింపుము. (మా పాపమును నశింపజేయుమని భావము).

(వివరణము) ఈ మంత్రముయొక్క పూర్వార్ధములో – నీ యాయుధములు మాకు ఉపద్రవము కలిగించకుండునట్లు చేయుమని ప్రార్థించుట జరిగినది. అందుపై – నీవు చేసిన పాపములు రాశీభూతములై యుండగా నీకు ఉపద్రవము లేకుండ జేయుటెట్లు? అను శంక కలుగగా – ఆ యాయుధములను నాయందుకాక, ఆ పాపరాశియందే ప్రయోగింపుమని ప్రార్థించుటకు ఉద్దేశింపబడినది.

**'యా తే హేతిః'** ఇత్యాది త్ర్యృచమునకు ఛన్దస్సు – అనుష్టుప్, ఋషియు, దేవతయు భగవానుడే. (ప్రణమదమరసంఘ…పినాకపాణిమ్) ప్రణమిల్లుచున్న దేవతాసంఘముల యొక్క శిరస్సులలో ధరింపబడిన మాలలలోని పుష్పముల పరాగముచే అరుణవర్ణమైన చరణనళినయుగళము గలిగి, పినాకపాణియై, భవానీసహితుడై వెలుగొందుచున్నవానినిగ జగత్పితయగు భగవానుని ధ్యానించవలెను.

**– ప్రథమానువాకము సమాప్తము –**



**"నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ మహాదేవాయ**
**త్ర్యమ్బకాయ త్రిపురాన్తకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ**
**నీలకణ్ఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ**
**సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః."**

– 0 –

# ద్వితీయోఽనువాకః

మూ. నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమః ॥1

**భాష్యమ్ –** తదేవం ప్రథమేఽనువాకే పఞ్చదశభిర్మన్త్రైర్భగవాన్ సపరికరః ప్రసాద్య ప్రార్థితః. అథేదానీం ద్వితీయాద్యైరష్టభిరనువాకైః సర్వేశ్వరత్వ – సర్వాన్తర్యామిత్వరూపేణ భగవన్తం నమస్కరిష్యన్ ప్రథమం సర్వేశ్వరత్వేన నమస్కరోతి. ఏతదారభ్య **'శ్వభ్యశ్శ్వపతి–భ్యశ్చ వో నమః'** ఇత్యన్తం సర్వ ఏవ ఉభయతోనమస్కారా ఏతే మన్త్రాః. సర్వత్ర చ నమ ఆదిర్నమోఽన్త ఏకైకో మన్త్రః. యథా – 'నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమః' ఇతి. ఏవమగ్రేఽపి. తత్ర తావత్ ప్రపఞ్చాన్తర్గతైకైకవస్త్వాధిపత్యప్రదర్శన–పూర్వకం భగవతః సర్వేశ్వరత్వముపపాదయన్ నమస్కర్తుమారభతే – నమో హిరణ్యబాహవే ఇతి. **హిరణ్యబాహవే** – హిరణ్మయకేయూరాద్యలంకృతబాహవే బాహుగ్రహణం చోపలక్షణమ్, ఆపాదమస్తకమతిదివ్యకనకఖచితభూషణతయా స్వరూపేణ చ సర్వోఽపి కనకవర్ణ ఏవ దివ్యమఙ్గలవిగ్రహ ఇతి హి శ్రుతయః ప్రథయన్తి. యథా – **'నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ' 'ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః' 'యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణమ్'** ఇత్యాద్యాః. **'రుక్మాభం స్వప్నధీగమ్యమ్' 'చారుచామీకరాభాసమ్'** ఇత్యాద్యాః స్మృతయోఽపి. **సేనాన్యే** – సేనాః నయతీతి సేనానీః, దేవాసురసిద్ధగన్ధర్వమనుష్యాది–సఙ్ఘాతరూపనానాసేనాపతిః. ఉక్తం హి ఆశ్వలాయనేన శివం ప్రస్తుత్య **'సర్వాణి హ వా ఏతస్య నామధేయాని, సర్వాశ్చ సేనాః సర్వాణి చోచ్ఛ్రయణాని'** ఇతి. తస్మై సేనాన్యే, తథా **దిశాం** – ప్రాచ్యాదీనామ్, **పతయే** – స్వామినే, నమః అస్తు. **'షష్ఠీయుక్తశ్ఛన్దసి వా'** ఇతి ఘిసంజ్ఞా. అత్ర 'దిశాం పతయే నమః' ఇతి ప్రథమమన్వయః. తత్ర కథం పరమేశ్వరస్య దిక్పతిత్వమ్? ఇన్ద్రాగ్న్యాదీనామేవ తథాత్వాదితి శఙ్కానిరాసాయ **'సేనాన్యే'** ఇతి విశేషితమ్. తేన సకలదేవతాసఙ్ఘాధిపతేః పరమేశ్వరస్యైవ దిగాధిపత్యమ్, ఇన్ద్రాదయస్తు తదాజ్ఞయా తత్తద్దిగధిష్ఠాతార ఇతి ప్రదర్శితమ్. పరమేశ్వరస్య ఇన్ద్రాద్యాధిపత్యం కథమిత్యాశఙ్కాయాం **'హిరణ్యబాహవే'** ఇతి విశేషితమ్. తేన హి **'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః'** ఇతి అన్తరాదిత్యవిద్యోపాస్యం పారమేశ్వరరూపముచ్యతే, అత ఏవ **'నమో హిరణ్యబాహవే'** ఇత్యస్య అన్తరాదిత్యవిద్యోపాసనే పురాణాదిషు వినియోగః కృతః.

**'యే చాముష్మాత్పరాఞ్చో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చ'** ఇతి అన్తరాదిత్యవిద్యా-వాక్యోక్తస్వర్గాదిలోకతద్భోగైశ్వర్యవిశిష్టం పరమేశ్వరరూపముపస్థాపయతా **'హిరణ్యబాహవే'** ఇత్యనేన స్వర్గతద్భోగాదీనీన్ద్రాదిభ్యః ప్రయచ్ఛతస్తస్య తదధిపతిత్వం యుక్తమితి ప్రదర్శితం భవతి. ప్రసిద్ధం చ పరమేశ్వరస్య శ్రుత్యాదిష్విన్ద్రాద్యాధిపత్యమ్. యథా 'సర్వమిదం బ్రహ్మావిష్ణు రుద్రేన్ద్రాస్తే సంప్రసూయన్తే' **'కారణం తు ధ్యేయః సర్వైశ్వర్యసంపన్నశ్శంభుః'** ఇతి. **'భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ'** ఇత్యాదయః. ఇతిహాసపురాణేషు చ, యథా భారతే – **'స దదాతి మనుష్యేభ్యః స ఏవాక్షిపతే పునః. శక్రాదిషు చ దేవేషు తస్యైవైశ్వర్యముచ్యతే'** ఇతి. భాగవతేఽపి 'బ్రహ్మాదయో యత్కృతలోకపాలాః' ఇతి. శివపురాణేషు చ ప్రపఞ్చితమ్. తదేవమిన్ద్రాదిలోకపాలవిశిష్టసకలదిక్పతిత్వేన పరమేశ్వరనమస్కారః ప్రథమమన్త్రార్థ ఇతి.

**అనువాదము:** ఇట్లు ప్రథమానువాకమునందలి పదునైదు మంత్రములతో సపరికరముగ భగవానుని ప్రసన్నుని జేసికొనుట వర్ణింపబడినది. ఇకనిప్పుడు రెండు మొదలు ఎనిమిది అనువాకములలో సర్వేశ్వరునిగా, సర్వాన్తర్యామిగా భగవానుని నమస్కరింపబోవుచు, మొదట సర్వేశ్వరస్వరూపునిగ నమస్కరించుచున్నాడు. **'నమో హిరణ్యబాహవే'** మొదలు **'శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చ వో నమః'** వరకు అన్నియు ఉభయతో నమస్కారమంత్రములు. 'నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమః'. ఈ విధముగ ఒక్కొక్క మంత్రము ఆదియందును అంతమందును నమఃపదము గలిగియుండును. అందు ప్రపంచమునందలి ఏకైకవస్త్వాధిపత్య ప్రదర్శనపూర్వకముగ భగవానునకు సర్వేశ్వరత్వము నుపాదించుచు నమస్కరించుటకు ఉపక్రమించుచున్నాడు –

(అర్థము) హిరణ్యబాహవే = బంగారుభుజకీర్తులతో భూషితములగు బాహువులు గలిగినట్టియు, సేనాన్యే = దేవాసురసిద్ధగన్ధర్వమనుష్యాది సమూహరూపములగు సేనలకు నాయకుడైనట్టియు రుద్రునకు నమస్కారము. అట్లే, దిశాం చ పతయే = తూర్పుమొదలగు సమస్తదిక్కులకు అధిపతియైనట్టియు శ్రీరుద్రునకు, నమః = నమస్కారము, నమస్కారద్వయము – ఆదరాతిశయద్యోతకము. ముందు మంత్రములలో గూడ నిట్లే గ్రహించునది.

(వివరణము) 'హిరణ్యబాహవే' అనుచో 'బాహు' గ్రహణ ముపలక్షణము. ఆపాదమస్తకము అత్యన్తదివ్యకనకఖచితభూషణములు గలవాడగుటచేతనేకాక, స్వరూపముచేగూడ సహజసువర్ణచ్ఛాయగల దివ్యమఙ్గళవిగ్రహము గలవాడని – 'నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ' 'ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః' 'రుక్మాభం స్వప్నధీగమ్యమ్'

'చారుచామీకరాభాసమ్' ఇత్యాది శ్రుతిస్మృతులు చాటుచున్నవి. 'దిశాం చ పతయే నమః' అనుచో 'షష్ఠీయుక్తశ్ఛన్దసి వా' అను సూత్రముచే, సమాసము కాకపోయినను, ఛన్దస్సులో వికల్పముగ **'ఘి'** సంజ్ఞ ప్రవర్తించునుగాన, 'పతయే' అను వ్యస్తరూపము సిద్ధించుచున్నది.

ఇచట ముందు 'దిశాం చ పతయే నమః' అని ముందు అన్వయించుటతోనే, ఇంద్రాగ్న్యాదులు దిక్పతులుగా ప్రసిద్ధులైయుండ, పరమేశ్వరుడు దిక్పతి యెట్లగును? అను శంక పొడమును. తత్సమాధానార్థము – 'సేనాన్యే' అను విశేషణము. దానిచే, సకలదేవసంఘాధిపతియగు పరమేశ్వరునకే దిక్పతిత్వము ముఖ్యము. ఇంద్రాదులన్నచో పరమేశ్వరాజ్ఞానుసారము ఆ యా దిక్కులకు అధిపతులుగా వ్యవహరింపబడుచున్నారను భావము సూచింపబడుచున్నది. ఇంద్రాది దేవతలకు గూడ పరమేశ్వరుడే అధిపతి యెట్లగు నను శంకకు సమాధానముగా 'హిరణ్యబాహవే' అను విశేషణము ప్రయోగింపబడినది. దానిచే 'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః' అని చెప్పబడిన *(అన్తరధికరణము (బ్ర.సూ. 1-1-7)లో 'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణ' ఇత్యాది (ఛా. 1-6-7-8) వాక్యముల నుదాహరించి, అందు పేర్కొనబడిన హిరణ్మయపురుషుడు జీవుడా? పరమాత్మయా? అను సంశయము కలుగుచున్న స్థితిలో – రూపరహితుడైన పరమాత్మ హిరణ్యశ్మశ్రుత్వాదిరూపము కలిగి ముండుటయు, అట్లే సర్వాత్మభూతుడైన వాడు ఆదిత్యమండలాదుల నాధారముగా జేసికొనియుండుటయు సంభవించదు గాన, కర్మోపాసనా జనితమైన పుణ్యాతిశయముగల జీవుడే యనుట యుక్తమనియు పూర్వపక్షమొనర్చి, ఆ సందర్భములో నిర్దేశింపబడిన సర్వపాపవినిర్ముక్తత్వము సర్వాత్మకత్వము, సర్వలోక కామనియామకత్వము మున్నగు లక్షణములు పరమేశ్వరుడని చెప్పినప్పుడే సరిపోవును. హిరణ్యశ్మశ్రుత్వాదిరూపము పరమాత్మకు స్వతస్సిద్ధము కాకపోయినను ఉపాసకానుగ్రహార్థము మాయామయమైన రూపమును ధరించుట – ఆతనికి సంభవించును. అట్లే ఆదిత్యమండలాధారత్వము తదభిమానియగు జీవునకే కాక, సర్వాన్తర్యామియగు పరమేశ్వరునకు గూడ సంభవించును గాన, అతనినే హిరణ్మయపురుషునిగా గ్రహించవలెనని సిద్ధాన్తము చేయబడినది.)* అన్తరాదిత్యోపాసనలో ధ్యేయమగు పరమేశ్వర స్వరూపము నిరూపితమగుచున్నది. కావుననే పురాణాదులలో 'నమో హిరణ్యబాహవే' అను మన్త్రమునకు అన్తరాదిత్యోపాసనలో వినియోగము ప్రదర్శింపబడినది. 'యే చాముష్మాత్పరాఞ్చో లోకాస్తేషాఞ్చేష్టే దేవకామానాం చ' అను అన్తరాదిత్య విద్యావాక్యములో ప్రతిపాదింపబడిన స్వర్గాదిలోకభోగైశ్వర్యవిశిష్టమైన పరమేశ్వర రూపమును స్ఫురింప జేయుచున్న 'హిరణ్యబాహవే' అను పదముచే స్వర్గతద్భోగాదులను ఇన్ద్రాదుల కనుగ్రహించు పరమేశ్వరునకు తదాధిపత్యము స్వతస్సిద్ధమని

చెప్పినట్లగుచున్నది. 'సర్వమిదం బ్రహ్మ... శంభుః' 'భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ' ఇత్యాది శ్రుతులు, ఇతిహాసపురాణములు గూడ పరమేశ్వరుని సర్వాధిపత్యమును ప్రతిపాదించు చున్నవి. మహాభారతములో – 'స దదాతి మనుష్యేభ్యః... తస్యైవైశ్వర్యముచ్యతే' అనియు, భాగవతములో – 'బ్రహ్మాదయో యత్కృతలోకపాలాః' అనియు, బ్రహ్మేన్ద్రాదుల లోకపాలకత్వముగూడ పరమేశ్వరాజ్ఞాయత్తమే – అని చెప్పబడినది. ఈ యంశము శివపురాణాదులలో సైతము విస్తరించి తెలుపబడినది. ఈ విధముగ ఇన్ద్రాది లోకపాలకులతో సహ సమస్తదిగధిపతిగా పరమేశ్వరుని నమస్కరించుట ప్రథమ మన్త్రార్థము.

## మూ. నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయే నమః। 2

**భాష్యమ్** – అథ ద్వితీయః, **'నమో వృక్షేభ్యః'** ఇతి. అత్ర **'పశూనాం పతయే'** ఇతి ప్రథమమన్వయః. పశుపదం చేహ న గవాదిమాత్రపరమ్, కిం తు ద్విపాచ్చతుష్పా-త్సాధారణప్రాణిమాత్రపరమ్. 'యేషామీశే పశుపతిః పశూనాం చతుష్పదాముత చ ద్విపదామ్' ఇతి, **'ఏతావన్తో వై పశవో ద్విపాదశ్చ చతుష్పాదశ్చ'** ఇత్యాది శ్రుతేః. తథా చ సకలప్రాణ్యధిపతయే ఇత్యర్థో భవతి. తత్ర కథం ప్రాణినామీశ్వరం ప్రతి పశుత్వమ్, కథం చ భగవతస్తత్పతిత్వమ్? ఇత్యాకాఙ్క్షాయాం తదుపపాదనాయ **'వృక్షేభ్యో హరికేశేభ్యః'** ఇత్యుక్తమ్. అత్ర **'హరితవర్ణాః కేశాః పలాశరూపా యేషామ్, తేభ్యో వృక్షేభ్యో రుద్రరూపేభ్యో నమః, తథా పశూనాం పతయే చ నమః'** – ఇతి ప్రాచీనవ్యాఖ్యానమనేన నిరస్తమ్. అస్మిన్ పక్షే వృక్షపదస్య పాశుపత్యోపపాదకత్వాభావాత్ **'పశూనాం పతయే'** ఇత్యనేన సహ న సంబన్ధః, నాపి సర్వేశ్వరత్వప్రకరణే వృక్షాత్మత్వప్రతిపాదనసంగతిః, న వా **'హరికేశేభ్యః'** ఇతి విశేషణస్య కించిత్ప్రయోజనమ్. అగ్రే చ 'నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ' ఇతి వృక్షాత్మకత్వస్య వక్ష్యమాణత్వాత్పునరుక్తిః. అతః అత్రార్థవిశేషేణ భవితవ్యమ్. తమేనం దర్శయామః – వృక్షపదమిహ సంసారవృక్షపరమ్, **'ఊర్ధ్వమూలమధశ్శాఖమ్'** 'వృక్షం యో వేద సంప్రతి' **'అహం వృక్షస్య రేరివా'** ఇత్యాది శ్రుతేః. 'అవ్యక్తమూలప్రభవస్తస్యైవానుగ్రహోత్థితః, బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇన్ద్రియాన్తరకోటరః' **'ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్'** ఇతి స్మృతేశ్చ. అత్రాపి **'భవస్య హేత్యై జగతాం పతయే నమః'** ఇత్యగ్రేతనమన్త్రే పరమేశ్వరస్య సంసారచ్ఛేదకాయుధత్వోక్త్యా సంసారస్య వృక్షత్వావిష్కరణాచ్చ. హరికేశపదమపి హరితవర్ణత్వోపలక్షితత్రిగుణాత్మక–

కర్మకాణ్డరూపపలాశలక్షణకేశవైశిష్ట్యపరమ్. **'త్రైగుణ్యవిషయా వేదాః' 'ఛన్దాంసి యస్య పర్ణాని'** ఇతి చ స్మృతేః. యథా వృక్షస్య రక్షార్థాని పర్ణాని భవన్తి, తథా సంసారవృక్షస్య రక్షార్థాని కర్మకాణ్డాత్మకాని ఛన్ధాంసి, తేషాం సంసారాభివృద్ధికరకర్మప్రతిపాదకత్వాత్. తాని చ శిరోరుహవదానన్త్యాత్కేశత్వేన నిరూపితాని. ఏవం చ **'నమో వృక్షేభ్యో హరికేశేభ్యః'** ఇతి మన్త్రభాగస్య వివిధకర్మజాలానువిద్ధసంసారవృక్షాత్మకత్వేన పరమేశ్వరనమస్కారోఽర్థః పర్యవసితః. అనేన చ కథం పశుత్వం, కథం పతిత్వమితి ప్రశ్నద్వయముత్తరితం భవతి – సంసారపాశబద్ధత్వేన ప్రాణినాం పశుత్వమ్, తైః స్వకార్యకారయితృత్వేన పరమేశ్వరస్య తత్పతిత్వమితి చ తదర్థలాభాత్. తదేతత్ లైఙ్గే స్పష్టముపబృంహితమ్ –

**బ్రహ్మాద్యాః స్థావరాన్తాశ్చ దేవదేవస్య శూలినః।**
**పశవః పరికీర్త్యన్తే సంసారవశవర్తినః॥**

**తేషాం పతిత్వాద్దేవేశః శివః పశుపతిః స్మృతః।**
**బ్రహ్మాదిస్తమ్బపర్యన్తాన్పశూన్బధ్వా మహేశ్వరః॥**

**పాశైరేతైః పతిర్దేవః కార్యం కారయతి స్వయమ్।**
**స ఏవ మోచకస్తేషాం భక్త్యా సమ్యగుపాసితః॥** – ఇతి.

ఏవం స్కాన్దశైవకూర్మపురాణవచనాన్యప్యుదాహార్యాణి. అత్ర **'బ్రహ్మాద్యాః స్థావరాన్తాః'** ఇత్యుక్త్యా **'ఏషామీశః'** ఇతి మన్త్రే ద్విపాచ్చతుష్పాద్గ్రహణం చేతనాచేతనాత్మక–సకలప్రపఞ్చోపలక్షణమితి వ్యాఖ్యాతం భవతి. యథా గవాశ్వమహిషాదయస్తత్స్వామిభిః పాశైరాబధ్య స్వవశీకృత్య స్వారాధనరూపతయా తదుపయోగితయా వా స్వకీయేషు తత్తద్వస్తుషు తత్తద్వస్తుసామర్థ్యాధీనేషు కర్మసు వినియుజ్యన్త ఇతి బ్రహ్మాదిస్థావరాన్తానాం పశుత్వం, పరమేశ్వరస్య తత్పతిత్వం చేత్యభిప్రాయః. యత్పునః శ్రూయతే – **'సోఽబ్రవీద్వరం వృణా అహమేవ పశూనామధిపతిరసానీతి తస్మాద్రుద్రః పశూనామధిపతిః'** ఇతి 'భగవతః పాశుపత్యం వరలబ్ధమ్' ఇతి, తత్తు – అజ్ఞానమోహితో లోకః పశు –పాశ– పశుపతీన్వివేక్తుమసమర్థతయా స్వతో న మోక్తుం శక్త ఇతి కరుణయా స్వకీయం పాశుపత్యం వరవ్యాజేన లోకే స్పష్టీకృతమితి శివపురాణే ష్వేవ

**స్వతస్సిద్ధం పతిత్వం మే యుష్మాకం పశుతాఽపి చ।**
**తదేతద్ధథయామ్యద్య వరబన్ధవినోదనైః॥**

ఇత్యాదినా వ్యాఖ్యాతాభిప్రాయమ్. యుక్తం చ సంసారబన్ధరూపపశుత్వస్యానాదితయా తద్బన్ధకత్వరూపపతిత్వస్యాఽపి అనాదిత్వప్రాప్త్యా తస్య వరలబ్ధత్వోక్త్యయోగాత్. న హి బన్ధకం వినా బన్ధః సంభవతి. శ్రుతిస్మృత్యాద్యుద్ఘోషితస్వతస్సిద్ధపరమేశ్వరభావే భగవతి పాశుపత్యవరణస్య, తల్లాభస్య, తం ప్రతి కస్యచిద్వరదాతుశ్చ కథమపి విచారా-సహత్వాచ్చేత్యాస్తాం తావత్.

**అనువాదము:** (అర్థము) పశూనామ్ = సంసారపాశబద్ధులగుటచే పశుప్రాయులైన మనుష్యులకు, తదితర పశుపక్ష్యాది సమస్తప్రాణులకు, పతయే = నియామకుడైన రుద్రునకు నమః = నమస్కారము.

హరికేశేభ్యః = త్రిగుణాత్మకములు అనన్తములునగు కర్మజాలములనెడి కేశములతో వ్యాప్తములైన, వృక్షేభ్యః = సంసారవృక్షముల రూపమున నున్న రుద్రులకు, నమః = నమస్కారము.

(వివరణము) ఇచట 'పశూనాం పతయే' అని మొదట అన్వయము. పశు పదము – కేవల గవాశ్వాదిపరము కాదు. 'యేషామీశే పశుపతిః పశూనాం చతుష్పదాముత చ ద్విపదామ్' 'ఏతావన్తో వై పశవో ద్విపాదశ్చ చతుష్పాదశ్చ' ఇత్యాది శ్రుతుల ననుసరించి నాల్గుకాళ్లతో నడచు గవాశ్వాదులనే కాక, పాదద్వయముతో సంచరించు మనుష్యాదులతో సహ సమస్త ప్రాణులను బోధించును. కాగా – సమస్త ప్రాణులకును అధిపతి – అను నర్థము సిద్ధించుచున్నది. సమస్త ప్రాణులు పశువులనుటగాని భగవానుడు వాని కధిపతి యనుటగాని యెట్లు ఘటించును? అను శంకకు సమాధానముగా 'వృక్షేభ్యో హరికేశేభ్యః' అని చెప్పబడిన ఇచట – 'హరితవర్ణపలాశరూపములగు కేశములతో గూడిన రుద్ర రూపములగు వృక్షములకు నమస్కారము' – అను ప్రాచీ వ్యాఖ్యానము – నిరస్తమగుచున్నది. అట్టి వ్యాఖ్యానము నంగీకరించుచో వృక్షపదము పశుపతిత్వమునకు ఉపపాదకము కాకపోవుటచే 'పశూనాం పతయే' అను దానితో సంబంధము సిద్ధించదు. మఱియు సర్వేశ్వరత్వమును చెప్పు ప్రకరణములో వృక్షాత్మకత్వమును చెప్పుట – సంగతము గూడ కాదు. ఇంతేకాక 'హరికేశేభ్యః' అను వృక్షవిశేషణముకు ప్రయోజనము గూడ మృగ్యము. ఇటుపైనిగూడ 'నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ' అని వృక్షాత్మకత్వమును చెప్పబోవుచుండుటచే పునరుక్తిదోషముగూడ ప్రసక్తమగును. కావున నిది అర్థవిశేషపరమై యుండుటావశ్యకము. దానినే వివరించుచున్నాము – ఇందలి వృక్షపదము, సంసారవృక్షపరము. 'ఊర్ధ్వమూలమధశ్శాఖమ్, వృక్షం యో వేద సంప్రతి'

'అహం వృక్షస్య రేరివా' ఇత్యాదిశ్రుతులు, 'అవ్యక్తమూలప్రభవః ...' 'ఊర్ధ్వమూలమధశ్శాఖ-మశ్వత్థం ప్రాహురవ్యయమ్' ఇత్యాది స్మృతులును సంసారమును వృక్షరూపముగా వర్ణించుచున్నవి. ప్రకృతరుద్రప్రశ్నలోగూడ 'భవస్య హేత్యై జగతాం పతయే నమః' అనుచో పరమేశ్వరుని సంసారవృక్షమును ఛేదించు ఆయుధముగా నిర్దేశించుట – సంసారమునకు వృక్షరూపత్వమును సమర్థించుచున్నది. హరికేశపదము గూడ 'హరితవర్ణోపలక్షిత సత్త్వరజస్తమోగుణాత్మక కర్మకాండరూపమగు పలాశజాలమనెడి కేశములతో గూడినవి' అను నర్థమును బోధించును. 'త్రైగుణ్యవిషయా వేదాః' 'ఛన్దాంసి యస్య పర్ణాని' అను స్మృతివచనము లీ యర్థమున కుపష్టంభకములు. చెట్టుకు ఆకులు రక్షకములైనట్లు సంసార వృక్షమునకు కర్మకాణ్డాత్మకములగు ఛన్దస్సులు రక్షకములగుచున్నవి. ఛన్దస్సులు సంసారాభివృద్ధికరములగు కర్మలను ప్రతిపాదించుచుండుటయే ఇందుకు కారణము. అవియు తలవెంట్రుకలవలె అనన్తములుగాన కేశములుగా నిర్దేశింపబడినవి. కాగా – 'నమో వృక్షేభ్యో హరికేశేభ్యః' అను మన్త్రభాగమునకు – వివిధకర్మజాలమూలక సంసారవృక్ష స్వరూపునిగ పరమేశ్వరుని నమస్కరించుటయే పర్యవసితార్థము. దీనిచే – సమస్త ప్రాణులును పశువులెట్లగును? భగవానుడు తత్పతి యెట్లగును? అను రెండు ప్రశ్నలకును ప్రత్యుత్తరము లభించుచున్నది. పాశములచే బంధింపబడుట – పశులక్షణము. జీవులందరును సంసారపాశబద్ధులుగాను పశువులనియు, వారిచే స్వకార్యమును నిర్వర్తింపజేయువాడుగాన పరమేశ్వరుడు పశుపతి యనియు అర్థము స్పష్టమే గదా!

ఈ విషయము లిఙ్గపురాణములో – 'బ్రహ్మాద్యాః స్థావరాన్తాశ్చ...భక్త్యా సమ్యగుపాసితః' జననమరణప్రవాహరూపమగు సంసారమునకు లోబడియుండు బ్రహ్మాదిస్థావరాంతజీవులందరును దేవదేవుడగు పరమేశ్వరుని దృష్టిలో పశువులే. వీరికందరికిని నియామకుడుగాన నాతడు పశుపతి యని చెప్పబడుచున్నాడు. కర్మపాశబద్ధులైన జీవుల నా సర్వేశ్వరుడు స్వస్వకార్యములలో బ్రవర్తింపజేయుచుండును. భక్తితో ఆ భగవానుని ఉపాసించు జీవుల నాతడు బంధముక్తుల నొనర్చును – అని చెప్పబడినది. ఈ యర్థమును బోధించు స్కాన్ద-శైవ-కూర్మ పురాణవచనములు గూడ ఇచట ఉదాహరింపదగియున్నవి. పై లిఙ్గపురాణవచనములో 'బ్రహ్మాద్యాః స్థావరాన్తాః' అనుటచే, 'ఏషామీశే' అను మంత్రములోని ద్విపాచ్చతుష్పాత్పదగ్రహణము – చేతనాచేతనాత్మక సకలప్రపంచోపలక్షణార్థమని – వ్యాఖ్యానించినట్లగుచున్నది. ఏ విధముగ గవాశ్వమహిషాదులను వాని యజమానులు పలుపులతో కట్టివేసి తమ యధీనములో నుంచుకొని తమకును ఆ పశువులకును ఉపయుక్తములగు కార్యములలో వినియోగించు

కొనుచుందురో, అట్లే యీశ్వరుడు తాను సృజించిన చేతనాచేతనాత్మకములగు సమస్త పదార్థములను, తత్తద్వస్తుసామర్థ్యానుగుణముగ తత్తత్కార్యములలో ప్రవర్తింపజేయు చుండును. కాగా – బ్రహ్మాదిస్థావరాంతమునకు పశుత్వము, తత్కర్తయగు పరమేశ్వరునకు పశుపతిత్వము ప్రాప్తమగుచున్నదని యభిప్రాయము.

ఐతే – **'సోఽబ్రవీద్వరం వృణా...తస్మాద్రుద్రః పశూనామధిపతిః'** అను శ్రుతి ననుసరించి రుద్రునకు పశుపతిత్వము – అతని కోరిక ననుసరించి దేవతలు వరముగా అనుగ్రహించినదేగాని, స్వసిద్ధము కాదని కొందరు ఆక్షేపించవచ్చును. అది సరికాదు; అజ్ఞానమోహితమైన లోకము, పశు–పాశ–పశుపతిత్వములను విశకలితముగ తెలిసికొన జాలదు గాన తనంత తాను ముక్తి నొందజాలని స్థితిలో – కరుణతో – తన పశుపతిత్వమును వరవ్యాజమున లోకమునకు వ్యక్తీకరించినాడనియే శ్రుత్యభిప్రాయము. ఈ విషయము

**స్వతస్సిద్ధం పతిత్వం మే యుష్మాకం పశుతాఽపి చ।**
**తదేతద్ద్రఢయామ్యద్య వరబన్ధవినోదనైః॥**

ఈ విధముగ శివపురాణములలోనే వ్యక్తీకరింపబడినది. అదియే సమంజసము. సంసారబంధరూపమగు పశుత్వము అనాది యగుటచే, తద్బంధప్రయోక్తృత్వరూపమగు పశుపతిత్వము గూడ అనాదియే కావలయును. అట్టిది మధ్యలో వరముచే లభించినదనుట యుక్తము కాదు. బంధకము లేనపుడు బంధము నుండదు గద! శ్రుతిస్మృతులలో షడ్గుణైశ్వర్యసంపన్నుడుగ నుద్ఘోషింపబడుచున్న భగవానుని విషయములో – పశు పతిత్వము నాతడు వరముగా కోరుటయు, ఎవరో దాని నాతని కనుగ్రహించుటయు ఒక వినోదమేగాని, విచారక్షమమైన విషయము కాదు. అది అట్లుండుగాక.

**మూ. నమస్సస్పిఞ్జరాయ త్విషీమతే పథీనాం పతయే నమః॥ 3**

**భాష్యమ్ –** అథ తృతీయః – నమస్సస్పిఞ్జరాయేతి. ససితి బాలతృణముచ్యతే. పిఞ్జర ఇతి పీతరక్తః సంకీర్ణవర్ణః. బాలతృణవత్పిఞ్జరః – సస్పిఞ్జరః, తస్మై. **త్విషీమతే** – ప్రకాశవతే. పథీనాం పతయే – వైదికతాన్త్రికమార్గాణాం స్వామినే నమః – ఇత్యక్షరార్థః. అత్ర త్విషీమత ఇత్యనేన జ్ఞానరూపః ప్రకాశ ఉచ్యతే, తేన చేయం శఙ్కా నిరస్తా భవతి. ఏవం హ్యత్ర శఙ్కావతరతి – కథం పరమేశ్వరేణ తాన్త్రికమార్గాః ప్రదర్శితాః?

**యా వేదాబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః।**
**సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య నిష్ఠా తేషాం హి తామసీ॥**

ఇతి తేషాం నిన్దితత్వాదితి. అత్ర చేదముత్తరమ్ – సత్యమేవ తాన్త్రికమార్గాణాం నిన్దితత్వమ్, తత్తు వైదికాన్ప్రత్యేవ. వేదబాహ్యానాం తు తాన్త్రికమార్గా ఏవోపకారకాః. తదేతదాలోచ్య సర్వజ్ఞేన పరమేశ్వరేణ తన్త్రాణి ప్రణీతాని. యది హ్యేతాని న స్యుః, తతో వేదబాహ్యాః పాపిష్ఠాః స్వతో వైదికమార్గవిముఖాః, శ్రేయస్సాధనమన్యచ్చ శాస్త్రమజానన్తః స్వేచ్ఛాచార–ప్రావణ్యవివశాః ప్రణష్టా ఏవ భవేయుః. అతస్తాన్త్రికమార్గప్రవర్తనముచితమితి. తదేతత్కూర్మపురాణే స్పష్టముపబృంహితమ్. తత్ర హి –

**స తేషాం మాయయా జాతం గోవధం గౌతమో మునిః।**
**కేనాపి హేతునా జ్ఞాత్వా శశాపాతీవ కోపనః।**
**భవిష్యథ త్రయీబాహ్యా మహాపాతకినః సమాః॥**

ఇతి వేదబాహ్యత్వేన మహాపాపిష్ఠత్వేన చ గౌతమశప్తాన్ ప్రస్తుత్య –

**తే సర్వే ప్రాప్య దేవేశం శఙ్కరం విష్ణుమవ్యయమ్।**
**అస్తువన్వివిధైః స్తోత్రైరుచ్ఛిష్టా ఇవ సేవకాః॥**

ఇత్యాదినా తేషాం శంకరవిష్ణుసన్నిధౌ ప్రార్థనాముపన్యస్య –

**తస్మాద్వై వేదబాహ్యానాం రక్షణార్థం చ పాపినమ్।**
**విమోహనాయ శాస్త్రాణి కరిష్యావో వృషధ్వజ॥**

**ఏవం సంచోదితో రుద్రో మాధవేన మురారిణా।**
**చకార మోహశాస్త్రాణి కేశవోఽపి శివేరితః॥**

**కాపాలం లాగుడం శాక్తం భైరవం పూర్వపశ్చిమమ్।**
**పాఞ్చరాత్రం పాశుపతం తథాన్యాని సహస్రశః॥**

ఇత్యాదినా వేదబాహ్యానాం పాపిష్ఠానాం రక్షణాయ పాశుపతపాఞ్చరాత్రాదితన్త్రమార్గః ప్రవర్తిత ఇత్యుక్తమ్. **'విమోహనాయ'** ఇత్యస్య చాయమర్థః – అస్తి చ పాశుపతపాఞ్చరాత్రాది– తన్త్రేషు వేదవిరుద్ధార్థప్రతిపాదనమ్, యథా – కేవలనిమిత్తేశ్వరవాదః. జీవోత్పత్త్యాదివర్ణనమ్, తద్విషయే వేదనిన్దా చేతి, తచ్చ సర్వమప్రమాణమేవ, వ్యవస్థాపితం హి తదంశే తదప్రామాణ్యం బ్రహ్మమీమాంసాయామ్,

తేషు చ వేదనిన్దాయాస్తద్విరుద్ధవర్ణనస్య చ ప్రయోజనమ్ – యే వైదికా ఏవ సన్తః పాపవశాద్వేదేష్వవిశ్వాసం కుర్వన్తి, తాన్విమోహయితుమ్, తచ్చ విమోహం తేషామనుగ్రహాయైవ. తే హి వేదద్విపస్తన్త్రేషు స్థితాం వేదనిన్దాముపశ్రుత్య బహుమన్యమానా వేదం విహాయ తాన్త్రికమార్గమనుప్రవిశ్య తేన విధినా పరమేశ్వరమారాధ్య తత్పుణ్యక్షతవేదద్వేషదోషాః క్రమేణ జన్మాన్తరే వేదనిష్ఠాం ప్రతిపద్య కృతకృత్యా భవన్తి. అత ఏవ వైదికస్యైవ సతః శాణ్డిల్యస్య వేదనిష్ఠాం విహాయ పాఞ్చరాత్రాదిదీక్షావిధినా విష్ణుమారాధితవతో నిన్దాపూర్వకం తం ప్రతి చిరాయ వేదమార్గం గమిష్యసీతి భగవతా వాసుదేవేన వరో దత్త ఇతి వాసిష్ఠలైఙ్గే శ్రూయతే –

**మత్తన్త్రాశ్రయణేనైవ మత్పూజా చ కృతా త్వయా।**
**తయా న ప్రేతావానస్మి తవ శాణ్డిల్య తే ప్రియః॥**

**కుమార్గేణాపి శాణ్డిల్య కృతా పూజా మమ త్వయా।**
**అతః కాలేన మహతా వేదమార్గం గమిష్యసి॥** – ఇతి.

పాపిష్ఠవిషయే పరమేశ్వరస్య మోహకత్వం తద్విషయే ద్వేష ఇవ తదనుగ్రహ పర్యవసితత్వాన్న దేషమావహతి. అత ఏవ ఖలు బుద్ధాద్యవతారేషు భగవతో నారాయణస్య విమోహకత్వం బహుశః ప్రఖ్యాయతే, న హి తత్తస్య దూషణం భవతీతి తదేత్సర్వమత్ర **'విమోహనాయ శాస్త్రాణి'** ఇత్యనేనాభిప్రేతమ్. ఏవమన్యాన్యప్యస్మిన్ విషయే బహూని వచనాని సన్తి, తాని సర్వాణ్యప్యస్మాభిః. **'పాషణ్డగజకేసరి'** ణ్యుదాహృతాని, తత్రైవ ద్రష్టవ్యాని. తదేవం వేదబాహ్యానాం రక్షణాయ సర్వజ్ఞేన భగవతా తాన్త్రికమార్గః ప్రవర్తిత ఇత్యేతత్ **'త్విషీమతే'** ఇత్యనేన ప్రదర్శితమ్. తదుపరి కాంశ్చిద్వేదాధికారిణః, కాంశ్చిద్వేదబాహ్యాంశ్చ సృజతః పరమేశ్వరస్య వైషమ్యనైర్ఘృణ్యదోషమాశంక్య **'సస్పిఞ్జరాయ'** ఇత్యనేన సజ్కీర్ణవర్ణ–విశేషవాచినా తథాభూతత్రైగుణ్యప్రధానత్వరూపార్థద్యోతకేన తత్పరిహృతమ్. అనాద్య–విద్యోపచితతత్తద్గుణకర్మానుసారేణ తథా సృజతో న వైషమ్యాదిప్రసక్తిః, 'పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన' ఇత్యాది శ్రుతేరితి భావః.

**అనువాదము:** (అర్థము) సస్పింజరాయ = బాలతృణమువలె పిఞ్జర (పసుపు–ఎఱుపు కలిసిన) శరీరచ్ఛాయ కలిగినట్టి, త్విషీమతే = ప్రకాశవంతుడైన రుద్రునకు, నమః = నమస్కారము. (మరియు) పథీనామ్ = వైదికతాన్త్రికమార్గములకు, పతయే = ప్రవర్తకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) సస్ శబ్దమునకు బాలతృణ మని యర్థము. 'త్విషీమతే' అనుచో కాన్తివాచకమగు త్విట్‌శబ్దము జ్ఞానరూపమగు ప్రకాశమును బోధించును. ఈ విశేషణము – ఒక శంకకు సమాధానరూప మగుచున్నది. 'యా వేదబాహ్యాః స్మృతయః...' ఇట్టి మన్వాదిస్మృతివచనములు – వేదవిరుద్ధములు, నాస్తిక తర్కమూలకములు, అపూర్వదేవతా నిరాకరణపరములునగు చార్వాకాది వాదములు – తమోగుణప్రయుక్తములు, అనర్థకరములు గాన పరిత్యాజ్యము లని చెప్పుచుండగా, వేదబాహ్యములగు తన్త్రమార్గములకు గూడ పరమేశ్వరుడే ప్రవర్తకుడని చెప్పుట అనుచితముకాదా? అని శంక. దాని కిది సమాధానము – తాన్త్రికమార్గములు నిన్ద్యము లనుమాట నిజమే. ఆ నిన్ద్యత్వము వైదికులను గూర్చి మాత్రమే. వేదబాహ్యుల కవి నిన్ద్యములు కాకపోగా ఉపకారకములే యగుచున్నవి. ఈ విషయము నాలోచించియే సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు తన్త్రములను ప్రవర్తింపజేసినాడు. తన్త్రములే లేనిచో వేదబాహ్యులగు పాపాత్ములు సహజముగ వేదమార్గవిముఖులుగాన, శ్రేయస్సాధనమగు మరియొక మార్గము నెరుగక స్వేచ్ఛాచారలంపటులై సర్వవిధముల అనర్థమునే పొందుదురు. అందువలన తాన్త్రిక మార్గప్రవర్తనము అవసరమగుచున్నది. ఈ విషయము కూర్మపురాణములో ఇట్లు స్పష్టీకరింపబడినది – ("స తేషాం మాయయా జాతం గోవధం గౌతమో మునిః... పాఞ్చరాత్రం పాశుపతం తథాన్యాని సహస్రశః') ఒకప్పుడు గౌతమమహర్షి – కొందరు మునులే కపటోపాయముచే తనకు గోవధపాపము నంటగట్టిన విధమును దివ్యదృష్టిచే తెలిసికొని క్రుద్ధుడై – వేదబాహ్యులు, మహాపాతకులతో సమానులుకండని వారిని శపించినాడు. వారును ఖిన్నులై బహిష్కృతులైన భృత్యులవలె శివకేశవుల దరిజేరి బహువిధముల స్తుతింపగా, వేదబాహ్యులగు వారిని రక్షించుటకై శివకేశవులు పరస్పర ప్రేరణతో మోహకరములగు వేలకొలది తన్త్రములను నిర్మించినారు. అవియే – కాపాలము, లాగుడము, శాక్తము, భైరవము, పూర్వపశ్చిమము, పాంచరాత్రము, పాశుపతము మున్నగు నామములతో ప్రసిద్ధినొందినవి. ఇది పై కూర్మపురాణవచన సారాంశము.

తన్త్రములు వ్యామోహకరము లనుటలో అభిప్రాయ మిది – పాశుపత పాంచరాత్రాదితన్త్రములలో, ఈశ్వరుడు జగత్తుకు నిమిత్తకారణము మాత్రమే యనుట – జీవులకు ఉత్పత్తిని వర్ణించుట – వేదములను నిందించుట – ఈవిధములగు వేదవిరుద్ధ విషయములు గూడ ప్రతిపాదింపబడినవి. ఆ యంశములలో తాన్త్రిక గ్రంథములు ప్రమాణములు కాజాలవని – బ్రహ్మమీమాంస (2–2–8) తో వ్యవస్థ చేయబడినది.

ఐతే – తన్త్రగ్రంథములలో వేదములను నిందించుటకును, వేదవిరుద్ధ విషయములను ప్రతిపాదించుటకును కారణమేమి? అందురేమో; వైదికసంప్రదాయము నకు చెందినవారైయుండియు, దురదృష్టవశమున వేదములయందు విశ్వాసములేనివారిని మోహపెట్టుటకే. అట్లు మోహపెట్టుటయు వారి ననుగ్రహించుటకే. వేదద్వేషులగువారు తంత్రములలోని వేదనిందను విని, దానినే బహూకరించి వేదమును పరిత్యజించి తాన్త్రికమార్గములలో ప్రవేశించి, తదుక్తవిధానముతో పరమేశ్వరు నారాధించి ఆ పుణ్యముచే పూర్వకృతమగు పాపము నశింపగా క్రమముగ జన్మాన్తరమున వేదనిష్ఠ నవలంబించి కృతకృత్యులగుదురు. కావుననే – వేదసంప్రదాయమునకు చెందినవాడై యుండియు వేదనిష్ఠను విడనాడి పాంచరాత్రాగమదీక్షావిధానముతో విష్ణునారాధించిన శాండిల్యునకు, తన్నిన్దాపూర్వకముగ 'నీవు చిరకాలమునకు మరల వేదమార్గమును చేరగలవు' అని భగవానుడగు వాసుదేవుడు వరమిచ్చినా డను వృత్తాన్తము – వాసిష్ఠలైఙ్గ పురాణము నందిట్లు ప్రతిపాదింపబడినది – 'మత్తన్త్రాశ్రయణేనైవ మత్పూజా చ త్వయా కృతా... వేదమార్గం గమిష్యసి' అని.

పాపాత్ములను పరమేశ్వరుడు మోహపెట్టుటగూడ – పూర్వము 'నమస్తే రుద్ర' మన్త్రములో చెప్పినవిధముగ ద్వేషించుటవలె – తదనుగ్రహములోనే పర్యవసితమగును గాన దోషావహము కాదు. కావుననే బుద్ధాద్యవతారములలో గూడ భగవానుడగు నారాయణుడు బహువిధముల మోహపెట్టినట్లు ప్రసిద్ధమైయున్నది. అది యాతని కెంతమాత్రమును కలంకము కాజాలదు. ఈ యభిప్రాయమంతయు 'విమోహనాయ శాస్త్రాణి' అను కూర్మపురాణవచనముచే వివక్షితమగుచున్నది. ఈ విషయమును సమర్థించు మరికొన్ని వచనములు గూడ నున్నవి. అవి యన్నియు మాచే **'పాషణ్డగజకేసరి'** యన గ్రంథములో ఉదాహరింపబడినవి. వాని నందే కాననగును. ఈ విధముగ వేదబాహ్యులను రక్షించుటకై సర్వజ్ఞుడగు భగవానునిచే తాన్త్రికమార్గములు ప్రవర్తింపజేయబడినవను భావము 'త్విషీమతే' అను పదముచే ప్రదర్శింపబడినది.

దీనిపై – కొందరిని వేదాధికారులుగను, మరికొందరిని వేదబాహ్యులుగను సృజించు పరమేశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యదోషములు ప్రసక్తములు కావా? అను శంకకు, సంకీర్ణవర్ణవాచియగు 'సస్పింజరాయ' అను విశేషణము సమాధానమును సూచించు చున్నది. సత్త్వరజస్తమోగుణసాంకర్యప్రయుక్తమగు ప్రాక్తనకర్మయే కారణమని భావము. అనాద్యవిద్యామూలకములగు గుణకర్మల ననుసరించి జీవులను విభిన్నరీతుల సృజించు

భగవానునకు వైషమ్యాదిదోషములు ప్రసక్తములగుట కవకాశమే లేదు. 'పుణ్యః పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన' అను శ్రుతి ఇందు కుపబృంహకము.

**మూ. నమో బభ్లు(భ్రు)శాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః ॥**

**భాష్యమ్ –** అథ చతుర్థః – నమో బభ్రుశాయేతి. బిభర్తి పరమేశ్వరమితి బభ్రుః వృషభః. **'కుర్భ్రశ్చ'** ఇత్యుణాదిసూత్రేణ భృఞ్ ధాతోః కుప్రత్యయే ద్విర్వచనే ధాతోర్యణాదేశే కిత్త్వాత్ గుణవృద్ధిప్రతిషేధే చ సతి బభ్రురితి రూపనిష్పత్తిః. బభ్రౌ శేతే తిష్ఠతీతి బభ్రుశః – వృషవాహనః. 'బభ్లుశాయ' ఇతి పాఠే లకారే – బభ్లురేవ బభ్రురితి వ్యాఖ్యేయమ్. విశేషేణ విధ్యతీతి వివ్యాధీ, అన్నానామ్ – అదనీయానాం భక్ష్యభోజ్యలేహ్యశోష్యరూపాణాం పదార్థానాం స్వామీ, తస్మై నమః ఇత్యర్థః. అత్ర బభ్రుశాయేత్యనేన ధర్మరూపవృషభ–మధితిష్ఠతోఽన్నస్వామిత్వం యుక్తమ్, **'యజ్ఞాద్భవతి పర్జన్యః పర్జన్యాదన్నసంభవః'** ఇత్యన్నస్య ధర్మకార్యత్వశ్రవణాదితి ప్రదర్శితమ్. **'వివ్యాధినే'** ఇత్యనేన **'యే అన్నేషు వివిధ్యన్తి' 'యేషామన్నమిషవః'** ఇతి చ శ్రుతేః. అన్నేన ఇషుణా విధ్యతోఽన్నపతిత్వముచితమ్. తన్నియమ్యస్యైవ తదిషుత్వాదితి హేత్వన్తరమ్.

**అనువాదము:** (అర్థము) బభ్లుశాయ = వృషభవాహనము నధిష్ఠించినట్టియు, వివ్యాధినే = బాణప్రయోగకుశలుడైనట్టియు రుద్రునకు, నమః = నమస్కారము, (మరియు) అన్నానామ్ = భక్ష్య భోజ్య లేహ్య చోష్య రూపములగు చతుర్విధములైన అన్నములకు, పతయే = అధిపతియగు రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'బిభర్తి పరమేశ్వరమ్' అను వ్యుత్పత్తిచే బభ్రుశబ్దమునకు వృషభమని యర్థము. 'భృఞ్ భరణే' అను ధాతువుకంటే 'కుర్భ్రశ్చ' అను ఉణాదిసూత్రముచే కుప్రత్యయము, ద్విర్వచనము, ధాతువుకు యణాదేశము, కిత్త ప్రయుక్తమగు గుణవృద్ధి నిషేధము ప్రాప్తముకాగా 'బభ్రుః' అను రూపము నిష్పన్నమగుచున్నది. **'బభ్రౌ శేతే – తిష్ఠతి'** అను విగ్రహము ననుసరించి బభ్రుశ శబ్దము వృషభవాహను డను నర్థము నిచ్చుచున్నది. 'రలయోరభేదః' అను న్యాయమున 'బభ్లుశాయ' అను లకారఘటితమగు రూపము సిద్ధించును.

ఇచట బభ్రుశబ్దార్థమగు వృషభము – **'వృషో హి భగవాన్ ధర్మః'** అను ప్రమాణానుసారము – ధర్మరూపముగాన దాని నధిష్ఠించినవాడు అన్నమునకు

అధిపతియగుట సముచితము. **'యజ్ఞాద్భవతి పర్జన్యః పర్జన్యాదన్నసంభవః'** అను స్మృతి, అన్నము - యజ్ఞాదిధర్మమూలక మని తెలుపుచున్నది. మరియు 'వివ్యాధినే' అను విశేషణము 'యే అన్నేషు వివిధ్యన్తి' 'యేషామన్నమిషవః' అను శ్రుతినిబట్టి, పరమేశ్వరుడు అన్న రూపములగు బాణములతో ప్రతిపక్షులను క్షతగాత్రుల నొనర్చువాడుగావున, ఈ కారణముచే గూడ అన్నపతిత్వము సముచితమని మఱియొక హేతువు చెప్పబడినది. అతని బాణము అతని వశవర్తియై యుండవలెను గద!

**మూ. నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః ॥ 5**

**బాష్యమ్ -** అథ పఞ్చమః - నమో హరికేశాయేతి. నీలాలకమూర్ధజసహితో హరికేశః, నిత్యయువేతి యావత్. ఉపవీతీ - యజ్ఞోపవీతవాన్, ఆదిబ్రాహ్మణః. సామవేదే - **'విరూపాక్షోఽసి దన్తాఞ్జిః'** ఇతి ప్రస్తుత్య, **'త్వం దేవేషు బ్రాహ్మణోఽసి అహం మనుష్యేషు, బ్రాహ్మణో వై బ్రాహ్మణముపధావతి, ఉప త్వా ధావాని'** ఇతి ప్రపదబ్రాహ్మణశ్రుతేః.

> **ఆదిబ్రాహ్మణమీశానముపధావేన్న చేతరమ్।**
> **బ్రహ్మతేజోఽధికం రాజన్న క్షాత్రం వైశ్యసంభవమ్।**
> **సర్వేషామధికో యస్మాద్భగవాన్బ్రాహ్మణః శివః॥**

ఇతి పరాశరసంహితాదివచనాత్. పుష్టశబ్దశ్చ - దేవేన్ద్రాదిపదప్రజ్ఞైశ్వర్యాదిపరిపూర్తి-మద్వాచీ, బ్రహ్మాదిస్థావరాన్తేషు యే యే పుష్టాః తేషాం స్వామీ, **పుష్టానాం పతయే నమః** ఇత్యర్థః. అత్ర ఆదిబ్రాహ్మణస్య పరమేశ్వరస్య బ్రహ్మాదిసర్వోపాస్యత్వావశ్యంభావేన స్వోపాసకాంస్తాన్ పుష్టిదానేనానుగృహ్ణతస్తస్య పుష్టానాం పతిత్వముపపన్నమిత్యేతత్ 'ఉపవీతినే' ఇత్యనేన ప్రదర్శితమ్. స్వయం పుష్టః పరస్మై పుష్టిం ప్రయచ్ఛతి. పరమేశ్వరస్య నిత్యయూనో దేహేన్ద్రియాదిపుష్టిర్నిత్యసిద్ధేతి లోకేభ్యస్తస్య తత్ప్రదత్వముచితమిత్యౌచిత్యరూపం వస్తుసామర్థ్యం హరికేశపదేన వ్యజ్యతే.

**అనువాదము:** (అర్థము) హరికేశాయ = నల్లని ముంగురులతో భాసిల్లుచున్న శిరోజములు గలిగినట్టియు, ఉపవీతినే = యజ్ఞోపవీతమును ధరించినట్టియు, రుద్రునకు, నమః = నమస్కారము. (మరియు) పుష్టానామ్ = పుష్టియుక్తములగు స్థావరజంగమాదులన్నింటికి, పతయే = స్వామియైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'హరికేశాయ' అను పదము భగవానుని నిత్యయౌవనత్వమును నిరూపించుచున్నది. 'ఉపవీతినే' అను విశేషణ మాతని ఆదిబ్రాహ్మణత్వమును సూచించుచున్నది. సామవేదములలోని ప్రపదబ్రాహ్మణములో 'విరూపాక్షోఽసి దన్తాఞ్జిః' అని ప్రారంభించి, 'త్వం దేవేషు బ్రాహ్మణోఽసి అహం మనుష్యేషు, బ్రాహ్మణో వై బ్రాహ్మణముపధావతి, ఉప త్వా ధావాని' అను వాక్యము వినవచ్చుచున్నది. 'ఓ పరమేశ్వరా! నీవు దేవతలలో బ్రాహ్మణుడవుగ ప్రసిద్ధి నొందినావు. నేను మనుష్యులలో బ్రాహ్మణుడను. బ్రాహ్మణుడు బ్రాహ్మణుని దరిజేరుట సహజము. కావుననే నేను నిన్ను శరణుజొచ్చెదను' అని శ్రుత్యభిప్రాయము. మఱియు, 'ఆదిబ్రాహ్మణమీశానం...బ్రాహ్మణశ్శివః' అను పరాశర సంహితావచనము, క్షత్రియ–వైశ్యతేజస్సులకన్న బ్రహ్మతేజముత్కృష్టము. కావుననే ఆదిబ్రాహ్మణుడగు శివుడు – సర్వోత్కృష్టుడు, సర్వసేవ్యుడు నగుచున్నాడని తెలుపుచున్నది. ఇక 'పుష్టానాం పతయే' అనుచో పుష్టపదం – ఇన్ద్రాదిపదముల నధిష్ఠించుటకు కావలసిన ప్రజ్ఞైశ్వర్యాదుల పరిపూర్ణతను బోధించును. కాగా – బ్రహ్మాదిస్థావరాంత ప్రపంచములో అట్టి పుష్టి గలవారికందరికిని భగవాను డధిపతి యను నర్థము సిద్ధించుచున్నది. మఱియు ఆదిబ్రాహ్మణుడగు పరమేశ్వరుడు బ్రహ్మాదుల కందరికిని ఉపాస్యుడగుట తప్పనిసరి గాన, తన నుపాసించునట్టి వారందరికిని పుష్టి ననుగ్రహించువానికి పుష్టిపతిత్వము సముచిత మను భావమును **'పుష్టానాం పతయే'** అను విశేషణము బోధించు చున్నది. తాను పుష్టిగలిగియున్నపుడే ఇతరులకు పుష్టినొసంగజాలును. నిత్యయౌవనుడగు పరమేశ్వరునకు దేహేన్ద్రియాదిపుష్టియు నిత్యసిద్ధమే గావున భక్తుల కాతడు పుష్టిప్రదుడగుట యుక్తమే యని ఔచిత్యరూపమగు వస్తుసామర్థ్యము 'హరికేశ' పదముచే ప్రతీయమాన మగుచున్నది.

**మూ. నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః॥ 6**

**భాష్యమ్ –** ఇత్థం పఞ్చభిర్మన్త్రైర్దిగాదికతిపయవస్త్వాధిత్యప్రదర్శనపూర్వకమీశ్వరో నమస్కృతః; ఇదానీం ప్రతివస్త్వాధిపత్యవచనపూర్వకనమస్కారస్యాశక్యతయా జగత్పతిత్వేన తం నమస్కర్తుం షష్ఠో మన్త్రః ప్రయుక్తః – నమో భవస్యేతి. భవః – సంసారః, తస్య చ్ఛేదనే హేతిః – ఆయుధమ్, సంసారవృక్షస్య చ్ఛేత్త్రేత్యర్థః. స్థావరజఙ్గమానాం లోకానాం స్వామీ **– జగతాం పతిః, తస్మై నమః.** యద్యపి **'పశూనాం పతయే నమః'** ఇత్యత్రైవ బ్రహ్మాది స్థావరాన్తసకలజగత్పతిత్వముక్తమ్, తథాపి సంసారపాశబన్ధహేతుత్వేన తదుక్తమ్, అత్ర సంసారమోచకత్వేనేతి భేదః, ఉభయోరపి బ్రహ్మధర్మత్వాత్.

**అనువాదము:** ఇట్లైదు మన్త్రములచే దిక్కులు మున్నగు కొన్ని పదార్థములకు అధిపతిగా ఈశ్వరుడు నమస్కరింపబడినాడు. ఇక నిప్పుడు ఒక్కొక్క పదార్థమునకును అధిపతిగా నమస్కరించుట అశక్యముగాన, జగదీశ్వరునిగ నాతని నమస్కరించుటకు ఆరవమన్త్ర మారంభింపబడుచున్నది –

(అర్థము) భవస్య = సంసారవృక్షమునకు, హేత్యై = ఛేదించు ఆయుధరూపుడైన రుద్రునకు, నమః = నమస్కారము (మరియు), జగతామ్ = స్థావరజంగమాత్మకములగు సమస్తలోకములకు, పతయే = స్వామియైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) **'పశూనాం పతయే నమః'** అనుటచేతనే పూర్వము బ్రహ్మాది స్థావరాన్తజగత్పతిత్వము చెప్పబడినది. ఐతే – అచట సంసారపాశబన్ధహేతుత్వము చెప్పబడినది. ఇచట తన్మోచకత్వము చెప్పబడినది. ఇది విశేషము. ఈ రెండును బ్రహ్మాలక్షణములే.

**మూ. నమో రుద్రాయాతతావినే క్షేత్రాణాం పతయే నమః॥ 7**

**భాష్యమ్ –** అత్ర ఉక్తమేవ జగత్పతిత్వముపపాదయితుం శ్రమావధిధావనన్యాయేన పునరపి తత్త్వద్వస్త్వాధిపత్యేన భగవన్తం నమస్కర్తుమారభతే సప్తమాదిభిః, **నమో రుద్రాయేతి.** రుద్రః – సంసారదుఃఖద్రావకః, అత ఏవ ఆతతజ్యేన ధనుషా అవతి – రక్షతీతి ఆతతావీ. క్షేత్రాణి – శరీరాణి. **'ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే'** ఇతి స్మృతేః. తేషాం స్వామీ క్షేత్రాణాం పతిః, తస్మై నమః ఇత్యర్థః. లోకే హి దేశాధిపతిరుపద్రవేభ్యో దేశవాసినో రక్షతి, తేషు చ స్వాశ్రితాన్ సుఖవిశేషేణ సంయోజయతి. తథా క్షేత్రాధిపతిః పరమేశ్వరోఽపి క్షేత్రస్థితాన్రక్షతి, న హ్యన్యః పరమేశ్వరాద్రక్షకోఽస్తి, **'యేన జాతాని జీవన్తి'** ఇతి శ్రుతేః. అత ఏవ ఖల్వాశాస్యతే – **'తయాస్మాన్విశ్వతస్త్వమయక్ష్మయా పరిబ్భుజ'** ఇతి. తదేతదాతతావిపదేనోక్తమ్. క్షేత్రస్థితేష్వపి స్వాశ్రితాన్ సుఖవిశేషేణ యోజయతీత్యేతత్ రుద్రపదేనోక్తమ్. 'జన్తోర్మ్రియమాణస్య రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే, యేనాసావమృతీ భూత్వా మోక్షీ భవతి' ఇతి శ్రుతేః. క్షేత్రపదస్యావిముక్తాదిక్షేత్రపరత్వే విశేషస్వారస్యం ద్రష్టవ్యమ్.

**అనువాదము:** పూర్వోక్తమగు జగత్పతిత్వమును సమర్థించుటకే **'శ్రమావధిధావన** (అలసిపోవువరకు పరుగెత్తుట) **న్యాయము'** ననుసరించి మరల ఆ యా వస్తువుల కధిపతిగా భగవానుని నమస్కరించుట కుపక్రమించుచున్నాడు –

(అర్థము) రుద్రాయ = సంసారదుఃఖమును పారద్రోలువాడును, ఆతతావినే = ఎక్కుపెట్టబడిన ధనుస్సుతో భక్తుల రక్షించువాడునునగు రుద్రునకు, నమః = నమస్కారము. క్షేత్రాణామ్ = సమస్తప్రాణిశరీరములకు, పతయే = స్వామియైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే' అను గీతాస్మృతి ననుసరించి క్షేత్రశబ్దమున కిచట శరీరమని యర్థము. లోకమునందు దేశాధిపతియగువాడు దేశవాసుల నుపద్రవములనుండి రక్షించును. అందును తన్నాశ్రయించినవారికి సుఖాతిశయమును కలిగించును. అట్లే శరీరరూపక్షేత్రాధిపతియగు పరమేశ్వరుడు గూడ క్షేత్రములందున్నవారిని రక్షించును. పరమేశ్వరుని కన్న రక్షకు డెవడున్నాడు? 'యేన జాతాని జీవన్తి' అని శ్రుతి చెప్పుచున్నది. కావుననే 'తయాస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయా పరిబ్భుజ' అని ప్రార్థించుట జరిగినది. ఈ యర్థమును **'ఆతతావినే'** అను పదము తెలుపుచున్నది. క్షేత్రపదమును అవిముక్తాది (కాశ్యాది) క్షేత్రపరముగ సమన్వయించు కొనుచో – 'జన్తోర్మ్రియమాణస్య రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే యేనాసావమృతీభూత్వా మోక్షీభవతి' అను శ్రుత్యనుసారము అచట మరణించినవారికి శ్రీరుద్రుడు తారకబ్రహ్మతత్త్వోపదేశ మొనర్చి తరింపజేయుట మూలముగా రక్షించు నను స్వారస్యాతిశయము సమకూరును.

**మూ. నమస్సూతాయాహన్త్యాయ వనానాం పతయే నమః ॥ 8**

**భాష్యమ్ –** అథాష్టమః – నమః సూతాయేతి. జగద్యన్త్రసారథిః సూతః.

> **ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।**
> **భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥** ఇతి స్మృతేః.

హన్తుమశక్య ఇతి – అహన్త్యః. వనానామ్ – అరణ్యానామ్, పతిః – స్వామీ, తస్మై నమ ఇత్యర్థః. తథా వనస్వామిత్వే జగన్నియన్తృత్వరూపహేతుః సూతశబ్దేన ప్రదర్శితః. జగన్నియచ్ఛతోఽపి తద్వికారైః నోపహతిరిత్యేతదహన్త్యపదేన జ్ఞాప్యతే చ.

**అనువాదము:** (అర్థము) సూతాయ = జగద్యన్త్రసారథియైనట్టియు, అహన్త్యాయ = హతమార్చుటకు అలవికానట్టియు రుద్రునకు, నమః = నమస్కారము, వనానామ్ = అరణ్యములకు, పతయే = స్వామియగు రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా' అను గీతాస్మృతి పరమేశ్వరునియొక్క జగద్యన్త్ర సారథిత్వమును సమర్థించుచున్నది. ఇయ్యది వనాధిపతిత్వములో హేతు వను విషయమును సూతశబ్దము సూచించుచున్నది. ఇట్లు జగన్నియామకుడైయున్నను జగత్తుకు సంబంధించిన షడ్భావవికారములకు లోనుకాడను భావమును 'అహన్త్యాయ' అను విశేషణము సూచించుచున్నది.

**మూ. నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః ॥ 9**

**భాష్యమ్ –** అథ నవమః – నమో రోహితాయేతి. లోహితవర్ణో రోహితః. స్థాతా చాసౌ పాతా చేతి స్థపతిః. **పృషోదరాదిః.** ఏవంభూతాయ వృక్షాణాం పతయే – స్వామినే నమః, ఇత్యర్థః. అత్ర స్థపతిశబ్దేన వృక్షస్వామిత్వే హేతురుచ్యతే – వృక్షేషు స్థిత్వా వృక్షాన్పాలయతస్తత్స్వామిత్వౌచిత్యాత్. రోహితశబ్దేన వృక్షాధిష్ఠాతుః పరమేశ్వరస్య స్వరూపముక్తం భవతి, **'యే వృక్షేషు సస్పిఞ్జరా నీలగ్రీవా విలోహితాః'** ఇతి హి వక్ష్యతే.

**అనువాదము:** (అర్థము) రోహితాయ = ఎఱ్ఱనివర్ణముగలవాడును, స్థపతయే = వృక్షములను అధిష్ఠించియుండి వానిని కాపాడువాడునగు రుద్రునకు, నమః = నమస్కారము. వృక్షాణామ్ = చెట్లకు, పతయే = స్వామియైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) స్థాతా చాసౌ పాతా చ అను వ్యుత్పత్తిచే స్థపతిశబ్దము అధిష్ఠించియుండి కాపాడువాడను నర్థము నిచ్చును. పృషోదరాదిగణములో జేరినదిగాన వర్ణలోపము దోషావహము కాదు. ఈ స్థపతిత్వము వృక్షస్వామిత్వములో హేతు వగుచున్నది. రోహితశబ్దము వృక్షాధిష్ఠాతయగు పరమేశ్వరుని స్వరూపమును తెలుపుచున్నది. 'యే వృక్షేషు సస్పిఞ్జరా నీలగ్రీవా విలోహితాః' అని ముందుదాహరింప బడనున్నది.

**మూ. నమో మన్త్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమః ॥ 10**

**భాష్యమ్ –** అథ దశమః – మన్త్రిణ ఇతి. వనగుల్మాదయోఽతిగహనపదార్థాః – కక్షాః, తేషాం స్వామీ కక్షాణాం పతిః, తస్మై నమః ఇతి ప్రథమాన్వయః. నను అతిగహనేషు కథమీశ్వరస్యాధిపత్యం స్యాత్? దురవగాహత్వాదిత్యాశఙ్క్య విశినష్టి – వాణిజాయేతి. వణిజాం సమూహో వాణిజః, యథా వణిక్ సర్వజనపదవ్యవహారాన్ పరిచ్ఛిద్య విశదీకరోతి, తథా ఆయమపి సకలవస్తుజాతమితి, నాస్య కించిద్దురవగాహమస్తీతి భావః. కైముతిక–న్యాయేనాపి కక్షాణాం పతిత్వముపపాదయతి – మన్త్రశబ్దేన సప్తకోటిమహామన్త్రాః, తథా వేదరహస్యభూతా ఉపనిషదః, సర్వగుప్తవాదాశ్చాభిధీయన్తే, తేషాం స్వామీ మన్త్రీ, ధనస్వామీ ధనీతివత్. న హి ధనసంబంధమాత్రేణ ధనవోఢారం ధనీతి వ్యవహరన్తి, తథా చ ఏవంవిధేష్వపి గహనేషు యస్య స్వామిత్వమ్ **'ఈశానః సర్వవిద్యానామ్'** ఇత్యాది శ్రుతిషూద్ఘుష్యతే, తస్య కిము వక్తవ్యం కక్షాణాం పతిత్వే ఇతి భావః. ఇతి దశమః.

**అనువాదము:** (అర్థము) మన్త్రిణే = సర్వమన్త్రాధిపతియు, వాణిజాయ = వణిక్సమూహమువలె సర్వవ్యవహారజ్ఞుడునగు రుద్రునకు, నమః = నమస్కారము, కక్షాణామ్ = అరణ్యములు పొదలు మొదలగు ప్రవేశింపనలవిగాని ప్రదేశములకు, పతయే = స్వామియగు రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) కక్షశబ్దవాచ్యములగు ప్రవేశింపనలవిగాని ప్రదేశములకు రుద్రుడధిపతియగు టెట్లు పొసగును? అను శంకను నిరాకరించుటకు 'వాణిజాయ' అను విశేషణము. వాణిజ్యముజేయువాడు సర్వదేశవ్యవహారములను ప్రత్యేకముగ గుర్తించి విశదీకరించు విధమున పరమేశ్వరుడు గూడ సమస్తవస్తుజాతమును గుర్తించి విశదీకరించును. ఆయనకు దురవగాహమైనదేదియు లేదని భావము. **కైముతికన్యాయము**చే గూడ కక్షపతిత్వము నుపపాదించుటకు **'మన్త్రిణే'** అని విశేషణ ముపయుక్తమగుచున్నది. మన్త్రశబ్దముచే సప్తకోటి మహామన్త్రములు, వేదరహస్యములగు ఉపనిషత్తులు, సమస్త గుప్తవాదములును వివక్షితము లగుచున్నవి. పరమేశ్వరుడు సమస్తమన్త్రములకును స్వామి. ధనమునకు స్వామి 'ధని' యనబడుచున్నట్లు – మన్త్రములకు స్వామి 'మన్త్రి, అనబడుచున్నాడు. కేవలము ధనసంబంధమాత్రమున – ధనమును మోయువానిని 'ధని' అని యనరు గద! కాగా – 'ఈశానస్సర్వవిద్యానామ్' ఇత్యాదిశ్రుత్యనుసారము అతిగహనములగు మహామన్త్రములకు గూడ అధిపతియైనవాడు. కక్షముల కధిపతి కాగలడని చెప్పవలసినపని యేమున్నది? అని భావము.

**మూ. నమో భువన్తయే వారివస్కృతాయౌషధీనాం పతయే నమః ॥**

**భాష్యమ్ –** అథైకాదశః – **'నమో భువన్తయే'** ఇతి. భువం తనోతీతి భువన్తిః, తస్మై, వారివస్కృతాయ, వరివః – పరిచర్యా, అస్య కర్తారః వరివస్కృతాః – భక్తాః, తేషు తిష్ఠతీతి వారివస్కృతః. సర్వగతస్యాఽపి పరమేశ్వరస్య భక్తేషు సాన్నిధ్యాతిశయవశాదియముక్తిః. అత ఏవ ఖలు

**యథాయోఽగ్నిసమావేశాన్నాయో భవతి కేవలమ్।**
**తథైవ మమ సాన్నిధ్యాన్న తే కేవలమానుషాః॥**

**శివస్య పరిపూర్ణస్య కిం నామ క్రియతే నరైః।**
**యత్కృతం శివభక్తానాం తచ్ఛివస్య కృతం భవేత్॥**
**అకాయో భక్తకాయః స్యాత్॥** – ఇతి పురాణవచనాని శ్రూయన్తే.

ఓషధీనాం వ్రీహ్యాదీనామ్, పతిః – స్వామీ, తస్మై నమః ఇత్యర్థః. అత్ర భువన్తయ ఇత్యనేన ఓషధిస్వామిత్వే హేతురుచ్యతే. సకలభూవలయస్రష్టృతయా తత్స్వామినః పరమేశ్వరస్య భూమికారౌషధిస్వామిత్వస్యాపి తత ఏవ ప్రాప్తేః. వారివస్కృతాయేత్యనేన చ భక్తకాయస్థత్వోక్త్యా

**నాహం తథాద్మి యజమానహవిర్వితానే చ్యో – తద్ఘృతప్లుతమదన్ హుతభుఙ్ముఖేన।**
**యద్బ్రాహ్మణస్య ముఖతశ్చరతోఽనుఘాసం – తుష్టస్య మయ్యవహితైర్నిజకర్మపాకైః॥**

ఇతి భగవతోక్తం భక్తముఖేన భగవతో భోక్తృత్వమావిష్కృతమ్. తేన చౌషధిఫలభోక్తృత్వేనాపి పరమేశ్వరస్యౌషధిస్వామిత్వం, తత్ఫలభోక్తుస్తత్స్వామిత్వౌచిత్యాత్ ఇత్యుక్తం భవతి. ఏవం పరమేశ్వరభోజనరూపత్వాతిశయమభిప్రేత్యైవ ఉపాసకైః కృతమేవ మే భోజనం నాన్యైః కృతమితి శ్రుతిస్మృత్యాదిభిరామ్నాయతే – **'అన్తరిచ్ఛతి తం జనో రుద్రం పరమో మనీషయా గృహ్ణాతి జిహ్వయా రసం కేవలాఘో భవతి కేవలాదీ'** ఇత్యాద్యాః శ్రుతయః,

**అన్తరిచ్ఛతి యో రుద్రం సదా వన్ద్యం మనీషయా।**
**గృహ్ణాతి జిహ్వయా సోఽన్నం రసపూర్ణామృతోదకమ్॥**

**అన్తర్నేచ్ఛన్తి యే రుద్రం భవాన్యా సహితం భవమ్।**
**పురీషమేవ గృహ్ణన్తి జిహ్వయా తే న సంశయః॥**

ఇత్యాదిపరాశరపురాణవచనాని. ఇత్యేకాదశః.

**అనువాదము:** (అర్థము) భువంతయే = భూమిని (సృజించి) విస్తరింపజేసినవాడును, వారివస్కృతాయ = భక్తులయందు నివసించువాడునునగు రుద్రునకు, నమః = నమస్కారము, ఓషధీనామ్ = వ్రీహియవాదిధాన్యములకు, పతయే = స్వామియగు రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'వారివస్కృతాయ' అనుచో, వరివః – అనగా పరిచర్య, దానిని చేయువారు వరివస్కృతులు. అనగా భక్తులని యర్థము. వారియందుండువాడు – వారివస్కృతుడు. పరమేశ్వరుడు సర్వగతుడైనను, విశేషించి భక్తులయందు సన్నిహితుడై యుండును గాన నిట్లు చెప్పబడుచున్నది. కావుననే **'యథా యోఽగ్నిసమావేశాత్...'** 'తచ్ఛివస్య కృతం భవేత్' 'అకాయో భక్తకాయః స్యాత్' ఇత్యాదిపురాణవచనములు – అగ్నిసంపర్కముచే ఇనుము అగ్నిభావము నొందునట్లు నిరంతరశివధ్యానరూపమగు సాన్నిధ్యముచే భక్తులు శివస్వరూపులగుదురనియు, సర్వపరిపూర్ణుడగు శివునకు సాక్షాత్తుగా చేయజాలిన ఉపచారమేదియు లేదు గాన, శివభక్తులకు చేయు ఉపచారమే శివోపచార మగుననియు, వస్తుతః అశరీరియగు భగవానుడు భక్తశరీరముల స్వశరీరముగ అభిమానించుననియు – తెలుపుచున్నవి. 'భువంతయే' అనునది – ఓషధిస్వామిత్వమునకు హేతువును సూచించుచున్నది. సమస్తభూమండలమును సృజించుటమూలమున తత్స్వామియగు పరమేశ్వరునకు భూవికారము లగు వ్రీహియవాదుల స్వామిత్వము – అర్థసిద్ధము. అనగా భూస్వామిత్వమువల్లనే ఓషధిస్వామిత్వము గూడ సిద్ధించునని భావము. 'వారివస్కృతాయ' అను విశేషణముచే భగవానుడు భక్తశరీరముల నధిష్ఠించి యుండుననుట మూలమున 'నాహం తథాద్మి...' అని భాగవతములో జెప్పబడినట్లుగా **భగవానుడు యజ్ఞములలో యజమానులు అగ్నిముఖమున సమర్పించు హవిస్సులకంటెను, భక్తుల ముఖమున జేయు భోజనమువల్లనే విశేషించి తృప్తినొందు** నను విషయము వ్యక్తీకరింపబడినది. దీనిచే – ఎవడు దేనికి ఫలభోక్తయైయుండునో, వాడే దానికి స్వామియగుట సహజము గాన, ఓషధిఫలభోక్తృత్వమును బట్టిగూడ, ఓషధిస్వామిత్వము సిద్ధమగుచున్నది. 'అన్తరిచ్ఛతి జనో రుద్రం...' 'అన్తరిచ్ఛతి యో రుద్రం...' ఇత్యాది శ్రుతిస్మృతులు – అన్తరంగమున శివుని ధ్యానించుచు చేయు భోజనమే రసపూర్ణమైన అమృతభోజన మని ప్రశంసించుటేకాక, అన్తరంగమున శివుని తలచనైన తలచక భుజించుట, మలభక్షణతుల్యమని నిందించుచున్నవి.

**మూ. నమ ఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం పతయే నమః॥ 12**

**భాష్యమ్ –** అథ ద్వాదశః – నమ ఉచ్చైర్ఘోషాయేతి. యుద్ధాదిషు ఉచ్చైరుచ్ఛ్రితో ఘోషో యస్య ఉచ్చైర్ఘోషః, తస్మై, ఆక్రన్దయతే – వైరిణాం రోదయిత్రే, తన్నాశకాయేతి యావత్. పత్తీనాం – పదాతీనామ్ స్వామినే నమః ఇత్యర్థః. అత్ర పత్తీనాం పతయే ఇత్యనేన పదాతి సాపేక్షమీశ్వరస్య శౌర్యమితి ప్రాప్తే, తన్నివారణాయ స్వయమేవ శత్రునాశనే సామర్థ్యం దర్శయితుమ్ ఆక్రన్దయతే, ఇత్యుక్తమ్. స్వయం శత్రునాశనేఽపి నాయుధాద్యపేక్షా కిన్తు హుంకారమాత్రేణ తదితి దర్శయితుమ్ **'ఉచ్చైర్ఘోషాయ'** ఇత్యుక్తమ్. తథా చ – ఆయుధపరివారాదికమలంకారమాత్రమ్, హాసవీక్షణనఖాదిభిస్త్రిపురమన్మథయమాదీన్ నాశితవతస్తదపేక్షావిరహాదితి భావః.

**అనువాదము:** (అర్థము) ఉచ్చైర్ఘోషాయ = యుద్ధాదులలో బిగ్గరగా హుంకరించునట్టియు, ఆక్రన్దయతే = విరోధులను రోదింప (నశింప)జేయు నట్టియు, రుద్రునకు, నమః = నమస్కారము, పత్తీనామ్ = పదాతిరూపములగు సేనలకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) ఇందు 'పత్తీనాం పతయే' అనుటచే, రుద్రుని పరాక్రమము – పదాతిసేనసాపేక్షమైయుండునని సూచింపబడుటవల్ల అతనికి అపకర్ష ప్రాప్తించు నను శంకకు సమాధానముగా, శత్రువులను నశింపజేయుటలో స్వయంసమర్థు డని వ్యక్తీకరించుటకై 'ఆక్రన్దయతే' అను విశేషణము ప్రయుక్తమైనది, స్వయముగా శత్రువులను నశింపజేయుటలో గూడ ఆయుధాదుల నపేక్షించకయే, కేవలము 'హుంకారము'చేతనే ఆ కార్యమును నిర్వర్తించునను విశేషమును ప్రదర్శించుటకు 'ఉచ్చైర్ఘోషాయ' అను విశేషణము. కేవలము చిఱునవ్వుచేతనే త్రిపురములను, దర్శనమాత్రముననే మన్మథుని, నఖక్షేపాదులచేతనే యమాదులను అంతమొందించిన పరమేశ్వరునకు ఆయుధ పరివారాదికము అలంకారమాత్రమే యని భావము.

**మూ. నమః కృత్స్నవీతాయ ధావతే సత్త్వనాం పతయే నమః ॥ 13**

**భాష్యమ్ –** అథ త్రయోదశః – నమః కృత్స్నవీతాయేతి. కృత్స్నం జగత్ వీతం అధిష్ఠానతయా అన్తర్యామితయా చ వ్యాప్తం యేన, స కృత్స్నవీతః, తస్మై. ధావతే – భక్తాన్ రక్షితుం

పృష్ఠతోఽనువ్రజతే, **'వత్సం గౌరివ గౌరీశో ధావన్తమనుధావతి'** ఇతి వచనాత్. సత్త్వానాం – సాత్త్వికానామ్, పతయే స్వామినే, నమః. అత్ర సత్త్వానాం పతిత్వే, 'ధావతే' ఇత్యనేన హేతురుక్తః. గోవత్సన్యాయేన పృష్ఠతోఽనువ్రజ్య సాత్త్వికాన్రక్షతస్తత్స్వామిత్వౌచిత్యాత్. **'కృత్స్నవీతాయ'** ఇత్యనేన తదేవ ధావనముపపాద్యతే – సర్వవ్యాపినా సర్వతో భక్తాననుధావితుం శక్యత ఇతి. ఇదమేవ ఖలు కృత్స్నవీతత్వేన భగవతః సర్వతో రక్షకత్వం వాజసనేయినాం గృహ్యే శ్రూయతే – 'అపః ప్రవేక్ష్యన్ననుమన్త్రయతే – నమో రుద్రాయాప్సుషదే స్వస్తి మా సంపారయ ఇతి, పన్థానం గచ్ఛన్ననుమన్త్రయతే నమో రుద్రాయ పథిషదే స్వస్తి మా సంపారయ ఇతి, వనం ప్రవేక్ష్యన్ననుమంత్రయతే నమో రుద్రాయ వనషదే స్వస్తి మా సంపారయ ఇతి, తస్మాద్యత్కిఞ్చిత్కుర్వన్స్యాత్తత్సర్వం నమో రుద్రాయ ఇతి కుర్యాత్, సర్వేషు రుద్ర ఇతి శ్రుతేః' ఇతి.

సోఽయం ద్వితీయానువాక ఏకో మన్త్రః. అస్య చ మణ్డూక ఋషిః, మహాగాయత్రీచ్ఛన్దః, శ్రీరుద్రో దేవతా.

**ముక్తాలఙ్కృతసర్వాఙ్గమిన్దుగఙ్గాధరం హరమ్।**
**ధ్యాయేత్కల్పతరోర్మూలే సమాసీనం సహోమయా॥**

శత్రునాశనవశీకరణాద్యైశ్వర్యలాభప్రధానోఽయం మన్త్రః.

**– ఇతి ద్వితీయోఽనువాకః –**

**అనువాదము:** (అర్థము) కృత్స్నవీతాయ = సమస్తజగద్వ్యాపకుడైనట్టియు, ధావతే = భక్తులను రక్షించుటకై వారివెంట పరుగిడునట్టి రుద్రునకు, నమః = నమస్కారము. సత్త్వానామ్ = సాత్త్వికులకు, పతయే = పాలకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) కృత్స్నం జగత్ వీతం వ్యాప్తం యేన – అను వ్యుత్పత్తిచే కృత్స్నవీతశబ్దము సమస్తజగద్వ్యాపకత్వమును బోధించును. సాత్త్వికులకు పాలకు డనుటలో, 'ధావతే' అను పదముచే హేతువు చెప్పబడినది. **'వత్సం గౌరివ గౌరీశో ధావన్తమనుధావతి'** అను వచనానుసారము **గోవత్సన్యాయముచే** వెనువెంట వెళ్లి సాత్త్వికులను రక్షించువాడు – వారి కధిపతియగుట సముచితమే గద! 'కృత్స్నవీతాయ' అను విశేషణముచే ఆ భక్తానుధావనమే సమర్థింపబడుచున్నది. సర్వవ్యాపియగువానికి, సర్వత్ర భక్తానుధావనము సాధ్యమగును. ఈ కృత్స్నవీతత్వమే భగవానుని సర్వరక్షకత్వనిదాన మను విషయమును 'అపః ప్రవేక్ష్యన్నను మన్త్రయతే...రుద్ర ఇతి శ్రుతేః' అను వాజసనేయిగృహ్యాము

తెలుపుచున్నది. నీటిలో దిగునప్పుడు గాని, దూరమార్గమున ప్రయాణించునపుడు గాని, అడవిలో సంచరించునపుడు గాని, మరి యే భయశంకతో గూడిన కార్యములను చేయునపుడుగాని, ఆ యా స్థానములలో సన్నిహితుడై యున్నవానినిగ రుద్రుని భావించి, నమస్కరించి, నన్ను క్షేమముగ దరిజేర్చుమని - అనుమంత్రణ మొనర్చవలెనని సూత్రాభిప్రాయము.

ఈ ద్వితీయానువాకమంతయు ఒకే మంత్రము. దీనికి ఋషి - మణ్డూకుడు, ఛన్దస్సు - మహాగాయత్రి, దేవత - శ్రీరుద్రుడు, (ముక్తాలఙ్కృత...సహోమయా) ముత్తెపు సరులతో అలంకరింపబడిన సర్వాఙ్గముగలిగి, గంగాధరుడై, చంద్రశేఖరుడై పార్వతితో సహ కల్పవృక్షము క్రింద ఆసీనుడైయున్న వానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను, ఈ మంత్రజపముచే శత్రునాశనము, వశీకరణము, ఐశ్వర్యలాభము మున్నగు ఫలములు ముఖ్యముగా లభించును.

**ద్వితీయానువాకము - సమాప్తము.**

- 0 -



**ఓన్నమశ్శివాయ**

# తృతీయోఽనువాకః

## మూ. నమస్సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమః. 1

**భాష్యమ్ –** అథ ద్వితీయ ఇవ తృతీయేఽపి ఆదావష్టభిర్మన్త్రైః సర్వేశ్వరత్వేన భగవాన్నమస్క్రియతే. తత్ర ప్రథమః – నమస్సహమానాయేతి. సహమానాయ – శత్రూన్ అభిభవతే, యద్వా – భక్తాపరాధాన్ క్షమమాణాయేత్యర్థః. నితరాం విధ్యతీతి నివ్యాధీ, తస్మై. ఆ సమన్తాత్ విధ్యన్తీత్యావ్యాధిన్యః – శూరసేనాః, తాసాం స్వామినే నమః. అత్ర ఆవ్యాధినీనాం పతిత్వే **'సహమానాయ – నివ్యాధినే'** ఇతి హేతుగర్భే విశేషణే. విధ్యతాం మధ్యే నితరాం విధ్యతో నిఖిలపరిభవశక్తస్య చ శ్రేష్ఠత్వేన తథావిధస్య తత్స్వామిత్వౌచిత్యాత్; సహమానపదస్య భక్తాపరాధసహమానార్థత్వే తు తస్యేత్థం స్వారస్యం ద్రష్టవ్యమ్ – నను యది పరమేశ్వరః సర్వాపేక్షయా స్వయమతిశయేన వేధకృత్ ఆవ్యాధినీనాం పతిః, తర్హి లోకాః సర్వేఽపి దత్తజలాఞ్జలయ ఇవ స్యుః; పాపరహితస్య కస్యాఽప్యభావేన ప్రాణిమాత్రస్యాపరాధితయా పరమేశ్వరవధ్యత్వస్యాపరిహార్యత్వాదిత్యాశఙ్క్య, భక్తాపరాధ–సహనస్వభావే భగవతి నేయం శఙ్కేత్యాహ – సహమానాయేతి. ఇతి ప్రథమః.

**అనువాదము:** ద్వితీయానువాకమందువలె తృతీయానువాకములో గూడ, మొదటి ఎనిమిది మన్త్రములలో భగవానుడు సర్వేశ్వరుడుగా నమస్కరింపబడుచున్నాడు.

(అర్థము) సహమానాయ = శత్రువులను అణచివేయుచున్నట్టి, లేక – భక్తుల అపరాధములను క్షమించుచున్నట్టియు, నివ్యాధినే = బాణప్రయోగముచే శత్రుశరీరములను విశేషించి గాయపఱచునట్టియు రుద్రునకు, నమః = నమస్కారము, ఆవ్యాధినీనామ్ = శత్రువులనాపాదమస్తకము క్షతగాత్రులను చేయు శూరసేనలకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) ఇచట ఆవ్యాధినీపతిత్వము, అనగా – శత్రువుల నాపాదమస్తకము క్షతగాత్రులనొనర్చు శూరసేనలకు నాయకుడనుటలో 'సహమానాయ నివ్యాధినే' అను రెండును హేతుగర్భవిశేషణములు. బాణప్రయోగము జేయువారిలో విశేషకౌశలము గలిగి సమస్తశత్రువులను పరిభవించజాలినవానికి తన్నాయకత్వము సముచితము గద.

ఇక 'సహమానాయ' అను దానికి భక్తుల అపరాధములను క్షమంచువాడను నర్థములో స్వారస్యమేమనగా – పరమేశ్వరుడు, తదితరులందరికన్నను విశేషించి బాణప్రయోగము జేయువాడగుచో, ఇక లోకమునకు సర్వనాశనమే సంప్రాప్తమగును. కారణమేమనగా – లోకములో సర్వాత్మనా పాపములేనివా డెవ్వడున్నాడు. సర్వప్రాణులును సాపరాధులే గాన వారు పరమేశ్వరునకు వధ్యులగుట తప్పనిసరి. అట్టిచో సర్వనాశనము కాక, శేషించున దేముండును! ఈ శంకకు సమాధానమును 'సహమానాయ' అను పదము సమర్పించుచున్నది. భక్తాపరాధములను సహించు స్వభావముగల భగవానుని విషయమున నిట్టి శంక అనావశ్యక మని భావము.

**మూ. నమః కకుభాయ నిషఙ్గిణే స్తేనానాం పతయే నమః ॥ 2**

**భాష్యమ్ –** అథ ద్వితీయః – నమః కకుభాయేతి. కకుభాయ – మహతే, నిషఙ్గిణే – ఖడ్గవతే, స్తేనానాం – గుప్తచోరాణాం స్వామినే నమః. అత్ర కకుభశబ్దవాచ్యమహత్త్వస్య ప్రతియోగ్యాకాఙ్క్షాయామ్, స్వవాక్యోపాత్తస్తేనానామేవ తత్ప్రతియోగిత్వేనాన్వయః. తథా చ స్తేనేషు మహత్త్వం స్తేనస్వామిత్వే హేతుః కకుభాయ ఇత్యనేన చోచ్యతే – నిషఙ్గిణే ఇత్యనేన స్తేనక్రియాపేక్షితోపకరణసంపత్తిః ప్రదర్శ్యతే. ఇతి ద్వితీయః.

**అనువాదము:** (అర్థము) కకుభాయ = మహత్త్వయుక్తుడైనట్టియు, నిషఙ్గిణే = ఖడ్గధారియై నట్టియు రుద్రునకు, నమః = నమస్కారము, స్తేనానామ్ = గుప్తచోరులకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) కకుభశబ్దము మహత్త్వమును, అనగా – గొప్పతనమును బోధించుచున్నది. ఇది సాపేక్షము. అనగా 'గొప్పది' అనుటతోడనే, 'దేనికంటే?' అను ప్రశ్న కలుగును. దేనినో ఒకదానిని పేర్కొని, 'దీనికంటే' అని సమాధానమును చెప్పవలసి యుండును. ఈ విధముగ ఈ మహత్త్వము తరచుగా సాపేక్షము తరతమభావాపన్నమునై గోచరించుచున్నది. కాగా – ప్రకృతమున అదే వాక్యములో నున్న స్తేనపదమును బట్టి యీ మహత్త్వము స్తేన (గుప్తచోర) నిరూపితమని తెలియుచున్నది, చోరనిరూపితమగు మహత్త్వమే చోరనాయకత్వమునకు నిమిత్తమని తాత్పర్యము, 'నిషఙ్గిణే' అను పదము – ఖడ్గధారి యను నర్థమును బోధించుచు, ప్రకృతమగు చౌర్యమునకు గావలసిన సాధనసంపత్తిని ప్రదర్శించుచున్నది.

## మూ. నమో నిషఙ్గిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమః ॥ 3

**భాష్యమ్ –** అథ తృతీయః – నమో నిషఙ్గిణ ఇతి. ధనుషి సన్ధాతుం హస్తే ధృతో బాణః – నిషఙ్గః. పృష్ఠే బద్ధో బాణాధారః – ఇషుధిః. తదుభయయుక్తాయ తస్కరాణాం – ప్రకాశచోరాణాం స్వామినే నమః. అత్ర తస్కరాధిపత్యానుగుణరూపప్రదర్శనార్థత్వేన విశేషణే సంగమయితవ్యే. ఇతి తృతీయః.

**అనువాదము:** (అర్థము) నిషఙ్గిణే = ధనుస్సులో నెక్కుపెట్టుటకై బాణమును చేత ధరించియున్నట్టియు, ఇషుధిమతే = అమ్ములపొదిని వీపునదాల్చినట్టియు రుద్రునకు, నమః = నమస్కారము, తస్కరాణామ్ = ప్రకటచోరులకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) ఇందలి 'నిషఙ్గిణే' 'ఇషుధిమతే' అను రెండు విశేషణములును తస్కరా(ప్రకటచోరా)నుగుణముగ స్వరూపమును ప్రదర్శించుటలో చరితార్థము లగుచున్నవి.

## మూ. నమో వఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే నమః ॥ 4

**భాష్యమ్ –** అథ చతుర్థః – నమో వఞ్చత ఇతి. యే స్వకీయా ఏవ భూత్వా అన్యైరజ్ఞాతాః సన్తః ద్రవ్యమపహరన్తి, తే – స్తాయవః, తేషాం స్వామినే నమః. దేవస్య స్తాయుస్వామిత్వ–ముపపాదయితుం వఞ్చతే – పరివఞ్చతే, ఇతి విశేషణే. స్వామిన ఆప్తో భూత్వా తదీయ–ద్రవ్యక్రయవిక్రయాదివ్యవహారేషు యత్ర కుత్రాపి యత్కిఞ్చిద్ద్రవ్యాపహారీ వఞ్చన్నిత్యుచ్యతే. సర్వేష్వపి వ్యవహారేషు అపహ్నవకృత్ పరివఞ్చన్నిత్యుచ్యతే. తద్రూపాయేత్యర్థః. ఇతి చతుర్థః.

**అనువాదము:** (అర్థము) వఞ్చతే = యజమానునకు ఆప్తుడుగా నుండి అతనికి సంబంధించిన వస్తువుల క్రయవిక్రయాది వ్యవహారములలో ఏదోయొకచోట ఏ కొంచెము ద్రవ్యమునో అపహరించునట్టియు, పరివఞ్చతే = అదేవిధముగ సర్వవ్యవహారములలో మోసపుచ్చునట్టియు, రుద్రునకు, నమః = నమస్కారము, స్తాయూనామ్ = యజమానునకు స్వీయులుగా వర్తించుచు, ఇతరుల కెవ్వరికిని తెలియకుండునట్లు అతని ద్రవ్యమపహరించు వారలకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) వఞ్చతే – పరివఞ్చతే – అను విశేషణద్వయమును భగవానుని స్తాయుపతిత్వమును సమర్థించుచున్నది.

**మూ. నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః ॥ 5**

**భాష్యమ్ –** అథ పఞ్చమః – నమో నిచేరవ ఇతి. అరణ్యేషు వర్తమానాశ్చోరా ఆరణ్యాః, తేషాం స్వామినే నమః. ఏతదేవోపపాదయతి. నమో నిచేరవే పరిచరాయేతి. ఆరణ్యక–చోరాపేక్షయాఽప్యపహారవిషయే నితరాం సంచరణశీలో నిచేరుః. ఏవం తదపేక్షయా పరితోఽపహర్తుం సంచరణశీలః – పరిచరః, తాదృశస్య తేషు శ్రేష్ఠత్వాత్ తత్స్వామిత్వం యుక్తమితి భావః. ఇతి పఞ్చమః.

**అనువాదము:** (అర్థము) నిచేరవే = దొంగిలించుటకై విశేషముగ సంచరించు స్వభావము గలిగినట్టియు, పరిచరాయ = దొంగిలించుటకే సర్వత్ర సంచరించు స్వభావము గలిగినట్టియు రుద్రునకు, నమః = నమస్కారము. అరణ్యానామ్ = అరణ్యములలోనుండెడి చోరులకు, పతయే = స్వామియగు రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) నిచేరవే పరిచరాయ – అను రెండు విశేషణములును చోర నాయకత్వమున కపేక్షితమగు సామర్థ్యాతిశయమును సూచించుచున్నవి.

**మూ. నమస్సృకావిభ్యో జిఘాగ్ంసద్భ్యో ముష్ణతాం పతయే నమః॥ 6**

**భాష్యమ్ –** అథ షష్ఠః – నమః సృకావిభ్య ఇతి. సృకేణ – యన్త్రేణ ఆత్మానమవన్తీతి సృకావిణః. ప్రాణినో హన్తుమిచ్ఛన్తో జిఘాంసన్తః. తదుభయరూపాయ, ముష్ణతాం కేదారాదిషు ధాన్యచోరాణాం స్వామినే నమః. అత్రాపి ముష్ణతాం పతిత్వం సమయే స్వరక్షణచతురస్య తద్విరోధినో జిఘాంసత ఏవ భవతీతి విశేషణద్వయమ్. బహువచనం ఛాన్దసమ్. అన్యథా విశేషణవిశేష్యభావాయోగాత్. ఏవముత్తరమన్త్రేఽపి. ఇతి షష్ఠః.

**అనువాదము:** (అర్థము) సృకావిభ్యః = యంత్రవిశేషముతో ఆత్మరక్షణము గావించు కొనునట్టియు, జిఘాగ్ంసద్భ్యః = ప్రాణులను హింసింపగోరుచున్నట్టియు రుద్రులకు, నమః = నమస్కారము. ముష్ణతామ్ = పండిన చేలలోని ధాన్యమును దొంగిలించువారలకు, పతయే = నాయకుడైనట్టి రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) అవసరమును బట్టి ఆత్మరక్షణకై అన్యులను హింసించుటకు సమర్థుడైనవాడే ధాన్యచోరులకు నాయకత్వమును వహించగల డను భావమును, 'సృకావిభ్యః - జిఘాగ్ంసద్భ్యః' అను విశేషణములు సూచించుచున్నవి. ఆ పదములోని బహువచనము ఛాన్దసము అట్లు కానిచో విశేషణవిశేష్యభావము కుదురదు. ముందు మంత్రములలో గూడ నిట్లే బహువచనోపపత్తి నెఱుంగునది.

## మూ. నమో౽సిమద్భ్యో నక్తఞ్చరద్భ్యః ప్రకృన్తానాం పతయే నమః॥ 7

**భాష్యమ్ –** అథ సప్తమః – నమో౽సిమద్భ్య ఇతి. అసిమన్తః – ఖడ్గధారిణః, నక్తంచరన్తః – రాత్రిచరాః, తద్రూపాయేత్యర్థః. హత్వైవాపహరన్తశ్చోరాః – ప్రకృన్తాః, తేషాం స్వామినే నమః. అత్ర ప్రకృన్తస్వామిత్వానుగుణస్వరూపప్రదర్శనాయ విశేషణద్వయమ్. ఇతి సప్తమః.

**అనువాదము:** (అర్థము) అసిమద్భ్యః = ఖడ్గధారులైనట్టియు, నక్తం చరద్భ్యః = రాత్రికాలమున సంచరించు (రాక్షసరూపులై)నట్టియు రుద్రులకు, నమః = నమస్కారము. ప్రకృన్తానామ్ = హింసించియే ధనము నపహరించు చోరులకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) ఇచటగూడ 'ప్రకృన్త' స్వామిత్వమును సమర్థించుటకై 'అసిమద్భ్యః – నక్తంచరద్భ్యః' అను విశేషణద్వయము ప్రయుక్తమైన దని యెఱుంగునది.

## మూ. నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం పతయే నమః॥ 8

**భాష్యమ్ –** అథాష్టమః – నమ ఉష్ణీషిణ ఇతి. కుం – భూమిం గృహక్షేత్రాదిరూపాం, లుఞ్చన్తి – అపహరన్తీతి కులుఞ్చాః, తేషాం స్వామినే నమః ద్వివిధాః కులుఞ్చాః – గ్రామేషు స్థిత్వా ఉష్ణీషిణో దుష్ప్రవర్తకతయా దుర్బలానాం క్షేత్రాద్యపహర్తారః కేచిత్. కేచిత్తు – గిరివనాద్యాశ్రయేణ బలిష్ఠాః సన్తో లోకానాం క్షేత్రాదీనపహరన్తి. తదుభయరూపత్వం ఉష్ణీషిణే – గిరిచరాయేతి విశేషణాభ్యాం క్రమేణ ప్రదర్శితమ్. తాదృశస్య కులుఞ్చస్వామిత్వం యుక్తమితి భావః.

**అనువాదము:** (అర్థము) ఉష్ణీషిణే = గ్రామములో నివసించుచు, పెద్దమనుష్యునివలె తలపాగా ధరించి, దుష్ప్రవృత్తితో దుర్బలుల సొత్తునపహరించునట్టియు, గిరిచరాయ = కొండలలో అడవులలో నివసించుచు బలిష్ఠులై పరుల సొత్తు నపహరించునట్టియు రుద్రులకు, నమః = నమస్కారము. కులుఞ్చానామ్ = గృహక్షేత్రాదుల నపహరించు వారలకు, పతయే = నాయకుడైన రుద్రునకు, నమః = నమస్కారము.

(వివరణము) 'కుం – భూమిం, లుఞ్చన్తి – అపహరన్తి; అను వ్యుత్పత్తిచే **కులుంచ**పదము గృహక్షేత్రాదిరూపమగు భూమి నపహరించువారిని బోధించును. వారిలోని అవాన్తరభేదమును తెలుపుచు 'ఉష్ణీషిణే – గిరిచరాయ' అను పదములు కులుంచనాయకత్వమునకు కావలసిన గుణసంపత్తిని సూచించుచున్నవి.

## మూ. నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ వో నమః ॥ 9

**భాష్యమ్ –** తదేవం **'నమో హిరణ్యబాహవే'** ఇత్యాదిభిరేతదన్తైరేకవింశత్యా మన్త్రైః దిగాద్యేకైకవస్త్వాధిపత్యప్రదర్శనేన, **'జగతాం పతయే నమః'** ఇతి సాక్షాచ్చ కణ్ఠరవేణ భగవతః **'ఏష సర్వేశ్వర ఏష లోకాధిపతిః'** ఇతి శ్రుతిప్రసిద్ధమఖిలజగదీశ్వరత్వముక్త్వా ఇదానీమేకైకవస్త్వాత్మకత్వేన భగవతః సర్వాత్మకత్వం వర్ణయన్నమస్కర్తుమారభతే – నమ ఇషుమద్భ్య ఇత్యాదినా. లోకానవితుమిషూన్ ధనుశ్చాహవే హస్తే వహన్తః – ఇషుమన్తః, ధన్వావినః, తే చ దేవాసురమనుష్యరూపేణ జగతి యావన్తో వర్తన్తే తద్రూపేభ్యో వః – యుష్మభ్యం నమః. పరమేశ్వరాంశానాం, వస్తుతస్తదభిన్నానాం చ ఘోరతరరుద్రాణాం బహుత్వాత్తత్సంబోధనాభిప్రాయేణ 'వ' ఇతి బహువచనమ్. తథా చ అసహ్యా హ్యేతే ఘోరతరా రుద్రా యే ఉభయతో నమస్కారాః, అథైతే శాన్తతరా రుద్రా యే అన్యతో నమస్కారా ఇతి.

**అనువాదము:** ఈ విధముగ 'నమో హిరణ్యబాహవే' మొదలగు ఇరువదియొక్క మంత్రములచే దిక్కులు మొదలుగా ఏకైకవస్త్వాధిపత్యప్రదర్శనపూర్వకముగను, 'జగతాం పతయే నమః' అనుచో సాక్షాత్తుగ కణ్ఠోక్తిచేతను 'ఏష సర్వేశ్వర ఏష లోకాధిపతిః' ఇత్యాది శ్రుతిప్రసిద్ధమగు భగవానుని సకల జగదీశ్వరత్వమును ప్రతిపాదించి, మరల నిప్పుడు ఏకైకవస్త్వాత్మకత్వప్రదర్శనము ద్వారా సర్వాత్మకత్వమును ప్రదర్శించుట కుపక్రమించు చున్నాడు.

(అర్థము) ఇషుమద్భ్యః = లోకరక్షణార్థమై యుద్ధమునందు బాణహస్తులై యున్నట్టియు, ధన్వావిభ్యః + చ = ధనుర్ధారులై యున్నట్టియును, వః = మీకొఱకు (అనగా ఘోరతనువును ధరించియున్న రుద్రమూర్తులకొఱకు) నమో నమః = నమస్కారము (ముందు మంత్రములలో గూడ 'వః' అను పదమున కీ విధముగనే అర్థమును గ్రహించునది.)

(వివరణము) 'తస్యైతే తనువౌ ఘోరాన్యా శివాన్యా' అను శ్రుతిలో జెప్పబడిన ఘోరతనువును ధరించిన రుద్రమూర్తులు దేవాసురమనుష్యాది వివిధరూపములతో సంచరించుచుందురు. 'వః' అను పదముచే వారందరును గ్రహింపబడి నమస్కరింపబడు చున్నారు. వీరందరును పరమేశ్వరాంశభూతులు, వస్తుతః తదభిన్నులును, తత్సంబోధనాభిప్రాయముతో 'వః' అను బహువచనాన్త పదము ఉపపన్నమగుచున్నది. **ఉభయతోనమస్కారమన్త్రప్రతిపాద్యులగు రుద్రులు అత్యన్తఘోరస్వరూపులనియు, అన్యతోనమస్కారమన్త్రప్రతిపాద్యులగు రుద్రులు అత్యన్తశాన్తస్వరూపులనియు** అవాన్తరభేదమును గ్రహించునది.

**మూ. నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చ వో నమః ॥ 10**

**భాష్యమ్ –** అథ ద్వితీయః – నమ ఆతన్వానేభ్య ఇతి. ధనుషి జ్యామారోపయన్తః ఆతన్వానాః, ఆతతజ్యే ధనుషి శరాన్ సన్దధానాః ప్రతిదధానాః, తే చ జగతి యావన్తః తద్రూపేభ్యః వో నమః ఇతి పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) ఆతన్వానేభ్యః = ధనుస్సున అల్లెత్రాటిని కూర్చుచున్నట్టియు, ప్రతిదధానేభ్యః + చ = అట్టి ధనుస్సున బాణములను సంధించుచున్నట్టియును, వః = మీ (రుద్రుల) కొరకు, నమో నమః = నమస్కారము.

**మూ. నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చ వో నమః ॥ 11**

**భాష్యమ్ –** అథ తృతీయః – నమ ఆయచ్ఛద్భ్య ఇతి. జ్యాకర్షణం కుర్వన్తః ఆయచ్ఛన్తః, ఆకృష్య బాణాన్ ముఞ్చన్తః విసృజన్తః, శేషమత్ర పూర్వవద్ద్రష్టవ్యమ్.

**అనువాదము:** (అర్థము) ఆయుచ్ఛద్భ్యః = అల్లెత్రాటిని ఆకర్షించుచున్నట్టియు, విసృజద్భ్యః + చ = ఆకర్షించి బాణములను విడచుచున్నటియును, వః నమో నమః = (యథాపూర్వము).

**మూ. నమోఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చ వో నమః ॥ 12**

**భాష్యమ్ –** అథ చతుర్థః – నమోఽస్యద్భ్య ఇతి. ముక్తస్య బాణస్య లక్ష్యపర్యన్తం గమనమ్ అసనమ్, తత్కర్తారః అస్యన్తః లక్ష్యసమీపగతస్య లక్ష్యే ప్రవేశో వేధః, తత్కర్తారో విధ్యన్తః.

**అనువాదము:** అస్యద్భ్యః = ధనుస్సునుండి విడువబడిన బాణమును లక్ష్యపర్యంతము పయనింపజేయునట్టియు, విధ్యద్భ్యః + చ = అట్లు పయనించిన బాణమును లక్ష్యములో లగ్నమగునట్లు జేయునట్టియు, రుద్రమూర్తులకు నమస్కారమని యర్థము.

**మూ. నమ ఆసీనేభ్యశ్శయానేభ్యశ్చ వో నమః ॥ 13**

**భాష్యమ్ –** 'నమ ఆసీనేభ్య' ఇత్యాదయః, 'అశ్వపతిభ్యశ్చ వో నమః' ఇత్యన్తాః పఞ్చ మన్త్రాః స్పష్టార్థాః.

సోఽయముభయతో నమస్కారరూపసప్తదశయజురాత్మకావాన్తరమన్త్ర-సముదాయరూపస్తృతీయోఽనువాక ఏకో మన్త్రః. అస్య భగవానేవ ఋషిః, స ఏవ దేవతా, బృహతీచ్ఛన్దః, **ధ్యానమ్ –**

**రూపయౌవనసంపన్నా మూర్తేవ వనదేవతా।**
**పుష్పితానేకపుంనాగసహకారశిఖోపమా॥**

**పఞ్చవింశతినక్షత్రమయూరాకృతిశేఖరః।**
**అకలఙ్కశరత్పూర్ణచన్ద్రబిమ్బసమాననః॥**

**ప్రాతర్విబుద్ధపద్మాభం వసానం చర్మ కోమలమ్।**
**సవ్యాపసవ్యవిధృతకృతమాలావిభూషితః॥**

**ధరాకదమ్బపుఞ్జేన నాభిదేశప్రలమ్బినా।**
**ఆజఙ్ఘం ప్రేక్షణీయేన ప్రేక్షణీయోఽపి శత్రుభిః॥**

భూధరస్య చ చార్వఙ్గీ కన్యాలఙ్కారశోభితా।
ఆదర్శమూర్తిః శోభానామన్యా నారీవ నిర్మలా॥

తస్యా హస్తే ధనుర్దత్త్వా శరమేకం చ నిర్మలమ్।
తదీయమంసమాలంబ్యాశ్లిష్టం వామేన బాహునా॥

సుగన్ధిపుష్పస్తబకమాఘ్రాయాఘ్రాయ పాణినా।
వీజ్యమానో మన్దమన్దం నవపల్లవశాఖయా॥

సమావృతో బాలకైశ్చ శ్వభిశ్చాపి మనోహరైః।
గచ్ఛద్భిరాగతో దృష్టైర్ధ్యాతవ్యో జగతాం గురుః॥
ఏవంరూపో మహాతేజాః కిరాతవపురీశ్వరః॥ ఇతి.

స్వరాష్ట్రవ్యాధిపరరాష్ట్రాభిచారశత్రునాశనాదిఫలప్రదోఽయం మన్త్రః. ప్రాజాపత్య– పూర్వకపఞ్చసహస్రజపాదయం మన్త్రః సిద్ధ్యతి. తతః ప్రయోగార్హో భవతి.

**అనువాదము:** 'నమ ఆసీనేభ్యః' మొదలు, 'అశ్వపతిభ్యశ్చ వో నమః' వరకు గల ఐదు మంత్రములు స్పష్టార్థములు – ఈ దృష్టితో భాష్యకారులు అర్థవివరణము జేయకున్నను. సాధారణపాఠకుల సౌకర్యార్థము సంగ్రహముగ అర్థము అభివ్యక్తము చేయబడుచున్నది–

(అర్థము) ఆసీనేభ్యః = కూర్చొనియున్నట్టియు, శయానేభ్యః + చ = పండుకొని యున్నట్టియు రుద్రమూర్తులకు నమస్కారము,

**మూ. నమస్స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమః ॥ 14**

**అనువాదము:** స్వపద్భ్యః = నిద్రించుచున్నట్టియు, జాగ్రద్భ్యః + చ = మేలుకొనియున్నట్టియు రుద్రమూర్తులకు నమస్కారము.

**మూ. నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః ॥ 15**

**అనువాదము:** తిష్ఠద్భ్యః = నిలచియున్నట్టియు, ధావద్భ్యః + చ = పరుగిడుచున్నట్టియు రుద్రమూర్తులకు నమస్కారము.

**మూ. నమస్సభాభ్యస్సభాపతిభ్యశ్చ వో నమః ॥ 16**

**అనువాదము:** సభాభ్యః = సంఘరూపముగనున్నట్టియు, సభాపతిభ్యః + చ = తత్సంఘ నాయకులుగా నున్నట్టియు రుద్రమూర్తులకు నమస్కారము.

**మూ. నమో అశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో నమః ॥ 17**

## ఇతి తృతీయోఽనువాకః.

**అనువాదము:** అశ్వేభ్యః = అశ్వరపధారులై యున్నటియు, అశ్వపతిభ్యః + చ = అశ్వపాలకులుగనున్నట్టియు రుద్రమూర్తులకు నమస్కారము.

(వివరణము) 'నమస్సహమానాయ' మొదలు, 'అశ్వపతిభ్యశ్చ వో నమః' వరకు గల ఉభయతోనమస్కారరూపములగు పదునేడుమన్త్రములును, పురశ్చరణవిధానములో ఒకే మన్త్రము. ఋషియు, దేవతయు భగవాను(రుద్రు)డే. ఛన్దస్సు – బృహతి. ('రూపయౌవనసంపన్నా...కిరాతవపురీశ్వరః') రూపయౌవనసంపన్నమైన – శరీరమును ధరించియున్న – వనదేవతయో యన, పుష్పించిన అశోకపుంనాగసహకారవృక్షాగ్ర సదృశమై, నక్షత్రములవలె ప్రకాశించుచున్న ఇరువదియైదు నెమలికన్నులను శిరోభూషణముగ ధరించి, మచ్చలేని శరత్కాలపూర్ణచంద్రబింబమును బోలిన ముఖము గలిగి, ప్రాతఃకాలమున వికసించిన పద్మమువలె కోమలమగు చర్మమును దాల్చి, పుష్పమాలాలంకృతములగు దక్షిణవామబాహువులతో, నాభిప్రదేశమునుండి పిక్కలవరకు వ్రేలాడుచున్న కడిమిపూలగుత్తులతో కడుంగడుసుందరమై, శత్రువులకు సైతము 'చూడవలె' నను బుద్ధిబుట్టించు సుందరరూపముతో ప్రకాశించుచు, ఆరణ్యకములగు అలంకారములచే సమలంకృతయై, అడవిసోయగముల కన్నింటికి అకలంకమైన ఆదర్శమూర్తిగా అతని ప్రక్కనే సుందరాంగియగు హైమవతి నిలచియుండగా, తనచేతనవున్న ధనుర్బాణముల నామె కందించి, యామె భుజశిరస్సు నానుకొని వామబాహువుతో నామెను కౌగిటజేర్చుకొని చేతనున్న సువాసనల విరజిముచున్న సుమగుచ్ఛమును మాటిమాటికి ఆఘ్రాణించుచు లేజిగురుటాకుల కొమ్మతో మెల్లమెల్లగా విసరబడుచున్నట్టియు, ఆరణ్యకబాలకులచే ఆవరింపబడినట్టియు మిక్కిలి మదించి

మనోహరములైన వేటకుక్కలు ముందు నడచుచుండగా వాని వెనుక కిరాతవేషముతో మహాతేజశ్శాలియై వచ్చుచున్నవానినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను.

తన రాష్ట్రమున జెలరేగిన వ్యాధిబాధల నశింపజేయుట, శత్రురాష్ట్రమున నట్టి బాధల నుత్పత్తిజేయుట, శత్రునాశనము, ఇత్యాదిఫలముల నిచ్చు మంత్ర మిది. ప్రాజాపత్యకృచ్ఛ్రము నాచరించి, ఐదువేల పర్యాయములు జపించిన మంత్రసిద్ధియగును. అటుపైని మన్త్రము ప్రయోగార్హమగును.

**తృతీయానువాకము – సమాప్తము**

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# చతుర్థోఽనువాకః

మూ. నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో నమః ॥ 1

**భాష్యమ్ –** అథ చతుర్థానువాకః. తృతీయ ఇవ చతుర్థేఽపి భగవాన్ సర్వాత్మకత్వేన నమస్క్రియతే. తత్ర ప్రథమః – నమ ఆవ్యాధినీభ్య ఇతి. ఆ సమన్తాద్వేద్ధుం శక్తాః స్త్రియః ఆవ్యాధిన్యః. వివిధం వేద్ధుం శక్తాః స్త్రియః వివిధ్యన్త్యః. తాశ్చ జగతి యావన్త్యః సన్తి, తావద్రూపేభ్యో వః నమః – ఇతి పూర్వవత్.

**అనువాదము:** తృతీయానువాకమునందువలె చతుర్థానువాకమునందు గూడ భగవానుడు సర్వాత్మకుడుగ నమస్కరింపబడుచున్నాడు –

(అర్థము) ఆవ్యాధినీభ్యః = సర్వత్రబాణప్రయోగమును జేయజాలినట్టియు, వివిధ్యన్తీభ్యః + చ = వివిధరీతుల బాణప్రయోగమును జేయజాలినట్టియును స్త్రీరూపమును ధరించియున్న, వః = మీకొరకు, అనగా ఘోరతనువును ధరించి యున్న రుద్రులకొరకు, నమో నమః = నమస్కారము. ఇట్లు పూర్వోక్తవిధముగనే (ముందుగూడ) అన్వయము.

మూ. నమ ఉగణాభ్యస్తృగ్ంహతీభ్యశ్చ వో నమః ॥ 2

**భాష్యమ్ –** అథ ద్వితీయః – నమ ఉగణాభ్య ఇతి. ఉత్కృష్టగణాః, ఉగణాః – సప్తమాతృకాద్యాః. తథా హింసితుం సమర్థాః దుర్గాద్యాః ఉగ్రదేవతాః – తృంహన్త్యః, తద్రూపేభ్య ఇతి పూర్వవత్.

**అనువాదము:** ఉగణాభ్యః = ఉత్కృష్టములగు సప్తమాతృకాదిగణములుగ నున్నట్టియు, తృగ్ంహతీభ్యః + చ = ఉగ్రదేవతలగు దుర్గాదుల రూపమున హింసించు సామర్థ్యము గలిగియున్నట్టియు మీకు నమస్కారము. ఇట్లే ఈ యనువాకసమాప్తిపర్యన్తము 'వో నమో నమః' అను పదముల కర్థము గ్రహించునది.

**మూ. నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమః ॥ 3**

**భాష్యమ్ –** అథ తృతీయః – నమో గృత్సేభ్య ఇతి. గర్ధనశీలా గృత్సాః – విషయలంపటాః, తేషాం పతయః – గృత్సపతయః. శేషం పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) గృత్సేభ్యః = విషయలంపటులైనట్టియు, గృత్సపతిభ్యః + చ = విషయలంపటులకధిపతులైనట్టియును, మీకు నమస్కారము.

**మూ. నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమః ॥ 4**

**భాష్యమ్ –** అథ చతుర్థః – నమో వ్రాతేభ్య ఇతి. నానాజాతీయాః సఙ్ఘాః వ్రాతాః, తేషాం పతయః – వ్రాతపతయః.

**అనువాదము:** (అర్థము) వ్రాతేభ్యః = నానాజాతులకు చెందిన సంఘములుగ నున్నట్టియు, వ్రాతపతిభ్యః + చ = అట్టి సంఘముల కధిపతులుగనున్నట్టియును, మీకు నమస్కారము.

**మూ. నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమః ॥ 5**

**భాష్యమ్ –** అథ పఞ్చమః – నమో గణేభ్య ఇతి. గణాః – ప్రమథాః, తేషాం పతయః – నన్దికేశ్వరాదయః.

**అనువాదము:** (అర్థము) గణేభ్యః = ప్రమథగణరూపముగనున్నట్టియు, గణపతిభ్యః + చ = గణనాయకులగు నన్దీశ్వరాదులుగా నున్నట్టియును, మీకు నమస్కారము.

**మూ. నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః ॥ 6**

**భాష్యమ్ –** అథ షష్ఠః – నమో విరూపేభ్య ఇతి. విరూపాః – వికృతరూపాః, నానారూపాః – విశ్వరూపాః. యద్వా – బ్రహ్మణో వస్తుతోఽవికారత్వేన పరమార్థతో విగతరూపాః. **'సమారోప్యస్య రూపేణ విషయో రూపవాన్ భవేత్'** ఇతి న్యాయేన శుక్తికాయాం రజతమివ బ్రహ్మణి అధ్యస్తం విశ్వరూపమితి – విశ్వరూపాః.

(అర్థము) విరూపేభ్యః = వికృతరూపులైనట్టియు, విశ్వరూపేభ్యః + చ = నానారూపులైనట్టియును, లేదా – వస్తుతః నిర్వికారపరబ్రహ్మస్వరూపులుగాన రూపరహితులైనట్టియు, అట్లయ్యును 'సమారోప్యస్య రూపేణ విషయో రూపవాన్ భవేత్' అను న్యాయమున విశ్వరూపులైనట్టియును మీకు (రుద్రులకు) నమస్కారము.

(వివరణము) శుక్తికయందు రజతమువలె, పరమాత్మయందు విశ్వము అధ్యస్తమైనది. శుక్తిక స్వస్వరూపముతోకాక, అధ్యస్తమైన రజతరూపమున భాసించినట్లు, పరమాత్మయు స్వస్వరూపముతోకాక, అధ్యస్తమైన విశ్వ(ప్రపంచ) రూపముతో భాసించుచున్నా డను భావము **'సమారోప్యస్య'** అను న్యాయము తెలుపుచున్నది.

**మూ. నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమః ॥ 7**

**భాష్యమ్ –** అథ సప్తమః – నమో మహద్భ్య ఇతి. అణిమాద్యష్టైశ్వర్యోపేతాః – మహాన్తః. తద్రహితాః – క్షుల్లకాః.

**అనువాదము:** (అర్థము) మహద్భ్యః = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము – అను అష్టైశ్వర్యములు గలిగినట్టియు, క్షుల్లకేభ్యః = అట్టి అష్టైశ్వర్యరహితులైనట్టియును మీకు నమస్కారము.

**మూ. నమో రథిభ్యోఽరథేభ్యశ్చ వో నమః ॥ 8**

**భాష్యమ్ –** అథాష్టమః – నమో రథిభ్య ఇతి. రథవన్తః రథినః, తద్రహితాః – అరథాః.

**అనువాదము:** (అర్థము) రథిభ్యః = రథసహితులైనట్టియు, అరథేభ్యః + చ = రథరహితులైనట్టియును మీకు నమస్కారము.

**మూ. నమో రథేభ్యో రథపతిభ్యశ్చ వో నమః ॥ 9**

**భాష్యమ్ –** నవమాదయః శ్వపతిభ్య ఇత్యన్తాః నవమన్త్రాః స్పష్టార్థాః. తత్ర చ రథచాలకాః సారథయః – క్షత్తారః. త ఏవ రథం నియచ్ఛన్తః – సంగ్రహీతారః. తక్షరథకారయో–

రవాన్తరభేదాద్భేదః. కర్మారాః – లోహకారాః. పక్షిపుఞ్జానాం ఘాతుకాః – పుఞ్జిష్ఠాః. నిషాదాః – శ్వపచాః. శునకగలబద్ధపాశధరాః – శ్వపతయః. శేషం స్పష్టమ్.

**అనువాదము:** నమో రథేభ్యః అను నవమమన్త్రము మొదలు 'శ్వపతిభ్యః' అను అనువాకాన్తమన్త్రమువరకు గల మన్త్రములు స్పష్టార్థములను దృష్టితో భాష్యకారులు కొన్ని పదములకు మాత్రమే అర్థమును వివరించి వదిలినారు. పాఠకుల సౌకర్యమునకై ఆ మన్త్రముల కన్నింటికిని యథాక్రమముగ అర్థము సంగ్రహముగ వ్రాయబడుచున్నది.

(అర్థము) రథేభ్యః = రథరూపముననున్నట్టియు, రథపతిభ్యః + చ = రథస్వాములైయున్నట్టియు, మీకు నమస్కారము.

**మూ. నమస్సేనాభ్యస్సేనానిభ్యశ్చ వో నమః ॥ 10**

**అనువాదము:** (అర్థము) సేనాభ్యః = ఏనుగులు–గుఱ్ఱములు–రథములు–పదాతులు అను చతురఙ్గబలరూపులైయున్నట్టియు, సేనానిభ్యః = అట్టి సేనకు నాయకులై యున్నట్టియు మీకు నమస్కారము.

(వివరణము) సేనానిభ్యః అనుచో దీర్ఘాభావము ఛాన్దసము.

**మూ. నమః క్షత్తృభ్యస్సఙ్గ్రహీతృభ్యశ్చ వో నమః ॥ 11**

**అనువాదము:** (అర్థము) క్షత్త్రభ్యః = రథసారథులుగనున్నట్టియు, సంగ్రహీతృభ్యః = రథనియామకులుగనున్నట్టియు మీకు నమస్కారము.

**మూ. నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః ॥ 12**

**అనువాదము:** (అర్థము) తక్షభ్యః = తక్షజాతికి చెందినట్టియు, రథకారేభ్యః = రథకారజాతికి చెందినట్టియు మీకు నమస్కారము.

(వివరణము) తక్ష–రథకారశబ్దములు రథమును నిర్మించువారిలోని అవాన్తరజాతి భేదమును తెలుపును.

**మూ. నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమః ॥ 13**

**అనువాదము:** కులాలేభ్యః = మట్టిపాత్రలను చేయు కుమ్మరివారుగనున్నట్టియు, కర్మారేభ్యః = రాగి, ఇత్తడి మున్నగు లోహపాత్రలను చేయు కమ్మరివారుగనున్నటియు మీకు నమస్కారము.

**మూ. నమః పుఞ్జిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమః ॥ 14**

**అనువాదము:** పుఞ్జిష్టేభ్యః = పక్షిజాలమును బట్టి హింసించువారుగనున్నట్టియు, నిషాదేభ్యః = చేపలనుబట్టి హింసించువారుగ (లేక శ్వపచులుగ) నున్నట్టియు మీకు నమస్కారము.

**మూ. నమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చ వో నమః ॥ 15**

**అనువాదము:** ఇషుకృద్భ్యః = బాణములను తయారుజేయువారుగనున్నట్టియు, ధన్వకృద్భ్యః = ధనుస్సులను నిర్మించువారుగనున్నట్టియు మీకు నమస్కారము.

**మూ. నమో మృగయుభ్యశ్శ్వనిభ్యశ్చ వో నమః ॥ 16**

**అనువాదము:** మృగములను వేటాడుజాతికి చెందియున్నట్టియు, శ్వనిభ్యః = వేటకుక్కల మెడలోని త్రాళ్ళను పట్టుకొని నడిపించువారుగనున్నట్టియు మీకు నమస్కారము.

**మూ. నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చ వో నమః ॥ 17**

**అనువాదము:** శ్వభ్యః = కుక్కలరూపముననున్నట్టియు, శ్వపతిభ్యః = కుక్కలను పోషించు వారుగ నున్నట్టియు మీకు నమస్కారము.

**భాష్యమ్ –** తదేతత్ 'ఇషుమద్భ్యః' ఇత్యేతదన్తైః షడ్వింశతిమన్త్రైః ప్రపఞ్చాన్తర్గతైక– వస్త్వాత్మకత్వప్రదర్శనేన, **'విశ్వరూపేభ్యః'** ఇతి సాక్షాత్కణ్ఠరవేణ చ భగవతశ్చేతనాచేతనాత్మక–

సకలప్రపఞ్చరూపత్వముపవర్ణితమ్. ఏతచ్చ **'నమో జ్యేష్ఠాయ చ'** ఇత్యగ్రే వక్ష్యమాణమపి సార్వాత్మ్యముపలక్షయతి, తేన చ శివాద్వైతముక్తం భవతి. తథా చ శ్రుతయః – **'ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే' 'న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః' 'ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే' 'విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్, సర్వో హ్యేష రుద్రః' 'సర్వో వై రుద్రః' 'అహమేవ ప్రథమమాసం వర్తామి చ భవిష్యామి చ నాన్యః కశ్చన మత్తో వ్యతిరిక్తః'** ఇతి. స్మృతయశ్చ – **'భూతాని శంభుర్భువనాని శంభుర్వనాని శంభుర్గిరయశ్చ శంభుః'** ఇత్యాద్యాః. తత్ర చేతనాచేతనాత్మకానాం చేతనస్వరూపైక్యమ్, **'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి'** ఇత్యాది ప్రమాణ–సహస్రానురోధాత్. అచేతనాత్మకత్వం తు ఆరంభణాధికరణ (2–1–6) న్యాయేన తదధ్యాసాధిష్ఠానత్వమ్; అధ్యస్తస్య అధిష్ఠానవ్యతిరేకేణాసత్త్వస్య శుక్తికారజతాదౌ దృష్టత్వేన రజతాధ్యాసాధిష్ఠానస్య శుక్తికాయాః రజతాత్మకత్వవత్ జగదధ్యాసాధిష్ఠానస్య బ్రహ్మణో జగదాత్మకత్వాదితి బ్రహ్మమీమాంసాయాం ప్రపఞ్చః. ఏతేన **'శ్వభ్యః శ్వపతిభ్యశ్చ'** ఇత్యతినికృష్టైః శ్వాదిభిః సహ భగవతః కథమైక్యం శ్రుత్యా ప్రతిపాద్యత ఇతి శంకా – నిరస్తా; నహి శ్వశబ్దవాచ్యదేహవిశిష్టాభేదః శ్రుత్యోచ్యతే, కిన్తు తల్లక్ష్యం నిష్కృష్టోపాధి యజ్జీవచైతన్యం ఉచ్చనీచభావాపన్నేషు శరీరేష్వనుస్యూతం, తదాత్మకత్వమ్. తదేతద్గీతా–యాం స్పష్టీకృతం భగవతైవ – **'విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః'** ఇతి. న చైతావతా పరమేశ్వరస్య తదుపాధిగుణదోష–సంబంధలేశోఽస్తి. నహి గంగాయాం తటాకే సురాయాం మూత్రే వా ప్రతిబింబ–మానస్యాదిత్యస్య తదుపాధిగుణదోషసంబంధ ఇతి సర్వమనవద్యమ్.

సోఽయముభయతో నమస్కారరూపః సప్తదశయజురాత్మకావాన్తరమన్త్ర–సముదాయరూపచతుర్థానువాక ఏకో మన్త్రః. అస్య దుర్వాసా ఋషిః. మహావిరాట్ఛన్దః. శంభుర్దేవతా. **ధ్యానమ్ –**

> **భస్మోద్ధూలితసర్వాఙ్గం జటామణ్డలమణ్డితమ్।**
> **ధ్యాయేద్దేవం వృషారూఢం గణేశ్వరయుతం హరమ్॥**

రాజయక్ష్మజ్వరసన్నిపాతకుష్ఠాదిరోగపరిహారకోఽయం మన్త్రః. సార్ధప్రాజాపత్యపూర్వకం సహస్రవారజపాన్మన్త్రసిద్ధిః. **ఇతి చతుర్థోఽనువాకః.**

**అనువాదము:** ఇట్లు 'ఇషుమద్భ్యః' మొదలు ఇరువదియారుమన్త్రములచే ప్రపంచములోని ఏకైక వస్తుస్వరూపునిగ ప్రదర్శించుటచేతను, విశేషించి 'విశ్వరూపేభ్యః' అను పదముచే

కణ్ఠోక్తిగ నిరూపించుటచేతను భగవానునకు చేతనాచేతనసకలప్రపంచరూపత్వము ప్రతిపాదింపబడినది. ఇయ్యది – 'నమో జ్యేష్ఠాయ చ' ఇత్యాదిగా ముందు చెప్పబోవు సార్వాత్మ్యమునకు గూడ నుపలక్షకము. ఇందుమూలమున శివాద్వైతము సిద్ధమగుచున్నది. 'ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే' న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః' 'ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే' విశ్వం భూతం భువనం...సర్వోహ్యేష రుద్రః' 'సర్వో వై రుద్రః' 'అహమేవ ప్రథమమాసం వర్తామి భవిష్యామి చ. న చాన్యః కశ్చనమత్తో వ్యతిరిక్తః, ఇతి' ఇత్యాదిశ్రుతులు, 'భూతాని శంభుః భువనాని శంభుః వనాని శంభుః గిరయశ్చ శంభుః' ఇత్యాది స్మృతులును పూర్వోక్తమగు అద్వైతమునకు ఉపబృంహకములై యున్నవి.

అందు 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది ప్రమాణవచనసహస్రము ననుసరించి చేతనాచేతనాత్మకముల కన్నింటికిని చేతనస్వరూపముతో ఐక్యము సిద్ధించును. అచేతనాత్మకత్వ మెట్లనగా – ఆరంభణాధికరణ (2–1–6) న్యాయము ననుసరించి – అచేతనాధ్యాసకు అధిష్ఠానమైయుండుటను బట్టి సిద్ధించును. అధ్యస్తము అధిష్ఠానముకన్న భిన్నముగ నుండజాల దను విషయము 'శుక్తికారజత' భ్రమాదులలో మన కనుభవసిద్ధమై యున్నది. రజతాధ్యాసాధిష్ఠానమైన శుక్తిక, రజతమున కాత్మయైనట్లు. జగదధ్యాసాధిష్ఠాన మైన బ్రహ్మమే జగత్తునకాత్మభూతమగును. ఈ విషయము బ్రహ్మమీమాంసలో వివరింపబడినది. *(ఇచట అభినవశంకరభాష్యములో శివాద్వైతమునుపపాదించుచు, 'రజతాధ్యాసాధిష్ఠానస్య శుక్తికాయాః రజతాత్మకత్వవత్ జగదధ్యాసాధిష్ఠానస్య బ్రహ్మణో జగదాత్మకత్వాత్' అని చెప్పబడినది. ఈ వాక్యము – 'రజతాధ్యాసాధిష్ఠానమైన శుక్తిక రజతాత్మక మైనట్లు, జగదధ్యాసాధిష్ఠానమైన బ్రహ్మము జగదాత్మకమైయున్నది.' అను నర్థమును స్ఫురింపజేయుచు, ఇంచుక భ్రమను కలిగించునదిగా నున్నది.*

*శాస్త్రసంప్రదాయజ్ఞులు. ఆరోపితమైన జగత్తుకు అధిష్ఠానబ్రహ్మైత్వకత్వమును (తదనన్యత్వమును) చెప్పుచున్నారేగాని, బ్రహ్మకు జగదాత్మకత్వమును చెప్పుటలేదు. అట్లు చెప్పుచో – జగదనన్యమైన బ్రహ్మకు జగత్తునకువలె జడత్వ – అనిత్యత్వ – మిథ్యాత్వాదిదోషములు ప్రసక్తములగును. బ్రహ్మమీమాంసలోని ఆరంభణాధికరణములో గూడ 'వాచారంభణ' శ్రుత్యాదుల ననుసరించి మృచ్ఛరావాది దృష్టాన్తములలో – కార్యభూతమగు జగత్తునకు కారణభూత బ్రహ్మానన్యత్వము (వేరుగా లేకుండుట బ్రహ్మసత్తాతిరిక్తసత్తాశూన్యత్వము) చెప్పబడినదే గాని, కారణభూతమగు బ్రహ్మకు కార్యభూతజగదనన్యత్వము చెప్పబడలేదు.*

ప్రకృతభాష్యవాక్యసందర్భమును పరిశీలించిన అభిజ్ఞులు కొందరు – ఇందలి 'రజతాత్మకత్వవత్' 'జగదాత్మకత్వాత్' అను పదములలోని 'క' కారములు, లేఖక – ముద్రాపక ప్రమాదపతితములై యుండవచ్చుననియు, వాని నుపేక్షించుచో, వాక్యము వివక్షితార్థమును బోధించుచు సమంజసమగుననియు అభిప్రాయపడినారు. తదనుగుణముగనే అనువదించుట జరిగినది. అభినవశంకరులవంటి మహామనీషి – అపసిద్ధాన్తము నవలంబించరు గద!)

ఈ దృష్టితో పరిశీలించినపుడు 'శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చ' ఇత్యాదిమన్త్రములలో నికృష్టములగు శునకాదులతో పరమాత్మ కేకత్వమును చెప్పుట – అనుచిత మను శంక పరిహృతమగును. ఇచట శ్వశబ్దమునకు వాచ్యార్థమగు నికృష్టమైన శునకశరీరముతోగాని, తద్విశిష్టమైన జీవచైతన్యముతోగాని పరమాత్మ కేకత్వమును శ్రుతిచెప్పుటలేదు. అది ఉపపన్నము గూడ కాదు. మరేమనగా – శ్వాదిశబ్దములచే లక్షితమైన ఉచ్చనీచభావా–పన్నములగు నిఖిలశరీరములలో అనుస్యూతమైన – చైతన్యమునకు పరమాత్మతో ఏకత్వము శ్రుతికి వివక్షితము. ఈ విషయమును 'విద్యావినయసంపన్నే...సమదర్శినః' అను గీతావచనమునందు భగవానుడే విశదీకరించియున్నాడు. ఇట్లు చెప్పుటచే ఆ యా ఉపాధుల గుణదోషములు ఈషణ్మాత్రముగ గూడ పరమాత్మను స్పృశింపజాలవని విషయము సిద్ధించుచున్నది. గంగాజలములో తటాకములో – మద్యములో – మూత్రములో ప్రతిబింబించిన సూర్యునకు తత్తదుపాధిగతములైన గుణదోషములతో సంబంధమున్నదా! కావున నిది నిరవద్యమైన సిద్ధాన్తము.

ఉభయతో నమస్కారాత్మకములగు పదునేడు అవాన్తరయజుర్మన్త్రములతో గూడిన యీ చతుర్థానువాకమంతయు పురశ్చరణప్రక్రియలో ఒకే మన్త్రము. దీనికి ఋషి– దుర్వాసుడు. ఛన్దస్సు – మహావిరాట్. దేవత – శంభువు, ధ్యానము – (భస్మోద్ధూళిత సర్వాఙ్గం...గణేశ్వరయుతం హరమ్) సర్వాంగము నందును భస్మమును బూసికొని, జడలచుట్టలు అలంకారములు కాగా, గణపతితో సహ వృషభవాహనము నధిష్ఠించి యున్నవానినిగ భగవానుని ధ్యానించవలెను. క్షయ–జ్వర–సన్నిపాత–కుష్ఠాదిరోగముల నీ మన్త్రము నివారించును. సార్థప్రాజాపత్యకృచ్ఛ్రపూర్వకముగ వేయి పర్యాయములు జపించిన మన్త్రసిద్ధి యగును.

**చతుర్థానువాకము – సమాప్తము**

– 0 –

## పఞ్చమోఽనువాకః

మూ. నమో భవాయ చ రుద్రాయ చ। 1

నమశ్శర్వాయ చ పశుపతయే చ। 2

**భాష్యమ్ –** ఇత్థం చతుర్థే సర్వాత్మకత్వేన భగవాన్నమస్కృతః. ఇదానీం భగవదసాధారణ–ధర్మరూపతన్మహిమానుసన్ధానపూర్వకం తన్నమస్కారమారభతే. ఏతదారభ్య **'ద్రాపే'** ఇత్యేతత్పర్యన్తమన్యతో నమస్కారాః. సర్వత్ర నమస్కారాదిరేకైకో మన్త్రః, యథా – **'నమో భవాయ చ రుద్రాయ చ'** ఇత్యాది. ఏవమన్యేఽపి జ్ఞేయాః. తత్ర ప్రథమం ద్వాభ్యాం మన్త్రాభ్యాం జగజ్జన్మస్థితిసంహారబన్ధమోక్షాఖ్యపఞ్చకృత్యకారిత్వరూపపరమేశ్వరాసాధారణ–మహిమానమనుసన్దధానస్తం నమస్కరోతి. **నమో భవాయ** చేతి. భవత్యస్మాజ్జగదితి భవః, అనేన **'సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేన్ద్రాస్తే సంప్రసూయన్తే'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం భగవతో జగజ్జన్మహేతుత్వం ప్రదర్శితమ్. రుదం సంసారదుఃఖం ద్రావయతీతి **రుద్రః**. అనేన **'యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః, తదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి' 'రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే'** ఇతి శ్రుతిప్రసిద్ధం మోక్షహేతుత్వముక్తమ్. శృణాతి హినస్తి సర్వమితి శర్వః. అనేన **'తస్మై ఉపసంహర్త్రే మహాగ్రాసాయ నమః'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం జగత్సంహర్తృత్వముక్తమ్. పశుపతిశబ్దేన బన్ధస్థితిహేతుత్వముచ్యతే, పశుశబ్దేన సంసారబన్ధస్య పతిశబ్దేన తద్రక్షణస్య చోక్తేః, తథా చ **'సంసారమోక్షస్థితిబన్ధహేతుః'** ఇతి శ్రుతిప్రసిద్ధం జగత్స్థితిబన్ధహేతుత్వముక్తం భవతీత్యాహత్య పఞ్చకృత్యహేతుత్వేన భగవన్నమస్కారో మన్త్రద్వయార్థః. అత్ర నమఃశబ్దస్య ప్రత్యేకం చతుర్థ్యన్తపదాభ్యామన్వయం ద్రఢయితుం సముచ్చయార్థౌ చకారౌ ఫలితౌ. తేన భవాయ చ నమః, శర్వాయ చ నమః ఇత్యన్వయో భవతి. ఏవమగ్రేఽపి సర్వత్ర ద్రష్టవ్యమ్.

**అనువాదము:** చతుర్థానువాకములో సర్వాత్మకుడుగ భగవానుడు నమస్కరింపబడినాడు. ఇకనిప్పుడు భగవానుని అసాధారణధర్మరూపమగు మహత్త్వమును అనుసంధాన మొనర్చుచు అతని నమస్కరించు ప్రక్రియ ప్రారంభింపబడుచున్నది. ఇది మొదలు 'ద్రాపే'

అన్ధసస్పతే' వరకు గల మన్త్రములన్నియు అన్యతోనమస్కారములు. అనగా – ఒక్కొక్క మన్త్రము 'నమో భవాయ చ రుద్రాయ చ' ఈ విధముగ ఆదియందుమాత్రమే నమః పదఘటితమైయుండును. అనన్యసామాన్య మహత్త్వప్రఖ్యాపకములైన జగత్తుయొక్క సృష్టి–స్థితి–లయ–బన్ధ–మోక్షము లను పంచకృత్యములను నిర్వర్తించు వానినిగ మొదటి రెండు మంత్రములలో భగవానుని నమస్కరించుచున్నాడు.

(అర్థము) భవాయ + చ = జగదుత్పత్తికారణమైనవానికి, నమః = నమస్కారము. రుద్రాయ + చ = సంసారదుఃఖమును దూరీకరించువానికి, నమః = నమస్కారము. శర్వాయ + చ = సమస్తప్రపంచమును లయింపజేయువానికి, నమః = నమస్కారము, పశుపతయే + చ = ద్విపాచ్చతుష్పాద్ద్రూపులగు కర్మపాశబద్ధులైన సమస్త ప్రాణులకును పాలకుడైన రుద్రునకు నమస్కారము.

(వివరణము) 'భవత్యస్మాదితి భవః' అను వ్యుత్పత్తిచే భవశబ్దము – భగవానుని జగజ్జన్మహేతుత్వమును తెలుపుచున్నది. 'సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్తే సంప్రసూయన్తే' ఇత్యాది శ్రుతు లీ యర్థమును సమర్థించుచున్నవి. ఇక రుద్రశబ్దము. 'రుదం సంసార–దుఃఖం ద్రావయతి' అను వ్యుత్పత్తిచే మోక్షకారణత్వమును ప్రదర్శించుచున్నది. ఈ విషయమున 'యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః తదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి' (మానవులు ఆకాశమును చర్మమును చుట్టినట్లు చుట్టజాలుదురేని, అపుడు శివతత్త్వము నెరుగకయే సంసారదుఃఖమును తరింపవచ్చును. అనగా – శివతత్త్వము నెరింగిన వారు మాత్రమే సంసారదుఃఖమును తరింపజాలుదురని భావము.) 'రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచేష్టే' (అవిముక్తోపాసకులకు రుద్రుడు తారక బ్రహ్మోపదేశ మొనర్చునని తాత్పర్యము.) ఇత్యాదిశ్రుతులు ప్రమాణమైయున్నవి. ద్వితీయ మంత్రములోని శర్వపదము 'శృణాతి హినస్తి సర్వమితి శర్వః' అను వ్యుత్పత్తిచే జగత్సంహారకారిత్వమును బోధించుచున్నది. **'తస్మై ఉపసంహర్త్రే మహాగ్రాసాయ నమః'** ఇత్యాదిశ్రుతులు ఇందుకుపోద్బలకములు. పశుపతిపదములోని పశుశబ్దము బంధమునకు, పతిశబ్దము తద్రక్షణమునకు సూచకములు గాన నయ్యది బంధమునకు – స్థితికిని కారణభూతుడను నర్థమును స్ఫురింపజేయుచున్నది. కాగా – 'సంసారమోక్షస్థితిబన్ధహేతుః' ఇత్యాది శ్రుతులలో చెప్పినట్లు జగత్స్థితి – బన్ధహేతుత్వము సిద్ధమగుచున్నది. ఇట్లు మొత్తము మీద పంచకృత్య కారణభూతునిగ భగవానుని నమస్కరించుట యీ మన్త్రద్వయ పర్యవసితార్థము. ఇందు 'నమః' శబ్దము చతుర్థ్యన్తపదములలో నొక్కొక్కదానితో అన్వయించు నను విషయమును దృఢీకరించుటయే సముచ్చయార్థకములగు చకారముల

ప్రయోజనము. కాగా 'భవాయ చ నమః' 'శర్వాయ చ నమః' ఈ విధముగ అన్వయము సిద్ధమగును. ముందు మంత్రములలో గూడ ఇట్లే అన్వయమును గ్రహించునది.

**మూ. నమో నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ ॥ 3**

**భాష్యమ్ –** అథ తృతీయః – నమో నీలగ్రీవాయేతి. కాలకూటగ్రసనేన నీలా గ్రీవా – కణ్ఠో యస్య స నీలగ్రీవః. తద్గ్రసనాత్పూర్వం శితిః – ధవలః కణ్ఠో యస్య సః శితికణ్ఠః. అనేన స్వతో ధవలకణ్ఠే కాలకూటప్రయుక్తం నైల్యం దోషమవిగణయ్య జగదేకరక్షణాయ విషం కబలితవతో భగవతః సర్వలోకదయాలుత్వం **'అర్హన్నిదం దయసే విశ్వ'** మిత్యాది శ్రుతిప్రసిద్ధం ప్రదర్శితమ్.

**అనువాదము:** (అర్థము) నీలగ్రీవాయ చ నమః = కాలకూటవిషమును మ్రింగుటచే నలుపెక్కిన కంఠముగలవానికి నమస్కారము. శితికణ్ఠాయ చ నమః = (విషభక్షణముకు ముందు) తెల్లని కంఠముగలవానికి నమస్కారము.

(వివరణము) సహజశుద్ధమగు తన కంఠమున కాలకూటవిషప్రయుక్తమగు కాళిమ (నలుపు) సంక్రమించు నను విషయమును లెక్కసేయక, లోకమును రక్షించు ప్రధానదృష్టితో విషమును మ్రింగిన భగవానుని సర్వలోకదయాళుత్వమును నీలగ్రీవాయ – శితికంఠాయ అను పదద్వయము ప్రదర్శించుచున్నది. ఈ యర్థమును 'అర్హన్నిదం దయసే విశ్వమ్' ఇత్యాదిశ్రుతులు సమర్థించుచున్నవి.

**మూ. నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ ॥ 4**

**భాష్యమ్ –** అథ చతుర్థః – నమః కపర్దిన ఇతి. కపర్దః – పరమేశ్వరజటాకలాపః, తద్వాన్ కపర్దీ. అనేన **'దక్షం సయజ్ఞం జహి తం భటానాం త్వమగ్రణీ రుద్రజటాంశకో మే'** ఇతి భాగవతాదిప్రసిద్ధః భగవజ్జటాంశవీరభద్రమహిమా స్మర్యతే. తేన చ **'దేవా వై యజ్ఞాద్రుద్రమన్తరాయన్, స యజ్ఞమవిధ్యత్'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధదక్షాధ్వరధ్వంసమహిమా దర్శితః. వ్యుప్తాః – ముణ్డితాః కేశాః యస్య, సః వ్యుప్తకేశః. పరమహంసపరివ్రాజకః. **'అథ పరివ్రాడేకశాటీ శిష్యపరివృతో ముణ్డోదరపాత్రీ' 'జ్ఞానశిఖినః జ్ఞానయజ్ఞోపవీతినః'** ఇత్యాదిశ్రుతేః. తేన దత్తాత్రేయదుర్వాసః ప్రభృతయః జాబాలోపనిషత్ప్రసిద్ధాః, కలియుగే

చ **'చతుర్భిః సహితః శిష్యైః శంకరోఽవతరిష్యతి' 'శంకరః సవితాననః'** ఇత్యాదిపురాణ–ప్రసిద్ధపరమేశ్వరావతారభావాః శంకరాచార్యస్వామినః, తద్రూపాయేత్యర్థః. అనేన 'బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిః' ఇతి శ్రుతిప్రసిద్ధం బ్రహ్మవిద్యాసంప్రదాయ–ప్రవర్తకత్వముక్తమ్.

**అనువాదము:** (అర్థము) కపర్దినే చ నమః = జటాజూటధారికి నమస్కారము, వ్యుప్తకేశాయ చ నమః = ముండితశిరస్కుడై యతిరూపమును ధరించిన రుద్రునకు నమస్కారము.

(వివరణము) 'కపర్దినే' అను పదము 'దక్షం సయజ్ఞం జహి తం భటానాం త్వమగ్రణీ రుద్రజటాంశకో మే' (రుద్రజటాసంభూతుడవగు నీవు నాయనుచరులలో అగ్రేసరుడవై దక్షుని, అతని యజ్ఞమును ధ్వంసము జేయుము) అను భాగవతోక్తి ననుసరించి రుద్రుని జడలనుండి యావిర్భవించిన వీరభద్రుని మహిమను స్మరింప జేయుచున్నది. దానిచే – 'దేవా వై యజ్ఞాద్రుద్రమన్తరాయన్ స యజ్ఞమవిధ్యత్' అను శ్రుతిప్రసిద్ధమగు – ఈశ్వరధిక్కారపూర్వకముగ ప్రారంభించిన దక్షుని యజ్ఞమును ధ్వంసమొనర్చిన భగవానుని మహిమాతిశయము ప్రదర్శితమగుచున్నది.

'వ్యుప్తకేశ' పదము – వ్యుప్తాః – ముణ్డితాః కేశాః యస్య అను వ్యుత్పత్తి ననుసరించి భగవంతుని పరమహంసపరివ్రాజకావతారలక్షణమును సూచించుచున్నది. 'అథ పరివ్రాడేకశాటీ శిష్యపరివృతో ముణ్డోదరపాత్రీ' 'జ్ఞానశిఖినో జ్ఞానయజ్ఞోపవీతినః' ఇత్యాదిశ్రుతుల ననుసరించి సన్న్యాసిలక్షణములలో నిదియు (ముండితశిరస్కత్వము) చేరియున్నది. ఇందువలన జాబాలాద్యుపనిషత్తులలో చెప్పబడిన – దత్తాత్రేయ, దుర్వాసః ప్రభృతులును, కలియుగములో 'చతుర్భిః సహితః శిష్యైః శంకరోఽవతరిష్యతి' ఇత్యాది పురాణప్రసిద్ధపరమేశ్వరావతారభూతులగు శ్రీశంకరాచార్యస్వాములును సూచింపబడు చున్నారు. తద్రూపియగు రుద్రునకు నమస్కారమని భావము. దీనివలన 'బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతిః' అను శ్రుతిప్రసిద్ధమగు బ్రహ్మవిద్యాసంప్రదాయ ప్రవర్తకత్వము ప్రతిపాదింపబడినది.

## మూ. నమస్సహస్రాక్షాయ చ శతధన్వనే చ ॥ 5

**భాష్యమ్** – అథ పఞ్చమః – నమస్సహస్రాక్షాయేతి. సహస్రమ్ – అనన్తాని అక్షీణి యస్య సః సహస్రాక్షః, అనేన **'యస్సర్వజ్ఞః'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధః సర్వజ్ఞత్వమహిమా

దర్శితః. శతమ్ – అనన్తాని ధన్వాని – ధనూంషి, వేదప్రణవమేర్వాదిరూపాణి యస్య, సః శతధన్వా. 'స తథోక్తస్తథేత్యుక్త్వా విష్ణుం కృత్వా శరోత్తమమ్, శల్యమగ్నిం తథా కృత్వా ధనుర్మేరుమకారయత్' **'కృత్వా చ ధనురోఙ్కారం సావిత్రీం జ్యాం మహేశ్వరః'** ఇత్యాదిభారతోక్తవేదప్రణవమేరుపినాకాద్యనేకధనుర్యుక్తాయేత్యర్థః. అనేన **'తేషామసురాణాం తిస్రః పుర ఆసన్'** ఇతి శ్రుతిప్రసిద్ధత్రిపురసంహారమహిమా దర్శితః.

**అనువాదము:** (అర్థము) సహస్రాక్షాయ చ నమః = అనన్తములైన కన్నులు గలవానికి నమస్కారము. శతధన్వనే చ నమః = అనన్తములగు ధనుస్సులు గల వానికి నమస్కారము.

(వివరణము) సహస్రాక్షశబ్దము – 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' ఇత్యాది శ్రుతి ప్రసిద్ధమైన భగవానుని సర్వజ్ఞత్వమును సూచించుచున్నది. 'శతధన్వనే' అనునది – శ్రుతిపురాణాదులలో ప్రసిద్ధమైన భగవానుని వేద–ప్రణవ–మేర్వాదినానావివిధ ధనుర్ధారిత్వమును తెలుపుచున్నది. 'స తథోక్తస్తథేత్యుక్త్వా...మహేశ్వరః' ఇట్లు భారతాదులలో ఒకప్పుడు మేరుపర్వతమును, మరియొకప్పుడు ఓంకారమును, ఇంకనొకప్పుడు వేదమును ధనుస్సుగ ధరించినట్లు చెప్పబడినది. పినాకము సుప్రసిద్ధము. దీనిచే – 'తేషామసురాణాం తిస్రః పుర ఆసన్' ఇత్యాదిగా శ్రుతిలో ప్రసిద్ధమైన త్రిపురాసురసంహారమహిమ ప్రదర్శిత మగుచున్నది.

**మూ.** **నమో గిరిశాయ చ శిపివిష్టాయ చ।** **6**

**నమో మీఢుష్టమాయ చేషుమతే చ ॥** **7**

**భాష్యమ్ –** అథ ద్వాభ్యాం త్రిమూర్త్యాత్మకత్వం, విశ్వాధికత్వం చ దర్శయతి – నమో గిరిశాయేతి. గిరిః – కైలాసః, సోఽస్యాస్తీతి గిరిశః. లోమాదిత్వాన్మత్వర్థీయః శః, తద్రూపాయ ఇత్యర్థః. శిపివిష్టః – విష్ణుః, **'విష్ణుశ్శిపివిష్టః'** ఇతి శ్రుతేః. విష్ణురూపాయేత్యర్థః. **మీఢుష్టమః** – అతిశయేన వీర్యసేచకః జగత్స్రష్టా హిరణ్యగర్భః, తద్రూపాయేత్యర్థః. అనేన **'స బ్రహ్మా స శివః స హరిస్సేన్ద్ర సోఽక్షరః, పరమస్స్వరాట్'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ–త్రిమూర్త్యాత్మకత్వముక్తం భవతి. ప్రశస్తః ఇషురస్యాస్తీతి ఇషుమాన్, ప్రశంసాయాం మతుప్. ప్రాశస్త్యం చ ఇషోః **'స ఇషుగ్ం నమస్కుర్వతాగ్నిమనీకగ్ం సోమాగ్ం శల్యం విష్ణుం తేజనమ్'** ఇత్యాదిశ్రుత్యుక్తం ద్రష్టవ్యమ్. తేన చ – సర్వదేవానామపి త్రిపురసంహారీయం

భగవత్పరికరత్వమనుస్మార్యతే. తేన చ **'యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ' 'విశ్వాధికో రుద్రో మహర్షిః' 'అజ్ఞాన్యన్యా దేవతాః'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం విశ్వాధికత్వం ప్రదర్శితమ్.

**అనువాదము:** ఇటుపైని రెండు మంత్రములలో త్రిమూర్త్యాత్మకత్వము విశ్వాధికత్వము ప్రదర్శింపబడుచున్నది.

(అర్థము) గిరిశాయ చ నమః = కైలాసగిరివాసునకు నమస్కారము. శిపివిష్టాయ చ నమః = విష్ణుస్వరూపునకు నమస్కారము. మీఢుష్టమాయ చ నమః = హిరణ్యగర్భ (బ్రహ్మ) స్వరూపునకు నమస్కారము. ఇషుమతే చ నమః = ప్రశస్తమైన బాణము గలవానికి నమస్కారము.

(వివరణము) 'గిరిశాయ' అనుచో గిరిశబ్దముకంటే లోమాదిత్వమును పురస్కరించుకొని మత్వర్థీయమగు శ ప్రత్యయము వచ్చినది. కైలాసగిరి కలవాడు, తద్రూపుడని యర్థము. 'విష్ణుశ్శిపివిష్టః' అను శ్రుత్యనుసారము శిపివిష్టుడనగా – విష్ణువు. వీర్యసేచనకర్త్రర్థకమగు మీఢుష్టమశబ్దమునకు జగత్స్రష్టయగు హిరణ్యగర్భుడని యర్థము. దీనిచే – 'స బ్రహ్మ స శివస్స హరి సేన్ద్రస్సోஉక్షరః పరమస్స్వరాట్' అను శ్రుతిలో పేర్కొనబడిన రీతిని త్రిమూర్త్యాత్మకత్వమును చెప్పినట్లగుచున్నది. 'ఇషుమతే' అనుచో మతుప్ ప్రత్యయము ప్రశంసార్థకము. 'త ఇషుగ్ం నమస్కుర్వతాగ్ని...తేజనమ్' అను శ్రుతిలో జెప్పినట్లు త్రిపురాసురసంహారముకై – అగ్ని అగ్రభాగముగను సోముడు మూలము (పిడి)గను, విష్ణువు పదునుపెట్టిన ప్రదేశముగను దేవతలచే తయారుచేయబడుటయే పరమేశ్వరుని బాణమునకు గల ప్రాశస్త్యము. దీనిచే త్రిపురాసురసంహారమున సమస్త దేవతలును భగవానునికి పరికరభూతులై యున్నారను విషయము స్మృత్యారూఢమగును. తన్మూలమున 'యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ' 'విశ్వాధికో రుద్రో మహర్షిః' ఇత్యాది శ్రుతిప్రసిద్ధమగు శ్రీరుద్రుని విశ్వాధికత్వము విదితమగుచున్నది.

**మూ. నమో హ్రస్వాయ చ వామనాయ చ. 8**

**భాష్యమ్ –** అథాష్టమః – నమో హ్రస్వాయేతి. శరీరే లఘుప్రమాణో హ్రస్వః. అనేన **'తత్రాపి దహ్రం గగనం విశోకః'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం దహరవిద్యోపాస్యత్వం ప్రదర్శితమ్. సంకుచితపాదాద్యవయవో వామనః – మహాగణపతిః, తద్రూపాయేత్యర్థః. మహాగణపతేః సాక్షాత్పరమేశ్వరావతారత్వస్య మంత్రశాస్త్రపురాణాదిప్రసిద్ధేః. అనేన **'గణానాం త్వా గణపతిగ్ం హవామహే'** ఇతి శ్రుతిప్రసిద్ధో మహిమా దర్శితః.

**అనువాదము:** (అర్థము) హ్రస్వాయ చ నమః = అల్పప్రమాణమగు శరీరముగలవానికి– అనగా దహరవిద్యోపాస్యునకు నమస్కారము. వామనాయ చ నమః = పొట్టికాళ్లు చేతులు గల్గి గుజ్జురూపముననుండు మహాగణపతిస్వరూపునకు నమస్కారము.

(వివరణము) హ్రస్వశబ్దముచే 'తత్రాపి దహ్రం గగనం విశోకః' ఇత్యాది శ్రుతులలో జెప్పబడిన దహరోపాసనలో ఉపాస్యమగు స్వరూపము ఉపశమింపబడుచున్నది. వామనశబ్దము – 'గణానాం త్వా గణపతిం' అను మంత్రముచే ప్రతిపాద్యమైనట్టియు మహాగణపతిస్వరూపమును తెలుపుచున్నది.

## మూ. నమో బృహతే చ వర్షీయసే చ. 9

**భాష్యమ్ –** అథ నవమః – నమో బృహత ఇతి. దేశకాలవస్తుకృతత్రివిధపరిచ్ఛేదరాహిత్యం బృహత్త్వమితి బ్రహ్మమీమాంసాయాం వ్యవస్థాపితమ్. బృహతే – పరబ్రహ్మణ ఇత్యర్థః. 'అథ కస్మాదుచ్యతే పరం బ్రహ్మేతి? యస్మాద్బృహతి బృంహయతి, తస్మాదుచ్యతే పరం బ్రహ్మ' ఇత్యథర్వశిరఃశ్రుతేః. అనేన **'ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ' 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'** ఇత్యాదిశ్రుత్యుక్తం పరబ్రహ్మత్వం దర్శితం భవతి. గుణైః సమృద్ధో వర్షీయాన్. అనేన **'సత్యకామః సత్యసంకల్పః' 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ'** ఇత్యాదిశ్రుత్యుక్తదివ్యగుణమహిమా ప్రదర్శితః.

**అనువాదము:** (అర్థము) బృహతే చ నమః = అపరిచ్ఛిన్నపరబ్రహ్మస్వరూపునకు నమస్కారము. వర్షీయసే చ నమః = సత్యకామత్వాది దివ్యగుణసంపన్నునకు నమస్కారము.

(వివరణము) దేశ–కాల–వస్తుకృతములగు త్రివిధపరిచ్ఛేదములు లేని పదార్థము బృహచ్ఛబ్దమునకు ముఖ్యార్థమని బ్రహ్మమీమాంస (1–1–1) లో నిర్ణయింపబడినది. అట్టిది పరబ్రహ్మమే, 'అథ కస్మాదుచ్యతే పరం బ్రహ్మేతి? యస్మాద్బృహతి బృంహయతి తస్మాదుచ్యతే పరం బ్రహ్మేతి' అను అథర్వశిరఃశ్రుతి యీ యర్థమునే సమర్థించుచున్నది. దీనిచే – 'ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ' 'తస్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' ఇత్యాది శ్రుత్యుక్తమగు పరబ్రహ్మత్వము ప్రదర్శితమగుచున్నది. 'వర్షీయసే' అను పదముచే **"సత్య–కామః సత్యసంకల్పః"** "పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ఇత్యాది శ్రుతిప్రసిద్ధములగు సత్యకామత్వసత్యసంకల్పత్వాది దివ్యగుణసమృద్ధమైన మాయోపాధికపరమేశ్వరస్వరూపము వివక్షితమగుచున్నది.

**ము. నమో వృద్ధాయ చ సంవృధ్వనే చ ॥ 10**

**భాష్యమ్ –** అథ దశమః – నమో వృద్ధాయేతి. సర్వాపేక్షయా వయోఽధికో వృద్ధః. సర్వైః స్వయం పూజ్యః న తు స్వస్య కశ్చిత్పూజ్యో వన్ద్యశ్చాస్తీత్యర్థః. అత ఏవ ఖలు పురాణే శ్రూయతే – 'యస్యాస్తి శక్తిస్స తు వన్దితవ్యః స కః కరోత్వఞ్జలికాం పురో మే, కః పూజితః స్వాచ్ఛశిశేఖరేణ నారాధితో భూతపతిస్తు వా కైః' ఇతి. అనేన **'యస్మై నమస్తచ్ఛిరో ధర్మ'** ఇతి శ్రుతిప్రసిద్ధం సర్వనమస్కారవిషయత్వముక్తం భవతి. యద్యపి **'యస్మై నమస్తచ్ఛిరః'** ఇతి సామాన్యేన శ్రూయతే, తథాపి **'త్వం భూతానాగ్ం శ్రేష్ఠోఽసి'** ఇతి పరమేశ్వరం ప్రస్తుత్య, **'సర్వం తే నమః'** ఇత్యుపసంహారే సర్వస్యాఽపి నమస్కారస్య తదీయత్వోక్త్యా, **'యస్మై నమః'** ఇత్యుపక్రమేఽపి నమస్కారవిషయత్వేన నిర్దిష్టః పరమేశ్వర ఏవేతి నిశ్చీయతే; తస్యైవ నిజచిచ్ఛక్తిరూపశింశుమారాద్యాధారత్వేన ప్రధానతయా తచ్ఛిరో–రూపప్రధానావయవత్వేన నిరూపణౌచిత్యాత్ దేవతాన్తరాణాం తదాకృతిం ప్రతి మూర్ధ–హను–హృదయమధ్య–చరణ–పుచ్ఛరూపత్వేన స్వస్వనామభిః పృథఙ్నిర్దిష్టత్వాదిత్యన్యత్ర విస్తరః. సమ్యక్–అసాధారణ్యేన స్తుతినమస్కారైర్వర్ధితః – సంవృధ్వా, అనేన – **'మా త్వా రుద్ర చుక్రుధామానమోభిర్మాసుష్టుతీవృషభమాసహూతీ ఉన్నోవిరాగ్ం అర్పయ భేషజేభిః' 'భిషక్తమం త్వా భిషజాం శృణోమి' 'దుష్టుత్యా సదృశస్తుత్యా సమానాహ్వానకర్మణా, న వయం చుక్రుధామ త్వాం సర్వదేవనమస్కృత'** ఇతి శ్రుతిపురాణసిద్ధమనితరదేవతా–సాధారణస్తుతినమస్కారైకవిషయత్వం దర్శితం భవతి.

**అనువాదము:** (అర్థము) వృద్ధాయ చ నమః = అందరికన్న నధిక వయస్సుగలవాని రూపమున నున్నవానికి నమస్కారము. సంవృధ్వనే చ నమః = సర్వాధికముగ స్తుతినమస్కారాదులచే వృద్ధినొందింపబడిన (సంతుష్టినొందింపబడిన) వానికి నమస్కారము.

(వివరణము) వృద్ధశబ్దము – సర్వాధికుడుగాన తాను సర్వులకును పూజ్యుడగును గాని, తనచే బూజింపదగినవాడు గాని, నమస్కరింపదగినవాడు గాని మరెవ్వడును లేడను భావమును సూచించుచున్నది. కావుననే – 'యస్యాస్తి శక్తిః... పురో మే' అను పురాణవచనము – ఎవడు శక్తిసంపన్నుడో వాడు వందనీయుడు. అట్టివాడు ఇతరు డెవ్వడున్నాడు? ఎవడేని యున్నచో నా యెదట వ్రేలెత్తిచూపుగాక. చంద్రశేఖరునిచే బూజింపదగిన వాడెవడున్నాడు? ఆతని బూజింపనివాడు మాత్ర

మెవడున్నాడు?' అని యుద్ఘోషించుచున్నది. దీనిచే 'యస్మై నమస్తచ్ఛిరో ధర్మః' అను శ్రుతిప్రసిద్ధమగు సర్వనమస్కారవిషయత్వము విదితమగుచున్నది. ఐతే – ఈ శ్రుతివాక్యములో 'యస్మై నమః' అని సర్వసాధారణముగ జెప్పబడినది. అట్లైనను 'త్వం భూతానాగ్ం శ్రేష్ఠోఽసి' అని సర్వభూతములలో నుత్కృష్టముగ పరమేశ్వరుని గూర్చి ప్రారంభించి, సమాప్తిలో 'సర్వం తే నమః' అను వాక్యముతో సర్వనమస్కారముల కాతడే గమ్యస్థానముగ చెప్పబడుటచే ఉపక్రమములో 'యస్మై నమః' అని సామాన్యరూపముగ – నమస్కార్యుడుగ – నిర్దేశింపబడినవాడు గూడ పరమేశ్వరుడే యని నిశ్చితమగుచున్నది. అతడే తన చిచ్ఛక్తిరూపమైన శింశుమారాదికమున కాధారమగుటచే ప్రధానుడుగాన, తత్ప్రధానావయవమగు శిరస్సుగ నిరూపింపబడుటయు, ఇతరదేవతలు మూర్ధ–హను–హృదయ–పాద–పుచ్ఛాద్యవయవరూపులుగ తమ తమ నామధేయములతో నిర్దేశింపబడుటయు సంగతమగుచున్నది. ఈ విషయవిస్తరమును ఇతరత్ర చూడవచ్చును. 'సంవృధ్వనే' అను పదముచే 'మా త్వా రుద్ర చుక్రుధాః' 'భిషక్తమం త్వా' 'దుష్టుత్యా సదృశస్తుత్యా... సర్వదేవనమస్కృత' (ఓ పరమేశ్వరా! సమస్తదేవతానమస్కృతుడవగు నిన్ను అనుచితముగ స్తుతించిగాని, ఇతరదేవతలతో సమానునిగజేసి స్తుతించిగాని, ఇతరదేవతలతో సమానముగ ఆహ్వానించిగాని నీకు కోపము తెప్పించకుందుము గాక.) ఇత్యాది శ్రుతిపురాణవచనప్రసిద్ధమగు భగవానుని అనన్యదేవతాసామాన్యమైన స్తుతినమస్కారవిషయత్వము ప్రదర్శితమగుచున్నది.

**మూ. నమో అగ్రియాయ చ ప్రథమాయ చ ॥ 11**

**భాష్యమ్** – అథైకాదశః – నమో అగ్రియాయేతి. అగ్రే – జగదుత్పత్తేః పూర్వమవస్థితః అగ్రియః. ఇదమగ్రియత్వం హిరణ్యగర్భస్యాప్యస్తి, **'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే'** ఇతి శ్రుతేః, అతో విశినష్టి – ప్రథమాయేతి. హిరణ్యగర్భాదపి ప్రథమః, తస్యాపి కారణభూత ఇత్యర్థః. **'హిరణ్యగర్భం జనయామాస పూర్వమ్'** ఇతి హి శ్వేతాశ్వతరశ్రుతిః. అనేన – **'యదా తమస్తన్న దివా న రాత్రిర్న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం జగత్కారణత్వం దర్శితమ్. యద్యపి **'నమో భవాయ'** ఇత్యనేనైవ తదుక్తమ్, తథాపి జగదాది–హిరణ్యగర్భజనకత్వేన తదేవాత్రోపపాద్యతే.

**అనువాదము:** అగ్రియాయ చ నమః = సృష్టికి పూర్వమే యున్నవానికి నమస్కారము. ప్రథమాయ చ నమః = హిరణ్యగర్భునికన్న మున్నే యున్నవానికి నమస్కారము.

(వివరణము) 'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే' ఇత్యాదివచనములనుబట్టి ఇతరభూతముల సృష్టికి కారణమైన హిరణ్యగర్భుడుగూడ సృష్టికి పూర్వమున్నవాడు కావచ్చును. కాని అత డిచట వివక్షితుడు గాడు. తద్వ్యావృత్తికై **'ప్రథమాయ చ'** అని చెప్పబడినది. హిరణ్యగర్భునికన్నను ప్రథముడు, అనగా అతనికి గూడ కారణభూతు డని యర్థము. 'హిరణ్యగర్భం జనయామాస పూర్వమ్' అని శ్వేతాశ్వతరశ్రుతి చెప్పుచున్నది. ఇట్లు చెప్పుటచే 'యదా తమస్తన్న దివా న రాత్రిర్న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః' ఇత్యాది శ్రుతిప్రసిద్ధమైన అవ్యక్తసాక్షిత్వరూపమైన పరమేశ్వరుని జగత్కారణత్వము ప్రదర్శింప బడినది. ఈ విషయము 'నమో భవాయ చ' అను మంత్రమునందే చెప్పబడినను, సామాన్యముగ జగత్కారణముగ చెప్పబడుచున్న హిరణ్యగర్భునకుగూడ భగవానుడు కారణభూతుడను విశేషమును విశదీకరించుటకై మరల చెప్పబడినది.

**మూ. నమ ఆశవే చాజిరాయ చ ॥ 12**

**భాష్యమ్ –** అథ ద్వాదశః – నమ ఆశవ ఇతి. అశ్నోతి – వ్యాప్నోతీతి ఆశుః. **'అశూ వ్యాప్తౌ'** ఇతి ధాతోరాఙ్పూర్వాదౌణాదిక ఉప్రత్యయః. జగద్వ్యాపినే ఇత్యర్థః. తత్ర హేతుః – అజిరాయేతి. గమనకుశలాయేత్యర్థః. అనేన **'యో రుద్రో అగ్నౌ'** ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం నిఖిలజగద్వ్యాపిత్వముక్తమ్.

**అనువాదము:** (అర్థము) ఆశవే చ నమః = సమస్తజగత్తును వ్యాపించియున్నవానికి నమస్కారము. అజిరాయ చ నమః = గమనకుశలునకు నమస్కారము.

(వివరణము) ఆఙ్పూర్వకమగు 'అశూ వ్యాప్తౌ' అను ధాతువుకంటే ఔణాదికమగు ఉప్రత్యయమును చేర్చగా 'ఆశుః' అను రూపము నిష్పన్నమగును. 'అశ్నోతి సర్వం జగద్వ్యాప్నోతీత్యాశుః' అని వ్యుత్పత్తి. ఆశుశబ్దార్థమగు సర్వజగద్వ్యాపకత్వములో ఆజిరత్వము (అనగా గమనకుశలత్వము) హేతువగుచున్నది. దీనిచే 'యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనా వివేశ' అను శ్రుతిప్రసిద్ధమగు నిఖిలజగద్వ్యాపకత్వము సూచింపబడినది.

**మూ.** నమశ్శీఘ్రియాయ చ శీభ్యాయ చ। **13**

నమ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ। **14**

నమస్స్రోతస్యాయ చ ద్వీప్యాయ చ। **15**

**భాష్యమ్ –** అథ త్రయోదశచతుర్దశపఞ్చదశాః – నమః శీఘ్రియాయ చేతి. శీఘ్రగాస్వప్సు భవః శీఘ్రియః, తదన్తర్యామీతి యావత్. శీభే ఉదకప్రవాహే భవః శీభ్యః, ఊర్మిషు తరఙ్గేషు భవః ఊర్మ్యః, అవస్వనే ధ్వనిరహితే జలే భవః అవస్వన్యః, స్రోతసి ప్రవాహే భవః స్రోతస్యః, శీభ – స్రోతసోర్మహత్త్వాల్పత్వాభ్యాం భేదః. ద్వీపే భవః ద్వీప్యః. యద్యపి **'నమో నాద్యాయ చ వైశన్తాయ చ' 'నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ' 'నమ ఊర్మ్యాయ చ సూర్మ్యాయ చ'** ఇత్యాదినా శీఘ్రశీభోర్మ్యాదిరూపవివిధజలాన్తర్యామిత్వమన్తర్యామి–ప్రకరణే వక్ష్యతే, తథాపి 'ఆపో వా ఇదగ్ం సర్వమ్' ఇత్యాదిశ్రుతిప్రసిద్ధః సర్వోఽప్యపాం మహిమా తదన్తర్యామిణః పరమేశ్వరస్యైవేతి దర్శయితుమగ్రే వక్ష్యమాణమేవ జలాన్తర్యామిత్వమత్రానూద్యతే. శ్రూయతే హి విచిత్రశక్తేః పరమేశ్వరస్య ఏకా శక్తిరపాం మహిమానం నిర్వహతీతి, యథా – **'అపామేకా మహిమానం బిభర్తి, సూర్యస్యైకా'** ఇతి. ద్వీపశబ్దోఽపి జలాన్తర్యామిత్వపర ఏవ. ద్విధాభూతా ఆపో యస్మిన్దేశ ఇత్యర్థే **'ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్'** ఇత్యప్శబ్దాకారస్య ఈకారే సవర్ణదీర్ఘే, **'ఋక్పూరబ్ధూః పథామానక్షే'** ఇత్యకారే చ సమాసాన్తే సతి, ద్వీపశబ్దస్య నిష్పన్నత్వాత్. యద్వా – ద్వీపశబ్దేన జంబూప్లక్షాదిసప్తద్వీపవాచినా సర్వమపి జగదుపలక్ష్యతే, తథా చ సర్వేషు ద్వీపేషు సర్వత్ర లోకేఽపి విద్యమానః సర్వోఽప్యతిశయస్తదన్తర్యామిణః పరమేశ్వరస్యైవేతి తదర్థో ద్రష్టవ్యః.

## ఇతి పఞ్చమోఽనువాకః

**అనువాదము:** (అర్థము) శీఘ్రియాయ చ నమః = వేగముగ ప్రవహించు జలములో (అన్తర్యామియై) ఉండువానికి నమస్కారము. శీభ్యాయ చ నమః = మహాజలప్రవాహమున నన్తర్యామియైయుండువానికి నమస్కారము. ఊర్మ్యాయ చ నమః = తరఙ్గముల కన్తర్యామియైన వానికి నమస్కారము. అవస్వన్యాయ చ నమః = నిశ్శబ్దజలమున కన్తర్యామియైనవానికి నమస్కారము. స్రోతస్యాయ చ నమః = అల్పజలప్రవాహమున

కన్తర్యామియైనవానికి నమస్కారము. ద్వీప్యాయ చ నమః = ద్వీపమునకు (జలమధ్యస్థ భూమికి) అన్తర్యామియైనవానికి నమస్కారము.

(వివరణము) ముందు సర్వాన్తర్యామిత్వప్రకరణమున 'నమో నాద్యాయ చ వైశన్తాయ చ' 'నమ ఊర్మ్యాయ చ సూర్మ్యాయ చ' ఇత్యాదులలో శీఘ్ర–శీభ–ఊర్మ్యాది రూపనానావిధజలాన్తర్యామిత్వము చెప్పబడనున్నది. ఐనను **'ఆపో వా ఇదగ్ం సర్వం'** ఇత్యాది శ్రుతిప్రసిద్ధమైన జలముల మహిమయంతయు తదన్తర్యామియగు పరమేశ్వరునకు సంబంధించినదే యని తెలుపుటకు ముందు వివరింపబోవు జలాన్తర్యామిత్వ మిచట అనువదింపబడుచున్నది. వివిధవిచిత్రశక్తిసంపన్నుడైన పరమేశ్వరునియొక్క ఒకానొక విలక్షణశక్తియే జలమహత్త్వమున కాలంబనమగుచున్నదని 'అపామేకా మహిమానం బిభర్తి, సూర్యస్యైకా' అను శ్రుతి యుద్ఘోషించుచున్నది.

'ద్వీప' శబ్దముగూడ జలాన్తర్యామిత్వమును బోధించనట్టిదే 'ద్విధా భూతా ఆపః యస్మిన్ దేశే (ఎచట నీరు రెండు పాయలగుచున్నదో తన్మధ్యప్రదేశము) అను నర్థములో 'ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్' అను సూత్రముచే ద్విశబ్దముకు పరమగు అప్ఛబ్దాకారమునకు ఈకారము, సవర్ణదీర్ఘము, 'ఋక్పూరబ్ధూః పథామానక్షే' అను సూత్రముచే అకారము సమాసాన్తము కాగా ద్వీపశబ్దము నిష్పన్నమగుచున్నది. లేదా – జంబూప్లక్షాది సప్తద్వీప వాచకమగు ద్వీపశబ్దముచే జగత్తంతయు ఉపలక్షితమగును కాగా – సప్తద్వీపములలో సమస్తలోకములలో గల అతిశయమంతయు తదన్తర్యామియైన పరమేశ్వరునకు సంబంధించినదే యని – యీ మంత్రముయొక్క అభిప్రాయమును గ్రహించునది.

**పంచమానువాకము – సమాప్తము**

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# షష్ఠో౽నువాకః

నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ, నమః పూర్వజాయ చాపరజాయ చ,

నమో మధ్యమాయ చాపగల్భాయ చ, నమో జఘన్యాయ చ బుధ్నియాయ చ,

నమస్సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ,

నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ, నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ,

నమశ్శ్లోక్యాయ చావసాన్యాయ చ, నమో వన్యాయ చ కక్ష్యాయ చ,

నమశ్శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ, నమ ఆశుషేణాయ చాశురథాయ చ,

నమశ్శూరాయ చావభిన్దతే చ, నమో వర్మిణే చ వరూథినే చ,

నమో బిల్మినే చ కవచినే చ, నమశ్శ్రుతాయ చ శ్రుతసేనాయ చ.

**భాష్యమ్ –** పఞ్చమే వివిధమహిమోపేతత్వేన భగవాన్నమస్కృతః, షష్ఠే తు సర్వాత్మకత్వ – సర్వాన్తర్యామిత్వాభ్యాం నమస్క్రియతే – నమో జ్యేష్ఠాయేతి. వయోవిద్యాశ్రమాదిభిరధికో జ్యేష్ఠః, తైర్న్యూనః కనిష్ఠః, తదుభయరూపాయేత్యర్థః. పూర్వభావి మృదాది కారణం – పూర్వజమ్, పశ్చాద్భావి ఘటాదికం కార్యమ్ అపరజమ్, తదాత్మకాయేత్యర్థః. మధ్యమః యువా, అపగల్భస్తు – అప్రరూఢేన్ద్రియో బాలః, తదుభయరూపాయేత్యర్థః. నమో జఘన్యాయేత్యాదయః అన్తర్యామిత్వప్రతిపాదకాః. జఘనే – పశ్చాద్భాగే భవః జఘన్యః,

బుధ్నే మూలే భవః బుధ్న్యః, ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం సహ వర్తమానః సోభః మనుష్యలోకః, **'పుణ్యేన పుణ్యం లోకం జయతి పాపేన పాపముభాభ్యామేవ మనుష్యలోకమ్'** ఇతి శ్రుతేః, తత్ర భవః – సోభ్యః. ప్రతిసరతి గచ్ఛతీతి ప్రతిసరః జఙ్గమప్రపఞ్చః, తత్ర భవః – ప్రతిసర్యః, యమలోకే భవః – యామ్యః. క్షేమే స్వర్గలోకే భవః క్షేమ్యః, ఉర్వరా సర్వసస్యాఢ్యా భూమిః, తత్ర భవః ఉర్వర్యః. ఖలః ధాన్యవివేచనదేశః, తత్ర భవః ఖల్యః. శ్లోకేషు వేదమన్త్రేషు భవః శ్లోక్యః, అవసానం వేదాన్తః, తత్ర భవః అవసాన్యః. వనే భవః వన్యః, కక్షేషు గుల్మేషు భవః – కక్ష్యః.

అథ సార్వాత్మ్యేన నమస్కరోతి – నమశ్రవాయేత్యాదినా. శ్రూయతే ఇతి శ్రవః– శబ్దః, ప్రతిశ్రవస్తు – ప్రతిధ్వనిః. ఆశుః శీఘ్రగామినీ సేనా యస్య, స ఆశుషేణః. ఏవమ్ ఆశురథః. శూరః శౌర్యవాన్. అవభిన్దన్ – భేత్తా, బ్రహ్మద్విషాం మూర్ధ్నో భినత్తీతి. వర్మీ కఞ్చుకోపేతః. వరూథః సారథేః గుప్తిస్థానమ్, బిల్మం బిలోపేతం యుద్ధే శిరోరక్షకమ్, తదస్యాస్తీతి బిల్మీ, కవచః శరీరరక్షకం కఞ్చుకమ్, తద్వాన్ కవచీ. శ్రుతః ప్రసిద్ధః. శ్రుతసేనః ప్రసిద్ధసేనః, దేవాసురమనుష్యాదిషు యో యస్తిష్ఠతి – ఆశుషేణః, ఆశురథః, శూరః, అవభిన్దన్, వర్మీ, వరూథీ, బిల్మీ, కవచీ, శ్రుతః, శ్రుతసేనో వా తద్రూపాయేత్యర్థః.

అస్య భగవానృషిః, స ఏవ దేవతా. క్రమేణ మహావిరాణ్మహాపఙ్క్తిచ్ఛన్దః. **ధ్యానమ్–**

**'గౌరీకరామ్బుజన్యస్తం స్వర్ణశైలశరాసనమ్।**
**ఇక్షుహస్తం నరారూఢం నరనారీతనుం స్మరేత్॥**

శత్రువిజయ చిరాయుష్య రాజ్యాభివృద్ధి సుపుత్రావాప్తి ఫలప్రదోఽయం మన్త్రః. త్రిరాత్రచరుభోజననిరన్తరైకాదశదినజపాన్మన్త్రసిద్ధిః.

**ఇతి షష్ఠోఽనువాకః**

**అనువాదము:** ఐదవ అనువాకములో వివిధమహిమలు కలవాడుగ భగవానుడు నమస్కరింపబడినాడు. ఇక ఆరవ అనువాకములో సర్వాత్మకుడుగను సర్వాన్తర్యామిగను నమస్కరింపబడుచున్నాడు –

(అర్థము) జ్యేష్ఠాయ చ నమః = వయస్సు–విద్య–ఆశ్రమము మున్నగు వానిచే అధికుడైనవానికి నమస్కారము. కనిష్ఠాయ చ నమః = వయోవిద్యాది పూర్వోక్తగుణములు అల్పముగ నున్నవానికి నమస్కారము. తదుభయాత్మకునకు నమస్కారమ మని యర్థము.

ఇట్లే ఉత్తరమన్త్రములలో గూడ యథోచితముగ నుభయాత్మకత్వమును గ్రహించునది. పూర్వజాయ చ నమః = ఘటాది కార్యములకు పూర్వభావియై మృదాదికారణ స్వరూపముతో నుండువానికి నమస్కారము. అపరజాయ చ నమః = మృదాది కారణములకు పశ్చాద్భావియై ఘటాదికార్యస్వరూపముతో నుండువానికి నమస్కారము. మధ్యమాయ చ నమః = నడిమివయసువానికి నమస్కారము. అపగల్భాయ చ నమః = ప్రరూఢములుకాని ఇంద్రియములుగల బాలునిగ నున్నవానికి నమస్కారము.

'నమో జఘన్యాయ చ' ఇత్యాదిమన్త్రములు – అన్తర్యామిత్వమును ప్రతిపాదించు చున్నవి. జఘన్యాయ చ నమః = వెనుకభాగమునందుండువానికి నమస్కారము. బుధ్నియాయ చ నమః = మూలభాగమునందుండువానికి నమస్కారము. సోభ్యాయ చ నమః = మనుష్యలోకమునందుండువానికి నమస్కారము. ప్రతిసర్యాయ చ నమః = జంగమాత్మకమగు ప్రపంచమునందుండువానికి నమస్కారము.

(వివరణము) 'ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం సహ వర్తత ఇతి సోభః' అను వ్యుత్పత్తిచే సోభ శబ్దము – మనుష్యలోకపరము. 'పుణ్యేన పుణ్యం లోకం జయతి, పాపేన పాపముభాభ్యామేవ మనుష్యలోకమ్' అను శ్రుతి – మనుష్యలోకము పుణ్యపాప మిశ్రితకర్మలభ్య మని చెప్పుచున్నది. అట్టి లోకమునందు (మనుష్యరూపమున) ఉన్నవాడు సోభ్యుడు. ప్రతిసరతి గచ్ఛతీతి ప్రతిసరః' అను వ్యుత్పత్తిచే ప్రతిసరశబ్దమునకు జంగమ ప్రపంచమని యర్థము.

యామ్యాయ చ నమః = యమలోకమునందుండువానికి నమస్కారము. క్షేమ్యాయ చ నమః = స్వర్గలోకమునందుండువానికి నమస్కారము. ఉర్వర్యాయ చ నమః = సర్వసస్యాఢ్యమైన భూమియందుండువానికి నమస్కారము. ఖల్యాయ చ నమః = ధాన్యమునూర్చు కళ్ళములయందుండువానికి నమస్కారము. శ్లోక్యాయ చ నమః = వేదమంత్రములలోనుండువానికి నమస్కారము. అవసాన్యాయ చ నమః = వేదాన్తము (ఉపనిషత్తు)లలో నుండువానికి నమస్కారము. వన్యాయ చ నమః = అరణ్యములలో నుండువానికి నమస్కారము.

ఇటుపైని 'నమశ్శ్రవాయ చ' ఇత్యాది మంత్రములలో సర్వాత్మకుడుగ నమస్కరింపబడుచున్నాడు – శ్రవాయ చ నమః = శబ్దస్వరూపునకు నమస్కారము. ప్రతిశ్రవాయ చ నమః = ప్రతిశబ్ద (ప్రతిధ్వని) స్వరూపునకు నమస్కారము. ఆశుషేణాయ చ నమః = శీఘ్రగామియైన సైన్యముగలవానికి నమస్కారము.

ఆశురథాయ చ నమః = శీఘ్రగాములైన రథములుగలవానికి నమస్కారము. శూరాయ చ నమః = శౌర్యవంతునకు నమస్కారము. అవభిన్దతే చ నమః = బ్రహ్మద్వేషుల శిరస్సులను ఛేదించువానికి నమస్కారము. వర్మిణే చ నమః = కంచుకము (చొక్కా)ను ధరించువానికి నమస్కారము. వరూథినే చ నమః = వరూథమనగా రథములో నుండెడి సారథియొక్క రక్షణస్థానము. అట్టి స్థానముగలవానికి నమస్కారము. బిల్మినే చ నమః = బలసహితమైన (యుద్ధములో ధరించు) శిరస్త్రాణముగలవానికి నమస్కారము. కవచినే చ నమః = శరీరరక్షకమైన (చీలమండలవరకు వ్రేలాడుచున్న) కంచుకముగలవానికి నమస్కారము. శ్రుతాయ చ నమః = సర్వత్ర ప్రసిద్ధుడైనవానికి నమస్కారము. శ్రుతసేనాయ చ నమః = ప్రసిద్ధమైన సేనగలవానికి నమస్కారము.

(వివరణము) శ్రీరుద్రుడే దేవాసురమనుష్యాదులలో ఆశుషేణాదిరూపముల నున్నాడని భావము.

ఈ మన్త్రమునకు ఋషియు, దేవతయు భగవానుడే. ఛన్దస్సుల క్రమముగ మహావిరాట్, మహాపఙ్క్తి. ధ్యానము – (గౌరీకరాంబుజ...స్మరేత్) మేరుశైలరూపమైన ధనుస్సును పార్వతీపాణిపద్మమున నుంచి, తాను బాణమును ధరించి రథము నధిష్ఠించియున్న అర్ధనారీశ్వరమూర్తినిగ ధ్యానించవలెను.

**షష్ఠానువాకము – సమాప్తము**

– 0 –



# సప్తమోఽనువాకః

నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ, నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ,

నమో దూతాయ చ ప్రహితాయ చ, నమో నిషఙ్గిణే చేషుధిమతే చ,

నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ, నమస్స్వాయుధాయ చ సుధన్వనే చ,

నమస్స్రుత్యాయ చ పథ్యాయ చ, నమః కాట్యాయ చ నీప్యాయ చ,

నమస్సూద్యాయ చ సరస్యాయ చ, నమో నాద్యాయ చ వైశన్తాయ చ,

నమః కూప్యాయ చావట్యాయ చ, నమో వర్ష్యాయ చ, చావర్ష్యాయ చ,

నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ, నమ ఈధ్రియాయ చాతప్యాయ చ,

నమో వాత్యాయ చ రేష్మియాయ చ, నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయ చ.

**భాష్యమ్** – షష్ఠ ఇవ సప్తమేఽపి సర్వాన్తర్యామిత్వసర్వాత్మత్వాభ్యాం నమస్క్రియతే – నమో దున్దుభ్యాయేతి. దున్దుభౌ భేర్యాం భవః దున్దుభ్యః. ఆహన్యతే తాడ్యతేఽనేనేత్యాహ–ననః – దున్దుభ్యాఘాతార్థో దణ్డః, తత్ర భవః ఆహనన్యః. నమో ధృష్ణవే చేత్యాదయః సర్వాత్మత్వేన భగవతో నమస్కారాః. లోకే యో ధృష్ణుః, ప్రమృశన్దూతాదిః, తద్రూపా–యేత్యర్థః. ధృష్ణుః – యుద్ధే పలాయనరహితః, ప్రమృశః – పరసైన్యవృత్తాన్తపరామర్శకః, దూతః – తద్వృత్తాన్తజ్ఞానకుశలః, ప్రహితః – స్వామిప్రేరితః పురుషః, నిషఙ్గీషుధిమన్తౌ వ్యాఖ్యాతౌ. తీక్ష్ణా ఇషవో యస్య సః తీక్ష్ణేషుః, బహూన్యాయుధాన్యస్యేతి ఆయుధీ, శోభనమ్

ఆయుధం యస్యేతి స్వాయుధః, శోభనం ధనుర్యస్యేతి సుధన్వా. నమస్స్రుత్యాయేత్యాదిభి-రన్తర్యామితోచ్యతే – స్రుతిః – పాదసంచారమాత్రయోగ్యః క్షుద్రమార్గః, తత్ర భవః స్రుత్యః. రథాదిసంచారయోగ్యః ప్రౌఢమార్గః పన్థాః, తత్ర భవః పథ్యః. కుత్సితమటతి జలమత్రేతి కాటః – అల్పజలప్రదేశః, తత్ర భవః కాట్యః. యత్ర జలం న్యగ్భావేన పతతి స దేశో నీపః, తత్ర భవో నీప్యః. సూదః కర్దమః, తత్ర భవః సూద్యః. సరః ప్రసిద్ధమ్, నద్యాం భవః నాద్యః. అల్పసరో వేశన్తః, తత్ర భవః వైశన్తః. కూపే భవః కూప్యః. అవటే గర్తే భవః అవట్యః వర్షే భవః వర్ష్యః. వర్షాభావః అవర్షః, తత్ర భవః అవర్ష్యః. వర్ష-తదభావయోః ప్రేరక ఇత్యర్థః. మేఘేషు భవః మేఘ్యః. విద్యుతి భవః విద్యుత్యః. ఈధ్రం నిర్మలత్వేన దీప్యమానం శరదభ్రమ్, తత్ర భవః ఈధ్ర్యః. ఆతపే భవః ఆతప్యః, వాతే భవః వాత్యః. రిష్యన్తి నశ్యన్తి భూతాన్యత్రేతి రేష్మః ప్రలయకాలః, తత్ర భవః రేష్మియః. వాస్తవం గవాదికం వస్తు, తత్ర భవః వాస్తవ్యః. గృహనిర్మాణార్థా భూమిః వాస్తు, తత్పాలకత్వేన తత్ర తిష్ఠన్ వాస్తుపః.

సోఽయమన్యతో నమస్కారరూపః షోడశయజురాత్మకావాన్తరమన్త్రసముదాయ-రూపః సప్తమోఽనువాక ఏకో మన్త్రః. అస్య రోమశ ఋషిః. మహానుష్టుప్ఛన్దః రుద్రో దేవతా,

**జటాభిర్లంబమానాభిర్నృత్యన్తమభయప్రదమ్।**
**దేవం శుచిస్మితం ధ్యాయేద్వ్యాఘ్రచర్మపరిష్కృతమ్॥**

మేధాయుష్యారోగ్యలక్ష్మీపుత్రవిద్యామోక్షఫలప్రదోఽయం మన్త్రః. ఏకోపవాసపూర్వక-శతజపాన్మన్త్రసిద్ధిః.

**ఇతి సప్తమోఽనువాకః.**

**అనువాదము:** షష్ఠానువాకమునందువలె సప్తమానువాకమునందు గూడ భగవానుని సర్వాన్తర్యామిగను, సర్వాత్మకునిగను నమస్కరించుచున్నాడు –

(అర్థము) దున్దుభ్యాయ చ నమః = దుందుభియందు అంతర్యామియై యన్నవానికి నమస్కారము. ఆహనన్యాయ చ నమః = దుందుభిని మ్రోగించు దండమున నన్తర్యామియై యున్నవానికి నమస్కారము.

'నమో ధృష్ణవే చ' ఇత్యాదులు శ్రీరుద్రుని సర్వాత్మకునిగ నమస్కరించు మన్త్రములు–

ధృష్ణవే చ నమః = యుద్ధమునందు పారిపోక స్థిరముగనుండు భటుని రూపమున నున్న రుద్రునకు నమస్కారము. ప్రమృశాయ చ నమః = పరసైన్య వృత్తాన్తమును పరిశీలించు భటుడుగానున్నవానికి నమస్కారము. దూతాయ చ నమః = పరవృత్తాన్తజ్ఞానప్రావీణ్యముగలిగి ప్రభువుయొక్క సందేశమును గొని పోవు దూతగానున్నవానికి నమస్కారము. ప్రహితాయ చ నమః = ప్రభుప్రేరణతో ప్రవర్తించువాడుగానున్నవానికి నమస్కారము. నిషఙ్గిణే చ నమః = ఖడ్గహస్తునకు నమస్కారము. ఇషుధిమతే చ నమః = అమ్ములపొదిని ధరించినవానికి నమస్కారము. తీక్ష్ణేషవే చ నమః = వాడియైన బాణములుగలవానికి నమస్కారము. ఆయుధినే చ నమః = అనేకాయుధములు గలిగియున్నవానికి నమస్కారము. స్వాయుధాయ చ నమః = ప్రశస్తములైన ఆయుధములు గలవానికి నమస్కారము. సుధన్వనే చ నమః = ప్రశస్తమైన ధనుస్సుగలవానికి నమస్కారము.

'నమస్స్రుత్యాయ చ' ఇత్యాదిమంత్రములలో అన్తర్యామిత్వము చెప్పబడుచున్నది–

స్రుత్యాయ చ నమః = పాదసంచారమాత్రయోగ్యమగు లఘుమార్గము (కాలిబాట)లో అన్తర్యామియైయుండువానికి నమస్కారము. పథ్యాయ చ నమః = రథాదిసంచారయోగ్యమగు విశాలమార్గమున నుండువానికి నమస్కారము. కాట్యాయ చ నమః = అల్పజలప్రదేశమునందుండువానికి నమస్కారము. నీప్యాయ చ నమః = నీరు క్రిందికి ప్రవహించు ప్రదేశమునందుండువానికి నమస్కారము. సూద్యాయ చ నమః = బురదనేలలో నుండువానికి నమస్కారము. సరస్యాయ చ నమః = సరస్సు (తటాకము) నందుండువానికి నమస్కారము. నాద్యాయ చ నమః = నదిలోనుండువానికి నమస్కారము. వైశన్తాయ చ నమః = అల్పసరస్సు (తటాకము) నందుండువానికి నమస్కారము. కూప్యాయ చ నమః = కూపము (చేదబావి)లో నుండువానికి నమస్కారము. అవట్యాయ చ నమః = గర్తము (గుంట)లలో నుండువానికి నమస్కారము. వర్ష్యాయ చ నమః = వర్షమునందుండువానికి నమస్కారము. అవర్ష్యాయ చ నమః = వర్షాభావము నందుండువానికి నమస్కారము.

(వివరణము) వర్షమునకు, వర్షాభావమునకు గూడ ప్రేరకుడు శ్రీరుద్రుడే యని భావము.

మేఘ్యాయ చ నమః = మేఘములలో నుండువానికి నమస్కారము. విద్యుత్యాయ చ నమః = విద్యుత్తు (మెఱుపు) నందుండువానికి నమస్కారము. ఈధ్రియాయ చ

నమః = నిర్మలముగా ప్రకాశించు శరత్కాలమేఘమునందుండు వానికి నమస్కారము. ఆతప్యాయ చ నమః = ఎండలోనుండువానికి నమస్కారము. వాత్యాయ చ నమః = గాలిలోనుండువానికి నమస్కారము. రేష్మియాయ చ నమః = ప్రళయకాలమునందుండు వానికి నమస్కారము. వాస్తవ్యాయ చ నమః = గవాదివస్తువునందుండువానికి నమస్కారము. వాస్తుపాయ చ నమః = గృహనిర్మాణార్థమైన భూమిని పాలించువానికి నమస్కారము,

అన్యతో నమస్కారాత్మకములైన పదునారు యజుస్సులుగల యీ సప్తమానువాక మంత్రము ఒకే మంత్రము. దీనికి ఋషి – రోమశుడు. ఛన్దస్సు – మహానుష్టుప్. దేవత – రుద్రుడు. (జటాభిర్లంబమానాభి...పరిష్కృతమ్) వ్యాఘ్రాజినాలంకృతుడై వ్రేలాడుజడలతో నృత్యముజేయుచు, నిర్మలమందహాసమొనర్చుచు, ఆశ్రితుల కభయమొసంగు దేవునిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రము – మేధా, ఆయుష్య, ఆరోగ్య, లక్ష్మీ, పుత్ర, విద్యా, మోక్షఫలప్రదము. ఒక్క రోజుపవసించి నూరుసార్లు జపించిన మంత్రసిద్ధి యగును.

**సప్తమానువాకము – సమాప్తము**

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# అష్టమోఽనువాకః

**మూ. నమస్సోమాయ చ రుద్రాయ చ ॥ 1**

**భాష్యమ్ –** సప్తమే సర్వాత్మకత్వసర్వాన్తర్యామిత్వాభ్యాం భగవాన్నమస్కృతః. అష్టమే తు అఖిలలోకోపాస్యత్వహేతుభిరసాధారణధర్మైరన్తర్యామితయా చ భగవాన్ నమస్క్రియతే సప్తదశభిః. తత్ర తావత్పరమేశ్వరస్యైవ మోక్షప్రదత్వాత్ స ఏవ ముముక్షుభిః సర్వైరుపాస్య ఇతి దర్శయితుం ప్రథమో మన్త్రః – నమః సోమాయేతి. అత్ర రుద్రాయ నమ ఇతి ప్రథమమన్వయః; రుతం సంసారదుఃఖం ద్రావయతీతి రుద్రః. శ్రూయతే హి శ్వేతాశ్వతరోపనిషది – **'యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః, తదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి'** ఇతి పరమేశ్వరం వినా దుఃఖనివృత్తేర్గగనవేష్టనవదత్యన్తా–సంభావితత్వమ్. ఏతదేవోపపాదయితుం నమస్సోమాయేతి విశేషితమ్. ఉమయా సహితః సోమః, ఉమేతి ప్రణవవర్ణవ్యత్యాసరూపః. **'పరాశక్తిః ప్రణవః'** ఇతి లైఙ్గాదిషు ప్రతిపాదితం దివ్యాభిధానమ్. తేన పరబ్రహ్మవిద్యాధిదేవతా పారమేశ్వరీ చిచ్ఛక్తిరుచ్యతే, తథా చావిద్యక–సంసారనివృత్తేర్బ్రహ్మవిద్యాసాధ్యత్వాత్ తాదృశబ్రహ్మవిద్యాధిదేవతాలంకృతః పరమేశ్వర ఏవ సంసారదుఃఖద్రావక ఇత్యుపపాదితం భవతి. బ్రహ్మవిద్యాధిదేవతాత్వం చ పరాశక్తే–రుమాయాః వేదాన్తేషు ప్రసిద్ధమ్. తథా హి, శ్వేతాశ్వతరోపనిషది – **'బ్రహ్మవాదినో వదన్తి కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతాః'** ఇతి ప్రస్తుత్య, **'తే ధ్యానయోగానుగతా అపశ్యన్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్'** ఇత్యాదినా పునర్బ్రహ్మవాదినాం మహర్షీణా–ముమానుగ్రహాదేవ బ్రహ్మత్వనిశ్చయో జాత ఇతి ప్రతిపాదితమ్. ఉపబృంహితం చ శైవపురాణే –

> **ముముక్షయా పురా కేచిన్మునయో బ్రహ్మవాదినః।**
> **సంశయావిష్టమనసో విమృశన్తి యథాతథమ్।**
> **కిం కారణం కుతో జాతా జీవామః కేన వా వయమ్॥**

ఇతి ప్రస్తుత్యోక్తమ్ –

> **తే ధ్యానయోగానుగతాః ప్రాపశ్యఞ్ఛక్తిమైశ్వరీమ్।**
> **పాశవిచ్ఛేదికాం సాక్షాన్నిగూఢాం స్వగుణైర్భృశమ్॥**

**తయా విచ్ఛిన్నపాశాస్తే సర్వకారణకారణమ్।**
**శక్తిమన్తం మహాదేవమపశ్యన్ జ్ఞానచక్షుషా॥** - ఇతి.

కూర్మపురాణేఽపి -

**సమేత్య తే మహాత్మానో మునయో బ్రహ్మవాదినః।**
**వితేనిరే బహూన్వాదాన్** ఇతి ప్రస్తుత్య

**'ఇత్యేవం మన్యమానానాం ధ్యానయోగావలంబినామ్।**
**ఆవిరాసీన్మహాదేవీ గౌరీ గిరివరాత్మజా।**
**నిరీక్షితాస్తే పరమేశపత్న్యా తదన్తరే దేవమశేషహేతుమ్।**
**పశ్యన్తి శంభుం కవిమీశితారం బృహన్తమీశం పురుషం పురాణమ్॥** - ఇతి.

తథా తలవకారిణాముపనిషద్యపి - 'స తస్మిన్నాకాశే స్త్రియమాజగామ బహుశోభమానా-ముమాం హైమవతీం తాం హోవాచ కిమేతద్యక్షమితి బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయధ్వమ్' ఇత్యాదినా పురా శక్రాదీనాముమానుగ్రహాదేవ పరబ్రహ్మావబోధో జాత ఇత్యుపాఖ్యాయతే. కైవల్యోపనిషది చ -

**ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం- త్రిలోచనం నీలకణ్ఠం ప్రశాన్తమ్।**
**ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం - సమస్తసాక్షిం తమసః పరస్తాత్॥**

ఇత్యుమాసాహిత్యేనైవ పరమేశ్వరస్య ధ్యానం మోక్షప్రదత్వేనోచ్యమానం ఉమాయాః పరబ్రహ్మవిద్యాధిదేవతాత్వం గమయతి, ఉక్తశ్రుత్యా ఏకార్థత్వాత్.

**పార్వతీ పరమా దేవీ బ్రహ్మవిద్యాప్రదాయినీ।**
**తస్మాత్సహ తయా శక్త్యా హృది పశ్యన్తి యే శివమ్॥**
**తేషాం శాశ్వతికీ సిద్ధిర్నేతరేషామితి శ్రుతిః॥**

ఇత్యాదితదుపబృంహణానురోధాచ్చ. న కేవలం మోక్షప్రదత్వమేవోమాసాహిత్యప్రయుక్తం భగవతః, కిన్తు సర్వజ్ఞత్వ - సర్వేశ్వరత్వ - సర్వాన్తర్యామిత్వ - సర్వకారణత్వాదిరూపః సర్వోఽపి మహిమా పరశక్తివిలాస ఏవేతి **'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ'** ఇత్యాదిశ్రుతయః ప్రథయన్తి. ప్రపఞ్చయన్తి చేతిహాసపురాణాని, ప్రవదన్తి చాభియుక్తాః - **'శక్తిః శరీరమధిదైవతమన్తరాత్మా, జ్ఞానం క్రియా కరణమాసనజాలమిచ్ఛా, ఐశ్వర్యమాయతనమావరణాని చ త్వం, కిం కిం న యద్భవసి బాలశశాఙ్కమౌలేః'** ఇతి.

**'న చేదేవం దేవో న ఖలు కుశలః స్పన్దితుమపి'** ఇతి చ. అత ఏవ ఖలు తాదృశమహిమ–ప్రయుక్తాయాముమాయామాదరాతిశయాదేవ తైత్తిరీయోపనిషది – **'అమ్బికాపతయే'** ఇత్యుక్త్వాఽపి, పునః **'ఉమాపతయే'** ఇతి తత్పతిత్వేన భగవాన్నమస్క్రియత ఇత్యాస్తాం తావత్.

**అనువాదము:** సప్తమానువాకమునందు సర్వాత్మకత్వ – సర్వాన్తర్యామిత్వ లక్షణములతో భగవానుడు నమస్కరింపబడినాడు. ఇక నీ యష్టమానువాకములో సమస్తలోకములకును ఉపాస్యుడగుటకు కారణములైన అసాధారణధర్మములతో, అన్తర్యామిరూపముగ భగవానుడు పదునేడుమంత్రములతో నమస్కరింపబడుచున్నాడు. అందును, పరమేశ్వరుడే మోక్షప్రదాతగను నాతడే ముముక్షువుల కందరికిని ఉపాస్యుడను నభిప్రాయముతో **'నమస్సోమాయ చ'** అను ప్రథమమంత్రము ప్రవర్తించుచున్నది.

(అర్థము) సోమాయ చ నమః = ఉమా (పార్వతీ) సమేతుడగు రుద్రునకు నమస్కారము. రుద్రాయ చ నమః = సంసారదుఃఖహరుడగు రుద్రునకు నమస్కారము.

(వివరణము) ఇచట రుద్రాయ నమః అని ముందుగా అన్వయించవలెను. 'రుతం – సంసారదుఃఖం ద్రావయతీతి రుద్రః' అని రుద్రశబ్దవ్యుత్పత్తి. 'యదా చర్మవదాకాశం' అను శ్వేతాశ్వతరోపనిషద్వచనము – ఆకాశమును చుట్టగాజుట్టుట ఎట్లు అసంభవమో, అట్లే శివతత్త్వము నెరుగనిదే సంసారదుఃఖమును తరించుట అసంభవమని తెలుపుచున్నది. ఈ యర్థము నిర్ధారించుటకే 'నమస్సోమాయ' అను విశేషణము. 'ఉమయా సహితః సోమః' అనగా 'ఉమ' తో కూడినవా డని యర్థము. 'ఉమ' యనునది – 'ఓమ్' అను ప్రణవముయొక్క వర్ణవ్యత్యాసరూపము. పరాశక్తి స్వరూపిణియగు ఉమ ప్రణవాత్మిక యని లిఙ్గపురాణాదులలో ప్రతిపాదింపబడియున్నది. ఉమాశబ్దముచే పరబ్రహ్మవిద్యాధిదేవతయగు పరమేశ్వరుని చిచ్ఛక్తి వివక్షితము. కాగా – అవిద్యామూలకమగు సంసారదుఃఖముయొక్క నివృత్తి – విద్యాసాధ్యముగాన, అట్టి బ్రహ్మవిద్యాసమలంకృతుడగు పరమేశ్వరుడే సంసారదుఃఖమోచకుడను విశిష్టార్థమును ఈ (సోమాయ – రుద్రాయ) విశేషణద్వయముచే ప్రతిపాదించినట్లగుచున్నది.

పరాశక్తియగు ఉమాదేవి బ్రహ్మవిద్యాధిదేవత యను విషయము ఉపనిషచ్ఛ్రుతిసిద్ధము. శ్వేతాశ్వతరోపనిషత్తులో – 'బ్రహ్మవాదినో వదన్తి – కిం కారణం బ్రహ్మ? కుతః స్మ జాతాః' జగత్కారణమైన బ్రహ్మ మెట్టిది? సమస్త ప్రాణులు దేనినుండి పుట్టిరి? ఇట్లు బ్రహ్మవాదుల విచారమునవతరింపజేసి, 'తే ధ్యానయోగానుగతా అపశ్యన్...'

ఇత్యాదిగ బ్రహ్మవాదులగు మహర్షులకు ఉమానుగ్రహముననే బ్రహ్మత్వనిశ్చయము కలిగినట్లు – ప్రతిపాదింపబడినది. ఈ విషయము శైవపురాణమునం దిట్లు ఉపబృంహితమునై యున్నది – 'ముముక్షయా పురా కేచిత్...' అని యారంభించి, 'తే ధ్యానయోగానుగతాః... అపశ్యన్ జ్ఞానచక్షుషా' అని చెప్పబడినది. పూర్వము ముముక్షువులైన కొందరు మునులు – ఈ ప్రపంచమునకు కారణమేమి? దేనివలన మనము పుట్టినాము? దేనివలన జీవించుచున్నాము? అని సంశయము కలుగగా, ధ్యానయోగము నవలంబించి గుణనిగూఢమైనట్టియు, సంసారపాశవిచ్ఛేదకారిణి యైనట్టియు పరమేశ్వరశక్తిని ముందు సందర్శించిరి. ఆశక్తియొక్క అనుగ్రహముచే ఆ మాయాశక్తికి అధిష్ఠానమైనట్టియు సర్వకారణకారణమైనట్టియు మహాదేవుని నిజస్వరూపమును జ్ఞానదృష్టితో సాక్షాత్కరించుకొనిరని – శివపురాణవచనసారాంశము, కూర్మపురాణములో గూడ **'సమేత్య తే మహాత్మానః...వితేనిరే బహూన్ వాదాన్'** బ్రహ్మవాదులు మహాత్ములునగు ఆ మునులు ఒకచో జేరి జగత్కారణ వస్తుతత్త్వమును గూర్చి వివిధవాదముల నొనర్చిరని యుపక్రమించి, 'ఇత్యేవం మన్యమానానాం...పురుషం పురాణమ్' అట్లు వారు వాదప్రతివాదములతో నిర్ణయమును బడయజాలక, చివరకు ధ్యానయోగనిష్ఠులైయుండగా గిరివరపుత్త్రియగు మహాదేవి (హైమవతియగు ఉమాదేవి) సాక్షాత్కరించినదనియు, ఆమె దృష్టి ప్రసారమాత్రమున సర్వజ్ఞము, సర్వనియామకము, సర్వవ్యాపకము, అనాదిసిద్ధము, అఖిలజగత్కారణమునగు పరశివతత్త్వము ఆమెయందే వారికి గోచరించినదనియు చెప్పబడినది. తలవకారో (కేనో)పనిషత్తులోగూడ – 'తస్మిన్నాకాశే...మహీయధ్వమ్'. ఈ విధముగ పూర్వము ఇన్ద్రాదులకు ఉమానుగ్రహము వల్లనే పరబ్రహ్మవిజ్ఞానము ప్రాప్తమైనట్లు వర్ణింపబడినది. కైవల్యోపనిషత్తులో సైతము **'ఉమాసహాయం...తమసః పరస్తాత్'** ఇట్లు – పరమేశ్వరుని ఉమాసమేతునిగ ధ్యానించుటయే మోక్షసాధనమని చెప్పబడియుండుట – ఉమాదేవి పరబ్రహ్మవిద్యాధిదేవత యనుటకు గమకమగుచున్నది. పైన ఉదాహరించిన కేన–కైవల్యోపనిషద్వాక్యములను సమన్వయించి చూచినపుడీ విషయము విస్పష్టము కాగలదు.

'పార్వతీ పరమా దేవీ...నేతరేషామితి శ్రుతిః' ఇత్యాదివచనములు గూడ పూర్వోక్తార్థమునకు ఉపబృంహకములై యున్నవి.

ఉమాసాహిత్యమువలన పరమేశ్వరునకు పరమపురుషార్థప్రదత్వమేకాక, సర్వజ్ఞత్వ – సర్వేశ్వరత్వ – సర్వాన్తర్యామిత్వ – సర్వకారణత్వాదిరూపమగు మాహాత్మ్య

మంతయు, ఆ పరాశక్తివిలాసమే యని, 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ' ఇత్యాదిశ్రుత లుద్ఘోషించుచున్నవి. ఇతిహాసపురాణాదు లీ విషయమును వ్యాఖ్యానించుచున్నవి. అభియుక్తులు సైత మామె నీ విధముగ వర్ణించుచున్నారు – 'శక్తిశ్శరీర…బాలశశాఙ్కమౌలే' అనగా – ఓ పరమేశ్వరీ! ఉమాదేవీ! నీవు చంద్రశేఖరుని యొక్క శక్తి, శరీరము, అధిదైవతము, అన్తరాత్మ, జ్ఞానము, క్రియ, కరణము, ఆసనజాలము (?), ఇచ్ఛ, ఐశ్వర్యము, ఆయతనము, ఆవరణము సమస్తము నీవే. నీవు కాని దేమున్నది! – అని భావము. మరియు, 'న చేదేవం దేవో న ఖలు కుశలః స్పన్దితుమపి' ఆమె సహకారము లేనిదే, పరమేశ్వరునకు జగత్కారణత్వమే కాదు; స్పందనముగూడ సంభవించదని పేర్కొనబడినది. ఇట్లు అనన్యసామాన్య మహిమాసమన్వితయైన ఉమాదేవి విషయమున గల ఆదరాతిశయమునుబట్టియే తైత్తిరీయోపనిషత్తులో 'నమో హిరణ్యబాహవే' అను మంత్రమునందు 'అంబికాపతయే' అని చెప్పియు అంతటితో నాగక, ప్రత్యేకముగ 'ఉమాపతయే' అను పదముతో భగవానుని ఉమాపతిగా పేర్కొని ప్రణామము సమర్పింప బడినది.

**మూ. నమస్తామ్రాయ చారుణాయ చ. 2**

**భాష్యమ్ –** అథ ఆదిత్యరూపేణ సర్వేషామప్యనాయాసేన ప్రత్యక్షీభూయ సకలశ్రేయః– ప్రదత్వాదపి పరమేశ్వర ఏవోపాస్య ఇతి ద్వితీయో మన్త్రః – నమస్తామ్రాయేతి. ఉదయకాలే అత్యన్తరక్తవర్ణః – తామ్రః. తదనన్తరమీషద్రక్తః **అరుణః**. చకారాద్ఊర్ధ్వం బభ్రువర్ణః. ఏవంభూతాయ. అష్టమూర్తేర్భగవతః సూర్యాత్మకో మూర్తివిశేషః, తస్మై నమ ఇత్యర్థః. లోకే హి ఉపాసకైర్మహతా నియమేన బహుకాలముపాసనే కృతే తదనన్తరం దేవతావిర్భవతి. ఆదిత్యస్తు భగవాన్ అయత్నతః స్వయమేవాఖిలప్రాణిజాతస్య పురతోఽనుదినమపి తామ్రారుణాదిరూపేణావిర్భవతి. ఉక్తం హి తదేతత్ – **'ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః'** ఇతి. ఏవమావిర్భవతోఽస్యాభిముఖ్యసంపాదనార్థమపి న యత్నో భవతి, ఉదయన్నేవ హి భగవాన్ప్రతిపురుషమభిముఖ ఏవ ఉదేతి. శ్రూయతే చ – **'తస్మాత్సర్వ ఏవ మన్యతే మాం ప్రత్యుదగాత్'** ఇతి. ఇత్థం స్వయమేవావిర్భూయ వరదానాభిముఖేఽవస్థితే పరమేశ్వరోఽయమితి బుద్ధిమాత్రం వితన్వన్నఖిలమపి శ్రేయో లభతే. తథా చ శ్రుతిః – **'ఉద్యన్తమస్తం యన్తమాదిత్యమభిధ్యాయన్ కుర్వన్బ్రాహ్మణో విద్వాన్సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మ'** ఇతి. అతోఽనాయాసేనైవాఖిల–

పురుషార్థప్రదః పరమేశ్వర ఏవ ఉపాస్య ఇతి భావః. **'ఉద్యన్తమ్'** ఇతి శ్రుతౌ ఉదయ–కాలావచ్ఛిన్నే తామ్ర ఏవాభిధాన్యం విహితమ్; అత్ర తు సర్వస్యాపి లోకస్య ఉదయకాలే నియమో న సంభవతి. ప్రమాదాలస్యభూయిష్ఠత్వాత్; తదనుగ్రహార్థముదయకాల–ధ్యానాశక్తానాం తదుత్తరకాలే అరుణవర్ణే, తత్రాప్యశక్తానాం తదూర్ధ్వకాలే బభ్రువర్ణే సవితరి బ్రహ్మాభిధ్యానం విధాతుం **'నమస్తామ్రాయ చారుణాయ చ'** ఇత్యుక్తమ్. అహో పరమకారుణికతా రుద్రోపనిషదః.

**అనువాదము:** అనన్తరము ఆదిత్యరూపమున అఖిలప్రాణులకును అనాయాసముగ ప్రత్యక్షమగుచు సకలశ్రేయస్సుల నిచ్చుచుండుటనుబట్టి గూడ పరమేశ్వరుడే సర్వులకు ఉపాస్యుడను నభిప్రాయముతో 'నమస్తామ్రాయ చ' అను ద్వితీయమంత్రము ప్రవర్తించుచున్నది–

(అర్థము) తామ్రాయ చ నమః = ఉదయకాలమునందు అత్యన్తరక్తవర్ణము గలిగి సూర్యరూపముతో నున్న రుద్రునకు నమస్కారము. అరుణాయ చ నమః = తదనన్తరము ఈషద్రక్తవర్ణసూర్యరూపముతో నున్న రుద్రునకు నమస్కారము. చకారము బభ్రువర్ణోపలక్షకము.

(వివరణము) ఈశ్వరుని అష్టమూర్తులలో ఆదిత్యుడుగూడ పరిగణింపబడి యున్నాడు. కావున ఆదిత్యరూపునిగ నమస్కరించుట – అసంగతముకాదు. విశేషమేమనగా – లోకమున ఉపాసకులచే మిక్కిలి నియమపూర్వకముగ ఉపాసింపబడి, తదనన్తర మా దేవత సాక్షాత్కరించును. ఆదిత్యు డన్ననో అప్రయత్నముగ తనంతటతానే సమస్తప్రాణుల యెదుట అనుదినము తామ్రారుణాదిరూపములతో ఆవిర్భవించుచున్నాడు. ఈ విషయము – **'ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః'** అను మన్త్రములో పూర్వము చెప్పబడినది. ఇట్లావిర్భవించు ఆ దేవుని అభిముఖ్యముకై ప్రయత్నించవలసిన పనిగూడ లేదు. ఉదయించుచునే ప్రతివానికిని అభిముఖముగనే ఉదయించుచున్నాడు. తస్మాత్సర్వ ఏవ మన్యతే మాం ప్రత్యుదగాదితి' అని శ్రుతి తెలుపుచున్నది. ఇట్లు స్వయముగ ఆవిర్భవించి అభీష్టముల నొసంగుటకు అభిముఖుడైయున్న స్థితిలో 'ఇతడు పరమేశ్వరుడు' అను భావన జేసినంతమాత్రమున మానవుడు సమస్త శ్రేయస్సుల నొందుచున్నాడు. 'ఉద్యన్తమస్తం యన్తమాదిత్యమభిధ్యాయన్కుర్వన్బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి' అను శ్రుతి ఈ యర్థము నావిష్కరించుచున్నది. కాగా అనాయాసముగ అఖిలపురుషార్థముల ననుగ్రహింపజాలిన పరమేశ్వరుడే అశేష లోకమునకు ఉపాస్యుడని భావము.

'ఉద్యన్తమస్తం యన్తం' అను శ్రుతివలన ఉదయకాలానుగతమైన ఆదిత్యుని తామ్రరూపము మాత్రమే సిద్ధించుచున్నది. ప్రమాదాలస్యభూయిష్ఠమగు జనసామాన్యము ఉదయకాలముననే నిద్రలేచి నియతమగు ఉపాసించుట దుర్ఘటమను దృష్టితో, అట్టివారిని సైత మనుగ్రహించుటకై ప్రకృతమన్త్రమున ఉదయకాలధ్యానాశక్తులకు తదుత్తరకాలమున బభ్రువర్ణుడగు ఆదిత్యునియందు, అందుకును శక్తిలేనివారికి తదుత్తరకాలమున బభ్రువర్ణుడగు ఆదిత్యునియందును బ్రహ్మాభిధ్యాన ముపదేశింపబడినది. అహో! రుద్రోపనిషత్కుయొక్క పరమకారుణికత్వము ఆశ్చర్యావహము.

**మూ. నమశ్శఙ్గాయ చ పశుపతయే చ. 3**

**భాష్యమ్ –** అథ ఖలు సుఖప్రదత్వాదపి పరమేశ్వర ఏవ సర్వసుఖార్థిభిరుపాస్య ఇతి దర్శయితుం తృతీయః – నమశ్శఙ్గాయేతి. శం సుఖం గమయతి ప్రాపయతీతి శఙ్గః, తత్ర హేతుః – పశుపతయ ఇతి. పశూనాం బ్రహ్మాదిస్థావరాన్తానాం పతిః పాలకః. తథా చ – భగవానేవ లోకజాలస్య సుఖహేతుః; పాలనీయసుఖస్య పాలకాధీనత్వాదితి భావః.

**అనువాదము:** అనన్తరము సుఖప్రదాతయగుటను బట్టి గూడ సుఖార్థులందరికిని పరమేశ్వరుడే ఉపాస్యుడని తెలుపుటకై 'నమశ్శఙ్గాయ చ' అను తృతీయమంత్రము ప్రవృత్తమగుచున్నది –

(అర్థము) శఙ్గాయ చ నమః = సుఖమును కలుగజేయు రుద్రునకు నమస్కారము. పశుపతయే చ నమః = బ్రహ్మాదిస్థావరాన్తప్రాణిజాతమునకు పాలకుడగు రుద్రునకు నమస్కారము.

(వివరణము) 'శం సుఖం గమయతీతి శఙ్గః' అనగా సుఖప్రాపకుడని యర్థము. 'పశుపతయే' అనునది హేతుగర్భవిశేషణము. పరిపాల్యుల సుఖము పరిపాలకాయత్తమై యుండుట సముచితమే గద!

**మూ. నమ ఉగ్రాయ చ భీమాయ చ. 4**

**భాష్యమ్ –** అథ విశ్వాధికత్వాత్పరమేశ్వర ఏవ విశ్వోపాస్య ఇతి దర్శయితుం చతుర్థః – నమ ఉగ్రాయేతి. ఉగ్రః శ్రేష్ఠః. ఉత్పూర్వాద్గమేః ఉద్గచ్ఛతీత్యస్మిన్నర్థే **'ఋజ్రేన్ద్రాఽగ్ర...'** ఇత్యుణాదిసూత్రేణ రన్ప్రత్యయః. అత ఏవ **'ఉగ్రోఽస్యుగ్రోఽహగ్ం సజాతేషు భూయాసమ్'** ఇతి మన్త్రే జ్ఞాతిశ్రైష్ఠ్యప్రశంసావిషయే స్వస్మిన్నుగ్రశబ్దః ప్రయుక్తః. తత్ర శ్రైష్ఠ్యసమర్పకస్య సజాతపదస్యైవ తాదృశస్య కస్యచిదభావాత్సంకోచాభావన్యాయేన సర్వశ్రేష్ఠత్వరూపం విశ్వాధిక్యం సిధ్యతి. తత్ర హేతుః – భీమాయేతి. భీమః – భయంకరః, **'భీష్మాస్మాద్వాతః పవతే'** ఇతి శ్రుతేః. తథా చ మహానుభావాదిన్ద్రాగ్న్యాదీన్ప్రత్యపి భయంకరత్వేన తన్నియన్తుర్భగవతః సర్వోత్తమత్వమితి భావః.

**అనువాదము:** విశ్వాధికుడు గాన పరమేశ్వరుడే విశ్వమునకు ఉపాస్యుడని చతుర్థమన్త్రము చెప్పుచున్నది –

(అర్థము) ఉగ్రాయ చ నమః = సర్వశ్రేష్ఠునకు నమస్కారము, భీమాయ చ నమః = సర్వభయంకరునకు నమస్కారము.

(వివరణము) 'ఉత్' అను ఉపసర్గపూర్వమునందుగల 'గమ్' ధాతువు కంటె 'ఉద్గచ్ఛతి' (పైకివెళ్లుచున్నాడు) అను నర్థములో 'ఋజేన్ద్రాగ్ర...' అను ఉణాదిసూత్రముచే ర–ప్రత్యయము చేరగా ఉగ్రశబ్దము నిష్పన్నమగుచున్నది. కావుననే 'ఉగ్రోఽస్యుగ్రోఽహగ్ం సజాతేషు భూయాసమ్' అను మన్త్రమునందు జ్ఞాతులలో ఎవనికి ఎదురుచెప్పు వారుండరో అట్టివాడు, అనగా సర్వశ్రేష్ఠుడు అను నర్థమున ఉగ్రశబ్దము ప్రయోగింపబడినది. ఐతే – అచట శ్రేష్ఠత్వము జ్ఞాతుల దృష్ట్యా మాత్రమే. ఇక్కడ ఆ విధమైన సంకోచకశబ్ద మేదియు లేనందున సర్వశ్రేష్ఠత్వరూపమగు విశ్వాధికత్వము సిద్ధించుచున్నది. ఇందుకు హేతువును 'భీమ' శబ్దము బోధించుచున్నది. అద్దానికి భయంకరుడని యర్థము. **'భీషాస్మాద్వాతః పవతే'** అని శ్రుతి బోధించుచున్నది. మహానుభావులగు ఇన్ద్రాగ్న్యాదులకు సైతము భయమును గలిగించు నియమించువాడు గావున భగవానుడు సర్వాధికుడని సారాంశము.

**మూ. నమో అగ్రేవధాయ చ దూరేవధాయ చ. 5**

**భాష్యమ్ –** అథ సకలజయహేతుత్వాత్సర్వైరేవ తదర్థిభిర్భగవానేవ సేవ్య ఇతి దర్శయితుం పఞ్చమః – నమో అగ్రే వధాయేతి. యుద్ధరఙ్గం ప్రవిష్టస్య స్వభక్తస్య అగ్రే స్థిత్వా

తదీయశత్రూణాం వధం కుర్వన్ – అగ్రేవధః. యుద్ధారంభాత్పూర్వమేవ దూరస్థితానామపి స్వభక్తవిరోధినాం బలతేజోభఙ్గం కుర్వన్ – దూరేవధః, తత్ర అగ్రే వధత్వం తావద్ద్రోణపర్వణి అర్జునేనోక్తమ్ – **'సఙ్గ్రామే శాత్రవానీకం శరౌఘైర్విసృజన్నహమ్, అగ్రతో లక్షయే యాన్తం పురుషం పావకప్రభమ్. జ్వలన్తం శూలముద్యమ్య యాం దిశం ప్రతిపద్యతే, తస్యాం దిశి విశీర్యన్తే శత్రవో మే మహామతే. తతో దగ్ధానరీన్ సర్వాన్పృష్ఠ– తోఽనుదహామ్యహమ్, తేన భగ్నానరిగణాన్మద్భగ్నాన్మన్యతే జనః'** ఇతి. ఆశ్వమేధికే చాయమర్థోఽనూదితః – **'తతః ప్రభాతాం రజనీమర్జునస్యాగ్రతః ప్రభుః**, జఘాన సైన్యం శూలేన ప్రత్యక్షం సవ్యసాచినః. కస్తాం సేనాం మహారాజ మనసాఽపి ప్రధర్షయేత్, ద్రోణకర్ణకృపైర్గుప్తాం మహేష్వాసైః ప్రహారిభిః, ఋతే దేవాన్మహేష్వాసాద్బహురూపా– న్మహేశ్వరాత్' ఇతి. దూరేవధత్వం తు మోక్షధర్మే అర్జునం ప్రతి కృష్ణేనోక్తమ్, తత్ర హి – **'యస్తు తే హ్యగ్రతో యాతి యుద్ధే సంప్రత్యుపస్థితే, తం విద్ధి రుద్రం కౌన్తేయ'** ఇతి ప్రస్తుత్యోక్తమ్ – **'నిహతాన్ తేన వై పూర్వం హతవానసి వై రిపూన్, అప్రమేయప్రభావం తం దేవదేవముమాపతిమ్, భజస్వ ప్రయతో నిత్యం విశ్వేశం హరమవ్యయమ్'** ఇతి. గీతాయామప్యుక్తమ్ – **'మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్'** ఇతి. పరమేశ్వరావతారత్వేన శ్రీకృష్ణస్య తదభిన్నత్వాత్ **'మయైవైతే నిహతాః' 'నిహతాం– స్తేన వై పూర్వమ్'** ఇతి వచనయోర్న విరోధః.

**అనువాదము:** సకలజయహేతుభూతుడు గాన జయార్థులందరికిని భగవానుడే సేవ్యుడను భావమును **'నమో అగ్రేవధాయ చ'** అను పంచమమంత్రము ప్రవచించుచున్నది–

(అర్థము) అగ్రేవధాయ చ నమః = యుద్ధరంగమున తన భక్తునకు ముందు నడచుచు నాతని శత్రువును వధించు రుద్రునకు నమస్కారము. దూరేవధాయ చ నమః = యుద్ధారంభమునకు పూర్వమే దూరమందున్నవారైనను నిజభక్తవిరోధుల బలపరాక్రమముల భంగపఱచు రుద్రునకు నమస్కారము.

(వివరణము) భగవానుని అగ్రవధత్వము, భారతద్రోణపర్వమందు అర్జునునిచే ఇట్లు అభివ్యక్తము చేయబడినది – 'సంగ్రామే శాత్రవానీకం...మన్యతే జనః' యుద్ధములో శత్రుసేనలను బాణపరంపరలతో సంహరించుచున్న నేను, అగ్నివలె ప్రకాశించుచు నా ముందు నడచుచున్న ఒక పురుషుని జూచితిని. జ్వలించుచున్న శూలము నెత్తిపట్టుకొని ఆ పురుషు డే దిక్కుకు బోవునో ఆ దిక్కుననున్న శత్రువులందరును నశించుచుండిరి. ఇట్లాతని తేజస్సుచే ముందు దహింపబడినవారినే వెనుకనుండి నేను దహించితిని.

అతడు సంహరించిన శత్రువులను నేనే సంహరించితినని లోకమనుకొన్నది – అని తాత్పర్యము.

అశ్వమేథపర్వములో గూడ నీ విషయము అనువదింపబడినది – 'తతః ప్రభాతాం రజనీం...బహురూపాన్మహేశ్వరాత్' అనంతరము రాత్రి తెల్లవారినంతనే సవ్యసాచిగా పేరొందిన అర్జునుని కన్నులయెదుటనే జగత్ప్రభువగు పరమేశ్వరుడు శత్రుసైన్యమును శూలముతో నేలగూల్చసాగెను. బహురూపధారియు, మహాధానుష్కుడు నగు మహేశ్వరుడు సహాయపడనిచో, సుప్రసిద్ధ ధనుర్ధారులగు భీష్మద్రోణకర్ణాది ప్రబలయోధులచే పరిరక్షితమైయున్న ఆ సేనానివహమును ప్రత్యక్షముగ బరిమార్చుట యట్లుండగా మానసికముగనైన ఎదుర్కొనుట కెవనికి శక్తియున్నది? అని పై భారతవచనముల భావసంగ్రహము.

దూరేవధత్వము మోక్షధర్మప్రకరణమునందు ప్రతిపాదింపబడినది. అందు శ్రీకృష్ణభగవాను డర్జునునితో – 'యస్తు తే హ్యగ్రతో యాతి...విశ్వేశం హరమవ్యయమ్' – ఓ అర్జునా! ఇపుడు యుద్ధములో నీముందు నడచుచున్నవాడు రుద్రుడని తెలిసికొనుము. అతనిచే పూర్వము సంహరింపబడిన శత్రువులనే నీవు సంహరించుచున్నావు. అప్రమేయ ప్రభావుడు – అవ్యయుడు – అఖిలవిశ్వమున కధినాథుడునగు హరుని శుద్ధచిత్తముతో అహరహము భజింపుము అని పలికినాడు. గీతలలో గూడ భగవాను డిట్లు తెలిపినాడు – **'మయైవైతే నిహతాః పూర్వమేవ, నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్'** భీష్మద్రోణాదుల నందరిని నేనే – ఇతఃపూర్వమే – చంపినాను. వారి చావుకు నీవు నిమిత్తమాత్రుడవే – అని భావము.

ఐతే – భీష్మద్రోణాదులను ముందుగనే సంహరించినవాడు – శివుడా? కేశవుడా? అందురేమో; పరమేశ్వరావతారమైన శ్రీకృష్ణుడు పరమేశ్వరాభిన్నుడేగాన నిందు విరోధమేమియు లేదు.

## మూ. నమో హన్త్రే చ హనీయసే చ. 6

**భాష్యమ్ –** అథ పరమేశ్వరానాదరస్య మహానర్థహేతుత్వాత్సర్వైరపి తదుపాసనం విధేయమితి దర్శయితుం షష్ఠః – **నమో హన్త్ర ఇతి.** అహమేవ సర్వోన్నత ఇతి గర్వేణ నిజానాదరకారిణాం **హన్తా–హింసకః,** ద్వేషనిన్దాపూర్వకం తత్కారిణామతిశయేన హింసకో

హనీయాన్. తత్ర హన్తృత్వస్యోదాహరణం రావణః. స కిల బలైశ్వర్యగర్వేణ పరమేశ్వర-మనాదృత్య కైలాససంచిచాలయిషయా భుజానధఃప్రసారయన్ భగవదఙ్గుష్ఠాగ్రదర-పరిస్పన్దనిపీడితకైలాసదృఢఘట్టితనిజభుజవ్యథయా చిరమాక్రుశ్య తతో దయయా భగవతైషముక్త ఇతి రామాయణాదిషు ప్రసిద్ధమ్. హనీయస్త్వస్యోదాహరణం దక్షః. స కిల భగవద్ద్వేషరూషితో యష్టుమారేభే. తం వీరభద్రోఽనుదుద్రావ, తతో దక్షస్య శిరచ్ఛేదః, యజ్ఞశాలాయాః దహనమ్, కుణ్డేషు మూత్రకరణమ్, అగ్నీనాం వినాశనమ్, యూపానుత్పాట్య తైరఖిలదేవతాప్రహారః, ఋత్విజాం కశాఘాతః, భృగోః శ్మశ్రులుఞ్చనమ్, పూష్ణో దన్తభఙ్గః, భగస్య నేత్రోత్పాటనమ్, అహో మహతీ హింసా కృతా. నహి తదా తేషాం కశ్చిత్త్రాతా బభూవ. అతో మహానర్థకరః పరమేశ్వరానాదర ఇతి తదుపాసన-మవశ్యం కార్యమితి భావః.

**అనువాదము:** పరమేశ్వరుని పట్ల అనాదరము అత్యన్తానర్థహేతువుగాన, సర్వులకును తదుపాసనము కర్తవ్యమను భావమును 'నమో హన్త్రే చ' అను మన్త్రము ప్రబోధించు చున్నది -

(అర్థము) హన్త్రే చ నమః = నేనే సర్వాధికుడనను అహంకారముతో తనను (పరమేశ్వరుని) అనాదరము చేయువారిని హతమార్చు రుద్రునకు నమస్కారము, హనీయసే చ నమః = ద్వేషనిన్దాపూర్వకముగ తనను (పరమేశ్వరుని) అనాదరము చేయువారిని సర్వవిధముల సంహరించు రుద్రునకు నమస్కారము.

(వివరణము) హన్తృత్వమునకు ఉదాహరణము - రావణుడు. అతడు బలైశ్వర్యగర్వముతో పరమేశ్వరుని లెక్కసేయక కైలాసమును కదలించు కోరికతో తన చేతులను దాని క్రిందికి దూర్చగా భగవానుని అఙ్గుష్ఠాగ్రస్పన్దమాత్రమున అణగిపోయిన కైలాసాచలముయొక్క దృఢతరమగు ఒరిపిడికి తన చేతులు నలిగిపోవుటయు, ఆ వ్యథతో చిరకాలము ఆక్రోశించి చివరకు భగవానునిచే దయతలచి విడిపింపబడుటయు రామాయణాదులలో ప్రసిద్ధము.

హనీయస్త్వమునకు ఉదాహరణము దక్షుడు. అతడు భగవద్ద్వేషరూపితుడై యాగము నారంభించెను. దానిని వీరభద్రుడు ప్రతిఘటించెను. అటుపైన దక్షుని శిరశ్ఛేదము, యజ్ఞశాలాదాహము, హోమకుండములో మూత్రోత్సర్జనము, అగ్నినాశనము, యూపస్తంభములను పెకటించి వానితో దేవతలను మోదుట, ఋత్విక్కులను కొరడాలతో కొట్టుట, భృగుమహర్షి మీసములను తీసివేయుట, పూషుని పండ్లూడగొట్టుట, భగుని

కన్నులు పెకలించుట, ఔరా, ఎంత హింసాకాండ జరిగినది! అపుడు దాని కడ్డుపడి కాపాడజాలిన వాడెవ్వడును లేకపోయినాడు. ఈశ్వరధిక్కార మెంత హానికరమో ఈ వృత్తాన్తము తెలుపుచున్నది. కాగా – శ్రేయస్కాములకు భగవదుపాసన మవశ్యకర్తవ్యమని భావము.

## మూ. నమో వృక్షేభ్యో హరికేశేభ్యః. 7

**భాష్యమ్ –** న కేవలం విపక్షే బాధకభయాదేవ పరమేశ్వరస్యోపాస్యత్వమ్, కిన్తు ఇహ లోకే పలాశబిల్వాశ్వత్థాదిరూపేణ సకలయజ్ఞనిర్వాహకతయా, పరత్ర చ కల్పకవృక్షరూపేణ సకలస్వర్గభోగనిర్వాహకతయా చ తదర్థిభిః సర్వైరపి తదాశ్రయణీయత్వమితి దర్శయితుం సప్తమః – **నమో వృక్షేభ్య ఇతి.** హరితవర్ణాః పలాశరూపాః కేశాః యేషాం తేభ్యః వృక్షేభ్యో నమః. హరితకేశపదేన పలాశానాం వృక్షత్వప్రయుక్త ఇవ పర్ణత్వప్రయుక్తోఽపి పరమేశ్వర–విభూతిమహిమాస్తీతి దర్శితమ్. అత ఏవ **'బ్రహ్మ వై పర్ణః, యత్పర్ణశాఖయా వత్సానపాకరోతి, బ్రహ్మణే వైనానపాకరోతి'** ఇతి పలాశవృక్షత్వప్రయుక్త ఇవ **'తస్మాత్త్రీణి త్రీణి పర్ణస్య పలాశాని, త్రిపదా గాయత్రీ'** ఇతి పర్ణత్వప్రయుక్తోఽపి తస్య మహిమా శ్రూయతే. బిల్వస్యాపి **'ఆదిత్యో యతోఽజాయత తతో బిల్వ ఉదతిష్ఠత్'** ఇతి బిల్వవృక్షత్వప్రయుక్త ఇవ పత్రప్రయుక్తమహిమా పురాణేషు శ్రూయతే. ఏవమన్యదప్యుదాహార్యమ్.

**అనువాదము:** కేవలము ఉపాసించనిచో అనర్థము కలుగునను భయముతో మాత్రమే కాదు; మరేమనగా – ఇహలోకమున పలాశ–బిల్వ–అశ్వత్థాది పవిత్రవృక్షరూపమును ధరించి సకలయజ్ఞనిర్వాహకుడై యుండుటచేతను, పరలోకములో కల్పవృక్షాదిరూపమున సకలస్వర్గభోగసంధాయకుడగుటచేతను గూడ ఆయా ప్రయోజనముల నపేక్షించు వారందరికిని ఆయన ఆశ్రయణీయుడను భావమున 'నమో వృక్షేభ్యః' అను సప్తమ మంత్రము సూచించుచున్నది.

(అర్థము) నమో వృక్షేభ్యో హరికేశేభ్యః = హరితవర్ణములగు చిగురుటాకులనెడి శిరోజములుగల వృక్షముల రూపముననున్న రుద్రులకు నమస్కారము.

(వివరణము) 'హరికేశ' పదము – పలాశాదులకు వృక్షత్వప్రయుక్తమైన మహిమయే కాక, కుర్ణత్వప్రయుక్తమైన మహిమగూడ కలదని సూచించుచున్నది. వృక్ష – పర్ణములు రెండును భగవద్విభూతివిశేషములే. కావుననే **'బ్రహ్మ వై పర్ణః...కరోతి'**

అను శ్రుతి ముందు బ్రహ్మరూపముగ పలాశమును ప్రస్తుతించుటద్వారా వృక్షత్వ ప్రయుక్తమగు మహత్త్వము నుపపాదించి, అటుపైని **'తస్మాత్త్రీణి త్రీణి...గాయత్రీ'** అని గాయత్రీరూపమున ప్రశంసించుట ద్వారా పర్ణతాప్రయుక్తమగు మాహాత్మ్యమునుగూడ ప్రదర్శించినది. బిల్వమునకు గూడ 'ఆదిత్యో యతోఽజాయత తతో బిల్వ ఉదతిష్ఠత్' అని ఆదిత్యసమానయోనిత్వమును పురస్కరించుకొని బ్రహ్మవర్చసహేతువని చెప్పుటద్వారా వృక్షత్వప్రయుక్తమగు మహత్త్వమును శ్రుతిచెప్పినట్లే పత్రత్వప్రయుక్తమగు మాహాత్మ్యము గూడ పురాణములలో బ్రసిద్ధమైయున్నది. తదితరవృక్షముల విషయమును నిట్లే యూహించునది.

## మూ. నమస్తారాయ. 8

**భాష్యమ్ –** అథ స్వర్గోపకరణత్వవన్మోక్షోపకరణత్వాదపి భగవత ఏవాశ్రయణీయత్వం వక్తుమష్టమః – **నమస్తారాయేతి**. తారః – ప్రణవః, తద్రూపాయ నమః. శ్రూయతే హ్యాథర్వశిరసి – **'స ఓఙ్కారస్తారః'** ఇతి ప్రస్తుత్య, **'స ఏకో రుద్రః స ఈశానః'** ఇతి. తైత్తిరీయేఽపి – **'బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్'** ఇతి. ప్రణవరూపత్వం చ – భగవతస్తత్ప్రతిపాద్యత్వమేవ. **'శివో వా ప్రణవో హ్యేష ప్రణవో వా శివః స్మృతః, వాచ్యవాచకయోర్భేదో నాత్యన్తం విద్యతే క్వచిత్'** ఇతి శివపురాణవచనాత్. **'తస్య ప్రకృతిలీనస్య యః పరస్స మహేశ్వరః'** ఇతి శ్రుతేశ్చ.

**అనువాదము:** భగవానుడు స్వర్గప్రదాత మాత్రమే కాదు; అపవర్గప్రదాతయు నాతడే – అను విషయమును 'నమస్తారాయ' అను అష్టమమన్త్రము తెలుపుచున్నది –

(అర్థము) తారాయ నమః = ప్రణవస్వరూపుడగు రుద్రునకు నమస్కారము.

(వివరణము) అథర్వశీర్షోపనిషత్తులో 'ఓఙ్కారస్తారః' అని మొదలిడి **'స ఏకో రుద్రః స ఈశానః'** ఇట్లు ప్రణవము పరమేశ్వరస్వరూపముగ పేర్కొనబడినది. తైత్తిరీయము నందుగూడ 'బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్' ఇట్లు ప్రణవము సదాశివపరబ్రహ్మాత్మక మని చెప్పబడినది. ప్రణవము పరమాత్మరూప మనగా – పరమాత్మ ప్రతిపాదక మని యర్థము. 'శివో వా ప్రణవో హ్యేష...క్వచిత్' అను శివపురాణవచనానుసారము వాచ్యవాచముల కభేదము సిద్ధించుచున్నది. *(మాణ్డూక్యప్రక్రియ ననుసరించి ప్రణవము (ఓంకారము)లో అన్తర్భూతములై యున్న అకార–ఉకార–మకారములను, క్రమముగ విరాట్–*

*హిరణ్యగర్భ-అవ్యాకృత (మూలప్రకృతి) రూపములనుగ ధ్యానించి. పిమ్మట విరాడ్రూపమగు అకారమును హిరణ్యగర్భరూపమగు ఉకారమునందును, దానిని అవ్యాకృత రూపమగు మకారమునందును ప్రవిలాపన మొనర్చుగా (తత్తాన్మాత్రముగ) ఉపసంహార మొనర్చుగా, దానికావల చతుర్థమాత్రారూపమగు నాదమునందు ధ్యానించదగిన సర్వాధిష్ఠానము - సర్వోత్కృష్టమునగు తత్త్వమే మహేశ్వరస్వరూపమని - శ్రుత్యభిప్రాయము.)* **'తస్య ప్రకృతిలీనస్య యః పరస్స మహేశ్వరః'** అనుశ్రుతియు ఇందుకు ఉపబృంహకము.

## మూ. నమశ్శమ్భవే చ మయోభవే చ. 9

**భాష్యమ్ -** అథ వైశ్వానరద్వాదశకపాలేష్టిఫలే పూతత్వాదీనామివ నిరతిశయానన్ద-మహాసముద్రే పరమాత్మని ఐహికాముష్మికసకలసుఖానామపి శీకరతయాన్తర్భావాత్ తదర్థిభిః సర్వైరపి తదాశ్రయణమవశ్యం కార్యమితి దర్శయితుం నవమః - **నమశ్శంభవ ఇతి.** శమిత్యైహికం సుఖమ్. మయ ఇత్యాముష్మికం స్వర్గాదిసుఖమ్. శం భవతి-ప్రాదుర్భవత్యస్మాదితి శంభుః, ఏవం మయోభూః. తథా చ శ్రుతిః - ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తీతి.

**అనువాదము:** వైశ్వానరద్వాదశకపాలేష్టి (తై.సం.2-2-5) *(వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్పుత్రే జాతే" అను శ్రుతిచే పుత్త్రుడు పుట్టినప్పుడు అనుష్ఠించవలసిన ఒక ఇష్టి (యాగము) విధింపబడినది. ఇందు వైశ్వానరుడు దేవత. ద్వాదశకపాలము ద్రవ్యము. ద్వాదశకపాలమనగా - పండ్రెండు (మృద్భాండశకలరూపములగు) కపాలములయందు పక్వము గావింపబడిన పురోడాశము. ఈ యిష్టివలన పుత్త్రునకు పూతత్వాదిఫలపరంపర ప్రాప్తమగుననియు చెప్పబడినది. అచటనే అష్టాకపాల- నవకపాల - దశకపాల - ఏకాదశకపాలములను గూడ చెప్పుచు, వానికి క్రమముగ* పూతత్వము - తేజస్విత్వము - ఇన్ద్రియపాటవము - పశుసమృద్ధి ఫలములుగా చెప్పబడినవి.

*ఈ స్థితిలో - 'శతే పంచాశత్' న్యాయముచే (నూరులో, ఏబది అన్తర్భూతమైయున్నట్లు)* అష్టాకపాలాదులకు చెప్పబడిన ప్రత్యేకఫలములన్నియు, ద్వాదశకపాలమునకు జెప్పబడిన ఫలపరంపరలో *అన్తర్భూతములైయుండుటచే నాన్తరీయకముగ సిద్ధించునుగాన, ద్వాదశకపాలమే ప్రశస్తమని - వైశ్వానరాధికరణము (పూ.మీ. 1-4-12)లో ప్రతిపాదింపబడినది.*

*కాగా - ప్రకృతమున, సహజానందమహాసముద్రస్వరూపుడగు సదాశివుని యనుగ్రహమునకు పాత్రుడగుచో, చిన్న చిన్న జలబిందువులబోలిన విషయానందములకై ప్రత్యేకించి*

*(్రాకులాడవలసిన యవసరము లేదని – భావము.)* యొక్క సంపూర్ణఫలము నందు పూతత్వాది ఫలములన్నియు అన్తర్భూతములైయున్నట్లు నిరతిశయపరమానన్ద మహాసముద్రముగ పరమాత్మయందు ఐహికాముష్మిక సుఖములన్నియు అన్తర్గతములు, అత్యల్పబిందువుల వంటివి గాన, వానిని కోరువారు సైతము ఆ పరమేశ్వరుని ఆశ్రయించు టావశ్యకమను భావమును 'నమశ్శంభవే' అను మంత్రము అభివ్యక్తముజేయుచున్నది.

(అర్థము) శంభవే చ నమః = ఐహికసుఖము నిచ్చు రుద్రునకు నమస్కారము. మయోభవే చ నమః = ఆముష్మికస్వర్గాదిసుఖము నిచ్చు రుద్రునకు నమస్కారము.

(వివరణము) శమ్ = ఐహికసుఖం, భవతి – ఆవిర్భవత్యస్మాదితి శంభుః. మయః = ఆముష్మికసుఖం, భవతి – ఆవిర్భవత్యస్మాదితి మయోభూః. విషయానందములన్నియు పరమా(త్మా)నన్దమహాసముద్రములోని చిన్నబిందువులవంటివను నర్థమును 'ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి' అను శ్రుతి సమర్థించుచున్నది.

**మూ. నమశ్శఙ్కరాయ చ మయస్కరాయ చ. 10**

**భాష్యమ్ –** న కేవలం తటాకాన్తస్థితస్యోదకస్యేవ పరమేశ్వరాన్తస్థితస్య సుఖస్య లోకోపజీవ్యత్వమాత్రేణ భగవతస్తదుపాసకతా, కిన్తు ఐహికాముష్మికసుఖదానే స్వతన్త్రకర్తృత్వేనాపీతి దర్శయితుం దశమః – **నమః శఙ్కరాయ చేతి.** యద్యపి నమశ్శంభవే చ ఇత్యనేనేదం పునరుక్తం, తత్ర సాక్షాత్కర్తృత్వం, అత్ర తు పరంపరయేతి భేదః.

**అనువాదము:** (అర్థము) శఙ్కరాయ చ నమః = ఐహికసుఖమును అన్యద్వారమున ననుగ్రహించు రుద్రునకు నమస్కారము. మయస్కరాయ చ నమః = ఆముష్మికసుఖమును అన్యద్వారమున ననుగ్రహించు రుద్రునకు నమస్కారము.

(వివరణము) తటాకములోని జలము జీవనాధారమైయుండుటవలన జనులకు సేవ్యమగుచున్నట్లు, పరమేశ్వరునియందున్న సుఖము అస్మదాదుల కపేక్షితముగాన నతడు మన కుపాస్యుడని చెప్పుటయేకాక, ఐహికాముష్మికసుఖముల నిచ్చుటలో నతడు స్వతంత్రకర్తయగుటచేతను గూడ – అను భావము నీ మంత్రము తెలుపుచున్నది. పూర్వమంత్రమున సాక్షాత్కర్తృత్వము చెప్పబడగా, ప్రకృతమంత్రమున పరంపరాకర్తృత్వము వివక్షితముగాన పునరుక్తత్వదోషమున కిచట ప్రసక్తి లేదు.

**మూ. నమశ్శివాయ చ శివతరాయ చ. 11**

**భాష్యమ్ –** అథేదానీమఖిలశ్రేయఃప్రదత్వేన పరమేశ్వరస్యైవ జగదుపాస్యత్వప్రదర్శకమ్, అశేషదోషజాలకూలంకషం, హరిబ్రహ్మాద్యుపాసనీయమ్ ఏకాదశమన్త్రరాజమాహ – **నమశ్శివాయేతి**. శివశబ్దః 'తత్కరోతి' ఇతి ణ్యన్తాత్పచాద్యచి నిష్పన్నః – శివంకరత్వవాచీ. తథా చ అథర్వశిఖాశ్రుతిః – **'శివ ఏకో ధ్యేయః శివంకరః'** ఇతి. అత్ర హి శివశబ్దవ్యాఖ్యానార్థం శివంకరపదమ్. 'సర్వైశ్వర్యసంపన్నః సర్వేశ్వరః' ఇత్యత్ర సర్వేశ్వర పదవ్యాఖ్యానార్థం సర్వైశ్వర్యసంపన్న ఇతి పదోపాదానేన అత్రాపి తథాత్వావగమాత్. **'సమా భవన్తి మే సర్వే దానవాశ్చ సురాశ్చ యే, శివోఽస్మి తేన భూతానాం శివత్వం తేన మే సురాః'** ఇతి భారతవచనాచ్చ. యత్తు భారతే – **'శివమిచ్ఛన్మనుష్యాణాం తస్మాద్దేవః శివః స్మృతః'** ఇతి శివశబ్దస్య వ్యాఖ్యానమ్, తదపి శివంకరత్వార్థపర్యవసితమేవ. ఇచ్ఛైవ సఙ్కల్పమాత్రేణ సకలజగత్స్రష్టుర్భగవతః కరణమ్. ఏవం **'హింసి ధాతోస్సింహశబ్దో వశ కాన్తౌ శివః స్మృతః, అథవాశేషకల్యాణగుణైకనిధిరీశ్వరః. శివ ఇత్యుచ్యతే సద్భిః శివతత్త్వార్థవేదిభిః'** ఇత్యాదీన్యన్యాన్యపి పౌరాణికవచనాన్యథర్వశిఖోక్తశివంకరత్వ-పర్యవసితాన్యేవ ద్రష్టవ్యాని.

నన్వేదం శివంకరత్వమన్యథాఽపి దృశ్యతే – **'పావకో అస్మభ్యగ్ం శివో భవ'** ఇతి. లోకేఽపి దృశ్యతే – **పన్థానః సన్తు తే శివాః** – ఇతి. అతో విశినష్టి – శివతరాయ చేతి. లోకే వేదే చ యావన్తశ్శివంకరాస్తదపేక్షయాప్యతిశయేన శివంకరః – శివతరః. అత ఏవ భగవానేవోపాస్య ఇతి భావః. తదేతదథర్వశిరసి స్పష్టముక్తమ్. తత్ర హి – **'కిం తద్ధ్యానం, కో వా ధ్యాతా, కశ్చ ధ్యేయః'** ఇతి ప్రశ్నే, **'శివ ఏకో ధ్యేయశ్శివంకరః సర్వమన్యత్పరిత్యజ్య'** ఇతి సర్వపరిత్యాగపూర్వకం శివస్యైకస్యైవ ధ్యేయత్వం శివశబ్దవాచ్యేన శివంకరత్వేన ఉపపాద్య, తతః సర్వాపేక్షయాతిశయితశివంకరత్వేనావిష్కృతమ్. సోఽయమఖిలశ్రుతిహారాయమాణరుద్రోపనిషన్నాయకమణిః మహామన్త్రః. యదాహుః– **'విద్యాసు శ్రుతిరుత్కృష్టా రుద్రైకాదశినీ శ్రుతౌ, తత్ర పఞ్చాక్షరీ తస్యాం శివ ఇత్యక్షరద్వయమ్'** ఇతి. జీవరత్నమితి చ శివశబ్దస్య ఆగమేషు వ్యవహారః. సర్వాణ్యేవ శివపురాణవచనాన్యే-తన్మాహాత్మ్యప్రమాణత్వేనోదాహరణీయానీతి సంక్షేపః.

**అనువాదము:** ఇకనిప్పుడు సకలశ్రేయఃప్రదాతయగుటచే పరమేశ్వరుడే లోకమునకు

సంసేవ్యు డను నర్థమును నిర్ధరించుచు, అశేషదోషజాలకూలంకషమై, హరిబ్రహ్మాదులకు సైతము ఉపాస్యమైన **'నమశ్శివాయ'** అను పదునొకండవ మంత్రము ప్రారంభమగు చున్నది –

(అర్థము) శివాయ చ నమః = మంగళకరుడగు రుద్రునకు నమస్కారము. శివతరాయ చ నమః = అత్యన్తము మంగళకరుడగు రుద్రునకు నమస్కారము.

(వివరణము) శివశబ్దము – 'తత్కరోతి' (దానిని చేయువాడు) అను నర్థమున విహితమగు ణిప్రత్యయము అన్తావయవమై, పిమ్మట 'పచాద్యచ్' ప్రత్యయము చేరగా నిష్పన్నమైనది. దానికి శివంకరు డని యర్థము. **'శివ ఏకో ధ్యేయః శివంకరః'** అని అథర్వశిరశ్శ్రుతి తెలుపుచున్నది. **'సర్వైశ్వర్యసంపన్నస్సర్వేశ్వరః'** అనుచో సర్వైశ్వర్య సంపన్న పదము సర్వేశ్వరపదవ్యాఖ్యానార్థమైనట్లు ఇందలి శివంకరశబ్దము శివశబ్దవ్యాఖ్యానరూపము. 'సమా భవన్తి మే సర్వే...తేన మే సురాః' అను భారతవచనము సర్వభూతములకు శివంకరుడై యుండుట మూలముననే శివశబ్దము ప్రవృత్తమైనట్లు తెలుపుచున్నది. ఐతే– భారతములోనే 'శివమిచ్ఛన్మనుష్యాణాం తస్మాద్దేవః శివః స్మృతః' అను వచనము శివమును కలిగించుటకాక, శివమును ఇచ్ఛయించుట (కోరుట)యే శివశబ్దమునకు ప్రవృత్తి నిమిత్తమని తెలియుచున్నది గదా? అందురేమో; సంకల్పమాత్రమున సకలజగత్తును సృజించు పరమేశ్వరునకు ఇచ్ఛయే అసాధారణ కారణము. అనగా, ఆయనకు సంకల్పము కలుగవలయునేగాని, సంకల్పానంతరము కార్యము సిద్ధించుటలో బాహ్యోపకరణముల అపేక్ష లేదు. 'ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః' 'క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే' ఇత్యాది వచనము లీ విషయమును విశదీకరించుచున్నవి.

ఇట్లే 'హింసి ధాతోస్సింహశబ్దో... శివతత్త్వార్థవేదిభిః' ఇత్యాది పురాణవచనములు – హింసిధాతువునుండి వర్ణవ్యత్యయముచే సింహశబ్దము నిష్పన్నమైనట్లు, కాన్త్యర్థకమగు వశధాతువునుండి శివశబ్దము నిష్పన్నమైనదనియు, ఇంతేకాక – పరమేశ్వరుడు సమస్త కల్యాణగుణనిధానము గావున, శివనామ మాతనికి సార్థకమని శివతత్త్వవిదులగు సజ్జనులు చెప్పుచున్నారనియు – బోధించుచు అథర్వశిరశ్శ్రుత్యుక్తమైన శివంకరుడను నర్థములోనే పర్యవసితములగుచున్నవి.

ఐతే – ఈ శివంకరత్వము శివునియందేకాక, ఇతరులయందు గూడ కనిపించు

చున్నది. 'పావకో అస్మభ్యగ్ం శివో భవ' అను శ్రుతి అగ్నికి శివంకరత్వమును తెలుపుచున్నది. 'శివాస్తే సన్తు పన్థానః' అను వాక్యము మార్గమునకు శివంకరత్వమును బోధించుచున్నది. కాగా – శివుడే శివంకరు డనుటెట్లు? అను శంకకు సమాధానముగా 'శివతరాయ చ' అని చెప్పబడినది. అందలి 'తర' శబ్దమునుబట్టి వేదమునగాని, లోకమున గాని శివంకరులుగ చెప్పబడిన వారందరికన్న నతిశయించి శివమును కలుగజేయువాడని యర్థము. ఇతరులకు గల శివంకరత్వము – సావధికము. శివునకు గల శివంకరత్వము నిరవధిక మని తాత్పర్యము. కావున నతడే సేవ్యుడని పర్యవసానము. ఈ విషయము – 'కిం తత్ ధ్యానమ్? కో వా ధ్యాతా? కశ్చ ధ్యేయః?' ఆ ధ్యాన మెట్టిది? ధ్యానించు వాడెవడు? ధ్యానించదగినవాడెవ్వడు? అని ప్రశ్నరాగా, 'శివ ఏకో ధ్యేయశ్శివంకరః సర్వమన్యత్పరిత్యజ్య' అను సమాధానములో – సర్వమును పరిత్యజించి శివునే ధ్యానించ వలెననుటకు హేతువుగా మొదట సాధారణముగ శివంకరత్వవాచియగు శివశబ్దమును ప్రయోగించి, అటుపైని నిరతిశయశివంకరత్వమును నిరూపించుటకై శివతరశబ్దము ప్రయోగింపబడినది.

సకలశ్రుతిమణిహారాయమాణమగు రుద్రోపనిషత్తులో నాయకమణి యీ మహామంత్రము. కావుననే – 'విద్యాసు శ్రుతిరుత్కృష్టా' అను అభియుక్తోక్తి – సర్వవిద్యలలో శ్రుతియు, శ్రుతిలో రుద్రైకాదశినియు, రుద్రైకాదశినిలో పంచాక్షరమంత్రము, ఆ మంత్రములో 'శివ' అను నక్షరద్వయము, ఉత్తరోత్తరము (ఒకదానికన్న నొకటి) ఉత్కృష్టమని తెలుపుచున్నది. ఆగమములలో శివశబ్దము – జీవరత్నముగా వ్యవహరింపబడినది. శివపురాణములన్నియు ఈ మన్త్రమాహాత్మ్యవిషయమున ప్రమాణముగ ఉదాహరింపదగియున్నను విస్తరభీతిచే విరమింపబడుచున్నది.

**మూ. నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ। 12**

**నమః పార్యాయ చావార్యాయ చ। 13**

**నమః ప్రతరణాయ చోత్తరణాయ చ। 14**

**నమ ఆతార్యాయ చాలాద్యాయ చ। 15**

**నమశ్శష్ప్యాయ చ ఫేన్యాయ చ। 16**

**నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ. 17**

**భాష్యమ్ –** తదేవమ్ **'నమస్సోమాయ'** ఇత్యాదిభిరేతదన్తైర్మన్త్రైరఖిలోపాస్యత్వధర్మ–హేతువిశిష్టతయా భగవాన్నమస్కృతః. అథాన్తర్యామిత్వేన చ నమస్కరోతి నమస్తీర్థ్యాయేత్యాదిభిః. తీర్థేషు గఙ్గాదిషు భవః తీర్థ్యః, కూలేషు భవః కూల్యః, నద్యాదీనాం పరం తీరం పారమ్, తత్ర భవః పార్యః, అర్వాక్తీరమ్ అవారమ్, తత్ర భవః అవార్యః. ప్రకృష్టేణ మార్గేణ పాపతరణహేతుః ప్రతరణః, తతోఽప్యుత్కృష్టేన జ్ఞానమార్గేణ అవిద్యాతరణహేతుః ఉత్తరణః ఇతి తాదాత్మ్యేన నమస్కారః; పునరాగమనం ఆతారః, తత్ర భవః ఆతార్యః, అలం కర్మ పూర్ణం యథా భవతి తథా కర్మఫలమత్తీత్యలాదః – జీవః, తత్ర భవః అలాద్యః, శష్పం బాలతృణమ్, తత్ర భవః శష్ప్యః, ఫేనేషు భవః ఫేన్యః, సికతాసు భవః సికత్యః, ప్రవాహేషు భవః ప్రవాహ్యః.

**ఇతి అష్టమోఽనువాకః**

**అనువాదము:** 'నమస్సోమాయ చ' మొదలు ఇంతవరకు పదునొకండు మంత్రములలో భగవానుడు అఖిలలోకోపాస్యుడగుటకు హేతుభూతములగు ధర్మములు గలవాడుగ నమస్కరింపబడినాడు. ఇక 'నమస్తీర్థ్యాయ చ' ఇత్యాది మంత్రములచే సర్వాన్తర్యామిత్వాది లక్షణలక్షితుడుగ నమస్కరింపబడుచున్నాడు –

(అర్థము) తీర్థ్యాయ చ నమః = గంగాదితీర్థములలో అన్తర్యామిగనున్న రుద్రునకు నమస్కారము. కూల్యాయ చ నమః = అట్టి తీర్థముల తీరములలో నున్న రుద్రునకు నమస్కారము. పార్యాయ చ నమః = నద్యాదుల ఆవలి గట్టులనున్న రుద్రునకు నమస్కారము. అవార్యాయ చ నమః = నద్యాదుల ఈవలిగట్టులనున్న రుద్రునకు నమస్కారము. ప్రతరణాయ చ నమః = ప్రకృష్ట (శాస్త్రీయ) మార్గము ననుసరించి పాపమును తరించుటకు కారణభూతుడైన రుద్రునకు నమస్కారము. ఉత్తరణాయ చ

నమః = అంతకన్నను ఉత్కృష్టమగు జ్ఞానమార్గము నాశ్రయించి అవిద్యను తరించుటకు హేతుభూతుడైన రుద్రునకు నమస్కారము. ఆతార్యాయ చ నమః = పునరాగమన మార్గమునందుండు రుద్రునకు నమస్కారము, ఆలాద్యాయ చ నమః = సమగ్ర కర్మఫలభోక్తయగు జీవునియందుండు రుద్రునకు నమస్కారము. శష్ప్యాయ చ నమః = బాలతృణమునందుండు రుద్రునకు నమస్కారము. ఫేన్యాయ చ నమః = నురుగులోనుండు రుద్రునకు నమస్కారము. సికత్యాయ చ నమః = ఇసుకలోనుండు రుద్రునకు నమస్కారము. ప్రవాహ్యాయ చ నమః = ప్రవాహములలో నుండు రుద్రునకు నమస్కారము.

**అష్టమానువాకము – సమాప్తము**

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# నవమో౽నువాకః

మూ. నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ। 1

నమః కిగ్ంశిలాయ చ క్షయణాయ చ। 2

నమః కపర్దినే చ పులస్తయే చ। 3

నమో గోష్ఠ్యాయ చ గృహ్యాయ చ। 4

నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ। 5

నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ। 6

నమో హ్రదయ్యాయ చ నివేష్ప్యాయ చ। 7

నమః పాగ్ంసవ్యాయ చ రజస్యాయ చ। 8

నమశ్శుష్క్యాయ చ హరిత్యాయ చ। 9

నమో లోప్యాయ చోలప్యాయ చ। 10

నమ ఊర్వ్యాయ చ సూర్మ్యాయ చ। 11

నమః పర్ణ్యాయ చ పర్ణశద్యాయ చ. 12

**భాష్యమ్ –** అష్టమే జగదుపాస్యత్వహేతుభిరన్తర్యామితయా భగవాన్నమస్కృతః. నవమే పునరన్తర్యామితయా భగవాన్నమస్క్రియతే – **నమ ఇరిణ్యాయేతి.** ఇరిణం – ఊషరమ్. తత్ర భవః ఇరిణ్యః. ప్రపథః – క్షుణ్ణమార్గః, తత్ర భవః ప్రపథ్యః. కుత్సితాః శిలా యస్మిన్ సః కింశిలః. క్షయణః – వాసయోగ్యో దేశః. తదుభయరూపాయేత్యర్థః కపర్దీ – జటాజూటవాన్. భక్తానాం పురతస్తిష్ఠతీతి పులస్తిః. గవాం స్థానం గోష్ఠమ్, తత్ర భవః గోష్ఠ్యః. గృహే భవః గృహ్యః. తల్పేషు భవః తల్ప్యః. గేహే – ప్రాసాదే భవః గేహ్యః. కుత్సితమటతి కణ్టకలతాదిపరిపూర్ణతయా దుష్ప్రవేశత్వం ప్రాప్నోతీతి – కాటః, తత్ర భవః కాట్యః. గహ్వరే – విషమే గిరిగుహాదౌ తిష్ఠతీతి గహ్వరేష్ఠః. హ్రదేషు – అగాధజలేషు భవః హ్రదయ్యః. నివేష్పం – నీహారజలమ్, తత్ర భవః నివేష్ప్యః. పాంసుషు పరమాణుషు భవః పాంసవ్యః. రజసి – స్పష్టాయాం ధూల్యాం భవః రజస్యః. శుష్కేషు కాష్ఠేషు భవః శుష్క్యః. హరితేషు ఆర్ద్రేషు భవః హరిత్యః. లుప్యతే తృణాదికమస్మిన్నితి లోపః – కఠినప్రదేశః, తత్ర భవో లోప్యః. ఉలపో బల్బజతృణాదిః, తత్ర భవః, ఉలప్యః. ఉర్వ్యాం పృథివ్యాం భవః, ఊర్వ్యః, **దీర్ఘశ్ఛాన్దసః.** శోభనా ఊర్మయో యాసాం నదీనాం తాః సూర్మయః తత్ర భవః సూర్మ్యః. పర్ణేషు భవః పర్ణ్యః. శుష్కపర్ణసఙ్ఘాతః పర్ణశదః, తత్ర భవః పర్ణశద్యః.

**అనువాదము:** అష్టమానువాకమునందు జగదుపాస్యత్వ – జగదన్తర్యామిత్వలక్షణములను పురస్కరించుకొని భగవానుడు నమస్కరింపబడినాడు. నవమానువాకమునందు గూడ మరల అన్తర్యామిగా భగవానుడు నమస్కరింపబడుచున్నాడు –

(అర్థము) ఇరిణ్యాయ చ నమః = ఊషరప్రదేశమునందుండు రుద్రునకు నమస్కారము. ప్రపథ్యాయ చ నమః = గమనాగమనాదులచే క్షుణ్ణమైన మార్గము నందుండు రుద్రునకు నమస్కారము. కిగ్ంశిలాయ చ నమః = కుత్సితములగు శిలలుగల ప్రదేశమునందుండు రుద్రునకు నమస్కారము. క్షయణాయ చ నమః = నివాసయోగ్యమగు దేశముననుండు రుద్రునకు నమస్కారము. కపర్దినే చ నమః = జటాజూటధారియగు రుద్రునకు నమస్కారము. పులస్తయే చ నమః = భక్తులయెదుట సన్నిహితుడై యుండు రుద్రునకు నమస్కారము. గోష్ఠ్యాయ చ నమః = గోశాలయందుండు రుద్రునకు నమస్కారము. గృహ్యాయ చ నమః = గృహమునందుండు రుద్రునకు నమస్కారము. తల్ప్యాయ చ నమః = తల్పములయందుండు రుద్రునకు నమస్కారము. గేహ్యాయ చ నమః = మేడలయందుండు రుద్రునకు నమస్కారము. కాట్యాయ చ నమః =

కంటకలతాసమన్వితమై కష్టముతో సంచరించదగిన ప్రదేశమునందుండు రుద్రునకు నమస్కారము. గహ్వరేష్ఠాయ చ నమః = నిమ్నోన్నతములైన పర్వతగుహాదులలో నుండు రుద్రునకు నమస్కారము. హ్రదయ్యాయ చ నమః = మిక్కిలి లోతైన జలాశయములలో నుండు రుద్రునకు నమస్కారము. నివేష్ప్యాయ చ నమః = మంచినీటిలోనుండు రుద్రునకు నమస్కారము. పాగ్ంసవ్యాయ చ నమః = పరమాణువులలోనుండు రుద్రునకు నమస్కారము. రజస్యాయ చ నమః = ధూళియందుండు రుద్రునకు నమస్కారము. శుష్క్యాయ చ నమః = ఎండినకాష్ఠలోష్ఠాదులలోనుండు రుద్రునకు నమస్కారము. హరిత్యాయ చ నమః = తడిసిన వస్తువులలోనుండు రుద్రునకు నమస్కారము. లోప్యాయ చ నమః = గడ్డికూడ మొలవని – కఠినస్థలములలో నుండు రుద్రునకు నమస్కారము. ఉలప్యాయ చ నమః = బల్బజతృణాదులలోనుండు రుద్రునకు నమస్కారము. ఊర్వ్యాయ చ నమః = పృథివియందుండు రుద్రునకు నమస్కారము. సూర్మ్యాయ చ నమః = మంచి తరంగములతో గూడిన నదులయందుండు రుద్రునకు నమస్కారము. పర్ణ్యాయ చ నమః = ఆకులలోనుండు రుద్రునకు నమస్కారము. పర్ణశద్యాయ చ నమః = ఎండుటాకుల రాశిలోనుండు రుద్రునకు నమస్కారము.

**మూ. నమోఽపగురమాణాయ చాభిఘ్నతే చ। 13**

**నమ ఆఖ్ఖిదతే చ ప్రఖ్ఖిదతే చ. 14**

**భాష్యమ్** – అథ నమోఽపగురమాణాయేతి ద్వాభ్యాం జగన్నిగ్రాహకా భగవదంశా రుద్రా నమస్క్రియన్తే. తత్ర నిగ్రాహ్యేషు పాపిష్ఠేషు ఉద్యతాయుధః – అపగురమాణః, తాన్ప్రహరన్ – అభిఘ్నన్. పాపానుసారేణ కాంశ్చిత్ ఈషత్ఖేదయన్ – ఆఖ్ఖిదన్. కాంశ్చిత్ప్రకర్షేణ ఖేదయన్ – ప్రఖ్ఖిదన్ తద్రూపేభ్య ఇత్యర్థః.

సోఽయమ్ **నమస్సోమాయ** ఇత్యాదిభిరన్యతో నమస్కారరూపైరేకత్రింశ–ద్యజురాత్మకావాన్తరమన్త్రసముదాయ ఏకో మన్త్రః. అస్య భగవానేవ ఋషిః. అనుష్టుప్ ఛన్దః. స ఏవ దేవతా. 'రూపయౌవ'నేత్యాదయస్తృతీయానువాకోక్తా ధ్యానశ్లోకాః. సామ్రాజ్యైశ్వర్యశివపదాదిఫలప్రదోఽయం మన్త్రః. కృచ్ఛ్రద్వయానుష్ఠానపూర్వకం పఞ్చశతజపాదస్య మన్త్రస్య సిద్ధిః.

**అనువాదము:** ఇటుపైని 'నమోఽపగురమాణాయ చ' ఇత్యాది మన్త్రద్వయముచే జగత్తును నిగ్రహిం(శిక్షిం)చు భగవదంశరూపులగు రుద్రులు నమస్కరింపబడుచున్నారు –

(అర్థము) అపగురమాణాయ చ నమః = పాపులను శిక్షించుటకై ఆయుధమును ఎత్తిపట్టుకొనియున్న రుద్రునకు నమస్కారము. అభిఘ్నతే చ నమః = పాపులను ఆయుధములతో ప్రహరించు రుద్రునకు నమస్కారము. ఆఖ్ఖిదతే చ నమః = పాపము ననుసరించి కొందరిని స్వల్పముగ బాధించు రుద్రునకు నమస్కారము. ప్రఖ్ఖిదతే చ నమః = మరికొందరిని విశేషించి బాధించు రుద్రునకు నమస్కారము.

'నమస్సోమాయ చ' మొదలుకొని అన్యతోనమస్కారరూపములైన ముప్పదియొక్క అవాన్తరయజుర్మన్త్రముల సముదాయము – పురశ్చరణ ప్రకియలో ఒకే మంత్రము. దీనికి ఋషియు దేవతయు భగవానుడే. ఛన్దస్సు అనుష్టుప్. తృతీయానువాకములో జెప్పబడిన 'రూపయౌవనసంపన్నా' ఇత్యాది ధ్యానశ్లోకములనే ఇచటగూడ గ్రహించునది. సామ్రాజ్య – ఐశ్వర్య – శివపదాది ఫలప్రద మీ మంత్రము. కృచ్ఛ్రద్వయానుష్ఠాన పూర్వకముగ ఐదువందలపర్యాయములు జపించిన మంత్రసిద్ధి యగును.

| | | |
|---|---|---|
| మూ. | నమో వః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యో। | 15 |
| | నమో విక్షీణకేభ్యో, | 16 |
| | నమో విచిన్వత్కేభ్యో, | 17 |
| | నమ ఆనిర్హతేభ్యో, | 18 |
| | నమ ఆమీవత్కేభ్యః. | 19 |

**భాష్యమ్ –** నమో వః కిరికేభ్య ఇతి పఞ్చమన్త్రైర్గుప్తరూపేణ జగన్నిగ్రాహకరూపా రుద్రగణా నమస్క్రియన్తే. గుప్తత్వం చ దేవానాం హృదయేభ్య ఇతి విశేషణద్వయేనావగమ్యతే. దేవానామేవ హృదయే వర్తన్తే, న వయం జానీమ ఇత్యర్థః. ఏతచ్చ కిరికాదీనాం

పఞ్చానామపి విశేషణమ్. కిరన్తి స్వేచ్ఛయా నాశయన్తీతి కిరికాః. వివిధం క్షిణ్వన్తి బాధన్తే ఇతి విక్షీణకాః. నిగ్రహానుగ్రహార్థమ్ ఇమే పాపినః, ఇమే సుకృతినః, ఇతి విచిన్వన్తో విచిన్వత్కాః. ఆఙ్మర్యాదాయామ్. పాపిష్వేవ నిశ్చయేన హననం కుర్వన్ ఆనిర్హతం - దుఃఖకరణమ్, తద్వన్తః ఆనిర్హతాః. పాపిష్ఠానామితస్తతః అపసర్పణాయ సమన్తాద్విజృమ్భమాణాః, ఆమీవత్కాః. ఏవంవిధేభ్యోఽయం (ఇదం) వో నమః అస్తు.

నమో వః కిరికేభ్య ఇత్యాదిరేతదన్తః అన్యతో నమస్కారరూపయజురాత్మకావాన్తర-మన్త్రసముదాయ ఏకో మన్త్రః. అస్యాగ్నిరృషిః. త్రిష్టుప్ఛన్దః. రుద్రో దేవతా.

**విశ్వతః పాణిపాదం తం విశ్వతోఽక్షిశిరోముఖమ్।**
**జ్వలన్తం శూలమావృత్య తేజోరాశిం శివం స్మరేత్॥**

పరాకకృచ్ఛ్రానుష్ఠానపూర్వకం చత్వారింశత్సహస్రజపాన్మన్త్రసిద్ధిః. సార్వభౌమాధిపత్య-లక్షసువర్ణవశ్యవేధసువక్రకవిత్వభోగశివసాక్షాత్కారఫలప్రదోఽయం మన్త్రః.

**ఇతి నవమోఽనువాకః**

**అనువాదము:** 'నమో వః కిరికేభ్యః' అని మొదలగు ఐదు మన్త్రములచే గుప్తరూపముతో జగత్తును నిగ్రహించు (శిక్షించు) రుద్రగణములు నమస్కరింపబడుచున్నవి -

(అర్థము) ఓ రుద్రగణములారా! దేవానాం హృదయేభ్యః = ఎవ్వరికిని తెలియకుండ దేవతల హృదయములలో గుప్తముగ నివసించుచుండెడివారును, కిరికేభ్యః వః నమః = స్వేచ్ఛగా నశింపజేయువారునగు మీకు నమస్కారము. 'దేవానాం హృదయేభ్యః' అను విశేషణము ముందు నాల్గుమంత్రములలో గూడ అన్వయించును. విక్షీణకేభ్యః నమః = అనేక విధముల బాధించు మీకు నమస్కారము. విచిన్వత్కేభ్యః నమః = నిగ్రహానుగ్రహముల నొనర్చుటకై వీరు పాపాత్ములు - వీరు పుణ్యాత్ములు నని విభజించు మీకు నమస్కారము. ఆనిర్హతేభ్యః నమః = హద్దుమీరకుండ తప్పనిసరిగ పాపులను హతమార్చు మీకు నమస్కారము. ఆమీవత్కేభ్యః నమః = పాపిష్ఠులు ఇటునటు పారిపోకుండ అన్నివైపులనుండి విజృంభించు మీకు నమస్కారము.

నమో వః కిరికేభ్యః - ఇత్యాదిమంత్రపంచకము, పురశ్చరణ ప్రక్రియలో ఏకమంత్రము. ఋషి-అగ్ని, ఛన్దస్సు-త్రిష్టుప్, దేవత-రుద్రుడు. ధ్యానము - (విశ్వతః పాణిపాదం తం...స్మరేత్) ప్రపంచమును వ్యాపించియున్న హస్తములు, పాదములు,

కన్నులు, శిరస్సులు, ముఖములు గలిగి తేజోరాశియై సమస్తవిశ్వము నావరించి ప్రకాశించుచున్నవానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. పరాకకృచ్ఛ్రానుష్ఠానపూర్వకముగ నలుబదివేల పర్యాయములు జపించిన మంత్రసిద్ధి యగును. సార్వభౌమాధిపత్య... శివసాక్షాత్కారాదిఫలప్రద మీ మంత్రము.

**నవమానువాకము - సమాప్తము**

- 0 -



**ఓన్నమశ్శివాయ**

# దశమోఽనువాకః

మూ. ద్రాపే! అన్ధసస్పతే! దరిద్రన్నీలలోహిత!

ఏషాం పురుషాణామేషాం పశూనాం మా భేర్మాఽరో మో

ఏషాం కిఞ్చనామమత్। 1

**భాష్యమ్ –** ఇత్థం ప్రథమేన ప్రసాద్య, ద్వితీయాదినవమాన్తైరనువాకైః సర్వేశ్వరత్వ – సర్వాత్మకత్వ – సర్వాన్తర్యామిత్వాదిరూపేణ భగవాన్ నమస్కృతః. ఇదానీం దశమేనానువాకేన ప్రార్థయతే – తత్ర ఋగ్రూపా ద్వాదశ మన్త్రాః. తత్రాద్యః – ద్రాప ఇతి. **ద్రా**శబ్దః కుత్సితవాచీ. కుత్సితాం గతిమాపయతీతి ద్రాపిః, అన్ధోఽన్నం, తత్స్వామీ అన్ధసస్పతిః, దరిద్రత్ – నిష్కిఞ్చనః, ఉమార్ధదేహతయా అర్ధం నీలమ్, అర్ధం లోహితమ్ అస్యేతి నీలలోహితః. ఏభిశ్శబ్దైః సంబోధ్యాభయం ప్రార్థయతే – ఏషామితి. ఏషామస్మదీయానాం పురుషాణాం – పుత్రపౌత్రాదీనాం, ఏషాం పశూనాం – గవాశ్వాదీనాం మా భేః – ఏతాన్మాభీషయేత్యర్థః. ఏషాం మధ్యే కిఞ్చన – ఏకమపి వస్తు, మారః – మా గచ్ఛతు, మా వినశ్యత్విత్యర్థః. తథా మో ఆమమత్ – మా వ్యాధిగ్రస్తం భవతు.

అత్ర మా భేః మారః మో ఆమమత్ ఇత్యత్ర ద్రాపే అన్ధసస్పత ఇతి చ హేతుగర్భమిదం సంబోధనద్వయమ్. భయరోగాదిభిః కుత్సితగతిప్రాపకస్య భయాద్యకరణేన తదనుత్పాదనాత్, అన్నస్వామితయా అన్నం దత్వా రక్షితుం శక్యత్వాచ్చ. నీలలోహితేత్యనేన చ ఉమాసహితత్వోక్త్యా నిజదయాశక్త్యలఙ్కృతవిగ్రహస్య అభయారోగ్యాదిదానముచితమితి దర్శితమ్. ఏవం నిగ్రహానుగ్రహౌ కుర్వతో భగవతః న వైషమ్యనైర్ఘృణ్యలేప ఇతి స్వయం నైష్కిఞ్చన్యార్థకేన దరిద్రదిత్యనేన దర్శితమ్.

అస్య మన్త్రస్య పులస్త్య ఋషిః. భైరవరుద్రో దేవతా. ఆస్తారపఙ్క్తిశ్ఛన్దః.

**ఆగుల్ఫాస్పృతకఞ్చుకో డమరుకస్నిగ్ధోల్లసత్కుణ్డలః।**
**శూలీ కుణ్డలితశ్రవాః సుతిలకో మఞ్జుక్వణన్నూపురః॥**

**నిర్లిప్తస్వకదన్తపఙ్క్తికిరణశ్వేతః కపర్దీ హరో।**
**దేవో భైరవవేషభూషితతనుర్ధ్యేయో మృడానీపతిః॥**

సకలభూతభయజ్వరశాన్తిధనలాభభైరవసాక్షాత్కారఫలప్రదో౭ యం మన్త్రః. ఏకదినోపవాస-పూర్వకమయుతజపాన్మన్త్రసిద్ధిః.

**అనువాదము:** ఇట్లు ప్రథమానువాకముచే పరమేశ్వరుని బ్రసన్నుని గావించి, ద్వితీయాది-నవమాన్తానువాకములచే సర్వేశ్వరత్వ - సర్వాత్మకత్వ - సర్వాన్తర్యామిత్వాదిలక్షణములతో నమస్కరించుట జరిగినది. ఇపుడు దశమానువాకముచే పరమేశ్వరుని ప్రార్థించుచున్నాడు - ఇందు **పంద్రెండు ఋఙ్మన్త్రములు** గలవు. వానిలో 'ద్రాపే అన్ధసస్పతే' అనునది - మొదటిది.

(అర్థము) హే ద్రాపే = పావులకు కుత్సితగతిని కలిగించువాడా! అన్ధసస్పతే = ఓ అన్నాధిపతీ! దరిద్రత్ = దరిద్రునివలె చరించువాడా! నీలలోహిత! = అర్ధనారీశ్వరుడగుటచే నలుపు - ఎఱుపు కలిసిన శరీరచ్ఛాయగలవాడా! ఏషామ్ పురుషాణామ్ = ఈ మా పుత్రపౌత్రాదులకును, ఏషామ్ పశూనామ్ = ఈ మా గవాశ్వాదులకును, మా భేః = భయమును కలిగింపకుము. ఏషామ్ = వీనిలో, కించన = ఏ యొకటిగూడ, మా అరః = నశించకుండుగాక. మో ఆమమత్ = (వీనిలో నే యొక్కటియు) వ్యాధిగ్రస్తము కాకుండుగాక.

(వివరణము) పురుష - పశ్వాదులకు, భయ - వినాశ - వ్యాధ్యాదులు లేకుండు గాక యని ప్రార్థించుటలో, ద్రాపే! అన్ధసస్పతే! - అను రెండును హేతుగర్భ సంబోధనములు. భయరోగాదులచే కుత్సితగతిని కలిగించజాలినవాడు గాన, అట్టి గతిని కలిగించకుండుటకును, అన్నపతిగాన అన్నము నొసంగి రక్షించుటకును సమర్థుడని భావము. ఉమాసహితుడను నర్థము నిచ్చు నీలలోహితపదము - సహజదయాశక్తి సమలంకృతమూర్తియగుటచే అభయారోగ్యాదుల నొసంగుట సముచిత మను భావమును సూచించుచున్నది. ఇట్లు నిగ్రహానుగ్రహము లొనర్చుచున్నను అవి ఆ యా జీవుల కర్మప్రయుక్తములేగాని, తనలో వైషమ్యనైర్ఘృణ్యాదు లే మాత్రమును లేవను భావము - నిష్కిఞ్చనత్వార్థకమగు 'దరిద్రత్' పదము తెలుపుచున్నది.

ఈ మంత్రమునకు ఋషి – పులస్త్యుడు. ఛన్దస్సు ఆస్తారపంక్తి. దేవత – భైరవరుద్రుడు. ధ్యానము – (ఆగుల్ఫాస్తృత...మృడానీపతిః) చీలమండలవరకు వ్రేలాడు కంచుకము ధరించి శూలడమరుకహస్తుడై, ముఖమున తిలకము, చెవుల కుండలములు, పాదముల మనోహరముగ ధ్వనించు నూపురములు నొప్పారు నాగభూషణుడై, నిజదంత పంక్తినుండి వెలువడు కాంతికిరణములు ముఖమునకు మిక్కిలి స్వచ్ఛతనాపాదింప భైరవవేషభూషితమైన విగ్రహము గలవానినిగ మృడానీపతిని ధ్యానించవలెను. సకల–భూతభయజ్వరశాన్తి ధనలాభ భైరవసాక్షాత్కారాదిఫలప్రద మీ మంత్రము. ఏకదినోపవాస–పూర్వకముగ పదివేలపర్యాయములు జపించిన మంత్రసిద్ధి యగును.

**మూ.** **యా తే రుద్ర! శివా తనూశ్శివా విశ్వాహభేషజీ।**
**శివా రుద్రస్య భేషజీ తయా నో మృడ జీవసే।** **2**

**భాష్యమ్ –** అథ ద్వితీయః – యా తే రుద్రేతి. హే రుద్ర! తే – తవ, శివా శాన్తా (శివా – శాన్తతరా) యా తనూః అస్తి, తయా తన్వా, నః – అస్మాన్, జీవసే – జీవితుమ్. తుమర్థే ఛన్దసి సేప్రత్యయః. మృడ (య) యథా వయం స్వస్థా జీవేమ తథా సుఖయేత్యర్థః. కథం తన్వా శివత్వమ్? తత్రాహ – విశ్వాహభేషజీతి. విశ్వేషు సర్వేష్వపి అహస్సు, భేషజీ – రోగదారిద్ర్యాదేరౌషధవద్వినాశహేతుః యస్మాదేవం తస్మాత్ శివా. న కేవలమైహిక–సుఖప్రదత్వమాత్రేణ శివత్వమ్, కింతు – మోక్షసుఖప్రదత్వేనాపీత్యాహ – శివా రుద్రస్యేతి. రుద్రస్య – సంసారరోగవైద్యస్య తవ స్వభూతా భేషజీ సంసారరోగహరదివ్యౌషధిరూపా, యస్మాదేవం తస్మాత్ శివా, తయా నో మృడ(య) –

అస్య మన్త్రస్య ఋషిర్దేవతా చ స్కన్దరూపీ రుద్రః.

**ద్రుతచామీకరప్రఖ్యం శక్తిపాణిం షడాననమ్।**
**మయూరవాహనారూఢం స్కన్దరూపం శివం స్మరేత్॥**

అష్టోత్తరశతప్రాణాయామపూర్వకం పఞ్చసహస్రజపాన్మన్త్రసిద్ధిః. ఆభిచారభూతవైకృత–దుస్స్వప్నాద్యుపశాన్తిసుపుత్రపుష్ట్యారోగ్యసంపత్తిప్రదోఽయం మన్త్రః.

**అనువాదము:** హే రుద్ర! = ఓ రుద్రుడా!, తే = నీయొక్క, శివా = శాన్తమైన, యా తనూః (అస్తి) = ఏ స్వరూపము కలదో, విశ్వాహభేషజీ = సమస్త దినములయందును

రోగదారిద్ర్యాదులను ఔషధమువలె నశింపజేయునది గావుననే, శివా = శాన్తమైనట్టియు. (ఇంతేకాక) రుద్రస్య = సంసారరోగవైద్యుడవగు నీకు స్వరూపభూతమై, భేషజీ = సంసార రోగమును హరించు దివ్యౌషధిరూపమైనది గావుననే, శివా = శాన్తమైనట్టియు, తయా = ఆ స్వరూపముతో, నః = మమ్ము, జీవసే = స్వాస్థ్యము గలిగి జీవించుటకు, మృడ(య) = సుఖింపజేయుము.

(వివరణము) ఈ మంత్రములో మూడు 'శివా' శబ్దము లున్నవి. వానిలో మొదటిది – తనువునకు సాక్షాద్విశేషణమై 'తస్యైతే తనువౌ ఘోరాన్యా శివాన్యా' ఇత్యాది శ్రుతిస్మృతిప్రసిద్ధమైన శివతనువును బోధించును. శేషించిన రెండు శివా శబ్దములును పూర్వోక్తమగు శివత్వమునకు ఉపపాదకములు. వానిలో మొదటిది – రోగదారిద్ర్యాదులను హరించి ఐహికసుఖము నిచ్చునదిగాన శివస్వరూపమని చెప్పగా, రెండవది – సంసార రోగహరమై నిశ్శ్రేయసప్రదముగాన, శివస్వరూపమని చెప్పుచున్నది.

ఈ మంత్రమునకు ఋషియు, దేవతయు స్కన్దస్వరూపియగు రుద్రుడు. (ద్రుతచామీకరప్రఖ్యం...స్కన్దరూపం శివం స్మరేత్) కఱిగిన బంగారమువంటి శరీరఛాయ గలిగి, చేత శక్త్యాయుధమును ధరించి మయూర వాహనారూఢుడై ఆరుముఖములతో స్కన్దరూపమును ధరించియున్న వానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. అష్టోత్తరశత–ప్రాణాయామపూర్వకముగ ఐదువేల పర్యాయములు జపించిన మంత్రసిద్ధియగును. ఈ మంత్రము – అభిచారము, భూతవికారము, దుఃస్వప్నము మున్నగువానిని నశింపజేయును. మఱియు, సుపుత్ర – పుష్టి – ఆరోగ్య – సంపదల నిచ్చును.

**మూ. ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే**
**మతిమ్। యథా నశ్శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం**
**గ్రామే అస్మిన్ననాతురమ్. 3**

**భాష్యమ్ –** అథ తృతీయః – ఇమాం రుద్రాయేతి. తపసే – తపోబలవతే, మత్వర్థీయలోపః. కపర్దినే జటాజూటవతే, క్షయన్తః – క్షీయమాణా వీరాః ప్రతిపక్షా యస్య, తస్మై క్షయద్వీరాయ

రుద్రాయ ఇమాం మతిం – బుద్ధిమ్, ప్రభరామహే – ప్రకర్షేణ నైరన్తర్యరూపేణ ధారయామః, కుర్మ ఇతి యావత్. కీదృశీ మతిరిత్యపేక్షాయామాహ – యథేతి. యథా యేన ప్రకారేణ కృతయా మత్యా, నః – అస్మాకం సంబంధినే ద్విపదే పుత్రపౌత్రాదయే, చతుష్పదే – గవాశ్వాదయే చ శం – సుఖమ్, అసత్ – స్యాత్, అస్తేః పఞ్చమో లకారః, 'లేటోఽడాటౌ' ఇత్యడాగమః, న కేవలం అస్మదీయానామేవ సుఖమ్, కిం తు అస్మిన్ గ్రామే స్థితం విశ్వం – సర్వమపి ప్రాణిజాతం యథా పుష్టమ్ అనాతురం చ స్యాత్, తథా మతిం ప్రభరామహే – ఇతి యోజనా. **'రుద్రాధ్యాయీ వసేద్యత్ర గ్రామే వా నగరేఽపి వా, వ్యాధిదుర్భిక్షచోరాదిబాధా తత్ర న జాయతే'** ఇతి పురాణవచనమిహానుసన్ధేయమ్. అత్ర ఉత్తరార్ధగతసుఖప్రదత్వే హేతుగర్భాణి రుద్రాయేత్యాదీని చత్వారి పదాని. తత్ర రుద్రాయేత్యనేన దుఃఖద్రావకత్వముక్తమ్. తపస ఇత్యనేన జ్ఞానశక్తిః. **'యస్య జ్ఞానమయం తపః'** ఇతి శ్రుతేః. కపర్దిన ఇత్యనేన తు అనన్యసాధ్యకార్యనిర్వాహకత్వమ్. కం – గఙ్గాజలం పర్దయతి – పాలయతీతి కపర్దః – జటాజూటః, తద్వాన్ కపర్దీతి శబ్దార్థపర్యాలోచనయా అనన్యసాధ్యగఙ్గాధారకత్వప్రతీతేః. **'గఙ్గాయాః పతనం రాజన్పృథివీ న సహిష్యతి, తాం వై ధారయితుం శక్తం నాన్యం పశ్యామి శూలినః'.** ఇతి రామాయణాదివచనైర్గఙ్గాధారణస్యానన్యసాధ్యత్వావగమాత్. క్షయద్వీరాయేత్యనేన వీర్యశక్తిః. ఏతాదృశస్య తద్యుక్తమిత్యభిప్రాయః.

**అనువాదము:** (అర్థము) యథా = ఏ ప్రకారముగా (బుద్ధిని నిలుపుటచేత), నః = మాయొక్క, ద్విపదే = పుత్రపౌత్రాదులకును, చతుష్పదే = గవాశ్వాదులకును, శమ్ = సుఖము, అసత్ = కలుగునో, మరియు, అస్మిన్ గ్రామే = ఈ గ్రామమునందు, విశ్వమ్ = సమస్త ప్రాణిజాతము, పుష్టమ్ = పుష్టిగలదియు, అనాతురమ్ = ఆరోగ్యవంతమైనదియు అగునో (తథా = ఆ ప్రకారముగా), తవసే = తపోబలసంపన్నుడైనట్టియు, కపర్దినే = జటాజూటధారియైనట్టియు, క్షయద్వీరాయ = శత్రుక్షయకరుడైనట్టియు, రుద్రాయ = రుద్రునికొఱకు, ఇమాం మతిమ్ = పూజాధ్యానాది విషయకమైన ఈ మా బుద్ధిని, ప్రభరామహే = అవిచ్ఛిన్నముగ ధరించుచున్నాము.

(వివరణము) **'తపసే' అనుచో వర్ణవ్యత్యయానుశాసనము ననుసరించి వకారస్థానమున పకారము గ్రాహ్యము.** మరియు మత్వర్థీయమునకు లోపము. 'అసత్' అనునది 'అస భువి' అను ధాతువుయొక్క పంచమ లకార (లేట్) రూపము. అద్దానికి 'లేటోఽడాటౌ' అను సూత్రముచే అడాగమము. శ్రీరుద్రజపధ్యానాదుల నాచరించువానికే

కాక, అతడు నివసించు గ్రామమునకు గూడ వ్యాధిదుర్భిక్షచోరాదిబాధలు కలుగవనుటలో – 'రుద్రాధ్యాయీ వసేద్యత్ర' అను పురాణవచనము ప్రమాణము. ఈ మంత్రముయొక్క ఉత్తరార్ధములో ప్రార్థించినవిధముగ సుఖము నిచ్చు సామర్థ్యము పరమేశ్వరునకు గలదని తెలుపుటలో – రుద్రాయ, తవసే, కపర్దినే, క్షయద్వీరాయ అను నాల్గుపదములును హేతుగర్భవిశేషణములు. అందు రుద్రపదము – దుఃఖమును దూరీకరించువాడను నర్థమును బోధించు నను విషయము పూర్వోక్తమే. 'తవసే' అనునది 'యస్య జ్ఞానమయం తపః' అను శ్రుతిననుసరించి జ్ఞానశక్తిని ఆవిష్కరించుచున్నది. 'కపర్దినే' అనునది – కం – గంగాజలం పర్దయతి పాలయతీతి కపర్దః – జటాజూటః, తద్వాన్ కపర్దీ' అను వ్యుత్పత్తిని బట్టి ప్రచండవేగముతో దివినుండి భువికి దిగివచ్చుచున్న గంగాప్రవాహమును నిజజటామండలమున నిలుపుట యను అనన్యసాధ్యమగు కార్యమును సాధించిన వాడను నర్థమును సూచించుచున్నది. 'గంగాయాః పతనం రాజన్... నాన్యం పశ్యామి శూలినః' ఈ విధములైన రామాయణాది వచనములు 'సర్వంసహా'గా పేరొందిన పృథివిగూడ సహింపజాలని గంగాప్రవాహపతనవేగమును సహింపజాలినవా డీశ్వరుడే గాని, తదితరు డెవ్వడు గాడని వివరించుచున్నది. **'క్షయద్వీరాయ'** అను విశేషణము వీర్యశక్తిద్యోతకము. ఇట్టివాడు గావుననే భక్తులు ప్రార్థించినట్లు సుఖము నీయగలడని భావము.

**మూ. మృడా నో రుద్రోత నో మయస్కృధి క్షయద్వీరాయ నమసా విధేమ తే. యచ్ఛం చ యోశ్చ మనురాయజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ. 4**

**భాష్యమ్** – అథ చతుర్థః – మృడా నో రుద్రేతి. హే రుద్ర! నః – అస్మాన్ మృడ – ఇష్టార్థదానేన సుఖయ. ఉత – అపి చ, నః – అస్మాకమ్, మయః – మోక్షసుఖమ్ కృధి– కురు. నను పాపిష్ఠాయ తుభ్యం కథం మోక్షసుఖం దేయమ్? అత ఆహ – క్షయద్వీరాయేతి. క్షపితాత్మదీయపాపాయ తే – తుభ్యమ్, నమసా – నమస్కారేణ, విధేమ, త్వాం పరిచరామేత్యర్థః. తుభ్యం నమస్కారక్షపితపాపస్య మే నిర్వివాద ఏవ మోక్షాధికారః, **'ఏతైర్హ వా అమృతో భవతి'** ఇతి శ్రుతేరితి భావః. అయం చ త్వత్ప్రసాదేన సంపాద్యః

భోగాపవర్గరూపార్థః నేదానీన్తనప్రాప్తః, కిం తు పరంపరాప్రాప్త ఇత్యాహ – యచ్ఛం చేతి. నః పితా మనుః, యేనాస్మాకం మనుజా ఇతి ప్రసిద్ధిః, యేన చ వర్ణాశ్రమధర్మోపదేశేన ప్రజాః పాలితాః, తాదృశః శ్రుత్యాదిప్రసిద్ధమహిమా మనుః తవ ప్రణీతౌ – ప్రణయే ప్రసాదే సతి, యచ్ఛం చ – విషయభోగం చ, యోశ్చ – దుఃఖపృథగ్భావేన మోక్షం చేతి యావత్. ఆయజే – సంపాదితవాన్ తత్సర్వం వయం హే రుద్ర! తవ ప్రణీతౌ అశ్యామ అశీమహి, త్వత్ప్రసాదాత్ప్రాప్నుయామేత్యర్థః. అత్ర చ – **'ఇమాం రుద్రాయ' 'మృడా నో రుద్ర'** ఇతి ఋగ్ద్వయమేకో మన్త్రః. అస్య మన్త్రస్య మార్కణ్డేయ ఋషిః, జగతీచ్ఛన్దః, రుద్రో దేవతా.

**దివ్యసింహాసనాసీనం స్తూయమానం మహర్షిభిః।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్సోమం సోమార్ధశేఖరమ్॥**

ఏకకృచ్ఛ్రానుష్ఠానపూర్వకం నవసహస్రజపాత్పురశ్చరణసిద్ధిః. గోతిర్యగాదిశాన్తిఫలప్రదో౽యం మన్త్రః.

**అనువాదము:** (అర్థము) హే రుద్ర! = ఓ రుద్రుడా!, నః = మమ్ము, మృడ = అభీష్టముల నిచ్చి ఆనందింపజేయుము. నః = మాకు, మయః = మోక్ష సుఖమును, కృధి = కలుగజేయుము, క్షయద్వీరాయ = మా పాపములను నశింపజేయునట్టి, తే = నీ కొఱకు, నమసా = నమస్కారముతో, విధేమ = పరిచర్యగావింతుము. నః = మాకు, పితా = తండ్రియగు, మనుః = మనువు, తవ = నీయొక్క ప్రణీతౌ = ప్రణయము (అనుగ్రహము) కలుగుచుండగా, యత్ = ఏ, శం చ = సుఖభోగమును, యోః చ = దుఃఖవియోగమును అనగా – మోక్షమును, ఆయజే = పొందెనో, తత్ = ఆ సమస్తమును, హే రుద్ర! = పరమేశ్వరా! అశ్యామ = నీ యనుగ్రహముచే మేమును పొందుదుముగాక.

(వివరణము) 'మృడా నో రుద్ర' ఇత్యాదిగా ఐహికసుఖమే కాక ఆముష్మిక (మోక్ష) సుఖము గూడ ప్రార్థింపబడినది. పాపాత్ముడవగు నీకు మోక్ష సుఖ మెట్లు లభ్యమగునను శంకకు సమాధానముగా 'క్షయద్వీరాయ' అని చెప్పబడినది. పరమేశ్వర నమస్కారాదులచే పాపమంతయు క్షయించుటవలన నాకు మోక్షాధికారము కలదను విషయము నిర్వివాదమని – భావము. 'ఏతైర్వా వా అమృతో భవతి' అను శ్రుతి ఇందుకు ఉపోద్బలకము. ఇట్లు భగవత్ప్రసాదము ద్వారా భోగాపవర్గములను సంపాదించుట ఈనాటి క్రొత్తమార్గము కాదనియు, పరంపరాప్రాప్తమనియు మానవులకు మూలపురుష

డైనట్టియు, వర్ణాశ్రమ ధర్మోపదేశపూర్వకముగ ప్రజలను పరిపాలించినట్టియు, శ్రుతిప్రసిద్ధమైన మహిమ గలిగినట్టియు మనువును నిదర్శనముగా జేసి నిరూపింపబడినది.

**'ఇమాం రుద్రాయ' 'మృడానో రుద్ర'** అను రెండు ఋక్కులును ఒకే మంత్రము. దీనికి ఋషి - మార్కండేయుడు. ఛన్దస్సు - జగతి. దేవత - రుద్రుడు. ధ్యానము - (దివ్యసింహాసనాసీనం...సోమార్ధశేఖరమ్) చంద్రకళను శిరోభూషణముగ ధరించి మహర్షులు స్తోత్రములు చేయుచుండగా ప్రసన్నవదనుడై పార్వతితో సహ దివ్యసింహాస నాసీనుడై యున్నవానినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఒక కృచ్ఛ్రము ననుష్ఠించి తొమ్మిదివేలు జపించిన పురశ్చరణసిద్ధి యగును. గోవులు మున్నగు తిర్యగ్జంతువులకు గలుగు ఉపద్రవములను శమింపజేయు మంత్రమిది.

**మూ. మా నో మహాన్తముత మా నో అర్భకం మా న ఉక్షన్తముత మా న ఉక్షితమ్। మా నోఽవధీః పితరం మోత మాతరం ప్రియా మా నస్తనువో రుద్ర! రీరిషః। 5**

**భాష్యమ్** - అథ పఞ్చమః - మా నో మహాన్తమితి. హే రుద్ర! నః - అస్మాకం సంబంధినం స్థవిరం స్థవిరపురుషమ్, మా రీరిషః - రోగాదిభిర్మా హింసీః. ఉత- అపి చ - నః అర్భకం - బాలం - మా రీరిష ఇతి సర్వత్రాన్వయః. ఉత నః సంబంధినమ్ ఉక్షన్తం - సేచనసమర్థం పుత్త్రమ్. ఉత నః ఉక్షితం - గర్భస్థం పుత్త్రమ్. నః పితరం మాతరమపి మావధీః. నః ప్రియాః తనువః - శరీరాణి చ మా రీరిషః. ఆదరాతి- శయాత్ప్రతిపర్యాయం నిషేధార్థకమాశబ్దః. స్వకీయజనాపేక్షయా న ఇతి బహువచనమ్. తథా చ మమ మదీయానాం జనానాం మహాన్తమర్భకాదీంశ్చ మా రీరిష ఇత్యర్థః. అస్య మన్త్రస్య భృగుర్ఋషిః. నన్దీశ్వరాత్మకో రుద్రో దేవతా. జగతీచ్ఛన్దః.

**బాలేన్దుమకుటం దేవం తరుణాదిత్యవిగ్రహమ్।**
**ధ్యాయేన్నన్దీశ్వరాకారం గణేశ్వరసమావృతమ్॥**

శాన్తిప్రధానోఽయం మన్త్రః. ఉపవాసత్రయపూర్వకం పఞ్చసహస్రజపాన్మన్త్రసిద్ధిః.

**అనువాదము:** (అర్థము) హే రుద్ర! = ఓ రుద్రుడా!, నః = మాకు సంబంధించిన, మహాన్తమ్ = వయోవృద్ధిని, మా రీరిషః = రోగాదులచే హింసింపకుము. ఉత = మరియు, నః = మాయొక్క, అర్భకమ్ = పిల్లవానిని, మా రీరిషః = హింసింపకుము. ఉత = మరియు, నః = మాయొక్క, పితరమ్ = తండ్రిని, మా వధీః = వధింపకుము. ఉత = మరియు, నః = మాయొక్క, మాతరమ్ = తల్లిని, మా వధీః = వధింపకుము. ఉత = మరియు, నః = మాయొక్క, ప్రియాః = ప్రేమాస్పదములగు, తనువః = శరీరములను, మా రీరిషః = హింసింపకుము.

(వివరణము) ఒక్కొక్క పర్యాయము గూడ నిషేధార్థకమగు మా శబ్ద ప్రయోగము – ఆదరాతిశయద్యోతకము. తననే కాక, తనవారిని గూడ దృష్టిలో నుంచుకొని 'నః (మాయొక్క)' అను బహువచనాన్తపదము ప్రయుక్తమైనది. కాగా – నన్ను, నా వారిని ఎవ్వరిని గూడ హింసింపకు మని యభిప్రాయము.

ఈ మంత్రమునకు ఋషి – భృగువు. దేవత – నన్దీశ్వరాత్మకుడగు శ్రీరుద్రుడు. ఛన్దస్సు – జగతి. ధ్యానము – (బాలేన్దుమకుటం...సమావృతమ్) బాలచంద్రుని కిరీటమున నలంకరించుకొని తరుణాదిత్యునిబోలిన (బంగారు) శరీరచ్ఛాయ గలిగి గణేశ్వర సమావృతుడై నన్దీశ్వరాకృతిని ధరించియున్నవానిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మన్త్రము శాన్తికర్మోపయుక్తము. మూడు రోజు లుపవసించి జపించిన మంత్రసిద్ధి యగును.

**మూ. మా నస్తోకే తనయే మా న ఆయుషి మా నో గోషు మా నో**
**అశ్వేషు రీరిషః। వీరాన్మా నో రుద్ర భామితో వధీర్హవిష్మన్తో**
**నమసా విధేమ తే। 6**

**భాష్యమ్ –** అథ షష్ఠః – మా నస్తోక ఇతి. హే రుద్ర! భామితః – విహితాకరణేన జాతక్రోధః త్వమ్, నః – అస్మాకమ్, తోకే – అపత్యమాత్రే తనయే – పుంప్రజాయాం చ విషయే మా రీరిషః – హింసాం మా కృథాః. ఏవం మా నః ఆయుషి మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః. అథ నః అస్మాకమ్, వీరాన్ భృత్యాన్, మావధీః. కథం అపచారిణి త్వయి న హింసితృత్వమ్? తత్రాహ – హవిష్మన్త ఇతి. హవిః చరుపురోడాశాదికం

భక్త్యుపహారరూపం వా. **'స్వల్పం వా పరిపూర్ణస్య మమ కిం క్రియతే నరైః । కిం తు సర్వాత్మనా దేవి మయా భావో హి గృహ్యతే',** ఇతి భగవదుక్తేః. 'తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః' ఇతి గీతోక్తేశ్చ. తాదృశహవిర్యుక్తాః. తే – తుభ్యమ్, నమసా – నమస్కారేణ విధేమ – పరిచరేమ. **'ప్రణిపాతప్రతీకారః సంరంభో హి మహాత్మనామ్'** ఇతి న్యాయాత్పాపిష్ఠోఽప్యహం దయనీయ ఇతి భావః.

అస్య మన్త్రస్య ఋషిర్దేవతా చ భగవానేవ. జగతీచ్ఛన్దః.

**దధానమేకాదశధా విభజ్య దేహం విశుద్ధస్ఫటికప్రకాశమ్।**
**తేజోమయం శూలినమిన్దుమౌలిం విచిన్తయేదత్ర సదైవ రుద్రమ్॥**

ఆయుష్యవృద్ధిః, రాజ్యవృద్ధిః, సువృష్టిః, ద్యూతే వ్యవహారే చాపరాజయః, సువర్ణసహస్రలాభః, మహాపాతకనివృత్తిః, వశ్యసిద్ధిః, సర్వజనజయ ఇత్యాదీన్యస్య మన్త్రస్య ఫలాన్యర్ణవాదిషు ప్రపఞ్చితాని. మన్త్రసిద్ధిప్రకారోఽపి తత్రైవ ద్రష్టవ్యః.

**అనువాదము:** (అర్థము) హే రుద్ర! = ఓ రుద్రుడా!; భామితః = శాస్త్రవిహిత కర్మానుష్ఠానము జేయనికారణమున మాపై కోపించినవాడవై, నః = మాయొక్క, తోకే = సంతాన విషయమున, తనయే = విశేషించి పురుషసంతానవిషయమున, మా రీరిషః = హింస నొనర్పకుము, నః = మాయొక్క, ఆయుషి = ఆయుర్దాయము విషయమున, మా రీరిషః = హింస నొనర్పకుము, నః = మాయొక్క, గోషు = ఆవులవిషయమున, మా రీరిషః = హింసనొనర్పకుము, నః = మాయొక్క, అశ్వేషు = గుఱ్ఱములవిషయమున, మా రీరిషః = హింసనొనర్పకుము, నః = మాయొక్క; వీరాన్ = భృత్యులను, మా వధీః = వధింపకుము, తే = నీకొఱకు, హవిష్మన్తః = చరుపురోడాశాదిరూపమైన – అథవా – భక్త్యుపహారాది రూపమైన హవిస్సుగలవారమై, నమసా = నమస్కారము (నమ్రభావము)తో విధేమ = పరిచర్య గావింతుము.

(వివరణము) ఈశ్వరాజ్ఞారూపమగు శాస్త్రము నుల్లంఘించి అపచార మొనర్చినవానిని శిక్షింపక విడచుట న్యాయమా? అను శంకకు సమాధానముగా 'హవిష్మన్తో నమసా విధేమ తే' అని చెప్పబడినది. అనగా – ఇతఃపూర్వము శిక్షార్హుడే యైనను, ఇపుడు పశ్చాత్తప్తుడై భగవత్సేవాతత్పరుడై యున్న కారణమున శిక్షార్హుడు కాజాలడని భావము. కొండంతదేవునకు కొండంత పత్రి తేగలమా? అన్నట్లు అల్పమైన యీ హవిస్సు ఆ మహాదేవున కెట్లు తృప్తిని కల్గించునను శంకకు సమాధానముగా –

**'స్వల్పం వా పరిపూర్ణస్య...భావో హి గృహ్యతే'** అను భగవదుక్తియు, 'తదహం భక్త్యుపహృత–మశ్నామి ప్రయతాత్మనః' అని గీతోక్తియు ఉదాహరింపబడినది. **భగవానుడు భావప్రధానుడే గాని, బాహ్యోపచారప్రధానుడు కాడని భావము.** మరియు, 'ప్రణిపాతప్రతీకారస్సరంభో హి మహాత్మనామ్' అను న్యాయము ననుసరించి నేను పాపినే యైనను ప్రణతుడను గాన స్వామిదయకు పాత్రుడనగుదు నను అభిప్రాయమును, 'నమ' శ్శబ్దము సూచించు చున్నది.

ఈ మంత్రమునకు ఋషియు దేవతయు భగవానుడే. ఛన్దస్సు – జగతీ, ధ్యానము – (దధానమేకాదశధా...స్ఫటికప్రకాశమ్) పరిశుద్ధమైన స్ఫటికమువలె భాసించుచున్న తేజోమయమగు తన దేహమును పదునొకండు (రుద్ర) మూర్తులుగా విభజించి, శూలమును ధరించి చంద్రశేఖరుడై యున్నవానినిగా శ్రీరుద్రుని ధ్యానించ వలెను. ఆయుర్వృద్ధి, రాజ్యవృద్ధి, సువృష్టి, జూదములో – వ్యవహారములో పరాజయము లేకుండుట, సువర్ణసహస్రలాభము, మహాపాపనివృత్తి, సర్వజనవశీకరణము, ఇత్యాది ఫలము లనేకములు అర్ణవాది గ్రంథములలో వివరింపబడినవి. మంత్రసిద్ధిప్రకారము సైత మందే కాననగును.

**మూ. ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే క్షయద్వీరాయ సుమ్నమస్మే**
**తే అస్తు। రక్షా చ నో అధి చ దేవ బ్రూహ్యధా చ నశ్శర్మ**
**యచ్ఛ ద్విబర్హాః॥ 7**

**భాష్యమ్ –** అథ సప్తమః – ఆరాత్త ఇతి. హే దేవ! గోఘ్నే – గోఘ్నస్య ఉత – అపి చ, పూరుషఘ్నే – పూరుషఘ్నస్య, షష్ఠ్యర్థే చతుర్థ్యౌ. సకలప్రాణిసంహారిణ ఇత్యర్థః. న చాస్య సర్వలోకసంహారిణః కశ్చిదవిషయోఽస్తీత్యాహ – క్షయద్వీరాయేతి. దేవాసురమనుష్యేషు అపరిమితబలపరాక్రమశాలినో యే వీరాః తే సర్వేఽప్యేనం ప్రాప్య క్షయం గచ్ఛన్తీతి క్షయద్వీరః, తస్మై క్షయద్వీరాయ, క్షయద్వీరస్యేత్యర్థః. **'యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః, మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః'** ఇతి శ్రుతేః. ఏతాదృశస్య

తే – తవ యత్ సుమ్నమ్ అఘోరం శివరూపమస్తి, తద్రూపమ్. అస్మై – అస్మాకమ్ ఆరాత్ – సమీపే అస్తు, ఘోరం తు రూపం దూరత ఏవాస్త్వితి త్యర్థాదుక్తం భవతి. **'ఆరాద్దూరసమీపయోః'** ఇతి నిఘణ్టుః. ఏతదుక్తం భవతి – ప్రసన్నరూపేణ సన్నిహితో భవేత్యర్థః. సన్నిధాయ చ నః – అస్మాన్ రక్ష – సర్వస్మాద్దురితాదస్మాన్ పరిపాలయ. తత్ర కథం పాపిష్ఠః పరిపాల్య ఇతి దేవాశ్చేత్పృచ్ఛేయుః, తదానీమ్ అధిబ్రూహి – పక్షపాత–వచనం కురు. న కేవలమనిష్టనివృత్తిమాత్రరూపలక్షణమ్. అథాపి చ హే ద్విబర్హాః – ద్వయోః మోక్షసుఖయోః బర్హయితః – వర్ధక! నః – అస్మాకం, శర్మ – మోక్షసుఖం చ ప్రయచ్ఛ. అస్య మన్త్రస్య శంభుర్దేవతా. త్రిష్టుప్ఛన్దః.

**కుర్వాణం సన్నిధౌ దేవ్యా దేవమానన్దతాణ్డవమ్।**
**హుతాశనయనం ధ్యాయేత్తప్తకాఞ్చనసన్నిభమ్॥**

ఆయురైశ్వర్యప్రదోఽయం మన్త్రః. త్రిరాత్రోపవాసపూర్వకం త్రిరాత్రం నిరన్తరజపాన్మన్త్ర–సిద్ధిః.

**అనువాదము:** (అర్థము) హే దేవ! = స్వయంప్రకాశమానుడవగు ఓ రుద్రుడా!, గోఘ్నే = గోవులను హింసిచునట్టియు, ఉత = మరియు, పూరుషఘ్నే = పురుష(మనుష్యు)లను హింసించునట్టియు, క్షయద్వీరాయ = అధికబలశాలులను గూడ హతమార్చునట్టియు, తే = నీయొక్క, సుమ్నమ్ = అభయంకరమగు శివస్వరూపము, అస్మే = మాకు, ఆరాత్ = సమీపమున, అస్తు = ఉండుగాక, అథ = అటుపిమ్మట, నః = మమ్ము, రక్ష = సమస్త పాపములనుండి కాపాడుము. అధిబ్రూహి చ = 'వీడు నా వాడు' అని స్పష్టముగ చెప్పుము. హే ద్విబర్హాః = అభ్యుదయనిశ్రేయసముల రెండింటిని విస్తరింపజేయువాడా!, నః = మాకు, శర్మ చ = మోక్షసుఖమును గూడ, యచ్ఛ = అనుగ్రహింపుము.

(వివరణము) గోఘ్నే – పూరుషఘ్నే – క్షయద్వీరాయ అను మూడు పదములను షష్ఠ్యర్థమున గ్రహించవలెను. ప్రళయకాలమున ఘోరతనువును పరిగ్రహించి సర్వమును సంహరించువానికి దేవమనుష్యపశుపక్ష్యాదులలో గోచరముకాని బలవత్తరమైన పదార్థ మేదియు లేదని భావము. 'యస్య చ బ్రహ్మ చ క్షత్రం చ...' అను కఠశ్రుతి – లోకవిధారకములుగా ప్రసిద్ధములైన బ్రహ్మక్షత్రజాతులు పరమేశ్వరునకు అన్నస్థానీయములు కాగా, మృత్యువు అతనికి కూర – పచ్చడి వంటి నంజుకొను పదార్థమని తెలుపుచున్నది. మృత్యువుకు గూడ మృత్యువని భావము. 'అట్టి ఘోరరూపము

మాకు దూరముగనే యుండుగాక' అను అర్థమును 'సుమ్నమస్మే తే అస్తు' అను వాక్యము సూచించుచున్నది. కేవలము అనిష్టపరిహారము మాత్రమే కాదు; మోక్షసుఖము గూడ మా కభీష్టమను విషయమును 'నశ్శర్మ యచ్ఛ ద్విబర్హాః' అను వచనము వ్యక్తము గావించుచున్నది.

ఈ మంత్రమునకు ఋషి – అత్రి, దేవత – శంభువు, ఛన్దస్సు – త్రిష్టుప్, ధ్యానము – (కుర్వాణం సన్నిధౌ...తప్తకాఞ్చనసన్నిభమ్) కఠిగిన బంగారమును బోలు శరీరచ్ఛాయ గలిగి, లలాటమున అగ్నినేత్రము రాజిల్ల దేవీ (పార్వతీ) సన్నిధానమున ఆనన్దతాణ్డవ మొనర్చుచున్నవానినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఆయుష్యమును ఐశ్వర్యమును ఇచ్చు మంత్ర మిది. మూడు నాళ్లుపవసించి, మూడు నాళ్లు నిరన్తరముగ జపించిన మంత్రసిద్ధి యగును.

**మూ. స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగన్న**
**భీమముపహత్నుముగ్రమ్। మృడా జరిత్రే రుద్ర స్తవానో అన్యం**
**తే అస్మన్నివపన్తు సేనాః। 8**

**భాష్యమ్** – అథాష్టమః – స్తుహీతి. అత్ర స్వాత్మైవ సంబోధ్యతే, హే ఆత్మన్! భగవన్తం స్తుహి. యద్వా హే వచః! స్తుహి ఇతి. తత్ర స్తుతిహేతుభూతం పారమ్యం దర్శయతి – శ్రుతిమితి. పరమేశ్వరత్వేన సర్వలోకప్రసిద్ధమిత్యర్థః. న చైతాదృశే కథం మదీయస్తోత్ర–ముపస్థాస్యత ఇతి శంక్యమ్; యతః గర్తసదం – గర్తే హృదయకుహరే సీదతీతి గర్తనదమ్, **'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి'** ఇతి స్మృతేః. న కేవలం పారమ్యమాత్రేణ స్తోతవ్యతా, కిం తు దివ్యమఙ్గలవిగ్రహతయాత్యద్భుతత్వేనాపీత్యాహ – యువానమితి. నిత్యతారుణ్యసున్దరమిత్యర్థః. ఏవం విహితస్య స్తోత్రస్య కరణాకరణయోరిష్టానిష్టప్రాప్తిం దర్శయన్ప్రథమమకరణేఽనిష్టమాహ – ఉపహత్నుమితి. వర్ణాశ్రమధర్మాననుష్ఠానేన నిజాజ్ఞాతిలఙ్ఘినామభక్తానాముపహత్నుం – ఉపసంహర్తారమిత్యర్థః. అత్ర దృష్టాన్తమాహ – మృగం న భీమమితి. ఉపమానార్థో నకారః. మృగమివ భీమమ్. గజవిదారణాయో–ద్యతసింహవదతిభయంకరమిత్యర్థః. మృగం నేతి దృష్టాన్తగ్రహణాన్మృగశబ్దవాచ్యస్య

సింహస్య స్వాపేక్షయాఽధికబలేన శరభేణేవ భగవతోఽపి స్వాపేక్షయాఽధికబలేన కేనచిదభిభవే తస్యైవ స్తోతవ్యతా స్యాదితి శఙ్కాపిశాచికోచ్చాటనాయోక్తమ్ – ఉగ్రమితి. కేనాప్యనభిభవనీయమిత్యర్థః. **'పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ'** ఇతి, **'న వా ఓజీయో రుద్ర త్వదస్తి' 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్'** ఇత్యాది శ్రుతిశతప్రసిద్ధే, నిస్సమాభ్యధికమహాబలోన్నతే, సకలలోకేశ్వరేశ్వరే కుతోఽభిభవశఙ్కేతి భావః. ఏవం స్తోత్రాకరణే అనిష్టముక్త్వా, కరణేఽపీష్టం దర్శయన్భవన్తం ప్రార్థయతే – మృడేతి. హే రుద్ర! స్తవానః స్తూయమానః త్వమ్, జరిత్రే – జరణశీలే అస్మిఞ్ఛరీరే స్థితానస్మాన్ మృడ – మృడయ. యథాహమ్ ఆపురుషాయుషమరోగదృఢగాత్రః స్యామ్, యథా చ తదనన్తరమజరామరణో ముక్తః, **'నమో రుద్రేభ్యః'** ఇత్యగ్రే వక్ష్యమాణాః, **'త్రిగ్ంశత్త్రయశ్చ గణినో రుజన్తః'** ఇత్యాదిషు ప్రసిద్ధాః, తాః సేనాః అస్మత్ – అస్మత్తః, అన్యమ్ – అస్మద్వైరిణం పాపం నివపన్తు – నాశయన్తు. అస్య మన్త్రస్య వైయాఘ్ర ఋషిః. త్రిష్టుప్ఛన్దః. శ్రీరుద్రో దేవతా.

**ఉద్యద్భాస్కరకోటిప్రకాశమాకాశగం భీమమ్।**
**భీతిఘ్నమభయవరదం ధ్యాయేద్రుద్రం సురౌఘనుతమ్॥**

ఏకరాత్రోపవాసపూర్వకం త్రిరాత్రసతతజపాత్పురశ్చరణసిద్ధిః. శత్రునాశనప్రదోఽయం మన్త్రః.

**అనువాదము:** తనకు దానే సంబోధించుకొని – అథవా – తన వాగింద్రియమును సంబోధించి యిట్లు ప్రార్థించుచున్నాడు –

(అర్థము) హే ఆత్మన్! = ఓ నా స్వరూపమా!, లేక – హే వచః = ఓ వాగింద్రియమా, శ్రుతమ్ = పరమేశ్వరుడుగా సర్వలోకప్రసిద్ధుడైనట్టియు, గర్తసదమ్ = హృదయగుహలో నివసించుచున్నట్టియు, యువానమ్ = నిత్యతారుణ్యసుందరుడైనట్టియు, భీమం మృగం న = భయంకరమైన సింహము వలె, ఉపహత్నుమ్ = నిజాజ్ఞారూపములైన శ్రుతిస్మృతుల నుల్లంఘించువారిని సంహరించునట్టియు, ఉగ్రమ్ = ఎదిరించశక్యము గానట్టియు భగవానుని, స్తుహి = స్తోత్రము చేయుము. హే రుద్ర! = ఓ రుద్రుడా!, స్తవానః = స్తుతింపబడుచున్న నీవు, జరిత్రే = జీర్ణించుస్వభావముగల ఈ శరీరములో నున్న మమ్ము, మృడ = సుఖింపజేయుము, తే = నీయొక్క, సేనాః = సేనలు, అస్మత్ అన్యమ్ = మమ్ము విడచి మా వైరిని, నివపన్తు = నశింపజేయుగాక.

(వివరణము) ఇందు అంతరాత్మనుగాని, వాక్కునుగాని సంబోధించి, భగవానుని స్తుతింపు మని చెప్పబడుచున్నది. స్తుతించుటకు తగిన వైశిష్ట్యమును శ్రుతపదము సూచించుచున్నది. సర్వలోకప్రసిద్ధుడని యా పదమున కర్థము. అంతటి గొప్పవాని విషయమున అల్పుడనగు నా స్తుతి యెట్లు కార్యకారి కాలదని శంకించవలసిన యవసరము లేదు, 'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' ఇత్యాదివచనముల ననుసరించి యాతడు నీ హృదయమునందే సన్నిహితుడై యున్నాడుగాన భక్తసులభు డను భావమును 'గర్తసదమ్' అను పదము విశదీకరించుచున్నది. ఇంతేకాక, అత్యద్భుతమగు దివ్యమంగళ విగ్రహము గలిగియుండుటచే గూడ స్తోత్రార్హుడను నర్థము 'యువానామ్' అను విశేషణముచే వివక్షిత మగుచున్నది. ఇట్లు స్తుతించుటచే అనిష్టనివారణ మగునని 'ఉపహత్నుమ్' ఇత్యాది పదములు బోధించుచున్నవి. అందు **'మృగం న భీమమ్'** అని దృష్టాన్తముగ గ్రహింపబడిన మృగశబ్దవాచ్యమగు సింహమును, అంతకన్న నధికబలము గల శరభము హతమార్చునట్లు, భగవానునకుగూడ తదధిక బలశాలియగు మరొకనివలన భంగము సంభవించు పక్షములో ఆ అధికబలునే ఆరాధింపవచ్చునుగదా? అను శంకాపిశాచమును ఉచ్చాటన మొనర్చుటకై **'ఉగ్రమ్'** అను పదము ప్రయుక్తమైనది. పరమేశ్వరుని పరాభవింపజాలినవాడు మరెవ్వడును లేడని భావము. 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ 'న వా ఓజీయో రుద్ర త్వదస్తి' 'త్వమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' ఇత్యాది శ్రుతిస్మృతిశతము – బలవీర్యాదులలో భగవానునకు సమానుడుగాని, అధికుడుగాని మరొకడు లేడని స్పష్టీకరించుచుండగా పూర్వోక్తశంక కవకాశ మెక్కడ?

ఈ విధముగ భగవత్స్తోత్రము అనిష్టనివారణకారణ మని చెప్పి, ఇటుపైని 'మృడా జరిత్రే' ఇత్యాదిగ ఇష్టప్రాప్తిసాధన మని చెప్పుచున్నాడు. 'మృడయ' అనుటలో సమగ్రపురుషాయుష (100 సంవత్సరములు) అరోగదృఢగాత్రత్వముచే గాక. అటుపైని జరామరణవర్జితమగు మోక్షసుఖమును గూడ అనుగ్రహింపు మని యభిప్రాయము. 'సేనాః' అనుచో 'నమో రుద్రేభ్యో యే పృథివ్యామ్' ఇత్యాదిగా ముందు చెప్పబోవునట్టియు, 'త్రిగ్ంశత్త్రయశ్చ గణినో రుజన్తః' ఇత్యాది శ్రుత్యన్తరప్రసిద్ధమైనట్టియు సేనాబహుత్వము వివక్షితము.

ఈ మంత్రమునకు ఋషి–వైయాఘ్రుడు. ఛన్దస్సు–త్రిష్టుప్. దేవత–రుద్రుడు, ధ్యానము – (ఉద్యద్భాస్కర...సురౌఘనుతమ్) ఉదయించుచున్న కోటిమంది సూర్యులతో

సమానమైన ప్రకాశముకలిగి దుష్టులకు భయమును శిష్టులకు అభయమును కలిగించుచు వరదాభయహస్తుడై దేవతాసమూహములు స్తుతించుచుండగా ఆకాశము నధిష్ఠించియున్న వానినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రమును ఏకరాత్రోపవాసపూర్వముగ త్రిరాత్రమవిచ్ఛిన్నముగ జపించిన పురశ్చరణసిద్ధి యగును. ఇది శత్రువినాశఫలప్రదము.

**పరి ణో రుద్రస్య హేతిర్వృణక్తు పరి త్వేషస్య దుర్మతిరఘాయోః।**

**అవ స్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ. 9**

**భాష్యమ్ –** అథ నవమః – పరి ణో రుద్రస్యేతి. రుద్రస్య హేతిః – ఆయుధం నః – అస్మాన్ పరివృణక్తు – పరివర్జయతు. కదాచిదపి మా విధ్యత్విత్యర్థః. హన్తుః హననబుద్ధౌ సత్యాం హేతిపరివర్జనమశక్యమితి తద్బుద్ధేః పరివర్జనం ప్రార్థయతే – పరి త్వేషస్యేతి. అఘాయోః – అఘం పాపం క్రోధసాధనత్వేన ఇచ్ఛతీతి అఘాయుస్తస్య పరి పరితః త్వేషస్య – క్రోధేన దీప్తస్య రుద్రస్య దుర్మతిః – హననబుద్ధిః, సాప్యస్మాన్ వృణక్తు. విహితాకరణనిన్దితానుష్ఠానరూపాత్పాపాత్పరమేశ్వరస్య క్రోధః, తతో హన్తవ్యతాబుద్ధిః, తతస్తు ఐహికాముష్మికవివిధదుఃఖసాధనదేశకాలపురుషాదినానాపదార్థరూపైః పరమేశ్వరాయుధైః వేధః, తతో దుఃఖానుభవః, ఇతి క్రమః. తదత్ర పాపాది-దుఃఖానుభవాన్తం సర్వమపి ప్రార్థితం భవతి. నను అమోఘా మదీయహేతిర్మతిశ్చ. కథం తత్పరిహారః స్యాత్? తత్రాహ – అవ స్థిరేతి. హే మీఢ్వః! ప్రణతకామవర్షిన్నితి హేతుగర్భం సంబోధనమ్. తవ స్థిరా – అమోఘా హేతిః మతిశ్చ, తాం మఘవద్భ్యః – మఘవదర్థం స్తుతినమస్కారాదిరూపత్వదీయమఘకృతామస్మాకమర్థే అవతనుష్వ – అవతతాం అవరోపితాం కురు. అమోఘాఽపి తే తవ హేతిః మతిశ్చ ప్రణతపాలకేన త్వయా మయి పరిహరణీయేత్యర్థః. కిం చ హే మీఢ్వః! నః తోకాయ – అపత్యమాత్రాయ, విశిష్య తనయాయ చ మృడయ – సుఖం దేహి. అస్య మన్త్రస్య భగవానేవ ఋషిః దేవతా చ. త్రిష్టుప్ఛన్దః. **ధ్యానమ్ –**

**గజచర్మావృతతనుం స్ఫురత్ప్రహరణోజ్జ్వలమ్।**
**సర్వపాపహరం ధ్యాయేద్దేవం కుఞ్జరభేదినమ్॥**

సుపుత్త్రాదిఫలప్రదోఽయం మన్త్రః. ఏకకృచ్ఛ్రాచరణపూర్వకం నవదినేషు ప్రతిదినం పఞ్చసహస్రజపాత్సిద్ధిః.

**అనువాదము:** (అర్థము) రుద్రస్య = రుద్రునియొక్క, హేతిః = ఆయుధము, నః = మమ్ము, పరివృణక్తు = పరిత్యజించుగాక, అఘాయోః = క్రోధసాధనముగా పాపమును కోరుచున్నట్టియు, త్వేషస్య = క్రోధముతో జ్వలించుచున్నట్టియు రుద్రునియొక్క, దుర్మతిః = హింసించవలెనను బుద్ధియు, పరివృణక్తు = మమ్ము పరిత్యజించుగాక, హే మీఢ్వః = భక్తాభీష్టములను వర్షించువాడా!, స్థిరా = అమోఘమైన నీ యాయుధమును, హింసాబుద్ధిని, మఘవద్భ్యః = స్తుతినమస్కారాది రూపమైన నీ యజ్ఞము ననుష్ఠించు మా కొఱకు, అవతనుష్వ = దించివేయుము (ఉపసంహరించుము). తోకాయ = మా సంతతికి, తనయాయ = విశేషించి పుత్త్రసంతతికి, మృడయ = సుఖము నొసంగుము.

(వివరణము) ఇందు ఆయుధపరిత్యాగము కోరబడినది. ఆపైన హంతకునకు హననబుద్ధియున్నంతవరకు ఆయుధపరిత్యాగము అశక్యముగాన, అట్టి బుద్ధినిగూడ పరిత్యజింపు మని 'పరిత్వేషస్య' ఇత్యాదిగా ప్రార్థింపబడినది. మొదట విహితాకరణ-నిన్దితాచరణరూపమగు పాపమును నిమిత్తముగ జేసికొని పరమేశ్వరునకు క్రోధము గలుగును. అటుపైని హింసించవలెనను బుద్ధి పుట్టును. తదుపరి ఐహికాముష్మికవివిధ దుఃఖసాధనములగు దేశ-కాల-పాత్రాది నానాపదార్థరూపములనున్న పరమేశ్వరుని యాయుధములచే హింసించుట జరుగును. తన్మూలమున దుఃఖానుభవము - ఇది యిందలి క్రమము. కాగా పాపాచరణము మొదలు దుఃఖానుభవమువరకు గల అనర్థ పరంపరయొక్క పరిహారము ప్రార్థిత మగుచున్నది. ఐతే - భగవానుని బాణము, సంకల్పమును, అమోఘమైనది. దాని నుపసంహరించుటెట్లు? అను శంకకు సమాధానముగా 'అవస్థిరా మఘవద్భ్యస్తనుష్వ' అని చెప్పబడినది. అమోఘము కావచ్చును. ఐనను 'ప్రణతభక్తకామవర్షి' యని ప్రఖ్యాతిని గన్న నీవు నా విషయమున వాని నుపసంహరించుకొనక తప్పదని నిగూఢాశయము. ఇందు 'మీఢ్వః' అనునది హేతుగర్భ విశేషణము.

ఈ మంత్రమునకు ఋషియు, దేవతయు భగవానుడే. ఛన్దస్సు - త్రిష్టుప్. ధ్యానము - (గజచర్మావృతతనుం...కుంజరభేదినమ్) తళతళలాడుచున్న ఆయుధములతో ప్రకాశించుచు గజాసురుని సంహరించి, గజచర్మమును ధరించి సర్వపాపహరమైన స్వరూపముతో నున్నవానినిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. సుపుత్త్రాదిఫలముల నిచ్చునది

యీ మంత్రము. ఒక కృచ్ఛ్రము నాచరించి తొమ్మిదిదినములు ప్రతిదినము ఐదువేల పర్యాయములు జపించిన మంత్రసిద్ధి యగును.

**మీఢుష్టమ! శివతమ! శివో నస్సుమనా భవ। పరమే వృక్ష ఆయుధం నిధాయ కృత్తిం వసాన ఆ చర పినాకం బిభ్రదా గహి।** **10**

**భాష్యమ్** – అథ దశమః – మీఢుష్టమేతి. హే మీఢుష్టమ! అతిశయేన ప్రణతకామవర్షిన్! హే శివతమ! అతిశయేన శివంకర! ఇతి చ హేతుగర్భం సంబోధనమ్. నః – అస్మాకమ్, శివః – శివంకరః, సుమనాః – శోభనమనస్కః అస్మాకం ప్రీతశ్చ భవ. ప్రీతస్య తవేదం లక్షణమిత్యాహ – పరమే వృక్షేతి. పరమే – అత్యున్నతే వృక్షే – వటాదౌ, శ్రూయతే హి కైలాసే శతయోజనోన్నతః పఞ్చసప్తత్యధికయోజనశతాయతశ్చ భవదావాసో దివ్యవటవృక్షః. **'స యోజనశతోత్సేధః పాదోనద్విశతాయతః,** పర్యక్కృతామలచ్ఛాయో నిర్ణి క్తస్తాపవర్జితః. తస్మిన్మహాముముక్షూణాం శరణే సువటే సురాః, దదృశుః శివమాసీనమ్' ఇతి. తస్మిన్ పరమే వృక్షే త్వదీయం ఆయుధం అతిభీషణం చ నిధాయ, యత్ర నిహితే వయం న పశ్యామః తత్రావస్థాప్య ఆచర – ఆగచ్ఛ. ఆగచ్ఛంశ్చ త్వం కృత్తిం – వ్యాఘ్రచర్మ, వసానః – పరిదధానః, పినాకం బిభ్రత్ – భూషణార్థం ధనుర్మాత్రం హస్తే ధారయన్ ఆగహి – సమీపమాగచ్ఛ. **'పినాకహస్తః కృత్తివాసాః' 'ప్రాణేశ్వరః కృత్తివాసాః పినాకీ'** ఇతి శ్రుతేః. తాదృశమేవ తవ రూపం బహుశ్రేయః ప్రశస్యతే. అయం భావః – పరమేశ్వరస్య హి చర్మపరిధానం న వస్త్రలాభప్రయుక్తమ్. బ్రహ్మేన్ద్రాదినిఖిలైశ్వర్యప్రదే, నవనిధిప్రణీతకుబేరాద్యనుచరవతి భగవతి తదలాభోక్తేః పరిహాసాస్పదత్వాత్. కిం తు నిజానన్దపరిపూర్ణత్వప్రయుక్తవిషయవైతృష్ణ్యం ప్రకటయితుం విషయలంపటజనాదరణీయ–దివ్యాంబరస్థానే చర్మాంబరధారణమ్. తదేతత్ భాగవతే ప్రతిపాదితమ్ :– 'హసన్తి యస్యాచరితం హి దుర్భగాః స్వాత్మామృతస్యావిదుషః సమీహితమ్, యైర్వస్త్ర–మాల్యాభరణానులేపనైః శ్వభోజనం స్వాత్మతయోపలాల్యతే' ఇతి స్వాత్మారామస్య భగవతః సమీహితం విషయవైతృష్ణ్యస్ఫుటీకరణాభిప్రాయమజానానా దేహాత్మవాదినో దుర్భగా అభాగ్యాః, దుష్టభగజన్యాః సంకరయోనిజాతా ఇతి యావత్. తే పరమేశ్వరం చర్మాంబర–కపాలభస్మాఙ్గరాగాదిపరీతం హసన్తీతి శ్లోకార్థః. మహిమ్నః స్తవేఽప్యుక్తమ్ – **'మహోక్షః ఖట్వాఙ్గం'** ఇత్యాది – **'న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి'** ఇత్యన్తేన.

తథా చ స్వాత్మారామస్య సర్వవిషయోపశాన్తిసూచకం కృత్తిపరిధానం ప్రీతిలక్షణమితి. పినాకం బిభ్రదిత్యనేన పినాకపదప్రవృత్తినిమిత్తం పాతృత్వం వివక్షితమ్. **'పినాకాదయశ్చ'** ఇతి ఆకప్రత్యయస్య, ఇత్యస్య, నుగాగమస్య చ ప్రతిపాదనాత్, రక్షణప్రధానస్య పినాకస్య ధారణం ప్రీతిచిహ్నమితి. అస్య మన్త్రస్య వైరాజ ఋషిః. త్రిష్టుప్ఛన్దః. శంభుర్దేవతా, **ధ్యానమ్ –**

> **మఙ్గలాయతనం దేవం యువానమతిసున్దరమ్।**
> **ధ్యాయేద్వనచరాకారమాగచ్ఛన్తం పినాకినమ్॥**

రాజభయతస్కరోపద్రవప్రాణసంశయాదివిపత్పరిహారప్రధానోఽయం మంత్రః.

**అనువాదము:** (అర్థము) హే మీఢుష్టమ! = విశేషించి భక్తుల కోర్కెలను వర్షించువాడా!, శివతమ! = విశేషించి మంగళముల నొసంగువాడా!, నః = మాకు, శివః = మంగళకరుడవు, సుమనాః = మంచి మనసు గలవాడవు, భవ = కమ్ము. పరమే = మిక్కిలి యెత్తైన, వృక్షే = వటవృక్షము మున్నగుదానియందు, ఆయుధమ్ = భయంకరమైన నీ యాయుధమును, నిధాయ = ఉంచి, ఆచర = రమ్ము, వచ్చుచు, కృత్తిమ్ = వ్యాఘ్రచర్మను, వసానః = ధరించినవాడవై, పినాకమ్ = పినాక మను పేరుగల ధనుస్సును, బిభ్రత్ = అలంకారముగ హస్తమున ధరించినవాడవై, ఆగహి = సమీపమునకు రమ్ము.

(వివరణము) ఈ మంత్రములో పూర్వార్ధమున – 'మా విషయమున ప్రీతిగలవాడవు కమ్ము, అని ప్రార్థింపబడినది. అట్లు ప్రీతుడవైనదానికి చిహ్నము. 'పరమే వృక్ష ఆయుధం నిధాయ' ఇత్యాదిగ చెప్పబడినది. 'పరమే వృక్షే' అను పదద్వయముచే – 'సయోజనశతోత్సేధః...' ఇత్యాదిగా పురాణములో వర్ణింపబడిన – 'నూరామడలయెత్తు, నూటడెబ్బదియైదామడల వైశాల్యము గలిగి అన్ని దిక్కుల వ్యాపించిన చల్లని నీడనిచ్చుచు పరిశుద్ధమై, తాపహరమై, ముముక్షువుల కాశ్రయమై, మనోహరమైన ఏ వటవృక్షముయొక్క మూలమున సుఖాసీనుడై శివుడు దేవతలకు దర్శనమిచ్చినాడో, కైలాసాచలస్థితమైన ఆ వటవృక్షము విపక్షితమగుచున్నది. 'కృత్తిం వసాన ఆచర' ఇత్యాది మంత్రభాగము – వ్యాఘ్రచర్మపరీవృతమై పినాకమును ధరించిన భగవానుని స్వరూపము బహుశ్రేయస్కరమని ప్రశంసించుచున్నది. 'పినాకహస్తః కృత్తివాసాః' 'ప్రాణేశ్వరః కృత్తివాసాః పినాకీ' ఇత్యాదిశ్రుతు లీ యర్థమును సమర్థించుచున్నవి. ఇందలి భావమిది – పరమేశ్వరుడు చర్మమును కట్టుకొనుట – బట్టలు లేక కాదు; బ్రహ్మేంద్రాదులకు

అఖండైశ్వర్యము ననుగ్రహించినట్టియు, తన యనుచరుడగు కుబేరుని నవనిధుల కధిపతిగా జేసినట్టియు భగవానునకు కట్టుకొనుటకు బట్టలుగూడ లేవనుటకన్న, పరిహాసాస్పదమగు విషయము మఱియొకటి యుండదు. మఱేమనగా – ఆత్మానన్ద పరిపూర్ణతాప్రయుక్తమగు విషయవైరాగ్యమును వ్యక్తీకరించుటకే. విషయలంపటులైన జనులకాదరపాత్రములగు దివ్యాంబరములకు బదులు చర్మాంబరము నాతడు ధరించినాడు. ఈ విషయము భాగవతములో – 'హసన్తి యస్యాచరితం...స్వాత్మతయోప లాల్యతే' ఇట్లు వర్ణింపబడినది – చచ్చినపిదప కుక్కల కాహారముగా నున్న యీ స్థూల శరీరమునే తాను (ఆత్మ)గా కొందరు భావించుచుందురు. దీనిని వస్త్రమాల్యాభరణ, చందనానులేపనాదులతో అలంకరించి పోషించుచుందురు. అట్టి అజ్ఞులు – అభాగ్యులు మాత్రమే, ఆత్మానందామృతపరిపూర్ణుడైన పరమేశ్వరునియొక్క విషయవైరాగ్యప్రయుక్తమగు భిక్షుకవేషమును గాంచి పరిహసించుచుందురు – అని దీని భావము. 'దుర్భగాః' అను పదమునకు దుష్టయోనులు, సంకర యోనిజనితు లని యర్థము చెప్పబడినది. మహిమ్నః స్తోత్రములో గూడ – 'మహోక్షః ఖట్వాఙ్గమ్' అని ప్రారంభించి, 'న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి' అని చెప్పబడినది. ఓ భక్తవరదా! నీ భ్రూవిక్షేపమాత్రమున దేవతలు అఖండైశ్వర్యసంపన్నులైయుండగా, నీవు మాత్రము ముసలియెద్దు వాహనము, మంచపుకోడు ఆయుధము, గొడ్డలి, చర్మము, భస్మము, పాములు – ఇట్టి పరికరములు గలిగియున్నావు. సర్వదా స్వస్వరూపమున రమించు వానిని మిథ్యావిషయములు భ్రమింపజేయజాలవని – భావము. 'పినాకం బిభ్రదాగహి' అనుచో 'పినాకాదయశ్చ' అను ఉణాదిసూత్రముచే పా–ధాతువునకు ఇత్వము నుగాగమము రాగా నిష్పన్నమైన పినాకపదమునకు ప్రవృత్తి నిమిత్తము – పాతృత్వము. (రక్షకత్వము) రక్షణ ప్రధానమైన పినాకమును ధరించుట గూడ ప్రీతిచిహ్నమే యగుచున్నది.

ఈ మంత్రమునకు ఋషి – వైరాజుడు. ఛందస్సు – త్రిష్టుప్. దేవత – శంభువు. ధ్యానము – (మఙ్గలాయతనం...పినాకినమ్.) అఖిలమంగళములకు ఆధారభూతుడును, అతిసుందరమైన యువకిరాతవేషము దాల్చి పినాకపాణియై వచ్చుచున్న వానినిగా దేవుని ధ్యానించవలెను. రాజభయము, తస్కరోపద్రవము, ప్రాణసంశయము మున్నగు కష్టముల దొలగించు మంత్ర మిది.

**మూ. వికిరిద! విలోహిత! నమస్తే అస్తు భగవః!**

**యాస్తే సహస్రగ్ం హేతయోఽన్యమస్మన్నివపన్తు తాః। 11**

**భాష్యమ్ –** అథైకాదశః – వికిరిదేతి. వివిధం కిరన్తి హింసన్తీతి వికిరయః పాప – రోగ – సంసార – దారిద్ర్యాదయః తాన్ ద్యతి ఖణ్డయతీతి వికిరిదః హే వికిరిద! హే విలోహిత! లోహితవర్ణ! కర్పూరగౌరేతి యావత్. అత ఏవ పఞ్చాక్షరధ్యానే తాన్త్రికాః స్మరన్తి. **'ధ్యేయో ముక్తాపరాగామృతరసఘటితాద్రిప్రభః'** ఇతి. శుద్ధసత్త్వాకారేతి యావత్. హే భగవః! షడ్గుణైశ్వర్యసంపన్న! తే తుభ్యం నమః అస్తు. ఏతచ్చ సంబోధనత్రయముత్తరార్ధ ప్రతిపాదితార్థే హేతుగర్భమ్. ఇత్థం నమస్కృత్య ప్రార్థయతే – యాస్త ఇతి. యాః సహస్రం హేతయః – అనన్తాన్యాయుధాని సన్తి తాః సర్వాః అస్మత్, అస్మత్తః, అన్యం – పాపం, నివపన్తు – నాశయన్తు; న త్వస్మానిత్యర్థః. అస్య మన్త్రస్య పులస్త్య ఋషిః. త్రిష్టుప్ఛన్దః. శంభుర్దేవతా.

**ప్రసన్నవదనం శాన్తం చరితోద్వాహమణ్డనమ్।**
**అమ్బయా సహితం ధ్యాయేత్సురసఙ్ఘైరభిష్టుతమ్॥**

మహాజనవిరోధ – శత్రుజయ – భయపరిహారాదీన్యస్య ఫలాని. త్రిరాత్రచరుభోజన–పూర్వకదశసహస్రజపః. తదనన్తరం దశసహస్రం శివప్రదక్షిణాని. ఏవమస్య మన్త్రస్య పురశ్చరణవిధిః.

**అనువాదము:** (అర్థము) హే వికిరిద! = పాప–రోగ–సంసారదారిద్ర్యాదులను ఖండించువాడా, హే విలోహిత = కర్పూరగౌరశరీరచ్ఛాయగలవాడా!, హే భగవః = ఓ షడ్గుణైశ్వర్యసంపన్నుడా!, తే = నీకొఱకు, నమః = నమస్కారము. అస్తు = అగుగాక, తే = నీయొక్క, సహస్రమ్ = అనన్తములగు, యాః హేతయః = ఏ ఆయుధములు గలవో, తాః = ఆ యాయుధములు, అస్మత్ అన్యమ్ = నీ భక్తులమైన మమ్ముకాక, ఇతరపాపాత్ముని, నివపన్తు = నశింపజేయుగాక.

(వివరణము) ఇందలి 'విలోహిత' పదము కర్పూరగౌరాకృతిగలవాడను నర్థము నిచ్చును. కావుననే పఞ్చాక్షరమన్త్రధ్యానకాలమున 'ధ్యేయో ముక్తాపరాగామృతరసఘటితాద్రి

ప్రభః' అని స్మరించుచున్నారు. వికిరిద - విలోహిత - భగవః - అను మూడును ఉత్తరార్ధప్రతిపాదితమగు అర్థమునందు హేతుగర్భములగు సంబోధనములు.

ఈ మంత్రమునకు ఋషి పులస్త్యుడు. ఛన్దస్సు - త్రిష్టుప్, దేవత - శంభువు, ధ్యానము - (ప్రసన్నవదం...రభిష్టుతమ్) దేవతాసంఘములు స్తోత్రపాఠముల జేయుచుండగా పార్వతితో వివాహమంగళకృత్యమును జరుపుకొని ప్రసన్నముఖుడై, ప్రశాన్తచిత్తుడైయున్నవానినిగా దేవుని ధ్యానించవలెను. మహాజనవిరోధపరిహారము, శత్రుజయము, భయనివారణము - ఇత్యాదులీ మంత్రఫలములు. త్రిరాత్రచరుభోజన పూర్వకముగ పదివేలపర్యాయములు జపము, తదుపరి పదివేల శివప్రదక్షిణములు. ఇది యీ మంత్రపురశ్చరణ విధానము.

**మూ. సహస్రాణి సహస్రధా బాహువోస్తవ హేతయః,**

**తాసామీశానో భగవః! పరాచీనా ముఖా కృధి। 12**

**భాష్యమ్** - అథ ద్వాదశః - సహస్రాణీతి. బాహ్వోరితి ద్వివచనమవివక్షితమ్, బాహుష్విత్యర్థః. హే భగవః - భగవన్! తవ బాహ్వోః. యద్వా అనన్తబాహోరపి ధనుర్బాణ-వ్యాపృతతద్బాహుద్వయాభిప్రాయేణ ద్వివచనమ్. హే భగవన్! బాహ్వోః హేతయః - ఆయుధాని సహస్రాణి సహస్రధా చ విద్యన్తే. ఆనన్త్యవాచీ సహస్రశబ్దః. ధనుః - ఖడ్గం - శూలమిత్యేవం విజాతీయధర్మిస్వరూపభేదేన అనన్తాని, తేష్వప్యేకైకస్మిన్ననేకభేదాదనన్త-ప్రకారాణి చేత్యర్థః. శ్రూయతే హి **'శూలాచ్ఛూలసహస్రాణి నిష్పతన్త్యస్య తేజసా'** ఇతి. తాసాం హేతీనాం ముఖ్యా ముఖాని పరాచీనా కృధి = పరాఙ్ముఖాని కురు. యతస్త్వమ్ ఈశానః - సర్వేశ్వరః. ప్రయుక్తానామప్యుపసంహారే శక్తోఽసీతి భావః. అస్య మన్త్రస్య నారద ఋషిః, శ్రీరుద్రో దేవతా. అనుష్టుప్ఛన్దః. **ధ్యానమ్** -

**సర్వపాపహరం దేవం సర్వాభరణభూషితమ్।**
**సర్వాయుధధరం దేవం సర్వలోకమహేశ్వరమ్॥**

ఉపద్రవపరిహారప్రధానోఽయం మన్త్రః. ఏకకృచ్ఛ్రాచరణపూర్వకం సహస్రజపాన్మన్త్రసిద్ధిః.

**ఇతి దశమోఽనువాకః**

**అనువాదము:** (అర్థము) హే భగవః! = ఓ భగవంతుడా!, తవ = నీయొక్క, బాహువోః = హస్తములయందు, హేతయః = ఆయుధములు, సహస్రాణి = అనన్తములు, సహస్రధా = అనన్తప్రకారములు, (విద్యన్తే = ఉంటున్నవి). తాసామ్ = వానియొక్క, ముఖా = అగ్రములను, పరాచీనా = పెడమోముగలవానినిగా, కృధి = చేయుము. (త్వమ్ = నీవు) ఈశానః = సర్వేశ్వరుడవు.

(వివరణము) ఇందు 'సహస్రాణి' 'సహస్రధా' అనుచో సహస్రశబ్దము అనన్తార్థకము. ధనుస్సు – ఖడ్గము – శూలము, ఈ విధముగ ఆకృతి భేదములచే విజాతీయములగు ఆయుధములు అనన్తములు. అందును ఒక్కొక్క దానిలో అనన్తములైన అవాన్తరభేదములు. ఇంతేకాక, శూలమునుండి మరియొక శూలము, ఖడ్గమునుండి మరియొక ఖడ్గము ఇట్లు అప్పటికప్పుడు ఈశ్వరప్రభావముచే ఆవిర్భవించుచుండునని పురాణములు చెప్పుచున్నవి. ఈశానశబ్దమునకు సర్వసమర్థుడని యర్థము. ప్రయోగించిన బాణములను గూడ నుపసంహరింప జాలినవాడవు నీ వను నర్థము నిది సూచించు చున్నది.

ఈ మంత్రమునకు ఋషి – నారదుడు. ఛన్దస్సు అనుష్టుప్. దేవత – రుద్రుడు, ధ్యానము – (సర్వపాపహరం...మహేశ్వరమ్) సర్వపాపహరము, సర్వాభరణభూషితము, సర్వాయుధసమన్వితమునగు స్వరూపముతో ప్రకాశించుచున్న సర్వలోకమహేశ్వరునిగా శ్రీరుద్రుని ధ్యానించవలెను. ఈ మంత్రము ఉపద్రవములను పరిహరించుటలో ప్రముఖమైనది. ఒక కృచ్ఛ్రము నాచరించి వేయిమారులు జపించిన మంత్రసిద్ధి యగును.

**దశమానువాకము – సమాప్తము**

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# ఏకాదశోஉనువాకః

మూ. సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్,

తేషాగ్ం సహస్రయోజనేஉవ ధన్వాని తన్మసి. 1

**భాష్యమ్ –** ఏవం దశమేஉనువాకే భగవాన్ప్రార్థితః. ఏకాదశే తు తదంశభూతా రుద్రాః ప్రార్థ్యన్తే. సన్తి హి సర్వలోకేశ్వరస్య సామ్బపరబ్రహ్మణోஉంశభూతాస్తత్తల్లోకగతతత్తత్ప్రాణి–కర్మానుగుణతత్తల్లోకనిగ్రహానుగ్రహార్థం తత్తల్లోకేశ్వరత్వేన భగవతా స్థాపితాః నిఖిల–బ్రహ్మాణ్డమణ్డలాధిష్ఠాతారః నిరతిశయమహిమమహాసముద్రాః రుద్రాః శ్రుతాః – **'య ఏకో రుద్ర ఉచ్యతే, అసంఖ్యాతాస్సహస్రాణి'** ఇతి. ఉపబృంహితాశ్చ మహాభారతే – **'స దేవస్సర్వభూతానాం మహాదేవస్సనాతనః, అసంఖ్యాతాస్సహస్రాణి రుద్రాణాం స్థాన మవ్యయమ్'** ఇతి. శైవపురాణేషు చ – **'య ఏకో రుద్ర ఇత్యుక్తస్స విశ్వమధితిష్ఠతి, అసంఖ్యాతాస్సహస్రాణి రుద్రో భూత్వాஉఖిలం జగత్'** ఇతి. తథా నిత్యముక్తా నిరుపమా నిర్ద్వన్ద్వా నిరుపప్లవాః, సశక్తయస్సానుచరాః సర్వలోకనమస్కృతాః. సర్వేషామేవ లోకానాం సృష్టిసంహరణక్షమాః, పరస్పరానురక్తాశ్చ పరస్పరనమస్కృతాః. శివప్రియతమా నిత్యం శివలక్షణలక్షితాః, సౌమ్యా ఘోరాస్తథా మిశ్రాశ్చాన్తరాలద్వయాత్మకాః. విరూపాశ్చ సురూపాశ్చ నానారూపధరాః ప్రభోః, తస్య పారిషదా దివ్యా నానారూపధరాః ప్రభోః. వామనా జటిలా ముణ్డాః కమ్బుగ్రీవా మహోదరాః. శూలహస్తాః ఖడ్గహస్తాః సర్వోచ్ఛ్రితకిరీటినః, హన్తారో ద్విషతాం సైన్యం ప్రసహ్యాస్యహవిక్రమాః. కామకారకరాస్సిద్ధాః త్రైలోక్యస్యేశ్వరేశ్వరాః, తైరాత్మభూతైర్భగవాన్పార్వత్యా చ మహేశ్వరః. సర్వభూతగణైర్భుఙ్క్తే భూతభవ్యభవత్ప్రభుః' ఇతి. అత్ర **'సౌమ్యా ఘోరాస్తథా మిశ్రాః'** ఇత్యనేన **'అఘోరేభ్యోஉథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః, సర్వేభ్యస్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః'** ఇత్యుక్తాః, రుద్రాః ప్రదర్శితాః. తేషాం చ నిగ్రహానుగ్రహకర్తృత్వరూపం ఘోరత్వాఘోరత్వరూపం చ లైఙ్గే ప్రతిపాదితమ్. తత్ర హి – **'స్మరణాదేవ రుద్రస్య సంప్రాప్తాస్తే గణేశ్వరాః, అసంఖ్యాతా మహాత్మానః'** ఇత్యుపక్రమ్యోక్తమ్ – 'తే గణేశా మహాసత్త్వాః సర్వలోకమహేశ్వరమ్, ప్రణమ్య దేవం దేవీం చ ఇదం వచనమబ్రువన్,

కిమర్థం చ స్మృతా దేవ ఆజ్ఞాపయ మహాప్రభో. కిం సాగరాన్ శోషయామో యమం వా హన్మ కిఙ్కరైః. హన్మ మృత్యుముతామృత్యుం వివస్వన్తం తు పద్మజమ్, బధ్వేన్ద్రం సహ దేవైశ్చ సహ విష్ణుం సనాతనమ్. ఆనయామోఽథ సంక్రుద్ధా దైత్యాన్వా సహ దానవైః, కస్యాద్య వ్యసనం ఘోరం కరిష్యామస్తవాజ్ఞయా. కస్య వాద్యోత్సవం దేవ దేవకామసమన్వితమ్' ఇతి. **'తస్య పారిషదా దివ్యా నానారూపధరాః ప్రభోః,** ఇతి భారతవచనేన తు **'దివ్యా గణా బహురూపాః పురాణాః'** ఇతి శ్రుత్యుక్తాః, రుద్రాః ప్రదర్శ్యన్తే. ఏవం సామవేదేఽపి దేవవ్రతాఖ్యే సామని **'యే దేవా దివిషదస్థ'** ఇత్యాదినా తత్తల్లోక–స్థితా రుద్రాః ప్రతిపాదితాః. శైవపురాణే చోపబృంహితాః – 'తే హి సాక్షాద్దివిషదస్త్వన్తరిక్ష–**సదస్తథా, పృథివీషద ఇత్యేవం దేవదేవవ్రతస్తుతాః'** ఇతి తేషాం చ తత్తల్లోకాధిపరుద్రాణాం **'అమృతస్య పుత్రా ఆయే ధామాని దివ్యాని తస్థుః'** ఇత్యాది శ్వేతాశ్వతరప్రసిద్ధాని తాని ధామాని తత్తన్నామధేయాని తదీయగణకోటిసంఖ్యాతాని చరిత్రాణి చేత్యేతత్సర్వం శివపురాణే ప్రపఞ్చితమ్. విస్తరభయాన్నేహ లిఖ్యన్తే. తానేతాన్రుద్రానధికృత్యాయమనువాకః.

అత్ర చ త్రయోదశ మన్త్రాః. తత్రాద్యః – సహస్రాణీతి అనేకసహస్రసంఖ్యా–పరిణామాః, తే చ సహస్రశః – సహస్రం సహస్రం భూత్వా అవస్థితాః, ఏవంభూతా యే రుద్రాః, అధిభూమ్యాం – భూమేరుపరి తదీశ్వరత్వేన వర్తన్తే, అధిరైశ్వర్యే, తేషాం ధన్వాని – ధనూంషి సహస్రయోజనే – అస్మత్తః సహస్రయోజనవ్యవహితదేశే అతిదూరే అవతన్మసి – అవతతజ్యాని కుర్మః. స్తుతినమస్కారైరితి శేషః. తే అస్మాన్ హింసితుం ధనురారోపణం న కుర్వన్త్విత్యర్థః.

భగవత్ప్రార్థనాత్మకమగు దశమానువాకము ముగిసినది. ఇక ఏకాదశానువాకము నందు తదంగభూతులగు రుద్రులు ప్రార్థింపబడుచున్నారు. సకల లోకేశ్వరుడైన శ్రీసాంబసదాశివపరబ్రహ్మమునకు అంశభూతులై ఆ యా లోకములలోని ప్రాణుల కర్మానుగుణముగ, దుష్టశిక్షణ – శిష్టరక్షణములను నిర్వహించుటకుగాను, ఆ యా లోకముల కధిపతులుగా భగవానునిచే నియమింపబడిన రుద్రు లెందరో యున్నారు. వారు నిఖిలబ్రహ్మాణ్డమణ్డలమున కధిష్ఠాతలుగా, నిరతిశయమహిమమహాసముద్రులుగా **'య ఏకో రుద్ర ఉచ్యతే – అసంఖ్యాతాస్సహస్రాణి'** ఇత్యాది శ్రుతులలో ప్రసిద్ధులైయున్నారు. 'స దేవస్సర్వభూతానాం…' అను మహాభారతవచనము, ఈ యర్థమును సమర్థించు చున్నది. మరియు 'య ఏకో రుద్ర ఇత్యుక్తః…భూతభవ్యభవత్ప్రభుః' ఇట్టి శైవపురాణ వచనములు పై విషయమును బలపఱచుచున్నవి. ఇందలి 'సౌమ్యా ఘోరాస్తథా మిశ్రాః'

అను వాక్యముచే, 'అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో...రుద్రరూపేభ్యః' అను శ్రుతిలో చెప్పబడిన రుద్రమూర్తులు వివరింపబడినారు. వారి నిగ్రహానుగ్రహకారిత్వము, ఘోరాఘోరస్వరూపము లిఙ్గపురాణములో ఇట్లు సంగ్రహింపబడినది – 'స్మరణాదేవ రుద్రస్య సంప్రాప్తాస్తే గణేశ్వరాః, అసంఖ్యాతా మహాత్మానః' అని యారంభించి – 'తే గణేశా మహాసత్త్వాః...దేవకామసమన్వితమ్' అని చెప్పబడినది. సర్వలోకమహేశ్వరుడగు శ్రీరుద్రభగవానుడు స్మరించినంతనే, రుద్రాంశ సంభవులైన అసంఖ్యాకులగు గణేశ్వరులు వచ్చినారనియు, వారు – భగవానుడు ఆజ్ఞనిచ్చినజాలు, సముద్రములను ఇంకింపజేయ జాలిన – విష్ణుబ్రహ్మేంద్రయమాదులను సైతం బంధించి తెచ్చి పరమేశ్వరుని పాదసన్నిధిని నిలుపగలిగినట్టియు. నిరతిశయబలపరాక్రమ సంపన్నులని – పై పురాణవచనముల సారాంశము.

మరియు, **'తస్య పారిషదా దివ్యా నానారూపధరాః ప్రభోః'** అను భారతవచనము – 'దివ్యా గణా బహురూపాః పురాణాః' అను శ్రుతిలో చెప్పబడిన రుద్రమూర్తి విశేషములను వివరించుచున్నది.

ఇట్లే, సామవేదములోని 'దేవవ్రత' సామలో 'యే దేవా దివిషదః స్థ...' ఇత్యాదిగా ఆ యా లోకములలోనున్న రుద్రమూర్తులు ప్రతిపాదింపబడినారు. 'తే హి సాక్షాద్దివిషద... దేవవ్రతస్తుతాః' అను శైవపురాణవచనము – ఏతదుపబృంహకము.

'అమృతస్య పుత్రా ఆ యే ధామాని దివ్యాని తస్థుః' ఇత్యాదిశ్వేతాశ్వతరోపనిష–త్ప్రసిద్ధములైన ఆ రుద్రమూర్తుల ధామము (స్థానములు), నామములు, సంఖ్యావిశేషములు, చరిత్రములు మొదలగునవన్నియు శివపురాణములలో వివరింపబడియున్నవి. విస్తరభయముచే – ఇచట ఉదాహరింపక – విడువబడుచున్నవి.

పదమూడు మంత్రములతోనున్న యీ పదునొకండవయనువాకము పూర్వోక్త రుద్రమూర్తులను విషయముగా జేసికొని ప్రవర్తించుచున్నది. అందు 'సహస్రాణి సహస్రశః' అనునది ఆద్యమన్త్రము.

(అర్థము) సహస్రాణి = అనేక సహస్రసంఖ్యాకులైనట్టియు, సహస్రశః = వేయేసి మందిగల అనేక సహస్రసముదాయరూపులుగానున్నట్టియు, యే రుద్రాః = ఏ రుద్రులు, అధిభూమ్యామ్ = భూమియందు తదధిపతులుగ నున్నారో, తేషామ్ = వారియొక్క, ధన్వాని = ధనుస్సులను, సహస్రయోజనే = వేయి ఆమడల వ్యవధానముగల

అతిదూరదేశము నందు, అవ తన్మసి = అల్లెత్రాళ్లనూడదీసి పడవేయుచున్నాము. మా స్తుతినమస్కారాదులచే సంతుష్టులైన రుద్రమూర్తులు మమ్ము హింసించుటకు ధనుస్సులలో బాణములను ఎక్కుపెట్టుకుందురుగాక యని భావము.

## మూ. అస్మిన్మహత్యర్ణవే౭న్తరిక్షే భవా అధి, తేషాగ్ం... తన్మసి. 2

**భాష్యమ్ –** అథ ద్వితీయః – అస్మిన్ మహతీతి. అస్మిన్మహతి పరిదృశ్యమానే మహతి అర్ణవే అన్తరిక్షే చ, అధి – ఉపరి వర్తమానా అర్ణవాన్తరిక్షయోరధీశ్వరాః, యే భవాః – రుద్రాః, తేషాం సహస్రయోజనే అవధన్వాని తన్మసీతి యోజనా. అత్ర **'అస్మిన్మహత్యర్ణ–వే౭న్తరిక్షే'** ఇత్యర్ణవాన్తరిక్షయోః ప్రత్యక్షోపలభ్యమానమహత్త్వోక్తిః, యదాహుః – **'గగనం గగనాకారం సాగరస్సాగరోపమః'** ఇతి. తేన చ తదధిష్ఠాతౄణాం రుద్రాణాం మహత్త్వాతిశయో యుజ్యతే. ఏతన్మన్త్రమారభ్య నవమాన్తేషు మన్త్రేషు **'తేషాం సహస్రయోజనే'** ఇత్యనుషఙ్గః. తదనుషఙ్గద్యోతనాయైవ దశమే మన్త్రే **'తేషామ్'** ఇత్యాది పునః పఠితమ్.

**అనువాదము:** (అర్థము) అస్మిన్ మహతి అర్ణవే = ఈ పరిదృశ్యమానమగు మహాసముద్రమునందు, అన్తరిక్షే = ఆకాశమునందున, అధి = ఉపరిభాగమున తదధిపతులుగానున్న, భవాః = ఏ రుద్రులు కలరో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను అల్లెత్రాడులేకుండజేసి వేయియామడల దూరమున పడవైచుచున్నాము.

(వివరణము) ఇచటి 'గగనం గగనాకారం సాగరస్సాగరోపమః' అను విధముగ ప్రత్యక్షసిద్ధమగు అర్ణవాన్తరిక్షముల మహత్త్వము ప్రస్తుతింపబడినది. ఇయ్యది – తదధిపతులగు రుద్రులమహత్త్వాతిశయమును ప్రస్తుతించుటలో కైముతికన్యాయమున – పర్యవసిత మగుచున్నది. అర్ణవాన్తరిక్షములే అంతటి మహత్త్వము కలిగియుండగా, వాని నధిష్ఠించియున్న రుద్రుల మహత్త్వమును గూర్చి చెప్పవలసినదేమున్నది? అని భావము.

విశేష మేమనగా – ఇది మొదలు తొమ్మిది మంత్రములలో ప్రతి మంత్రము నందును, 'తేషాగ్ం సహస్రయోజనే౭వధన్వాని తన్మసి' అను ఉత్తరార్ధము అనుషక్త మగును. దీనిని సూచించుటకే చివరి (10) మంత్రమున పునఃపఠితమైనది. అర్థముకూడ ప్రథమమంత్రములో జెప్పబడినదేగాని, బేధమేమియు లేదు. కావున ఉత్తరమంత్రములలో గూడ దానినే అనుసంధించు కొందురు గాక.

**నీలగ్రీవాశ్శితికణ్ఠాశ్శర్వా అధః క్షమాచరాః, తేషాగ్ం...తన్మసి. 3**

**భాష్యమ్ –** అథ తృతీయః – నీలగ్రీవా ఇతి. కాలకూటాదనాదుపరి పరమేశ్వరస్వరూపాః – నీలగ్రీవాః. తతః పూర్వం తత్స్వరూపాః శ్వేతగ్రీవాః శితికణ్ఠాః – ఇత్యవస్థాభేదేన నీలకణ్ఠత్వశితికణ్ఠత్వే పూర్వమేవ వ్యాఖ్యాతే. ఏతాదృశాః, యే శర్వాః రుద్రాః, అధః క్షమాచరాః – భూమేరధః పాతాలలోకేషు తదీశ్వరత్వేన వసన్తి, తేషామిత్యాది పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) నీలగ్రీవాః = కాలకూటవిషమును మ్రింగిన పిదప పరమేశ్వర స్వరూపులైనవారు గాన నల్లని కంఠముగలిగినట్టియు, శితికంఠాః = అంతకుపూర్వమే పరమేశ్వరస్వరూపులైనవారుగాన తెల్లని కంఠము కలిగినట్టియు, యే శర్వాః = ఏ రుద్రులు, అధఃక్షమాచరాః = భూమిక్రిందనున్న పాతాలలోకముల కధిపతులై యున్నారో, తేషాం... తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

**నీలగ్రీవాశ్శితికణ్ఠా దివగ్ం రుద్రా ఉపశ్రితాః । తేషాగ్ం...తన్మసి. 4**

**భాష్యమ్ –** అథ చతుర్థః – నీలగ్రీవా ఇతి. దివముపశ్రితాః = ఇన్ద్రాదీనాం నియన్తృతయా స్వర్గముపసంప్రాప్తాః. శేషం పూర్వవత్. 'సహస్రాణి సహస్రశః' ఇత్యారభ్య ఏతదన్తం ఋక్చతుష్టయమేకో మన్త్రః. అస్య దుర్వాసా ఋషిః. అనుష్టుప్ఛన్దః. రుద్రో దేవతా.

> **దంష్ట్రాకరాళవదనం భీషణం రక్తమూర్ధజమ్।**
> **త్రినేత్రం త్రిశిఖం దీప్తం ధ్యాయేద్భుజగభూషణమ్॥**

శత్రునాశనఫలప్రదోఽయం మన్త్రః. చాన్ద్రాయణపూర్వకం పఞ్చసహస్రజపాత్పురశ్చరణ–సిద్ధిః.

**అనువాదము:** (అర్థము) నీలగ్రీవ – శితికణ్ఠపదములకు అర్థము – యథాపూర్వమే. దివగ్ం రుద్రా ఉపశ్రితాః = ఏ రుద్రులు ఇంద్రాదులకు నియామకులుగ స్వర్గము నధిష్ఠించియున్నారో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

(వివరణము) 'సహస్రాణి సహస్రశః' మొదలు ఇంతవరకు గల నాల్గు మంత్రములను పురశ్చరణప్రక్రియలో ఒకే మంత్రము. దీనికి ఋషి–భరద్వాజుడు.

ఛన్దస్సు– అనుష్టుప్. దేవత – రుద్రుడు. ధ్యానము(దంష్ట్రాకరాళవదనం...భుజగభూషణం) దీర్ఘములైన దంష్ట్ర(కోర)లతో భయంకరమైన ముఖము, ఎఱ్ఱని కేశములు, మూడుకన్నులు, మూడుశిఖలు గలిగి, పెనుబాములను ఆభరణములనుగా ధరించి భయంకరాకారముతో జ్వలించుచున్నవానినిగ శ్రీరుద్రుని ధ్యానించవలెను. శత్రునాశన మీ మంత్రమునకు ఫలము చాంద్రాయణపూర్వకముగ ఐదువేలు జపించిన పురశ్చరణసిద్ధి యగును.

## యే వృక్షేషు సస్పిఞ్జరా నీలగ్రీవా విలోహితాః। తేషాగ్ం...తన్మసి. 5

**భాష్యమ్ –** అథ పఞ్చమః – యే వృక్షేష్వితి. యథా లోకేషు స్వామిత్వేన భూమౌ రుద్రా అవస్థితాః, తథా వృక్షేష్వపి. తత్ర కేచిత్ సస్పిఞ్జరాః = బాలతృణవత్పిఞ్జరవర్ణాః. కేచిత్ విలోహితాః – విశేషేణ రక్తాః రక్తవర్ణాః, ఏతాదృశా యే నీలగ్రీవాః, తేషామితి పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) వృక్షేషు = వృక్షములయందు, సస్పిఞ్జరాః = బాలతృణమువలె పింజరవర్ణము గలిగినట్టియు, విలోహితాః = మిక్కిలి ఎఱ్ఱని వర్ణముగలిగినట్టియు, యే నీలగ్రీవాః = ఏ రుద్రమూర్తులు గలరో, తేషాం... తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము. (ఆ యా లోకములలో నున్నట్లే వృక్షములయందు గూడ రుద్రమూర్తు లధిష్ఠాతలై యున్నారని శ్రుత్యభిప్రాయము.)

## యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః। తేషాగ్ం... తన్మసి. 6

**భాష్యమ్ –** అథ షష్ఠః – యే భూతానామితి. భూతానాం – బాలగ్రహాదిభూతగణానాం అధిపతయః యే రుద్రాః, తేషు కేచిత్ విశిఖాసః – శిఖారహితాః, కేచిత్తు కపర్దినః – జటాబన్ధోపేతాః. తేషామితి.

**అనువాదము:** (అర్థము) భూతానామ్ = బాలగ్రహాదిభూతగణములకు, యే అధిపతయః = ఏ రుద్రమూర్తులు నాయకులై, విశిఖాసః = కొందరు శిఖారహితులుగను, కపర్దినః = మరికొందరు జడలను ధరించినవారుగను ఉన్నారో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

## యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్ । తేషాగ్ం... తన్మసి. 7

**భాష్యమ్ –** అథ సప్తమః. యే అన్నేష్వితి. అన్నేషు – అదనీయేషు వస్తుషు గూఢత్వేన తిష్ఠన్తో యే రుద్రాః వివిధ్యన్తి – అన్నవైషమ్యాదినా వివిధవ్యాధ్యుత్పాదనేన జనాన్ బాధన్తే, తథా పాత్రేషు – పాతవ్యేషు నీరక్షీరాదిషు గూఢత్వేన తిష్ఠన్తో యే రుద్రాః పిబతో జనాన్ విధ్యన్తి, తేషామితి పూర్వవత్. అత్ర **'యే వృక్షేషు'** ఇత్యారభ్య ఏతదన్తమ్ ఋక్త్రయమేకో మన్త్రః. ఋష్యాదికం సర్వం పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) యే = ఏ రుద్రమూర్తులు, అన్నేషు = భుజించు పదార్థములలో నిగూఢముగ నుండి, జనాన్ = జనులను. వివిధ్యన్తి = ఆహారవైషమ్యాదులద్వారా నానావిధములైన వ్యాధులను కలుగజేసి, బాధించుచున్నారో మఱియు, పాత్రేషు = త్రాగదగిన నీర–క్షీరాదులలో దాగియుండి, పిబతః జనాన్ = త్రాగుచున్న జనులను, వివిధ్యన్తి = విశేషించి బాధించుచున్నారో, తేషాం... తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

(వివరణము) పురశ్చరణప్రక్రియలో 'యే వృక్షేషు' మొదలు మూడును ఒకే మంత్రము. ఋష్యాదులు పూర్వమంత్రోక్తములే.

## యే పథాం పథిరక్షయ ఐలబృదా యవ్యుధః। తేషాగ్ం... తన్మసి. 8

**భాష్యమ్ –** అథాష్టమః – యే పథామితి. అత్ర పథిశబ్దేన లౌకికవైదికమార్గ ఉచ్యతే. పథిరక్షయ ఇతి సమస్తస్యాఽపి రక్షిపదస్య పథామిత్యనేనాప్యన్వయః – పథాం రక్షయః పథిరక్షయ ఇతి. లౌకికవైదికమార్గరక్షకా ఇత్యర్థః. ఏతదేవ రక్షకత్వం విశేషణద్వయే–నోపపాదయతి – ఐలబృదా యవ్యుధ ఇతి. ఇరాశబ్దోఽన్నవాచీ, ఇరాణాం సమూహ ఐరమ్, ఐరమేవ ఐలమ్, తద్బిభ్రతీతి ఐలభృతః, త ఏవ ఐలబృదాః. భకారస్య వకారః, తకారస్య దత్వమ్, అకారస్య దీర్ఘశ్ఛాన్దసః, అన్నదాతార ఇత్యర్థః. యౌతి మిశ్రీభవతి పాపేనేతి యుః – పాపిష్ఠః, యుభిర్యుధ్యన్తీతి యవ్యుధః, పూర్వవదేవ ఛాన్దసీ రూపనిష్పత్తిః, పాపిష్ఠానాం నిరోద్ధార ఇత్యర్థః. ఏవం చ లౌకికవైదికమార్గరక్షకత్వం నామ సత్పురుషాన్ తేషు మార్గేషు ప్రవర్త్య తేషాం తత్ఫలైరన్నాద్యైః సంయోజనమ్. పాపిష్ఠానాం తత్ర నిరోధనమిత్యేవంరూపమితి భావః. ఏతాదృశా యే రుద్రాః, తేషామ్...

**అనువాదము:** (అర్థము) యే = ఏ రుద్రమూర్తులు, ఐలబృదాః = సత్పురుషులకు

అన్నాదిఫలముల నిచ్చుచు. యవ్యుధః = పాపులను నిరోధించుచు, పథాం పథిరక్షయః = లౌకిక – వైదికమార్గముల కన్నింటికిని రక్షకులై యున్నారో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

(వివరణము) ఇందు **'పథిరక్షయః'** అనుచో రక్షి పదము సమానములో చేరియున్న స్వపూర్వపదముతోనేకాక, 'పథామ్' అను వ్యస్తపదముతో గూడ నన్వయించును. కాగా – పథాం రక్షయః – పథిరక్షయః అను రెండు రూపములు సిద్ధించును. మొదటిదానికి – లౌకికమార్గరక్షకులనియు, రెండవదానికి – వైదికమార్గ రక్షకులనియు అర్థము. ఈ రక్షకత్వమును సమర్థించునట్టిదే – 'ఐలబృదాః' 'యవ్యుధః' అను విశేషణద్వయము ఇరాశబ్దము అన్నవాచకము. అన్నసమూహము 'ఐరం' అనబడును. 'రలయోరభేదః' అను న్యాయముచే ఐరమే ఐలమైనది. దానిని భరించువారు 'ఐలభృతః' అనబడుదురు కాని – చాన్దసప్రక్రియననుసరించి భకారమునకు బకారము, తకారమునకు దకారము, అకారమునకు దీర్ఘము రాగా 'ఐలబృదాః' ఐనది దానికి అన్నదాత లని యర్థము. ఇక – యవ్యుధః' అనుచో, యు శబ్దమునకు **'యౌతి మిశ్రీభవతి పాపేనేతి యుః'** అను వ్యుత్పత్తిచే పాపిష్ఠుడని యర్థము. **'యుభిర్యుధ్యన్తీతి యవ్యుధః'** అట్టి పాపిష్ఠులతో యుద్ధమొనర్చువారు, అనగా అట్టివారిని నిరోధించువారు. గాన యవ్యుధు లనబడుచున్నారు. పూర్వమువలె నిదియు ఛాన్దసరూపము. పర్యవసానములో – లౌకిక వైదిక మార్గ రక్షణ మనగా – సత్పురుషుల నా మార్గములలో బ్రవర్తింపజేసి, వారికి తత్ఫలములగు అన్నాదుల నొసంగుటయు, పాపిష్ఠుల నా మార్గములలో జేరకుండునట్లు నిరోధించుటయు నని సారాంశము.

**యే తీర్థాని ప్రచరన్తి సృకావన్తో నిషఙ్గిణః। తేషాగ్ం...తన్మసి. 9**

**భాష్యమ్ –** అథ నవమః – యే తీర్థానీతి, సృకావన్తః – సృకాఖ్యాయుధవన్తః, దీర్ఘశ్ఛాన్దసః. నిషఙ్గిణః – ఖడ్గవన్తశ్చ, యే రుద్రాః, తీర్థాని – గఙ్గాదీని రక్షితుం ప్రచరన్తి కేషాం–చిత్తీర్థఫలం దాతుం, కేషాంచిత్తన్నిరోద్ధుం చ, తేషామ్ అత్ర **'యే పథాం' 'యే తీర్థాని'** ఇతి ఋగ్ద్వయమేకో మన్త్రః. అస్య దేవల ఋషిః. అనుష్టుప్ఛన్దః. రుద్రో దేవతా. సుపుత్త్రఫలప్రదోఽయం మన్త్రః. కృచ్ఛ్రాచరణపూర్వకం పఞ్చసహస్రజపాత్పురశ్చరణసిద్ధిః. అన్యత్సర్వం **'సహస్రాణి సహస్రశః'** ఇత్యత్రోక్తమ్.

**అనువాదము:** (అర్థము) యే = ఏ రుద్రులు, సృకావన్తః = సృకమను ఆయుధమును ధరించినవారలై, నిషఙ్గిణః = ఖడ్గహస్తులై, తీర్థాని = గంగాది పుణ్యజలాశయములను, ప్రచరన్తి = రక్షించుటకై సంచరించుచున్నారో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

(వివరణము) తీర్థములను రక్షించుట యనగా – అర్హులైనవారిని తీర్థ ఫలభాక్కులనుగ జేయుటయు, అనర్హుల కది లేకుండజేయుటయు నని యభిప్రాయము.

'యే పథాం' 'యే తీర్థాని' అను రెండును పురశ్చరణమున నేకమంత్రముగా పరిగణింపబడును. ఋషి – దేవలుడు. ఛన్దస్సు – అనుష్టుప్. దేవత – రుద్రుడు, సుపుత్రఫలప్రద మీ మంత్రము. కృచ్ఛ్రాచరణపూర్వకముగ ఐదువేల పర్యాయములు జపించిన పురశ్చరణసిద్ధి యగును. ఇతరవిశేషములను 'సహస్రాణి సహస్రశః' అను మంత్రవివరణములో జూచునది.

**మూ. య ఏతావన్తశ్చ భూయాగ్ంసశ్చ దిశో రుద్రా వితస్థిరే,**
**తేషాగ్ం సహస్రయోజనేఽవ ధన్వాపి తన్మసి. 10**

**భాష్యమ్** – అథ దశమః – య ఏతావన్త ఇతి. **'సహస్రాణి సహస్రశః'** ఇత్యారభ్య యావన్తోఽమీ రుద్రా ఉక్తాః ఏతావన్తశ్చ, ఇతోఽపి భూయాంసః బహుతరాః ఇయత్తామతీత్య వర్తమానా యే రుద్రా వితస్థిరే – సర్వా దిశో వ్యాప్య స్థితాః, తేషాం సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసీతి అత్ర ఋష్యాదికం పూర్వవత్.

**అనువాదము:** (అర్థము) ఏతావన్తః చ = 'సహస్రాణి సహస్రశః' ఇత్యాదిగ పేర్కొనబడిన వారును, ఇంతేకాక భూయాంసః చ = ఈ మంత్రములలో చెప్పబడనట్టి ఇందరని చెప్పుటకు శక్యముగాని – సంఖ్యాతీతులైనట్టి, యే రుద్రాః = ఏ రుద్రులు, దిశః = అన్ని దిక్కులను, వితస్థిరే = వ్యాపించియున్నారో, తేషాం...తన్మసి = వారి ధనుస్సులను... పడవైచుచున్నాము.

(వివరణము) ఈ మంత్రమునకు ఋష్యాదికమును, పూర్వమంత్రమునకు వలెనే గ్రహించునది.

**మూ. నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽన్తరిక్షే యే దివి యేషామన్నం**
**వాతో వర్షమిషవస్తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ**
**ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాస్తేభ్యో నమస్తే నో మృడయన్తు తే**
**యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తం వో జమ్భే దధామి. 11**

**భాష్యమ్ –** అత్ర **'నమో రుద్రేభ్యో యే పృథివ్యామ్'** ఇత్యాదిభిర్మన్త్రైః పృథివ్యన్తరిక్షద్యులోక–స్థితాన్ రుద్రాన్ నమస్కృత్య స్వస్య సుఖం, ద్వేషిణాం దుఃఖం చ ప్రార్థయతే. అత్రేత్థం మన్త్రత్రయవిభాగః –

1. **'నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేషామన్నమిషవః**
   **తేభ్యో దశ ప్రాచీర్దశ...దధామి' ఇత్యేకో మన్త్రః,**
2. **'నమో రుద్రేభ్యో యేఽన్తరిక్షే యేషాం వాత ఇషవః**
   **తేభ్యో దశ ప్రాచీర్దశ...దధామి' ఇతి ద్వితీయో మన్త్రః,**
3. **'నమో రుద్రేభ్యో యే దివి యేషాం వర్షమిషవః**
   **తేభ్యో దశ ప్రాచీర్దశ...దధామి' ఇతి తృతీయో మన్త్రః.**

తత్ర ప్రథమస్యాయమర్థః – నమో రుద్రేభ్యో అస్తు, యే పృథివ్యాం వర్తన్తే, యేషాం చ అన్నమ్ ఇషవః – ఇషుస్థానీయం హింసాసాధనమ్. అపథ్యాన్నభక్షణమ్, అతిమాత్రాశనం చ కారయిత్వా తేన రోగానుత్పాద్య కాంశ్చిద్బాధన్తే, కాంశ్చిదన్నవిఘాతేన క్షుధముత్పాద్య పీడయన్తి, కాంశ్చిదన్నార్థం చౌర్యాది కారయిత్వా వధాదికం ప్రాపయన్తి, ఏవం పాపిష్ఠ–హింసాయామన్నం నిమిత్తమితి తదేవ ఏషామిషవః. తేభ్యో రుద్రేభ్యో దశ ప్రాచీః – ప్రాఙ్ముఖాఞ్జలిరూపా అఙ్గులీః కరోమి. ప్రాఙ్ముఖత్వేన అఞ్జలీకరణే హి దశాఙ్గులయః ప్రాగగ్రా భవన్తి. ఏవం దక్షిణాద్యూర్ధ్వాన్తేషు ద్రష్టవ్యాః. ఈదృశాఞ్జలిరూపాఙ్గుల్యుపలక్షితాన్ నమస్కారాన్ కరోమీత్యర్థః. అనేన కాయికనమస్కారో దర్శితః. **'తేభ్యో నమ'** ఇతి మానసః. **'నమో రుద్రేభ్యో'** ఇతి మన్త్రస్యాదౌ యో నమస్కారః స వాచికః. ఏవం త్రికరణై

ర్నమస్కుర్వాణా వయం యం ద్విష్మః, యశ్చ నః – అస్మాన్ ద్వేష్టి, తమ్ – అస్మత్పాపతత్ఫలతదుపకరణరూపం ద్వేషిణం, హే రుద్రాః! వః – యుష్మాకం, జమ్భే– విదారితాస్యే దధామి – స్థాపయామి, తం భక్షయేత్యర్థః. ఏవం ద్వితీయతృతీయయోరపి యోజనీయమ్ – యే అన్తరిక్షే రుద్రా వర్తన్తే, యేషాం వాత ఇషవః బాణాః, వాయువికారప్రయుక్తవివిధరోగోత్పాదనేన తీవ్రతరవాయూత్పాదనాదిభిశ్చ పాపినో హింసన్తీత్యర్థః. యే దివి రుద్రాః, వర్తన్తే, యేషాం వర్షమిషవః. అతివృష్ట్యనావృష్ట్యాదిభిః హింసన్తీత్యర్థః. శేషం పూర్వవత్, **ఇతి సర్వం రమణీయమ్.**

అత్ర **'నమో రుద్రేభ్య'** ఇత్యాది సమాప్త్యన్తం యజుస్త్రయమేకో మన్త్రః. అత్ర దేవతా ఋషిశ్చ రుద్ర ఏవ. ధ్యానం తు – **'సహస్రాణి సహస్రశః'** ఇత్యత్ర ఉక్తమేవ గ్రాహ్యమ్. అన్నసమృద్ధిప్రదోఽయం మన్త్రః. పురశ్చరణాదిప్రకారః, కృత్యోత్పాదన– జాతిస్మరత్వాదిఫలభేదాశ్చ రుద్రకల్పాదిప్రపఞ్చితా ద్రష్టవ్యాః.

**ఇతి**

**శ్రీమత్పరమహంసపరివ్రాజకసార్వభౌమ**

**శ్రీమదద్వైతవిద్యాప్రతిష్ఠాపకశ్రీమదభినవశంకరభగవతాకృతం**

**శ్రీరుద్రభాష్యం సంపూర్ణమ్.**

**అనువాదము:** ఇటుపైని 'నమో రుద్రేభ్యో యే పృథివ్యామ్' ఇత్యాది మంత్రములచే, పృథివి – అన్తరిక్ష – ద్యులోకములలో నున్న రుద్రులను నమస్కరించి తనకు సుఖమును, శత్రువులకు దుఃఖమును కలుగజేయు మని ప్రార్థించుచున్నాడు – ఇచట,

1. నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేషామన్నమిషవస్తేభ్యో... జమ్భే దధామి,
2. నమో రుద్రోభ్యో యేఽన్తరిక్షే యేషాం వాత ఇషవస్తేభ్యో... జమ్భే దదామి,
3. నమో రుద్రేభ్యో యే దివి యేషాం వర్షమిషవస్తేభ్యో... జమ్భే దధామి,

ఈ విధముగ మన్త్రవిభాగము నెఱుంగునది.

(అర్థము) రుద్రేభ్యః = రుద్రులకొఱకు, నమః = నమస్కారము (అస్తు = అగుగాక.) యే = ఏ రుద్రులు, పృథివ్యామ్ = భూలోకమునందు ఉన్నారో, యేషామ్ = ఎవరికి, అన్నమ్ = అన్నమే, ఇషవః = బాణస్థానీయమగు హింసాసాధనమో, తేభ్యః = అట్టి రుద్రులకొఱకు, దశ = చేతివ్రేళ్లను పదింటిని, ప్రాచీః = ప్రాఙ్ముఖమైన అంజలిగ

జేయుచున్నాను. దశ దక్షిణా = పదిద్రేళ్లను దక్షిణాదిఙ్ముఖమైన అంజలిగ జేయుచున్నాను. దశోదీచీః = పదిద్రేళ్ళను ఉదఙ్ముఖమైన అంజలిగ జేయుచున్నాను. దశోర్ధ్వాః = పదిద్రేళ్లను ఊర్ధ్వముఖాంజలిగ జేయుచున్నాను. తేభ్యః = ఆ రుద్రులకొఱకు, నమః = నమస్కారము. తే = ఆ రుద్రులు, నః = మమ్ము, మృడయన్తు = సుఖింపజేయుదురుగాక! తే(వయం) = ఈ విధముగ త్రికరణశుద్ధిగ నమస్కరించుచున్న మేము, యమ్ = ఎవనిని, ద్విష్మః = ద్వేషించుచున్నామో, యః చ = ఎవడైతే, నః = మమ్ము, ద్వేష్టి = ద్వేషించుచున్నాడో, తమ్ = అట్టి (పాప – తత్ఫల – తదుపకరణరూపుడగు) శత్రువును, హే రుద్రాః! = ఓ రుద్రుల్లారా!, వః = మీయొక్క, జంభే = తెఱువబడిన నోటిలో, దధామి = పడవేయు చున్నాను. (వానిని భక్షింపుడని భావము)

ద్వితీయమంత్రములో – అన్తరిక్షే, వాతః అను రెండు పదములు మాత్రమే క్రొత్తవి. అన్తరిక్షే = అన్తరిక్షలోకమునందున్నారో, ... వాతః ఇషవః = గాలియే బాణస్థానీయమో – అని యాపదముల కర్థము. తక్కినదంతయు పూర్వమంత్రముతో సమానము.

తృతీయమంత్రములో గూడ – దివి, వర్షం అనునవి మాత్రమే క్రొత్త పదములు. దివి = ద్యు (స్వర్గ)లోకమునందున్నారో, ...వర్షం ఇషవః = వర్షమే బాణస్థానీయమో = అని యర్థము. శేషము ప్రథమమంత్రముతో సమానము.

(వివరణము) 'అన్నమిషవః' అనుచో, రుద్రులకు అన్నమే బాణస్థానీయమై పాపులను హింసించుటకు సాధనమగునని భావము. అపథ్యభోజనము – అతిభోజనము జేయించుట ద్వారా రోగములను గలుగజేసి కొందరిని బాధింతురు. మఱికొందరిని అన్నము లేకుండజేసి ఆకలిచే బాధింతురు. ఇంకను కొందరిని అన్నముకై చౌర్యాదులకు బాల్పడునట్లుచేసి శిక్షలకు గుఱిగావింతురు. ఇట్లనేక రీతుల పాపులను హింసించుటకు అన్నము సాధనమగుచున్నది.

'వాత ఇషవః' అనుచో – వాయువికారప్రయుక్తవివిధరోగోత్పాదనము, తీవ్రతరశీతోష్ణవాయ్వాఘాతము మున్నగువానిద్వారా హింసింతురని భావము.

'వర్షమిషవః' అనుచో – అతివృష్టి, అనావృష్టి, ప్రచండవాయుసహితవృష్టి, మొదలగువాని ద్వారా హింసింతు రని యాశయము.

ఇందు త్రివిధములగు నమస్కారములు ప్రతిపాదింపబడినవి. మొదట 'నమో రుద్రేభ్యః' అనునది వాచికనమస్కారము. 'దశప్రాచీః – దశదక్షిణా' ఇత్యాది పంచపర్యాయములలో పదివ్రేళ్లను ప్రాగాదిదిఙ్ముఖముగ అంజలిరూపమున ఘటించుట జరుగుచున్నది. ఇది కాయిక నమస్కారాత్మకము. అటుపైని 'తేభ్యో నమః' అనునది పరిశేషన్యాయముచే మానసికనమస్కారములో పర్యవసితమగుచున్నది.

ఇచట 'నమో రుద్రేభ్యః' మొదలు సమాప్తివరకు మూడు యజుస్సులును గలసి ఒకే మంత్రము. ఋషియు, దేవతయు రుద్రుడే. ధ్యానము – 'సహస్రాణి సహస్రశః' అను మంత్రవివరణములో జెప్పినదే. అన్నసమృద్ధి, ఫలప్రద మీ మంత్రము. పురశ్చరణవిధానము, కృత్యోత్పాదన జాతిస్మరత్వాది ఫలవిశేషములు 'రుద్రకల్పా'ది గ్రంథములలో వివరింపబడిన విధముగ గ్రహింపనగును.

శ్రీసన్నిధానవంశపయఃపారావారరాకాసుధాకర – విద్వద్వర

విశ్వనాధశాస్త్రి మహోదయ ప్రథమతనూభవుండగు,

సాఙ్గస్వాధ్యాయభాస్కర – లక్ష్మీనారాయణమూర్త్యవధానిచే విరచితంబైన

అభినవశంకరరుద్రభాష్యార్థానువాదము సంపూర్ణము

ఓమ్ – తత్ – సత్.

– 0 –



**ఓన్నమశ్శివాయ**

# శివార్పణమ్

ఇదమిహ శతరుద్రీయం
విద్యారణ్యాఖ్యవిద్వదీశానైః।
శ్రీభట్టభాస్కరాద్యైః
వ్యాఖ్యాతం భవ్యదివ్యభావాఢ్యమ్॥ 1

యదపి బ్రహ్మపరత్వం
సమసూచ్యత తైశ్చ తత్ర రుద్రాణామ్।
అభినవశఙ్కరచరణాః
తత్ ప్రోచుస్స్పష్టమత్ర భాష్యే స్వే॥ 2

అత ఏవ భాష్యమేతత్, భూషణమద్వైతసంప్రదాయస్య।
ఆన్ధ్రీచకార – 'లక్ష్మీనారాయణమూర్తి' రాన్ధ్రతుష్ట్యర్థమ్॥ 3

పార్వత్యర్ధశరీరే
శ్రీబాలాత్రిపురసున్దరీ సేవ్యే।
భగవతి భక్తిప్రణతః
కృతిమేతామర్పయామి విశ్వేశే॥ 4

పఙ్కిలమపి రథ్యామ్బుః
గఙ్గాం సంప్రాప్య గఙ్గతామేతి।
దిష్ట్యా మత్కృతిరేషా,
దుష్టాఽపి శివార్పితైతి శివభావమ్॥ 5

– 0 –